2000

వార్షిక సాహిత్య సంచిక

రూ. 20

# ఇండియా టుడే



# నవ్య భావధార

ఆధునికానంతరవాదంపై చర్చ ✤ కాశీభట్ల చిన్న నవల ✤ యాత్రా సాహితి ✤ ప్రసిద్ధ రచయితల కథలు, కవితలు ✤ సినీ నటి వాణిశ్రీ వ్యక్తిత్వం

నూతన సహస్రాబ్ది మొదలైన చారిత్రక సందర్భంలో తెలుగు పాఠకులకు నజరానాగా ఇండియా టుడే వార్షిక సాహిత్య సంచిక2000ను సమర్పిస్తున్నాం. గత మూడేళ్ళుగా అనివార్య కారణాల వల్ల నిలిచిపోయిన మా వార్షిక సాహిత్య సంచిక ప్రచురణ, ఈ మధ్యకాలంలో తెలుగు సాహిత్యంలో వచ్చిన ప్రధాన మార్పులను పొందుపరచుకుని సర్వాంగసుందరంగా విడుదలవుతోంది. కొత్త సహస్రాబ్ది అనగానే కొంగ్రొత్త ఆశలు, వినూత్న విశ్వాసాలు చిగురిస్తాయి. కొత్త అజెండా ముందుకువస్తుంది. గత సహస్రాబ్ది ముగింపు దశలో, ముఖ్యంగా గత రెండు దశాబ్దాలలో, ప్రపంచవ్యాప్తంగా మౌలికమైన, విస్తృతమైన పరిణామాలు చోటుచేసుకున్నాయి. సోవియట్ యూనియన్ పతనం, దానితో పాటే సోషలిస్టు స్వప్నభంగం, రాజకీయంగా అమెరికా నాయకత్వంలో ఏక ధ్రువ ప్రపంచం ఆవిర్భవించడానికి తావిస్తున్నాయి. అదేవిధంగా సాంకేతిక రంగంలో కంప్యూటర్, ఇంటర్నెట్‌లు చోదకశక్తిగా సమాచార విప్లవ ప్రభంజనం, ఆర్థిక రంగంలో డబ్ల్యు.టి.ఒ సారథ్యంలో అంతర్జాతీయాకరణ మానవ జాతిని 'ప్రపంచ గ్రామస్థులు'గా ఏకం చేస్తున్నాయి. ఒకవైపు రాజకీయ, ఆర్థిక, సాంకేతిక రంగాలలో ఏక ధ్రువత, అఖండత బలంగా వేళ్ళూనుకొంటుండగా, మరోవైపు సాహిత్య రంగంలో అఖండతకు సమాధి కట్టి, శకలీకరణకు పట్టం కట్టడమే తన అజెండాగా పోస్ట్‌మాడర్నిజం ముందుకొస్తోంది. పోస్ట్‌మాడర్నిజం'ను తెలుగులో ఆధునికానంతరవాదం లేదా ఉత్తరాధునిక వాదం అని వ్యవహరిస్తున్నారు.

గత శతాబ్దం ద్వితీయార్థంలో తెలుగునాట ప్రధాన సాహిత్య స్రవంతిగా ప్రవహించిన అభ్యుదయ, విప్లవ కవిత్వాలకు మార్క్స్‌వాదమే ఊపిరి. సాహిత్య పురోగమన, తిరోగమనాలకు విప్లవ పార్టీలే భాష్యం చెప్పేవి. కానీ, ఆ తర్వాత దేశీయంగా, అంతర్జాతీయంగా కమ్యూనిస్టు పార్టీల వైఫల్యాలు తెలుగు సాహిత్యపు తాత్విక, రాజకీయ పునాదుల వినిర్మాణానికి దారితీశాయి. ఈ క్రమంలో భాగంగా మార్క్సిజంపై విమర్శతో మొదలైన స్త్రీవాద, దళితవాద, మైనార్టీవాదాలు, అనుభూతివాద కవిత్వం నేటి తెలుగు సాహిత్యంలో ముఖ్యమైన పాయలుగా నిలదొక్కుకున్నాయి. వీటన్నింటిని ఆధునికానంతర వాద ఉద్యమాలుగా గుర్తిస్తున్నారు. అదేసమయంలో అనంతర పెట్టుబడిదారీ విధానంలోనూ, వినియోగదారీ సమాజాలలోనూ నెలకొన్న సంక్షోభాన్ని ఈ ఆధునికానంతరవాదం ప్రతిఫలిస్తోందనీ, కన్యాశుల్కంలోని బైరాగిలా 'నిజవేఁవిటీ, అబద్ధవేఁవిటీ మేం సిద్ధులం. అబద్ధం నిజం చేస్తాం, నిజం అబద్ధం చేస్తాం' అన్న చందంగా సంపన్నదేశాలు భాషతో, సత్యాలతో చేస్తున్న స్వేచ్ఛాక్రీడకు ఇది ప్రతిరూపమని పోస్ట్‌మాడర్నిజంపై విమర్శ ఉంది. ఈ ఆసక్తికరమైన వాదప్రతివాదాలను ఇండియా టుడే వార్షిక సాహిత్య సంచిక 2000 తెలుగు పాఠకులకు అందిస్తోంది. అన్ని కాలాల్లోనూ కవులు, రచయితలు, కళాకారులు తమ సమకాలీన సమాజ స్థితిగతులను, ఆలోచనలను ప్రతిఫలిస్తూ సృజనాత్మక కృషిని కొనసాగిస్తుంటారు. వార్షిక సాహిత్య సంచిక అలాంటి కృషికి దర్పణం కావాలన్నదే మా అభిమతం.

ఈ సంచికలోని ఇతర విభాగాలను కూడా నూతన సహస్రాబ్ది సాహిత్య స్ఫూర్తి తొణికిసలాడేలా తీర్చిదిద్దాం. అన్ని ఆదర్శాలూ (లేదా పోస్ట్‌మాడర్నిస్టులు చెప్పే మహాకథనాలు) అంతమైన ప్రస్తుత చారిత్రక ఘట్టంలో- వ్యక్తి జీవన క్రమంలో నుంచే విలువలూ, వ్యక్తిత్వం, ఆదర్శాలు రూపుదిద్దుకుంటాయని ఆశించవలసి ఉంటుంది. ఇలాంటి జీవన స్రవంతి కాశీభట్ల వేణుగోపాల్ నవల రంగులగదిలో ప్రస్ఫుటంగా చిత్రితమైంది. తెలుగువారి జీవనది కృష్ణవేణి గలగలలు, నల్లమల అడవుల్లో పక్షుల కిలకిలలు, చెంచు తెగల జీవన సౌరభం, శ్రీశైలం మల్లన్న దివ్యప్రభ చినవీరభద్రుని యాత్రాసాహితిలోనూ, కె.ఆర్. వినయన్ ఫోటోలలోనూ కళ్ళకు కడతాయి.


చిత్రకారుడు: కొండపల్లి శేషగిరిరావు

తెలుగు చిత్రసీమలో దాదాపు ఒకటిన్నర దశాబ్ద కాలం సాటిలేని మేటి హీరోయిన్‌గా విలసిల్లిన కళాభినేత్రి వాణిశ్రీ విశిష్ట వ్యక్తిత్వాన్ని ఆవిష్కరిస్తున్నాం. ఇప్పుడు నడుస్తున్న సాహితీ ఒరవడికి అద్దం పట్టే ప్రసిద్ధ రచయితల కథలు, కవితలను అందిస్తున్నాం. మా ఆహ్వానాన్ని మన్నించి రచనలు పంపిన రచయితలకు, వారి పదచిత్రాలకు రంగు, రూపూ దిద్దిన చిత్రకారులకు మా ధన్యవాదాలు. కన్సల్టింగ్ ఎడిటర్ ఎం. రాజేంద్ర సారథ్యంలో ఎ.ఎ.వి. ప్రసాద్, ఎస్.వి. సూర్య ప్రకాశరావు, రెంటాల జయదేవ, పసునూరు శ్రీధర్‌బాబు, ఇతర సహచరుల సమష్టి కృషితో ఈ సంచిక రూపుదిద్దుకొంది. మా పాఠకులకు, రచయితలకు నూతన సహస్రాబ్ది శుభాకాంక్షలు.

(ప్రభు చావ్లా)

ఆర్ట్ & ప్రొడక్షన్: హరీష్, నానా, ప్రభురాం, గోపాల్, శశి, అనిల్ శర్మ, అనిల్ షరాఫ్, అమర్ ప్రకాశ్ బింజోలా, సుందర్

**వార్షిక సాహిత్య సంచిక 2000**

**ఎడిటర్, ప్రచురణకర్త: ప్రభు చావ్లా**

■ ప్రధాన కార్యాలయం: లివింగ్ మీడియా ఇండియా లిమిటెడ్, F-14/15, కనాట్ ప్లేస్, న్యూఢిల్లీ-110 001. ఫోన్: 3315801-4, టెలెక్స్: 31-61245 INTO IN; కేబుల్: లివ్ మీడియా, న్యూఢిల్లీ ● తెలుగు సంచిక కార్యాలయం: 98-A రెండవ అంతస్తు, డా. రాధాకృష్ణన్ శాలై, మైలాపూర్, చెన్నై-600 004. ఫోన్: 8531605, 8531719 ● హైదరాబాద్ కార్యాలయం: 6-3-885/7/బి, సోమాజిగూడ, హైదరాబాద్-500 482. ఫోన్: 040-3390479, 3390481, 3311657; టెలెక్స్: 0425-2085 INTO IN; ఫ్యాక్స్: 040-3390484.

■ ప్రధాన విక్రయ కార్యాలయం: ఇండియా టుడే, హామిల్టన్ హౌస్, 1-ఎ కనాట్ ప్లేస్, న్యూఢిల్లీ. ఫోన్: 3313076-8; టెలెక్స్: 31-62634 INTO IN; కేబుల్: సర్క్యులేట్, న్యూఢిల్లీ. ● దక్షిణ ప్రాంత విక్రయ కార్యాలయం: 98-A, రెండవ అంతస్తు, డా. రాధాకృష్ణన్ శాలై, మైలాపూర్, చెన్నై-600 004. ఫోన్: 8531605; కేబుల్: లివ్ మీడియా, చెన్నై.

■ ప్రధాన అడ్వర్టయిజ్‌మెంట్ కార్యాలయం: 28 ఎ&బి, జాలీమేకర్ చాంబర్స్-II, నారిమన్ పాయింట్, బొంబాయి-400 021. ఫోన్: 2026152, 2029326, 2026091, 2029435; టెలెక్స్: 011-85373 THOM IN; ఫ్యాక్స్: 2817397; కేబుల్: లివ్ మీడియా, బొంబాయి. ● ప్రాంతీయ అడ్వర్టయిజ్‌మెంట్ కార్యాలయాలు: హామిల్టన్ హౌస్, 1-ఎ, కనాట్ ప్లేస్, న్యూఢిల్లీ-110 001 ఫోన్: 3313076/7/8; ఫ్యాక్స్: 3712998 ● 201-204, రిచ్‌మండ్ టవర్స్, రెండవ అంతస్తు, 12 రిచ్‌మండ్ రోడ్, బెంగుళూరు-560 025. ఫోన్: 2212448; ఫ్యాక్స్: 2218335 ● 98-A, రెండవ అంతస్తు, డా. రాధాకృష్ణన్ శాలై, మైలాపూర్, చెన్నై-600 004. ఫోన్: 8531605, 8531719; టెలెక్స్: 041-6177 INTO IN; ఫ్యాక్స్: 8532178; కేబుల్: లివ్ మీడియా, చెన్నై ● 7-బి, మిడిల్టన్ స్ట్రీట్, కలకత్తా-700 071. ఫోన్: 2825398, 2821922, ఫ్యాక్స్: 2827254 కేబుల్: లివ్ మీడియా, కలకత్తా ● 6-3-885/7/బి, సోమాజిగూడ, హైదరాబాద్-500 482, ఫోన్: 3311657, ఫ్యాక్స్: 040-3390484 ● 2 సి, 'సూర్యరథ్ బిల్డ్', రెండవ అంతస్తు, వైట్ హౌస్ వెనుక, పంచవటి, ఆఫ్.సి.జి రోడ్, అహ్మదాబాద్-380 006, ఫోన్: 404449.



■ రిజిస్టర్డ్ ఆఫీసు: కె-9, కనాట్ ప్లేస్, న్యూఢిల్లీ-110 001.

# వార్షిక సాహిత్య సంచిక 2000

◆ పుటల్లో పరిమళించే సాహితీసుమాలు ◆

























విభాగ ముఖ చిత్రాలు: కొండపల్లి శేషగిరిరావు

# పుట్టుకలోనే మరణం ఉన్న

## సంపన్న ప్రథమ ప్రపంచ దేశాల్లోని ప్రత్యేక పరిస్థితుల్లో పుట్టిన ఉత్తరాధునిక వాదంలో తృతీయ ప్రపంచ దేశాలకు సంబంధించిన వాస్తవాలను చూడడానికి నిరాకరించే తత్త్వం ఉంది

● కె. కె. రంగనాథాచార్యులు
● చిత్రాలు: నర్సిం



అయిదారు సంవత్సరాల క్రితం ఒక సామాజిక, రాజకీయ వారపత్రికలో ఓ సాహిత్య విద్యావేత్త ప్రపంచవ్యాప్తంగా మూడు నాలుగు దశాబ్దాలుగా అనేక రకాలుగా వినవస్తున్న సాహిత్య సిద్ధాంతాలను గురించి వ్యాసం రాశాడు. అందులో వలసానంతరం తృతీయ ప్రపంచ దేశాలలో వస్తున్న సాహిత్యాన్ని గురించి, అదే కాలంలో సామ్రాజ్యవాద కేంద్రాల నుంచి వస్తున్న సాహిత్య, సాంస్కృతిక సిద్ధాంతాలను గురించి ఆసక్తిదాయకమైన చర్చ చేశాడు. ఈ సిద్ధాంతాల ఆధారంగా వస్తున్న సాహిత్య విమర్శ, విశ్లేషణలలోని వైరుధ్యాలను, అవాస్తవాలను, వాటి అన్వయంలోని వికృత స్వభావాన్ని వివరించాడు.

తృతీయ (వర్ధమాన), ప్రథమ ప్రపంచ (సంపన్న) దేశాల మధ్య కొన్ని దశాబ్దాలుగా సాహిత్య వాణిజ్యంలో గమనించదగ్గ సమస్థితి ఒకటి కనిపిస్తున్నదని అమెరికన్ విశ్వవిద్యాలయాలలోని సిద్ధాంతవేత్తలు కొందరు సూచిస్తున్నారు. గతంలో ఆర్థికంగా, సైనికంగా వలసలుగా ఉండిన దేశాల ప్రజల నుంచి చాలా ముఖ్యమైన సాహిత్యం వస్తున్నది. ఒకప్పుడు వాళ్ళమీద అధికారం నడిపిన సామ్రాజ్యవాద దేశాల నుంచి ఉత్తేజకరమైన సాహిత్య విమర్శ సిద్ధాంతాలు వస్తున్నాయి. ఉత్తరాధునికవాద (ఆధునికానంతర వాద), ఉత్తర నిర్మాణవాద సాహిత్య సిద్ధాంతాలకు, వలసానంతర సాహిత్యానికి గల సహకార స్వభావం ప్రథమ ప్రపంచ దేశాలకు, తృతీయ ప్రపంచ దేశాలకు మధ్య వారధిగా పనిచేయగలదని, దీనివల్ల మేధా రంగంలో శాంతియుతమైన నిర్వలసీకరణ సాధ్యమని ఈ అమెరికన్ సాహిత్య సిద్ధాంతవేత్తలు ప్రతిపాదిస్తున్నారు. సాహిత్య సాంస్కృతిక రంగంలో సాధారణ విమర్శకుడు కూడా ప్రపంచీకృతమైన ఈ నెట్‌వర్క్‌లో పాలుపంచుకోవడానికి అవకాశం ఉందని, ఈ సిద్ధాంతాలను పరస్పర సాపేక్షమైన యాత్రా సిద్ధాంతాలుగా పేర్కొనవచ్చని అభిప్రాయపడుతున్నారు.

ఈ అభిప్రాయాలను గమనిస్తే ఇది ఒకరకమైన సాంస్కృతిక శ్రమ విభజన లాగా కనిపిస్తుంది. వలస పాలన కాలంలో సామ్రాజ్యవాద దేశాల పరిశ్రమలకు వలస దేశాలు ముడిసరుకులను సరఫరా చేసేవి. మారుగా ఈ ముడిసరుకులతో తయారైన పారిశ్రామిక ఉత్పత్తులకు వలసలు మార్కెట్‌గా ఉపయోగపడేవి. ప్రస్తుతం సాంస్కృతిక శ్రమ విభజనకు కూడా అలాంటి స్వభావమే ఉన్నట్టు కనిపిస్తుంది. తృతీయ ప్రపంచ దేశాలు సాహిత్యాన్ని అందిస్తున్నాయి. ప్రథమ ప్రపంచ దేశాలు సిద్ధాంతాలను ఉత్పత్తి చేస్తున్నాయి. దానికి మార్కెట్ మళ్ళీ తృతీయ ప్రపంచ దేశాలే. దీని పేరే సాంస్కృతిక ప్రపంచీకరణం. ఇందులో రెండు ప్రపంచాలకు సమాన ప్రతిపత్తి ఉందా అనేదే ప్రశ్న.

స్థూలంగా 1950లలో మొదలై 1960ల నుంచి విస్తృతంగాను, బహువిధాలుగాను సామాజిక, సాంస్కృతిక, కళా, సాహిత్య సిద్ధాంతాలెన్నో ప్రథమ ప్రపంచ దేశాలలో ఉత్పత్తి అవుతున్నాయి. సాహిత్య విమర్శ పద్ధతులలో అతివేగంగా మార్పులు వస్తున్నాయి. ప్రతి కొత్త సిద్ధాంతమూ కొన్ని రోజులలోనే పాతది అయిపోతుంది. సమాచార సాంకేతిక రంగంలో వస్తున్న వేగమూ, మార్పూ ఈ సిద్ధాంతాలలో కూడా కనిపిస్తాయి. మూడు, నాలుగు దశాబ్దాలుగా వస్తున్న ఈ సిద్ధాంతాలకు స్వయం ప్రకాశకమైన పేర్లు లేవు. ఇది ఆ సిద్ధాంతాలకుండే ద్రవస్థితిని, అసమగ్రతని, అసంపూర్ణతని తెలియజేస్తాయి. అంతకు ముందు ఉండే సిద్ధాంతాలను, భావనలను తెలియజేసే పదాలకు ముందు 'పోస్ట్' చేర్చడం ద్వారా ఈ సిద్ధాంతాలు సూచితమవుతున్నాయి. పోస్ట్ మోడర్న్, పోస్ట్‌కలోనియల్, పోస్ట్ ఇండస్ట్రియల్, పోస్ట్ మార్క్సిస్ట్, పోస్ట్ స్ట్రక్చరల్ – ఇంకా ఇలా ఎన్నైయినా చెప్పవచ్చు.

భారతదేశంలాంటి పూర్వ వలస దేశాలకు సంబంధించి పోస్ట్ ఇండిపెండెంట్ అన్న పదం వాడుకలో ఉంది. కొన్ని పదాలలో పోస్ట్ – తరువాత అనే అర్థాన్ని సూచిస్తుంది. ఇది స్పష్టంగా కాల విభాగ సూచకం. కొన్ని కాల విభాగంతో పాటు ప్రత్యేక లక్షణాలను, స్వభావాలను కూడా సూచిస్తాయి. కొన్ని ఏ పదానికి 'పోస్ట్' చేరిందో ఆ పదం సూచించే భావనకు సంబంధించిన మరో దశను గాని, దానికి సంబంధించిన విమర్శనుగాని సూచిస్తాయి. కొన్ని ఆ భావనల కొనసాగింపును సూచిస్తాయి. పోస్ట్ – చేర్పు అర్థాన్ని బట్టి తెలుగులో ఉత్తర, అనంతర అనే పదాలను వాడవచ్చు. కొన్ని సిద్ధాంతాలకు రకరకాల నిర్వచనాలు, కోణాలు ఉన్నందువల్ల కొంత తికమక ఏర్పడే అవకాశం ఉంది. 'పోస్ట్' లాగే 'లేట్' అనే పదాన్ని చేర్చిన పద బంధాలూ ఉన్నాయి. లేట్ – ప్రత్యేక దశను సూచిస్తుంది. లేట్ కేపిటలిజం, లేట్ మోడల్ ఇలాంటివే. నయా సామ్రాజ్యవాదం, నయా మార్క్స్‌వాదం సుపరిచితాలే. వీటితో పాటు విచ్ఛిత్తిని సూచిస్తూ తెలుగులో అంతంలో వాడే 'అంతం' కూడా ఉంది. మహా కథనాల అంతం, చరిత్ర అంతం, మార్క్సిజం అంతం, సిద్ధాంతాల, భావజాలాల అంతం– ఇలా అనేక అంతాలు చర్చలలో కనిపిస్తూ ఉంటాయి. వేదాంతం మొదలుకొని ఈ అంతాలకు అంతులేదు. ఆర్థికరంగంలో అమెరికాతో జపాన్ పోటీకి నిలబడగలిగే స్థాయికి చేరుకొనే దశలో 'అమెరికా అంతం' అన్న ఆక్రోశం వినిపించింది. ఈ సందర్భంలో రావిశాస్త్రి ఆఖరిదశ కథ మనకు జ్ఞాపకం రావచ్చు. అంతాలతోపాటు మరణాలు ఉన్నాయి. ఈ సిద్ధాంతాలలో పోస్ట్ మోడర్నిజం, పోస్ట్ కలోనియలిజంలు సామాజిక శాస్త్రంలో, అంతకంటే ఎక్కువగా సాహిత్య విమర్శ రంగంలో ప్రచలనంలో ఉన్నాయి. వీటికి సమానంగా తెలుగులో స్థూలంగా ఉత్తరాధునిక వాదం, వలసానంతర వాదం అనే పదాలను వాడవచ్చు. పోస్ట్ మోడర్న్, పోస్ట్ కలోనియల్‌లలోని పోస్ట్ సంపన్న ప్రథమ ప్రపంచ దేశాలు తమ సాంస్కృతిక ఉత్పత్తులను మార్కెట్ చేసుకోవడానికి ఏర్పడిన ఖాళీని భర్తీ చేసే పదం అని ఒక ఆఫ్రికన్ మేధావి అంటాడు. తరువాత ఏమిటి అన్న ప్రశ్నకు 'పోస్ట్' సమాధానం.

"పోస్ట్ మోడర్న్‌లోని 'పోస్ట్', సంపన్న దేశాలు తమ సాంస్కృతిక ఉత్పత్తులను మార్కెట్ చేసుకోవడానికి ఏర్పడిన ఖాళీని భర్తీ చేసే పదం."

ప్రస్తుత సిద్ధాంతాలలో చాలావరకు ఫ్రాన్స్‌లో ఉత్పత్తి అయినవే. అక్కడి నుంచి అనువాదాల రూపంలో అమెరికాకు, బ్రిటన్‌కు, ఇతర పశ్చిమ యూరప్ దేశాలకు ఎగుమతి అవుతాయి. విశ్వవిద్యాలయాలలో ప్రవేశిస్తాయి. అక్కడి నుంచి తృతీయ ప్రపంచ దేశాలకు దిగుమతి అవుతాయి. సెమినార్లు, విజిటింగ్ ఫెలోషిప్‌లు, పరస్పరం రాకపోకలు (సాధ్యమైతే స్థిరమైన ఉద్యోగాలు) ప్రారంభమవుతాయి. అదొక్క యాత్రా చరిత్ర. అందుకే ఈ సిద్ధాంతాలను 'పర్యాటక సిద్ధాంతాలు' అన్నారు. ఈ సిద్ధాంతాల పరిజ్ఞానం విదేశయానానికి పాస్‌పోర్టుగా, వీసాగా పని చేస్తుంది. సాంకేతిక రంగంలో కంప్యూటర్ సైంటిస్టులు, సాంస్కృతిక రంగంలో ఇటువంటి మేధావులు ప్రస్తుతం అమెరికాకు ఎంతో అవసరం. తృతీయ ప్రపంచ దేశాలకు చెందిన మేధావులు, విద్యావేత్తలు అమెరికన్, యూరోపియన్ విశ్వవిద్యాలయాలలో చేరిన తరువాతనే వలసానంతర వాదం ప్రారంభం అయిందా, అని ఒక సాంస్కృతిక రంగానికి సంబంధించిన విద్యావేత్త వ్యంగ్యంగా ప్రశ్నిస్తాడు. శిష్ట

# సిద్ధాంతం

స్థాయిలో ఇది అకడమిక్ ప్రపంచం. తెలుగు అకడమిక్ ఉన్నది వదిలించు కోగలిగిందేగాని. ఈ శిష్టస్థాయిని గురించి ఆలోచిస్తున్నట్టు లేదు. తెలుగుకు సంబంధించి విశ్వవిద్యాలయాల వెలుపల సాహిత్య, సాంస్కృతిక ప్రపంచమే తమదిగా బతుకుతున్న యువ బుద్ధిజీవులలో ఈ సిద్ధాంతాల చర్చ ఎక్కువగా జరిగింది. జరుగుతున్నది. వీళ్ళకు దిన పత్రికలు, నాన్ అకడమిక్ పత్రికలు, లేక సొంత ప్రచురణలు వేదిక. నడుస్తున్న చరిత్రపైన, వర్తమానం పైన పట్టు దొరక్క పోవడం, చాలాకాలంగా పునరావృతమవుతున్న సాహిత్యాధ్యయన పద్ధతులు, భావాలు, సిద్ధాంతాలు అసంతృప్తిని, విసుగుదలను, అసహనాన్ని కలిగించడం– ఏ కొత్త సిద్ధాంతాన్నయినా వెంటనే ఆహ్వానించడానికి కావలసిన వాతావరణాన్ని ఇస్తాయి. కొత్త కోసం, కొత్త సాధనాల కోసం పరితపిస్తున్న వీళ్ళకి కొత్తగా పరిచయం అయ్యే సిద్ధాంతాలు బుద్ధిని మిరుమిట్లుగొలుపుతాయి. అవి ఒక అద్భుత ప్రపంచాన్ని చూపిస్తాయి. 'కొత్త యుగంలో ప్రవేశించాం, కొత్త ఆలోచనలు వచ్చాయి, పాతవన్నీ అంతం అయిపోయాయి' అన్న భావాన్ని కలిగిస్తాయి. వాళ్ళ నిజాయితీని మాత్రం శంకించడానికి అవకాశం లేదు. ఈ పరిస్థితి కొత్తదేమీ కాదు. ఒకరకంగా ఇది చరిత్ర పునరావృతం కావడమే. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందూ, తరువాతా కళా, సాహిత్య రంగాలలో ఆధునికతావాదం పేరిట వచ్చిన సింబాలిజం మొదలైన ఉద్యమాలు, ధోరణులు 'హంగ్రీథర్టీస్' లోని తెలుగు కవులెందరినో అద్భుతంగా ఆకర్షించాయి. ఈ ధోరణులలో కూడా చాలావరకు ఫ్రాన్స్‌లో ఆవిర్భవించినవే. వీటి ఆధారంగా ప్రయోగాలు చేశారు కవులు.

చాలాకాలంగా పునరావృతమవుతున్న భావాలు, సిద్ధాంతాలు వినుగెత్తించి ఏ కొత్త సిద్ధాంతాన్నయినా వెంటనే ఆహ్వానించడానికి వీలు కల్పిస్తాయి.

ఆనాటి నుంచి దిగంబర కవుల కాలం దాకా ఎజ్రాపౌండ్, మలార్మే, బాదిలేర్, లూయీ అరగాఁ, ఎడ్గార్ ఎలెన్ పో మొదలైన కవుల పేర్లను, వారి కార్యకలాపాలను ఎంతో రొమాంటిక్‌గా చర్చించుకొనేవారు. సంప్రదాయ విమర్శ పరిభాషను పునరావృతం చేసిన భావ కవిత్వ సిద్ధాంతాల సందర్భంలో ఆధునికతావాద ధోరణులు కొత్త ప్రపంచంలోకి తీసుకొని వెళ్ళి ఉండాలి. ఈ పరిధిలోకి రాలేని వాళ్ళెవరూ ఆధునికులుగా కనిపించేవారు కాదు. ఈ నేల పైననే స్వీయ అనుభవాలతో కొత్త చైతన్యంతో గళం విప్పిన జాషువాను సంప్రదాయ సమాజం, తనలో ఇముడ్చుకోగలగడం గొప్ప వైరుధ్యం. సమకాలంలో లియోటార్డ్, జాక్‌దెరిదా, బాద్రిలార్డ్, ఫూకో లాంటి పేర్లు వినిపిస్తాయి. ఈ ప్రస్తావన అంతా ఈ సిద్ధాంతాలు అమెరికాలోనో, యూరప్‌లోనో పుట్టాయి గనుక నిరాకరించాలని చెప్పడానికి కాదు. వాటిని నిర్విమర్శగా స్వీకరించడాన్ని, రొమాంటిక్‌గా చూడడాన్ని గుర్తు చేయడమే ఉద్దేశం.

ఉత్తరాధునిక వాదం లేవనెత్తిన ప్రశ్నలు, దానికి అనుసరించిన పద్ధతులు మన పరిస్థితులను, సమకాలీన సాహిత్యాన్ని విశ్లేషించుకోవడానికి ఉపయోగ పడగలిగితే తప్పనిసరిగా ఉపయోగించుకోవచ్చును. వలసానంతర వాద విమర్శ రూపాలను అనుకూలమైన పద్ధతిలో స్వీకరించవచ్చు. ఒక సిద్ధాంతంగా ఉత్తరాధునిక వాదం పుట్టుకలోనే దాని మరణం ఉంది. తృతీయ ప్రపంచ దేశాలకు సంబంధించి వాస్తవ నిరాకరణ తత్త్వం ఉంది. అది ప్రథమ ప్రపంచ దేశాలలోని ప్రత్యేక పరిస్థితులలో పుట్టింది. వలస దేశంగా మనదేశంలో రూపు దాల్చిన ఆధునికతను వలసవాద ఆధునికతగా కొందరు భావించడం ఉంది. ఆధునికత యూరప్ కేంద్రకం అయితే, ఉత్తరాధునిక వాదం కూడా యూరో-అమెరికన్ కేంద్రకమే కావాలి. తృతీయ ప్రపంచ దేశాలకు సంబంధించి ఉత్తరాధునిక వాదంకన్నా వలసానంతర వాదానికి కొంత ప్రాసంగికత ఉండవచ్చు. తృతీయ ప్రపంచ దేశాల సాహిత్యానికి సాధారణ రూపంలో పోస్ట్ కలోనియల్ అన్న విశేషణం వాడుకలో ఉంది. భౌగోళికంగా వలస పాలన అంతమయిన తరువాత పూర్వ వలస దేశాలలోని అనుభవాలను, ఆధిపత్య రూపాలను, పరిపాలన విధానాలను, జీవన స్థితిగతులను, సూత్రీకరించడంతోపాటు వలస పాలన కాలంనాటి పరిస్థితులను, భావాలను, అనుభవాలను పునస్సమీక్షించుకోవడంగా వలసానంతర వాదాన్ని అర్థం చేసుకోవచ్చు.

ఉత్తరాధునిక వాదం ఒక సిద్ధాంతంగా సాధారణ రూపంలో అన్ని రకాల కేంద్రాలకు, తృతీయ ప్రపంచ దేశాలకు మధ్య అన్ని రకాల అసమానతలను, అప్రధానీకరణలను ప్రశ్నిస్తుంది. ప్రథమ, తృతీయ ప్రపంచ దేశాల మేధావులిద్దరికీ వలసానంతర వాదం రూప కల్పనలో పాత్ర ఉంది కానీ, రూపం దాల్చడం మాత్రం అమెరికన్, యూరోపియన్ విశ్వవిద్యాలయాలలో, సంస్థలలో. ఉత్తరాధునిక, వలసానంతర వాదాలు రెండింటికీ ఉత్తర నిర్మాణ, వినిర్మాణ వాదాలు సైద్ధాంతిక ప్రాతిపదికను అందించాయి.

ఒక రకంగా ఉత్తరాధునిక వాద, వలసానంతర వాదాలు అనుసరించే పద్ధతులు ఒకే విధమైనవి. విమర్శ రూపాలలో మాత్రం కొంత తేడా ఉంది. ఈ వాదాలు ఏదో ఒక రూపంలో మన దగ్గర చర్చలో ఉన్నాయి గనుక వాటి ప్రాసంగికతను అర్థం చేసుకోవడానికి వాటి స్వరూప స్వభావాలను అర్థమైనంతవరకు కొంతవరకైనా తెలుసుకోవలసి ఉంటుంది. వాటిలోని అపర్యాప్తతలను, వాటి అస్థిర స్వభావాన్ని కూడా అవగాహన చేసుకోవలసి ఉంటుంది.

## 2

ఆధునికత అన్న భావనకు సంబంధించి కూడా మొదటి నుంచీ కొన్ని భేదాలు ఉన్నా దానికి కనీసపు నిర్దిష్టమైన తాత్త్విక భూమిక ఉంది. విజ్ఞాన శాస్త్రం, చరిత్ర, వీటి ఆధారంగా హేతువు, హేతువాదం, జాతి భావన, ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, లౌకిక వాదం అన్న నిర్దిష్ట భావనలు ఆధునికతను నిర్వచిస్తాయి. ఉత్తరాధునిక వాదానికి మొదటి నుంచీ నిర్దిష్టమైన భావ భూమిక లేదు. దేశాలను బట్టి, సంస్థలను బట్టి, కాలాన్ని బట్టి, అస్తిత్వాలను బట్టి, సందర్భాలను బట్టి, అధ్యయన క్షేత్రాలను బట్టి వివిధ స్థాయిలలో ఉత్తరాధునిక వాదానికి వివిధ నిర్వచనాలు, వివరణలు కనిపిస్తాయి. ఆధునికత, ఆధునికతా వాదాలకు లాగా ఉత్తరాధునికతకు, ఉత్తరాధునిక వాదానికి స్పష్టమైన భేదం ఉన్నట్టు కనిపించదు. ఈ రెండింటిని పర్యాయంగా వాడడం కనిపిస్తుంది. ఆధునికీకరణంలాగా ఉత్తరాధుని





కీకరణం అన్న ప్రయోగం ఉన్నట్టు కనిపించదు. నిర్దిష్ట తాత్త్విక భూమిక, జ్ఞాన సిద్ధాంతం, కార్యాచరణ ప్రణాళిక లేకపోవడం, ఉత్పత్తి క్రమంతో నిర్దిష్టమైన సంబంధాన్ని అన్వయించ లేకపోవడం దీనికి కారణం కావచ్చు.

పదిహేడు, పద్దెమినిది శతాబ్దాలలో గృహనిర్మాణానికి సంబంధించి ఆధునికీకరణం అన్న పదాన్ని వాడినట్టు కనిపిస్తుంది. తరువాత లేఖన క్రమం ఆధునికీకరణ, భాష ఆధునికీకరణ అన్న భావనలు కనిపిస్తాయి. ఆధునిక, సమకాలీన ప్రపంచంలో భౌతిక, వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలో ఆధునికీకరణ అన్న భావన విస్తృతంగా ప్రచారంలో ఉంది. ఉత్తరాధునికత అన్న మాట కూడా తొలుత గృహ నిర్మాణ సందర్భంలోనే వాడడాన్ని గమనించాలి. మూడు, నాలుగు దశాబ్దాలుగా ఉత్తరాధునిక వాదం సాహిత్య విమర్శ రంగంలో విస్తృతంగా ప్రచారంలో ఉంది. ఉత్తరాధునిక వాదం మొదటి నుంచీ సమస్యాత్మక పదంగానే ఉంది. ఆధునికతకు సంబంధించిన అనేక భావనలను సమస్యాత్మకం చేసిన ఉత్తరాధునిక వాదం చివరకు తానే సమస్యాత్మకమై కూర్చుంది. అది కళా, సాహిత్య రంగాలలో ఆధునికతా వాద ధోరణులపైన తిరుగుబాటుగా కనిపిస్తే, మరో చోట దాని కొనసాగింపుగా కనిపిస్తుంది.

ఉత్తరాధునిక వాదానికి నిర్దిష్ట తాత్త్విక భూమిక, జ్ఞాన సిద్ధాంతం, కార్యాచరణ ప్రణాళిక లేవు. ఉత్పత్తి క్రమంతో నిర్దిష్ట సంబంధాన్ని అన్వయించలేక పోతున్నారు.

సాహిత్య స్వయంప్రతిపత్తి విషయంలో ఆధునికతా వాదానికి, ఉత్తరాధునిక వాదానికి పెద్ద తేడా కనిపించదు. కొందరి దృష్టిలో ఉత్తరాధునికత కాల విభాగాన్ని సూచిస్తుంది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అణుశక్తి విస్తరణ, సైనిక కూటాలు, ప్రచ్ఛన్న యుద్ధ భయం, విచ్ఛిన్నమైన ఆధునిక ఆదర్శాలు, స్థానచ్యుతి- ఈ వాతావరణంలో మనిషి మానసిక స్థితి మొదలైనవాటికి సంబంధించిన ఆలోచనే ఉత్తరాధునికత. నూతన ప్రపంచ వైఖరి, ప్రపంచీకరణం, ప్రపంచ ఆర్థిక విధానం, ప్రపంచ గ్రామం కొందరికి ఉత్తరాధునికతను నిర్వచిస్తాయి.

సమకాలీన సాంస్కృతిక, రాజకీయ, సామాజిక పరిస్థితులను వర్ణించే పదంగా ఉత్తరాధునికతను కొందరు భావిస్తారు. కొందరికి ఉత్తరాధునికత సంభావ్యమానమే కానీ, రూపం తీసుకోని సామాజిక భవిష్యత్తు. ఒక వాతావరణం, ఒక జీవన విధానం. ఆ ప్రత్యామ్నాయం ఆధునికతతో లెక్కలు పూర్తి చేసుకున్న తరువాతే స్పష్టం అవుతుంది. ఈ లెక్కలు పూర్తి చేసుకుంటున్న కాలాన్ని సూచించేదే ఉత్తరాధునికత. అమెరికా సందర్భంలో మధ్య తరగతి ఆధిపత్యం, నేతృత్వం దాడిని ఎదుర్కొనే పరిస్థితే ఉత్తరాధునికత. మధ్యతరగతి ప్రాధాన్యానికి గండి పడడంతో, 'అంతా తమ ప్రయోజకత్వం' అని భావించిన ప్రపంచం ఆ వర్గం ముందే పటాపంచలు అవుతుండడంతో 'చరిత్ర ముగిసింది', 'అమెరికా అంతం' అయిందని చేసిన ఆక్రోశమే ఉత్తరాధునికత.

ఆధునికతతో ఘర్షణగా, విచ్ఛేదంగా ఉత్తరాధునికతను కొందరు చూస్తే, ఆధునికత కొనసాగింపుగా కొందరు చూస్తారు. ప్రపంచీకరణం, స్థానిక చైతన్యాల మధ్య వైరుధ్యం, వినియోగదారీ సమాజాల అట్టడుగు స్థాయిలో బహుళ జాతి సంస్థలు తెచ్చిన భిన్న అనుభవాల సంపుటిగా ఉత్తరాధునికతను కొందరు నిర్వచించారు. మానవ సంబంధాలలో, ఆలోచనలలో, ఆచరణలో, అనుభవాలలో, సంవేదన శీలంలో, భాషాదృష్టిలో వచ్చిన మార్పులే కొందరికి ఉత్తరాధునికత. ఈ ప్రపంచం ఉత్తరాధునిక దశలో ప్రవేశించిందని కాక, సమకాలీన ప్రపంచాన్ని దర్శించే విధానంలో ఉత్తరాధునికత ఉందని కొందరంటారు. తూర్పు యూరప్ దేశాలలో కమ్యూనిస్టు పాలన అంతమైన తరువాత, సోవియట్ రష్యా విచ్ఛిన్నమైన తరువాత ఉత్తరాధునిక వాదం ప్రధానంగా మార్క్సు వాద వ్యతిరేక ధోరణిగా ముందుకు వచ్చింది.

మానవ జాతిని ఒక అఖండ పదార్థంగానో, స్థూలమైన రెండు వర్గాల మొత్తంగానో గుర్తించడం కాక సూక్ష్మాతి సూక్ష్మ విభాగాల అస్తిత్వాన్ని, బహుళ సాంస్కృతిక స్థితిని గుర్తించడం, విఖండత, లింగ, వర్ణ, ప్రాంత చైతన్యాలను ఉత్తరాధునిక వాదం సాంస్కృతిక రంగంలో ముందుకు తీసుకొని వచ్చిన అంశాలు. ఒకరకమైన ఉత్తరాధునిక వాదం సంస్కృతికి ఉత్పత్తి విధానంతో సమానమైన స్థానాన్ని ఇస్తుంది. ఒక్కొక్కసారి ప్రధాన స్థానాన్ని కూడా ఇస్తుంది. ఉత్తరాధునిక వాదం సాంస్కృతికాధ్యయనం అన్న కొత్త విషయాన్ని ముందుకు తీసుకొని వచ్చింది. సామాజిక జీవితంలోని అన్ని కోణాలను- ఆర్థిక రంగం, రాజ్యం, రాజ్యాంగం, ఆధిపత్యం, మనస్తత్త్వ నిర్మాణం మొదలైన వాటినన్నిటినీ, ఉత్తరాధునిక వాదం సాంస్కృతిక రూపాలుగానే చూస్తుంది. సాహిత్యం, రాజకీయాలు, సినిమాలు, టీవీ, వ్యాపార ప్రకటనలు మొదలైనవాటిలోని జనరంజక ధోరణులను, వాటి స్వభావాన్ని సమకాలీన సాంస్కృతిక జీవన రూపాలుగా చూస్తుంది. నవ్య మార్క్సు వాదులలో కొందరు ఉత్తరాధునిక వాదాన్ని అనంతర పెట్టుబడిదారీ విధానపు సాంస్కృతిక తర్కంగా చూశారు. ఆర్థిక విధానాలైన మార్కెట్, గుత్తాధిపత్యం, బహుళ జాతి సంస్థారూపాలకు, ఉత్పత్తివిధానాలైన ఆవిరి యంత్రాలు, విద్యుద్యంత్రాలు, అణు చోదిత యంత్రాలు, ఎలక్ట్రానిక్స్‌లకు, కళా, సాహిత్య రంగాలలోని వాస్తవికత, ఆధునికతావాద, ఉత్తరాధునిక వాదాలకు మధ్య గల సంబంధాన్ని గుర్తింపజేశారు.

మార్క్సువాదులు ఆధునికతకు పారిశ్రామికీకరణం, పెట్టుబడిదారీ విధానం, బూర్జువా సంస్కృతులకు గల సంబంధాన్ని వివేచిస్తారు. అనంతర పెట్టుబడిదారీ విధానం, వినియోగదారీ సమాజాలలోని సంక్షోభాన్ని ఉత్తరాధునిక వాదం ప్రతిఫలిస్తుందని మార్క్సు వాదులు అంటారు. జ్ఞాన వికాస సిద్ధాంతాల మూలాలను ప్రశ్నించిన ఉత్తరాధునిక వాదం సహజంగానే పునరుద్ధరణ భావాలకు, తిరోగమన భావాలకు దారితీస్తుందని భావిస్తారు.

## 3

ఉత్తరాధునిక వాదానికి అనేక కోణాలు, నిర్వచనాలు ఉన్నా తాత్త్వికంగా, ఆచరణాత్మకంగా ఆధునికతకు ఉన్న పరిమితులు, పరిధులపైన విమర్శగా, జ్ఞాన వికాస భావాల పునర్మూల్యాంకనంగానే ఎక్కువగా ప్రచారంలో ఉంది. ఉత్తరాధునిక వాద విమర్శ రూపాలు ఇలా ఉంటాయి: యూరప్‌లో పద్దెనిమిదవ శతాబ్దిలో విస్తరించిన జ్ఞాన వికాస భావాలు విశ్వజనీనాలు, సార్వకాలికాలు, అన్న విషయం నిరూపితం కాలేదు. ఆధునిక జీవితం, సంస్కృతి అంతకు ముందరి మానవ జీవిత రూపాల కంటే, సంస్కృతి కంటే ఉన్నతమైనదన్న విషయం కూడా నిరూపితం కాలేదు.

ఆధునికీకరణం అభివృద్ధిని సూచించదు. అందులో వెలుగుల కంటే నీడలే ఎక్కువ. హేతువు ఆధునికీకరణ పేరిట మానవ జీవితంపై నిర్నిబంధమైన అధికారం చలాయించడం మానవజీవితంలో అనేక సంకటాలకు దారి తీసింది. మనిషి జ్ఞాన వికాసంలో హేతువు పాత్ర ఉన్నా, మానవ జీవితానికి సంబంధించిన అన్ని అంశాలలోనూ దాన్ని ఉద్దేశపూర్వకంగా సాధనం చేయడం వల్ల మానవజీవితం, వ్యక్తిత్వం జడప్రాయం అయింది. అంధ విశ్వాసాల నుంచి, అతీత శక్తుల నుంచి విముక్తం చేసేదిగా ముందుకు వచ్చిన హేతువు తానే ఒక దేవుడై కూర్చుంది. జాతి అన్న బావనలో పరిమితులున్నాయి. ఒక జాతిగా గుర్తింపు గల మానవ సమూహంలో వివిధ తెగలు, ఉపజాతులు, విభాగాలు, ప్రాంతాలలో పెరుగుతున్న అస్తిత్వ కాంక్షే దీనికి నిదర్శనం. జాతి రాజ్యాల రాజ్యాంగ యంత్రం, పోలీసు, ఉద్యోగ వ్యవస్థ సాధారణ జనం పైన ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అణచివేతకు సాధనం అవుతున్నాయి. సందిగ్ధత, అనిశ్చితత, ఉత్కంఠ- ఆధునికత

ఫలితాలు, పరిణామాలు ఆధునిక జీవితంలోని అనారోగ్యకరమైన పోటీలు, స్పర్థలు నేర ప్రవృత్తిని, తీవ్రవాదాన్ని పెంచుతున్నాయి.

ఈ వరుసలోనే వలసానంతర వాద విమర్శ రూపాలను కూడా పరిశీలించడం అవసరం. ఒకప్పుడు భౌగోళికమైన వలసపాలనలో ఉండి అనమానతలకు, న్యూనతాభావానికి గురైన తృతీయ ప్రపంచ దేశాల చారిత్రక అనుభవాలపై ఆధారపడిన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విమర్శగా వలసానంతర వాదాన్ని నిర్వచించవచ్చు. ప్రాతినిధ్యం, అప్రధానీకరణం, కర్తృత్వం, అస్తిత్వం, చరిత్ర, ప్రవచనం మొదలైనవి వలసానంతర సాహిత్య విమర్శలో ప్రధానాంశాలు.

స్థూలంగా వలసానంతర వాద విమర్శ రూపాలు ఇలా ఉంటాయి: జ్ఞానం విషయంలో ఏక రూపత, సమరూపత, విశ్వజనీనత- వలసవాద శక్తులు తృతీయ ప్రపంచ దేశాల పైన రుద్దిన భావాలు. జ్ఞాన వికాస సిద్ధాంతాలలో ప్రధానమైన ఉదార మానవతా వాదాన్ని పాశ్చాత్య వలసవాదులు వలస దేశాల విషయంలో పాటించలేదు.

వలస వాదం రూప కల్పన చేసిన 'చరిత్ర' అన్న భావన వలస దేశాలపై ఆధిపత్యం నిలుపుకోవడానికి ఉద్దేశ పూర్వక సాధనంగా పని చేసింది. స్వర్ణయుగాలను, మహా యుగాలను నిర్దేశించడంలో వలసవాద దృష్టి ఉంది. యూరప్ జాతి, హేతువు మొదలైన వాటికి ఇచ్చిన నిర్వచనాలు మొత్తం ప్రపంచ దేశాలకు అదే రూపంలో వర్తించవు. ప్రపంచీకరణం జాతి రాజ్యాల స్వయంప్రతిపత్తిని విచ్ఛిన్నం చేసింది. వలసానంతర వాదంలో మరో ముఖ్యాంశం ప్రాచ్య వాదం అన్న భావన. సామాజికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, భావజాల పరంగా, తమ ఆధిక్యాన్ని నిరూపించుకోవడానికి సామ్రాజ్య వాదులు చేసిన కల్పనే ప్రాచ్యం. ప్రాచ్యం కేవలం ఒక భౌగోళిక విభాగం కాదు. యూరప్ తనను తాను నిర్వచించుకోవడానికి, నాగరికులుగా నిరూపించుకోవడానికి కావలసిన 'ఇతరం' (అదర్)గా ప్రాచ్య రూపకల్పన చేసింది. యూరప్‌ను వక్తృస్థానంలో, ఇతరాన్ని శ్రోతృ స్థానంలో నిలిపింది ప్రాచ్యవాదం. సామ్రాజ్య వాదం తృతీయ ప్రపంచ దేశాలలో మత రూఢ వాదం (ఫండమెంటలిజం) పెరగడానికి ఎలా కారణమయిందో 'ప్రాచ్య వాదం' అన్న భావనను ముందుకు తీసుకొని వచ్చిన ఎడ్వర్డ్ సైద్ విస్తృతంగా చర్చించాడు.

**అనంతర పెట్టుబడి దారీ విధానం, వినియోగదారీ సమాజాలలోని సంక్షోభాన్ని ఉత్తరాధునికవాదం ప్రతిఫలిస్తుందని మార్క్సువాదులంటారు.**

## 4

కేంద్రాన్ని తిరస్కరించడం, ఖండాలను మాత్రమే గుర్తించడం ఉత్తరాధునిక వాదం అన్న భావనకు సైద్ధాంతిక రూపం ఇచ్చిన సిద్ధాంతాలలో ప్రధానంగా కనిపించే అంశం. ఈ సిద్ధాంతాలు ఒక్కొక్కసారి తమ పైన తామే ఎదురుదాడికి సిద్ధమవుతాయి. వీటిలో ముఖ్యమైన సిద్ధాంతం మహా కథనాల అంతం. ఉదారమానవతా వాదం ఒక మహా కథనం. మానవజాతిని భౌతిక, భౌద్ధిక, మానసిక బంధనాలన్నిటి నుంచి విముక్తం చేసే సిద్ధాంతంగా ఉదార మానవతావాదం ముందుకు వచ్చింది. ఆ విషయం నిరూపితం కాలేదు. కాబట్టి ఉదార మానవతావాదం అనే మహా కథనం అంతం అయినట్టే. మార్క్సు వాదం కూడా మానవజాతిని విముక్తి చేసే సిద్ధాంతంగా నిరూపితం కాలేదు. బహుళత్వాన్ని, విభిన్నతను అంగీకరించాలి. విభిన్న కథనాలే కాని మహా కథనాలు లేవు. మహా కథనాలపై యుద్ధం, విభిన్న కథనాలను బలపరచడం దీని నినాదం. ఈ నినాదం కూడా మహా కథనమే కదా, అనేది ఈ సిద్ధాంతం పైన వచ్చిన ప్రశ్న. ఉన్న మహా కథనాలు అంతం అయ్యాయో లేదో కానీ, కొత్త మహా కథనాలు రంగంలో ప్రవేశించాయి. ప్రపంచీకరణం ఒక మహా కథనం. ఉదార ఆర్థిక విధానాలు, నూతన ప్రపంచ వైఖరీ మహా కథనాలే.

చారిత్రక కాలాన్ని సూచించేదిగా, ఆధునికత విమర్శ రూపంగా ఉన్న ఉత్తరాధునిక వాదానికి సైద్ధాంతిక ప్రతిపత్తిని కల్పించిన సిద్ధాంతాలు- ఉత్తర నిర్మాణ వాదం, వినిర్మాణవాదం. భాషా శాస్త్రంలో ప్రారంభమైన నిర్మాణ వాదం సామాజిక, సాంస్కృతిక అధ్యయన రంగాలలో నమూనాగా పనిచేసింది. నిర్మాణ వాద మూలాలలోనే పుట్టి దాని పరివర్తిత రూపంగా ఉత్తర నిర్మాణవాదం వచ్చింది. దానికి మరింత సైద్ధాంతిక స్వభావాన్ని ఇచ్చింది వినిర్మాణవాదం. ఇది వాచక కేంద్రకం. ఈ సిద్ధాంతాల పైన ఆధారపడిన ప్రత్యేక సాహిత్య విమర్శ పద్ధతిగా ఉత్తరాధునిక వాదాన్ని ఇక ముందు వాడుదాం. ఈ తరగతికి చెందిన ఉత్తరాధునిక వాద సాహిత్య విమర్శకులో మార్క్సిస్టులు కూడా ఉన్నారు. ప్రస్తుత రూపంలో ఉత్తరాధునిక వాద సిద్ధాంతం ప్రామాణ్యాప్రామాణ్యాలు ఎట్లా ఉన్నా వాటిని అన్వయించిన పద్ధతులు వాస్తవాలను ఎలా తారుమారు చేస్తాయో, వికృతం చేస్తాయో సోదాహరణంగా చూపించినవారున్నారు. ఈ బలహీనత సిద్ధాంతంలోనే ఇమిడి ఉందేమో?

మనం ఉపయోగించే భాష బాహ్య ప్రపంచానికి అద్దం పడుతుందని, భాష ద్వారా ప్రపంచాన్ని అందుకోవచ్చని, ప్రపంచాన్ని చూడడానికి భాష గవాక్షంలా పనిచేస్తుందని, రచనను సూక్ష్మంగా అధ్యయనం చేయడం వల్ల అర్థం సుబోధకం అవుతుందని నిర్మాణ వాదం చెప్తుంది. భాష పారదర్శకం కనుక ప్రపంచానికి, వాస్తవానికి సంబంధించిన జ్ఞానాన్ని ఇస్తుందని, ఇందులో రచయితకు లేక వక్తకు, వాస్తవానికి కూడా ప్రాతినిధ్యం ఉంటుందని కూడా నిర్మాణవాదం చెప్తుంది. పదాలు నిర్దిష్టమైన అర్థాన్ని ఇస్తాయి. భాషవల్ల వాస్తవ జ్ఞానం కలుషితం గాని, వికృతంగాని కాదు. నిర్మాణవాదం వాగ్వ్యవహారానికి ప్రాధాన్యం ఇస్తుంది. ఇక ఉత్తర నిర్మాణ వాదం పదాలు, భాష నిర్దిష్టమైన అర్థాన్ని ఇవ్వవని, అందువల్ల ఒకే అర్థాన్ని నిర్ణయించడం సాధ్యం కాదని అంటుంది. ప్రతి అర్థం మరొక అర్థానికి దారి తీస్తుంది. కాబట్టి నిర్దిష్టమైన అర్థం అంటూ ఉండదు. వినిర్మాణవాదం వాచక కేంద్రకం. వినిర్మాణవాద ఉత్తరాధునిక విమర్శ లిఖిత భాషపైన ఆధారపడిన విమర్శ. ప్రతి వాచకం బహుళార్థాల్ని ఇస్తుంది. కేంద్రీకృతమైన అర్థం అంటూ లేదు.

వాచకం బాహ్య వాస్తవానికి ప్రాతినిధ్యం వహించదు. వాచకానికి సొంత అస్తిత్వం ఉంది. కొంత వాస్తవం ఉంది. భాషాగత వాస్తవం బాహ్య వాస్తవాధీనం కాదు. వాచకంలో బాహ్య వాస్తవం ఉపస్థితమై ఉండనడం అధిభౌతిక దృష్టి. భాష స్వీయ వాస్తవ మటితం కాబట్టి భాష వల్ల బాహ్య వాస్తవ జ్ఞానం కలుషితం, వికృతం అవుతుంది. భాషకు క్రీడా స్వభావం ఉంది. దీని ఫలితంగా వాచకం అర్థాలు రకరకాలుగా మారిపోతాయి. వాగ్వ్యవహారంలో వక్త ఉపస్థితుడు. లిఖిత భాషలో వక్త ఉపస్థితుడు కాదు. రచన పూర్తికావడంతో రచయిత పని కూడా పూర్తి అయినట్టే. ఆ తరువాత రచన అర్థంతో రచయితకు సంబంధం లేదు. దీన్నే 'రచయిత మరణం' అన్నారు. తరువాత పాఠకులే అర్థ నిర్ణాయకులు, స్వీయ వాచక నిర్మాతలు. ఈ నిర్మాణాలు కూడా స్థిరాలు కావు. అస్థిరత దాని స్వభావం. భాషలో స్వేచ్ఛా క్రీడ ఉంది. సత్యాలూ స్వేచ్ఛాక్రీడలే.

ఈ రూపంలోని ఉత్తరాధునిక వాదం పైన బాగానే విమర్శలు వచ్చాయి. చారిత్రకంగా చూస్తే వాగ్వ్యవహారంతో పోల్చినపుడు లిఖిత సంకేతాలు చాలా ఇటీవలివి. మనిషి భాషను పొందే క్రమంలో వాగ్వ్యవహారం మొదటి దశ. ఆ తరువాతే అభ్యాసంతో లేఖనాన్ని అలవరచుకుంటాడు. ఈ ప్రపంచంలో లేఖనం లేని భాషలే ఎక్కువ. లేఖనం ఉన్న భాషలలో కూడా అత్యధిక శాతం లేఖనం తెలియని వాళ్ళు. వాగ్వ్యవహారం మౌలికం. లిఖిత భాష వాగ్వ్యవహారానికి



ప్రతినిధి. భౌతిక, బౌద్ధిక, సామాజిక పరిమితుల వల్ల వక్త లేక రచయిత తాను చెప్పదలచుకున్న విషయాలన్నిటినీ లిఖిత భాషలో చెప్పలేకపోవచ్చు. సరియైన, అవసరమైన ప్రాతినిధ్యాలు కొరవడవచ్చు. ప్రాతినిధ్యంలో అసమగ్రత ఉండవచ్చు. కొన్నిటికి అప్రధాన ప్రాతినిధ్యం ఉండవచ్చు. అప్రధానీకరణం ఉద్దేశపూర్వకం కావచ్చు. ఉద్దేశ పూర్వకం కాకపోవచ్చు. ఏ భౌతిక, చారిత్రిక పరిస్థితులలో వాచకం పుట్టిందో, ఆ పరిస్థితులు మారడం వల్ల వాచకం అర్థాలు మారవచ్చు.




ఇటువంటి అపరాన్వతల్నీ, అసమగ్రతల్నీ, అప్రధానీకరణలను, ప్రాతినిధ్యరాహిత్యాన్నీ, చారిత్రిక ప్రాసంగికతలను స్త్రీవాద, దళితవాద, ముస్లింవాద, ప్రాంతవాద సాహిత్యాలు ముందుకు తెస్తూ విమర్శకు పెడుతున్నాయి. అధికార స్వభావాన్ని ప్రశ్నిస్తున్నాయి. ఈ విమర్శలకు మూలం జీవితానుభవాలు, జీవిత వాస్తవాలు. ఉత్తరాధునిక వాద పద్ధతులు వీటికి సాధనంగా ఉపయోగించినంతవరకే వాటి ప్రాసంగికత. వాస్తవానికి, జీవితానికి దూరమయినప్పుడు ఆ వాచకంతో ఎవరికేమి పని? అర్థం అస్థిరం అన్న భావనలోనే అధికారికత ఉంది. ఉపస్థితి, అనుపస్థితుల చర్చ జీవిత వాస్తవాలను విస్మృతం చేసి చూడడానికే ఉపకరిస్తుంది. భాష సామాజిక కార్యకలాపం. భాష అంటే వ్యాకరణం, వాక్యనిర్మాణ వ్యవస్థ మాత్రమే కాదు. కేవలం పదాలు మాత్రమే కావు. వాస్తవాలు, అనుభవాలు, భావాలు, ఆలోచనలకు ప్రాతినిధ్యం వహించినప్పుడే అది భాష అవుతుంది. అస్తి, నాస్తి వివికల్పకు లోనైతే అది భాష కాదు. వినిర్మాణ వాద మూలక ఉత్తరాధునిక వాదంలోని అనేక అంశాలు నీ భాషను నీది కాకుండా చేస్తుంది.

మన జీవితంలో కఠోర వాస్తవాలున్నాయి. తిండీ, గుడ్డా లేకుండా జీవచ్ఛవాల్లా బతుకుతున్న రువాండా మొదలైన ఆఫ్రికన్ ప్రజలు ఉన్నారు. ఎముకలు తేలే వాళ్ళ నగ్న శరీరాలు వాస్తవాలు. ప్రపంచీకరణ పరిధిలోకి వాళ్ళు రారు. ప్రత్యక్ష, పరోక్ష అణచివేతలున్నాయి. పోరాటాలు ఉన్నాయి. ప్రథమ ప్రపంచ దేశాలు భాషతో, సత్యాలతో స్వేచ్ఛాక్రీడ చేయవచ్చు. దాన్ని ఎదుర్కోవడానికి తృతీయ ప్రపంచ దేశాలు భాషను ఆయుధంగా ఉపయోగించాలి. దాన్ని స్వాధీనం చేసుకోవడంలోనే మనిషికి విజయం ఉంది.

అభివృద్ధికి కులవ్యవస్థ పెద్ద ఆటంకం. అంతర్జాతీయ సమాచార వ్యవస్థలూ, మరి ఏ ఇతర సాంకేతిక అభివృద్ధీ కుల నిర్మూలన జరగనిదే సాధ్యం కావు.

న్యాయ-అన్యాయాలు, సత్య - అసత్యాల సారాలు, అర్థాలు, విలువలు చారిత్రిక పరిస్థితులను బట్టీ, దేశాలను బట్టీ, అధికారం, అణచివేతల స్వభావాలను బట్టీ మారవచ్చు. భిన్నం కావచ్చు. కానీ, అవి పూర్తిగా అసత్యాలు కావు. 'నిజమేదిలే, అబద్ధమేదిలే! మేం నిర్మిస్తాం. అబద్ధం నిజం చేస్తాం నిజం అబద్ధం చేస్తాం లేకపోతే పెద్ద అబద్ధం' అని కన్యాశుల్కం లోని బైరాగి ద్వంద్వ ప్రత్యర్థులను విష్ణువులో ఏకం చేశాడు. వీటికి క్రీడా సిద్ధాంతాలు అవసరం లేదు.

## 5

ఇటీవల సామాజిక శాస్త్రజ్ఞులు ఉత్తరాధునిక వాదానికి దేశీయమైన ప్రత్యామ్నాయంగా గాంధీ వాదాన్ని ముందుకు తీసుకొని వస్తున్నారు. దేశానికే కాదు ప్రపంచానికే గాంధీ వాదాన్ని ప్రత్యామ్నాయంగా ప్రతిపాదిస్తున్నారు. ఉత్తరాధునిక విమర్శ గాంధీతోనే మొదలయినట్టూ కూడా చెప్తున్నారు. వాళ్ళ అభిప్రాయాలు ఇలా ఉన్నాయి. దేశీయ సాంస్కృతిక చట్రంలోనే గాంధీ అభివృద్ధిని చర్చించాడు. పాశ్చాత్య ఆధునికతకు, తృతీయ ప్రపంచ దేశాల ఆధునికతకు భేదం ఉంది. మానవ సమాజాన్ని విముక్తం చేసే శక్తి పాశ్చాత్య ఆధునికతకు మాత్రమే లేదు. ఆ శక్తి భారతీయ సంప్రదాయ సంస్కృతికీ ఉంది.

ఉత్తరాధునిక వాదంతో పోలిస్తే గాంధీ మరింత బలంగా ఆధునికతను విమర్శించాడు. జాతి రాజ్యాన్ని, ఆధునిక విజ్ఞానాన్ని, సాంకేతికతని, నాగరికతల వైయక్తికతని సవిమర్శకంగా పరిశీలించాడు. విమర్శనాత్మక సంప్రదాయం గాంధీమార్గం. సంప్రదాయంలో జీవిస్తూనే సంప్రదాయంలోని అస్పృశ్యతను వ్యతిరేకించాడు గాంధీ. సంప్రదాయ సంస్కృతి ఆయుధంగా సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొన్నాడు. బౌద్ధ, జైనాల నుంచి అహింసను, భగవద్గీత నుంచి కర్మయోగ రూపమైన సత్యాగ్రహ ఆచరణను గ్రహించాడు. భక్తి కవుల విముక్తి శక్తిని స్వాయత్తం చేసుకున్నాడు. గాంధీ ప్రజల సజీవ సంస్కృతిలో భాగంగా జీవించాడు. గాంధీ వాదానికి ఉండే సంప్రదాయ మతభూమిక ఇతరులను వ్యావర్తీకరిస్తుంది. అందువల్ల దాని ఆచరణాత్మకతను గురించి సందేహాలున్నాయి.

విమర్శనాత్మక సంప్రదాయం, విమర్శనాత్మక ఆధునికత అనే ద్వంద్వాలు పాశ్చాత్యమంటే భౌతికం, ఆధునికం; ప్రాచ్యమంటే సాంప్రదాయికం, ఆధ్యాత్మికం అన్న భావాన్ని పునరుద్ధరించ జేస్తాయన్న సందేహం కూడా ఉంది. సామాజిక శాస్త్రరంగంలో తప్ప సాహిత్య విమర్శలో గాంధీ వాదం ఒక సాధనంగా ప్రచారంలోకి రాలేదు. ఇక దళిత వాదం అంబేత్కరిజం అన్న ప్రత్యామ్నాయాన్ని ముందుకు తెచ్చింది. మార్క్సిజంతో జత కలిసిన అంబేత్కరిజాన్ని దేశీయ మార్క్సిజంగా అన్వయిస్తూ దళితవాదంలోనే మరో ప్రత్యామ్నాయం ముందుకు వచ్చింది.

## 6

బహుముఖంగా వస్తున్న సిద్ధాంతాలను అలా ఉంచితే, ఉత్తరాధునికవాద, వలసానంతర వాదాలలోని విమర్శ రూపాలు కొన్ని సమకాలీన జీవితంలో, సాహిత్యంలో ప్రాసంగికాలే. ఈ విమర్శ రూపాలు చాలావరకు మార్క్సు వాదంలో భాగాలే. ఆధునికోత్తరవాద, వలసానంతర వాద విమర్శ రూపాలు వలస పాలన కాలంలోనే తెలుగు మేధావులలో, సాహిత్యంలో కనిపిస్తాయి.

గురజాడ ఆధునిక పాశ్చాత్య రాజ్యాంగ యంత్రాన్ని కలగూరగంప, స్వార్థపూరితమైందిగా వర్ణించాడు. ఉన్నవ లక్ష్మీనారాయణ పోలీసు వ్యవస్థను రద్దు చేయడం మంచిదనీ, ఉరిశిక్షను రద్దు చేయాలనీ 1921లో చెప్పాడు. విభిన్నతలను గుర్తించని జాతి భావనలోని వైరుధ్యాలను శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి బట్టబయలు చేశాడు. మన సమాజంలో ఆధునికతను అర్థం చేసుకోవడానికి వలస పూర్వదశలోని చైతన్యాన్ని సమాంతర చైతన్యాన్ని అర్థం చేసుకోవాలి. మన సమాజంలో మనిషి సర్వతోముఖమైన అభివృద్ధికి కులవ్యవస్థ పెద్ద ఆటంకం. అంతర్జాతీయ సమాచార వ్యవస్థలూ, మరి ఏ ఇతర సాంకేతిక అభివృద్ధీ కుల నిర్మూలన జరగనిదే సాధ్యం కాదు. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ పరిపాలన భారతదేశంలో అంతవరకు స్థిరంగా ఉన్న గ్రామీణ వ్యవస్థను విధ్వంసం చేసిందంటాడు మార్క్సు. వలసపాలనకు పూర్వమే మూడు నాలుగు దశాబ్దాలుగా సంప్రదాయ వ్యవస్థలో కదలికలు ప్రారంభమయ్యాయి. వృత్తికారుల పరిమిత వాణిజ్యం అభివృద్ధి చెందుతున్న దశలో, తమను బద్ధమైన ఆర్థిక వ్యవస్థలో కుల, వర్గ భేదాల హద్దులను చెరిపే పోరాటాలున్నాయి. భక్తి ఉద్యమాలు, తెలుగులో తత్వ కవుల సాహిత్యం ఆధిపత్యాన్ని ప్రశ్నించాయి. కులాలే కాదు, మత భేదాలను కూడా ఈ ఉద్యమాలు, సాహిత్యం అధిగమించే ప్రయత్నం చేశాయి. వలసవాదం రూపంలో తప్ప సారంలో యథాస్థితి కొనసాగడానికి దోహదం చేసింది.

ప్రస్తుతం మన సమాజంలో జరుగుతున్న పోరాటాలను, వాటికి ప్రాతినిధ్యం వహిస్తున్న సాహిత్యాన్ని రెండువందల సంవత్సరాలకు ముందు ఆగిపోయిన పోరాటాలను మళ్ళీ అందుకోవడంగానే అర్థం చేసుకోవాలి. సంప్రదాయ జీవితం పరిమితం (క్లోజ్డ్). ఆధునిక జీవితం విస్తృతం (ఓపెన్). విస్తృత పరిధి విస్తరిస్తున్న దశలే ఆధునిక పరిణామ క్రమంలోని పూర్వ ఆధునిక, ఉత్తరాధునిక దశలు. ఇది అంచెలంచెలుగా నిరంతరం సాగే ప్రక్రియ. లంబరేఖ సమాంతర రేఖగా పరిణామం చెందే క్రమం. ●

చిత్రపటం పేరు: రన్నింగ్ రివర్స్



మాత్రమే కాదనీ, అందులో సాంస్కృతిక పెట్టుబడి పాళ్ళు అధికంగా ఉన్నాయనే విషయాన్ని ఇవాళ గుర్తించడం జరిగింది. కులం, మతం, జాతి, లింగం, వృత్తి లాంటివి ఈ సాంస్కృతిక పెట్టుబడిలో కీలకాంశాలుగా పరిగణించడం జరుగుతుంది. అలాగే ఒక కులం, మతం, జాతి ఉపయోగించే భాషలో ఆ కులం, మతం, జాతుల మనో నిర్మితుల్ని, సాంస్కృతిక కార్యక్షేత్రాల్ని అన్వేషించడం కూడా కొత్త పరిణామమే.

ఏ సంస్కృతికైనా భాషే కేంద్రీకృత అంశంగా ఉంటుంది తప్ప, ఒక తప్పనిసరి మానవత్వ లక్షణం కానీ, కాలాతీత సత్యం కానీ కాదు. భాషావ్యవస్థలో సంకేతాలు వాస్తవికతని ప్రత్యక్షంగా ప్రతిబింబించవు. ఇతర పదాల్నించి, ఉన్న విభిన్నత లోంచి మాత్రమే అర్థాల్ని రూపొందిస్తాయి. ఏ అర్థమూ కూడా ఎప్పుడూ స్థిరంగా ఉండదు. బహుళ అర్థాల్ని స్ఫురిస్తూ సందర్భాన్ని బట్టి మారుతూ ఉంటుంది.

ఆధునికానంతరవాద సాహిత్య సిద్ధాంతం ప్రతి అంశాన్ని ఒక వాచకంగా పరిగణిస్తుంది. ప్రతి అనుభవ వ్యక్తీకరణ ఒక వాచకమే. ఇలా సమస్త అంశాల్ని వాచకంగా పరిగణించడం వల్ల సాహిత్య వాచకాలకి ఇప్పటిదాకా మనమిచ్చుకుంటూ వచ్చిన సాధికారిక స్థానం అనేది లేకుండా పోయింది. అలాగే సామాజిక శాస్త్రం, తత్త్వశాస్త్రం లాంటి సాహిత్యేతర రంగాలకి చెందిన వాచకాల్ని కూడా సాహిత్య వాచకాలను పరిశీలించినట్లుగానే పరిశీలించడం జరుగుతోంది. ఇవి కూడా ఆలంకారికత నిండిన రచనలుగానే గుర్తించడం జరుగుతోంది. ఫలితంగా సాహిత్యేతర వాచకాల్లో ఇప్పటిదాకా అవగతం కాని, అంచనాలకందని అణచివేత స్వరూప స్వభావాల్ని, శ్రేణీకరణాల్ని, కుట్రల్ని బహిర్గతం చేయడం జరుగుతోంది.

ఈ పై పరిశీలనల నేపథ్యంలో ప్రతి పుస్తకానికి దాని రచయిత అర్థ నిర్దేశం చేస్తాడని, ప్రతి వాచకం తప్పనిసరిగా ఒకానొక కీలకమైన, శాశ్వతమైన సారాన్ని ఆవిష్కరిస్తుందని, దానికి ఒకానొక అధిగమన స్థాయి ఉంటుందనే భావనల్ని నిరాకరించడం జరుగుతోంది. ఈ కొత్త పరిశీలనలు ఒక రచనని వివిధ కోణాల్నించి పరిశీలించడానికి, వివిధ కోణాల్నించి ఒక అంశాన్ని అవగతం చేసుకోవడానికి ఆస్కారం కల్పిస్తున్నాయి. కాల్పనిక పాత్రల్ని సృష్టించడంలో, వాటి తీరుతెన్నుల్ని మలచడంలో కూడా ఇటీవల మార్పు కనిపిస్తుంది. సాహిత్య పాత్రలకి ఒక స్థిర ప్రవృత్తిని, తత్త్వాన్ని ఆపాదించడం అసాధ్యమైంది. ఆధునికతావాదులు అస్థిరంగా ఉండే మానవ అహాన్ని స్థిరమైనదిగా, పొందికతో కూడినదిగా చూశారు. ఫలితంగా ఆధునిక సాహిత్యంలో పాత్రలు ఎక్కువ సందర్భాలలో నమూనాలుగా తీవ్ర స్థాయికి చేరాయి. ఆధునికానంతరవాద సాహిత్యం ఈ నమూనాల మీద తిరుగుబాటు ప్రకటించింది.

ఆధునిక సాహిత్యపు అన్ని ప్రక్రియలలో వాటి వాటి నిర్మాణ సూత్రాల మీద మితిమీరిన అధికరణ ఉంటుంది. రూపం మీద అతి శ్రద్ధ ఉంటుంది. సమకాలీన సాహిత్యం ఈ అధికరణని నిరాకరిస్తూ యాదృచ్ఛికతను ముందుకుతెస్తుంది. ఆధునికతా వాదం ముందుకు తెచ్చిన ప్రతి సాహిత్యోద్యమం తనవైన ప్రణాళికలు, పథకాలు, రాజకీయ ప్రతిపాదనలను ముందుగా సిద్ధం చేసుకొని రావడం కనిపిస్తుంది సమకాలీన ఆధునికానంతర వాద సాహిత్యం ఇందుకు భిన్నంగా ఆయా సందర్భాల నుంచి పుట్టే అంశాలను మాత్రమే పట్టించుకుంటుంది. ఆధునికానంతరవాద సాహిత్య వాచకాల్లో క్రమానుగతత్వాన్ని నిరాకరిస్తూ సాహిత్యాన్ని మౌఖిక రూపం దగ్గరికి తీసుకెళ్ళడం స్పష్టంగా కనిపిస్తుంది ఈ సాహిత్యంలో సమగ్రత, పొందిక అనేవాటికి ఆస్కారం లేదు. చిత్రకళలో కన్పించే కలాజ్ టెక్నిక్ లాంటిదే ఆధునికానంతరవాద సాహిత్యంలో కనిపిస్తుంది ఈ టెక్నిక్ వల్ల రచయిత అనుభవ ప్రపంచంలో ఉండే క్రమరాహిత్యాన్ని కూడా ఆవిష్కరించడానికి అవకాశం కలుగుతుంది. అనుభవం ఏవిధమైన సెన్సార్‌కి గురికాకుండా వ్యక్తమౌతుంది.

ఆధునికతావాద సాహిత్యంలో కన్పించే మితిమీరిన కాల్పనికత, హేతుబద్ధత, మధ్యతరగతి విలువల ప్రాముఖ్యం ఈ సాహిత్యంలో కన్పించవు. ఆధునికానంతరవాద సాహిత్యం మధ్యతరగతి నీతివాదం స్థానంలో నైతిక బహుళత్వాన్ని ముందుకు తెస్తుంది. అఖండ నీతికి, అఖండ విలువలకి ఇక్కడ ఆస్కారం లేదు. ఆధునికానంతర వాదం సాహిత్య రూపాల సరిహద్దుల్ని చెరిపేసింది. కథ, నవల, కవిత్వం మొదలైన వాటి మధ్య తేడాని చూపడం అసాధ్యమౌతోంది. ఆత్మకథ, జీవితకథ, చరిత్రల మధ్య హద్దులు అంతర్థానమౌతున్నాయి. 'సంకరం' కాని సాహిత్య రూపమేదీ సమకాలీన సాహితీ ప్రపంచంలో లేదు. గార్షియా మార్క్వెజ్, లూయి బోర్హెస్, ఇలూలియావో కాల్వినో, జాన్‌బార్త్, థామస్ పించన్, సాల్మన్ రష్దీల కాల్పనిక సాహిత్యం ఇందుకు ఉదాహరణ. రూప సంబంధమైన 'పరిశుద్ధత' కోసం ప్రాకులాడిన సాహిత్య శకం అంతమైంది. అలాగే చారిత్రక దృక్పథంతో శుద్ధ వాస్తవికతని పరిశీలించడానికి ప్రయత్నించిన సాహిత్యం ప్రతిష్ఠని కోల్పోయింది. సాహిత్య విశ్లేషణ తాత్త్విక, లైంగిక, భాషా ప్రవచనాల్లోంచి జరుగుతోంది. ఆధిపత్య స్థానంలో ఏ ప్రవచనమూ లేదు. అలా లేకపోవడమే ఆధునికానంతర వాద సాహిత్య బలం. అది నిజమైన ప్రజాస్వామిక లక్షణం.

ప్రపంచవ్యాప్తంగా సంభవించిన ఈ మార్పుల నేపథ్యంలో 1980ల నుంచి ఆధునికానంతర వాద భావనలు తెలుగు సమాజంలో ప్రాముఖ్యతని సంతరించుకోవడం మొదలైంది.

**అఖండతలు, శాశ్వతత్వాలు, స్థిర చట్రాలు బద్దలై, ప్రాంతీయమైన, అనిశ్చితత నిండిన భావనలు, సత్యాలు మాత్రమే గౌరవం పొందుతున్నాయి.**

ఇంతవరకు తెలుగు సమాజంలో నిర్దిష్టంగా ప్రచారమైన సాహితీ, తాత్త్విక సిద్ధాంతం మార్క్సిజం మాత్రమే. కాగా ఇక్కడ కమ్యూనిస్టు పార్టీలు కులం, మతం మొదలైన వాటికి సామాజిక జీవితం మీద ఉన్న పట్టుని గ్రహించలేక పోయాయని, అసలు కమ్యూనిస్టు పార్టీలే కొన్ని కులాల కేంద్రాలుగా, అధికార శ్రేణులుగా ఉన్నాయని, సమాజ విశ్లేషణలో ఐరోపా కేంద్రక దృష్టి నుంచి బయటపడలేకపోయాయంటూ ఆధునికానంతర వాదం వెలుగులో దళిత, స్త్రీవాద ఉద్యమాల్నించి వచ్చిన విమర్శ కమ్యూనిస్టు పార్టీల్ని, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సంక్షోభంలో పడవేసింది.

ఈ క్రమాన్ని దృష్టిలో ఉంచుకుని సమకాలీన తెలుగు సాహిత్యానికి ఆధునికానంతర వాదానికి ఉన్న సంబంధాన్ని పరిశీలించాల్సి ఉంటుంది: ఇరవయ్యో శతాబ్దపు మొదటి దశకంలో ప్రారంభమైన ఆధునిక తెలుగు సాహిత్యంలో కాల్పనిక, వాస్తవిక, అభ్యుదయ, హేతువాద, అధివాస్తవిక, అస్తిత్వ, అనుభూతి, రూప, దిగంబర, విప్లవ అనే అనేక రకాల వాదాలు, ధోరణులుగా భిన్నస్థాయిలలో కొనసాగాయి. జాతీయోద్యమ సాహిత్యాన్ని పక్కన పెట్టి ఆలోచిస్తే మిగతా అన్ని సాహిత్య ధోరణులు ఆధునిక సాహిత్యంలో భాగంగానే కొనసాగాయని చెప్పవచ్చు (ఆధునికతని ఇక్కడ కేవలం కాల సంబంధమైన పదంగా కాక, ఆధునీకీకరణని, ఆధునిక రాజకీయ సమీకరణాల్ని, హేతుబద్ధతని ముందుకు తీసుకుపోయే, ప్రచారం చేసే వాదంగా గుర్తించి వాడడం జరిగింది).

ఆధునిక తెలుగు సాహిత్య పరిణామాన్ని మార్క్సిజం వేగవంతం చేసిందనేది వాస్తవం. 1920లలో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడి, క్రమంగా రాజకీయ రంగం నుంచి సాంస్కృతిక రంగం దాకా విస్తరించింది. ఈ క్రమంలో ఆంధ్ర ప్రదేశ్‌లో 1940లలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. తమ సభ్యుల మధ్య భావ సారూప్యత చాలా బలహీనంగా మాత్రమే ఉండడం అభ్యుదయ రచయితల సంఘపు విశిష్టత. ఇది కూడా అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో ఉన్న అమూర్తతకు కారణం. అయితే, తెలంగాణ పోరాట సమయంలో కొంత అమూర్తత నుంచి బయటపడగలిగిన అభ్యుదయ సాహిత్యం ఆ పోరాట విరమణ తరువాత తగ్గు ముఖం పట్టి 1960ల నాటికి అసంబద్ధంగా మారింది. అభ్యుదయ సాహిత్యోద్యమం సన్నగిలిన తరువాత 1965లో వచ్చిన దిగంబర కవితా ఉద్యమం ప్రధానంగా సమాజ జీవితపు అసంబద్ధత మీద, విలువల మీద, ద్వంద్వ ప్రమాణాల మీద తీవ్ర నిరసనతో వచ్చిన ఉద్యమం. తాత్త్విక స్పష్టత కానీ, సంప్రదాయ అర్థంలో సంస్థాగత రూపం కానీ దిగంబర ఉద్యమానికి లేవు. అందువల్లే ఒక సందర్భంలో మార్క్సిజాన్ని సంశయాత్మకంగా చూసిన దిగంబర కవులు మరొక సందర్భంలో భూమి మీద ఆకలి, దరిద్రం ఉన్నంతవరకు మార్క్సిజాన్ని సవాలు చేసే శక్తి దేనికీ లేదని ప్రకటించారు. అయితే, దిగంబర కవుల లక్ష్యాలు, ఆచరణలు ఎటువంటివైనా వారు తెలుగు కవిత్వ స్వరూప స్వభావాల్ని పూర్తిగా మార్చివేశారు. ఒకరకంగా అభ్యుదయ సాహిత్యంలోని అమూర్తత్వం, అనిర్దిష్టతని కొంతవరకు దిగంబరులు అధిగమించడం వల్లనే ఇది సాధ్యమైంది.

ఇరవయ్యో శతాబ్దపు మొదటి దశాబ్దం నుంచి ఈ రోజు వరకూ తెలుగు సాహిత్య చరిత్రలో అవిచ్ఛిన్నత అనేది ఏమైనా ఉంటే అది సాహిత్యం అమూర్తత నుంచి మూర్తత వైపు, అనిర్దిష్టత నుంచి నిర్దిష్టత వైపు చేసిన ప్రయాణమే. గురజాడ నుంచి ఇవాళ్టి దళితవాదం దాకా వచ్చిన సాహిత్యం అంతిమంగా చేరుకుంది నిర్దిష్టత, మూర్తతని. నక్సల్‌బరీ, శ్రీకాకుళ రైతాంగ ఉద్యమాల నేపథ్యంలో 1970లో రూపుదిద్దుకున్న విప్లవ సాహిత్యోద్యమం అభ్యుదయ, దిగంబర ఉద్యమాల్లోని అనిర్దిష్టతని, రాజకీయ గందరగోళాన్ని చాలావరకు అధిగమించగలిగింది. రాజకీయ నిర్దిష్టతను సాధించింది. ఈ రాజకీయ నిర్దిష్టత అదే స్థాయిలో సాహిత్యంలో ఆవిష్కరింపబడింది. ఒక దశాబ్దకాలం పాటు విప్లవ సాహిత్యోద్యమం తెలుగు సాహిత్యాన్ని శాసించగలిగింది. విప్లవ పార్టీల మధ్య తలెత్తిన 'రాజకీయ విభేదాలు' విప్లవ సాహిత్యోద్యమానికి కూడా విస్తరించడం, సాహిత్య విస్తృతి లేకపోవడం, రచయితల సంఘాలు చీలిపోవడం, కొత్తగా ముందుకు వచ్చిన సమస్యల్ని గురించిన అవగాహనా రాహిత్యం, క్రమంగా విప్లవ సాహిత్యోద్యమాన్ని బలహీనపరిచాయి. అయితే, 70-80ల మధ్యకాలంలో విప్లవ సాహిత్యోద్యమం వచన కవిత్వం, పాటలకు సంబంధించి గణనీయమైన సాహిత్యాన్ని సృష్టించగలిగింది.

విప్లవ రచయితలు సామాజిక జీవితంలో చాలా బహిరంగంగా కనిపించే ఆర్థిక దోపిడీ గురించి, రాజ్యహింస గురించిన సాహిత్య రచన చేయగలిగారే తప్ప, కులం, మతం, జెండర్, వృత్తి లాంటి అంశాలు సామాజిక జీవితంలో నిర్వర్తిస్తున్న రాజ్య పాత్రని గురించి విశ్లేషించలేకపోయారు. సాహిత్య వస్తు విస్తృతి వైపు రచయితల దృష్టి మరల్చాల్సిన విప్లవ విమర్శకులు ఆ విషయంలో పూర్తిగా విఫలమయ్యారు. రచయితల్ని 'ద్వంద్వ ప్రత్యర్థుల' ఆలోచన నుంచి బయట పడవేయలేకపోగా దాన్ని తాత్త్వికంగా కూడా సమర్థించారు. విప్లవ పార్టీలు ప్రధాన వైరుధ్యాలుగా గుర్తించని అంశాల మీద సాహిత్య సృజన జరిగినప్పుడు విప్లవ విమర్శకులు వాటిని ఖండించారు. వస్తు రూపాల మధ్య వైరుధ్యం చూపి వస్తు ఆధిక్యతని ప్రకటించారు. ఫలానా అంశం మీద రాయడమే సాహిత్య పురోగమన దృష్టికి నిదర్శనంగా భావించారు. 'ప్రత్యక్ష రాజకీయాల్ని' ఆవాహన చేయని సాహిత్యాన్ని తప్పుదోవ పట్టించే సాహిత్యంగా ప్రకటించారు. ప్రారంభ దినాల్లో సంప్రదాయ సాహిత్యవాదుల నుంచి విప్లవ సాహిత్యాన్ని కాపాడడంలో అమోఘమైన పాత్ర నిర్వర్తించిన విప్లవ విమర్శకులు ఆ తరువాత విప్లవ సాహిత్య వస్తు ప్రపంచం కుంచించుకుపోవడంలో అంతే పాత్ర నిర్వహించారు. ఫలితంగా ఎనభైల నాటికి విప్లవ సాహిత్యంతో పాటు విప్లవ విమర్శ బలహీనపడింది..

> చిత్రకళలో కనిపించే కలాజ్ టెక్నిక్ లాంటిది రచయిత అనుభవ ప్రపంచంలోని క్రమరాహిత్యాన్ని ఆవిష్కరించడానికి అవకాశం ఇస్తుంది.

1985ల తరువాత దళిత, స్త్రీవాదాల నేపథ్యంలో విప్లవ పార్టీల కంటే విప్లవ సాహిత్యం అని పిలవబడే సాహిత్యంలో సమాజాన్ని గురించిన విస్తృతావగాహన, నిర్దిష్ట విశ్లేషణ కన్పిస్తాయి. అల్లం రాజయ్య కథల నుంచి సొదా లాంటి వాళ్ళ కథలు, కవిత్వం దాకా ఇది వర్తిస్తుంది. నిజానికి విప్లవ రచయితల సంఘాలలో లేకపోయినప్పటికీ, విప్లవ పార్టీల ప్రేరణతో సాహిత్య రచన చేస్తున్న రచయితలు కూడా విప్లవ పార్టీలు నమ్ముతున్న సైద్ధాంతిక చట్రాల్ని దాటి ముందుకు వచ్చారు. అలా రావడం వల్లనే సమకాలీన సాహిత్య వాతావరణంలో దళిత, స్త్రీవాదాల పక్కన విప్లవ సాహిత్యం ఇంకా అస్తిత్వంలో ఉంది. అయితే బాలగోపాల్, చివరి రోజుల్లో కె.వి.యార్ తప్ప తెలుగులో మార్క్సిస్టు విమర్శకులు ఏమాత్రం మారలేదు. నిజానికి చాలామంది ప్రముఖ మార్క్సిస్టు విమర్శకులు, ముఖ్యంగా త్రిపురనేని మధుసూదనరావు లాంటివాళ్ళు రాయడం లేదు. యువ విమర్శకుల్ని మార్క్సిజం ఆకర్షించలేక పోతోంది. మార్క్సిస్టు విమర్శనా పరికరాల పరిమితులు ఇందుకు కారణం.

తెలుగు నాట కమ్యూనిస్టు పార్టీల, కమ్యూనిస్టు సాహితీ, సాంస్కృతిక సంఘాల వైఫల్యాల్ని బహిర్గతం చేస్తూ, పరిమితుల్ని అధిగమిస్తూ, 1980ల తరువాత నుంచి స్త్రీవాదం, దళిత వాదం, మైనార్టీవాదం మొదలైన ఉద్యమాలు రంగం మీదకి వచ్చాయి. ఈ వాదాలకి తాత్త్విక ప్రేరణ ఆధునికానంతర వాదం. తెలుగు సమాజంలో స్త్రీవాదాన్ని రెండు దశలుగా విడగొడితే 1960ల నుంచి 80లదాకా కొనసాగిన స్త్రీవాదం మొదటిది. 80ల నుంచి ఇప్పటికీ



ఫ్లవర్ వేజ్

కొనసాగుతున్న స్త్రీవాదం రెండవది. మొదటి దశలోని స్త్రీవాదం ఆధునికతలో భాగంగా నడిచిన ఉదారవాద స్త్రీవాదం. 80ల తరువాత మొదలైన స్త్రీవాదం ఆధునికానంతర వాదంలో భాగంగా కొనసాగుతున్న రాడికల్ స్త్రీవాదం. తమది సోషలిస్టు స్త్రీవాదం అని చెపుతూ ఉన్నప్పటికీ, నిజానికి 80ల తరువాత వచ్చిన స్త్రీవాద రచనల్లో సోషలిస్టు స్త్రీవాద రచన 'జానకి విముక్తి' నవల మాత్రమే. ఓల్గా, పి. సత్యవతి, ఎస్. జయ, కొండేపూడి నిర్మల, పాటిబండ్ల రజని, సి. సుజాత, కుప్పిలి పద్మ మొదలైన వాళ్ళు రాస్తున్న కాల్పనిక సాహిత్యం కానీ, ఓల్గా, వసంతా కన్నబిరాన్, కల్పనా కన్నబిరాన్, కె. లలిత, రేఖా పప్పు, తేజస్విని నిరంజన, సూసీతారు లాంటి వాళ్ళ తాత్త్విక రచనలు సోషలిస్టు స్త్రీవాద పరిమితుల్ని బయటపడి రాసినవని గుర్తించాల్సి ఉంటుంది.

ఉదారవాద స్త్రీవాదం 'స్త్రీ కూడా ఒక మనిషే' అనే గుర్తింపుని తీసుకు రాగలిగింది. రాడికల్ స్త్రీవాదం ఇంకా ముందుకు పోయి స్త్రీని కేవలం పురుషుడి సంబంధం లోంచి నిర్వచించడం కాక స్త్రీని ఒక ప్రత్యేక విషయిగా నిలిపింది. తాత్త్వికంగా, శరీర నిర్మాణపరంగా కూడా పురుషాధిక్యతని సవాలు చేసి, పితృస్వామ్యానికి గొప్ప ప్రమాదకారిగా నిలిచింది. ఉదార స్త్రీవాదం వల్ల పితృస్వామిక వ్యవస్థకి పెద్ద ప్రమాదం లేదు. అందువల్లే ఉదారవాద స్త్రీవాదం పట్ల లేని నిరసన తెలుగు సమాజంలో రాడికల్ స్త్రీవాదం పట్ల వచ్చింది. ప్రముఖ విప్లవ, అభ్యుదయ మార్క్సిస్టు రచయితలుగా చలామణి అయిన చాలామంది, రాడికల్ స్త్రీవాదం మీద దాడి చేశారు. మార్క్సిస్టుల నుంచి స్త్రీవాదం మీద విమర్శకులు రావడం చారిత్రక విషాదం. తమ మీద జరిగిన దాడిని స్త్రీవాదులు శక్తిమంతంగా ఎదుర్కొనగలిగారు.

'మాకు గోడలు లేవు', 'దుశ్శాసనులు', 'మనకు తెలియని మన చరిత్ర', 'సరిహద్దులు లేని సంధ్యలు' మొదలైన తాత్త్విక, రాజకీయ రచనలతో పాటు ఇంకా అనేక స్త్రీవాద కవిత్వ, కథా సంపుటాలకు రాసిన ముందు మాటల్లోనూ స్త్రీలు తమ తాత్త్విక 'ఆధిక్యత' చాటగలిగారు. ఈ క్రమం మొత్తంలో చాలా స్పష్టంగా కన్పించేది ఆధునికానంతర తాత్త్విక చేతనే.

స్త్రీవాదంలో చాలా కీలకమైన రచన- 'మనకు తెలియని మన చరిత్ర'. చరిత్రని ఒక క్రమానుగత సంఘటనల సమాహారంగా చూసే పద్ధతిని, దృష్టిని నిలదీసింది. చరిత్రలో మార్జినలైజ్ చేయబడిన విషయి (ఈ సందర్భంలో స్త్రీ) ప్రాధాన్యతని ఈ గ్రంథంలో నొక్కి చెప్పింది. ఒకరకంగా ప్రత్యామ్నాయ రచనా శాస్త్రానికి ద్వారాలు తెరిచింది. తెలంగాణ పోరాటంలో విస్మృతిలోకి నెట్టబడిన స్త్రీల పాత్రని వెలికి తీయడం ద్వారా ఈ పుస్తకం వైయక్తిక జీవిత చరిత్రలకి, ఆత్మకథలకి, సమాజ స్థూల చరిత్రకి ఉండే సంబంధాన్ని వెలుగులోకి తీసుకొచ్చింది. మిషేల్ ఫుకోలాంటి ఆధునికానంతరవాద తాత్త్వికులు అందించిన చరిత్ర రచనాపద్ధతుల ప్రేరణ ఈ పుస్తకం రూపొందడంలో కనిపిస్తుంది. అయితే, స్త్రీవాదులు దీనిని తెలుగులో ఆ తరువాత కొనసాగించలేకపోయారు.

రాజకీయాలకు, వైయక్తిక అంశాలకు ఉన్న సంబంధాన్ని ఆధునికతావాదం ఎప్పుడూ పట్టించుకోలేదు. 'వైయక్తికం కూడా రాజకీయమే' అని ప్రకటించిన వాళ్ళు స్త్రీవాదులే. ఓల్గా 'రాజకీయ కథలు', పి. సత్యవతి 'ఇల్లలకగానే...' లాంటి కథాసంపుటాల్లో ఈ విషయాన్ని స్పష్టంగా చూడవచ్చు. వైయక్తిక సంబంధాల్లో ఉండే అనేక సున్నితాంశాల్ని చాలా ధైర్యంగా ఘంటసాల నిర్మల, కొండేపూడి నిర్మల, జయప్రభ, పాటిబండ్ల రజని లాంటి వాళ్ళ కవిత్వంలో చూడవచ్చు. సాహిత్య వస్తువు కాని అంశం జీవితంలో ఏదీ లేదని రుజువు చేశారు స్త్రీవాదులు.

స్త్రీవాదులు ప్రస్తావించిన అంశాలన్నీ కూడా కొన్ని సామాజిక (పితృస్వామిక) నిర్మాణాలకి సంబంధించి ఉండడం వల్ల అవి అనివార్యంగా రాజకీయాంశాలేననే విషయాన్ని 'మెయిన్‌స్ట్రీం' రాజకీయవాదులు అంగీకరించక తప్పలేదు. రాజకీయాలను గురించి సంప్రదాయ అవగాహనని, అర్థాన్ని స్త్రీవాదులు వినిర్మించారు. తద్వారా సమాజంలో అమలులో ఉన్న సంబంధాల్ని, వాటి సూక్ష్మ క్షేత్రాల్ని వెలికి తీసి చూపగలిగారు. సాహిత్య విమర్శలో, భాషకు సంబంధించిన చర్చల్లో కూడా స్త్రీవాదులు ఆధునికానంతర చేతనని కనపర్చారు.

ఇటీవలి కాలంలో స్త్రీవాద ఉధృతి కొంత తగ్గింది. దీనికి ప్రత్యక్ష కారణాలు: స్త్రీవాదం ఎక్కువగా తాత్త్విక, సాహిత్య రంగాలకే పరిమితం కావడం, 'నిర్దిష్ట' రాజకీయ ఉద్యమాలపై శ్రద్ధ చూపకపోవడం. ఏ ఉద్యమమైనా సిద్ధాంతం- ఆచరణలను ఏకకాలంలో ముందుకు తీసుకుపోవడం ద్వారానే అస్తిత్వంలో ఉండగలుగుతుంది. ఈ పని చేయడంలో స్త్రీవాదం విఫలమైంది. అలాగే దళిత స్త్రీల పితృస్వామిక అణచివేతల్ని గురించి అవగాహనని ప్రచారం చేయడంలో కూడా స్త్రీవాదం వెనుకబడే ఉంది.

ఈ పై కార్యక్రమాల్ని చేపట్టడంతో పాటు స్త్రీవాదం విస్తరించాల్సిన రంగాలు చాలా ఉన్నాయి. ముఖ్యంగా సమకాలీన రచనల్లో చేతనంగా, అచేతనంగా వ్యక్తమవుతున్న పితృస్వామిక లక్షణాల్ని బహిర్గతం చేయడం, ప్రాచీన గ్రంథాల్లోని పితృస్వామిక ప్రవచనాల్ని వెలికితీసి ఖండించడం, సాహిత్యంలో స్త్రీల ప్రాతినిధ్యాన్ని విశ్లేషించడం, సమస్త రంగాల్లో స్త్రీని పరాయి (అదర్)గా చూసే దృష్టిని నిరాకరించడం, రచనల్లోనూ, రోజువారీ జీవితంలోనూ వ్యక్తమయ్యే, ఆవిష్కరింపబడే అధికార సంబంధాల్ని ఖండించడం, పాఠక విశ్లేషణల్ని కూడా ఒక రాజకీయ ఆచరణగా గుర్తించి ఆ పని చేయడం, స్త్రీ- పురుషుడు అనే



గుర్తింపులను వాటి మూలాల్లోంచి అర్థం చేసుకోవడానికి ఉపయోగపడే మనో వైజ్ఞానిక శాస్త్రాన్ని ఉపయోగించుకోగలగడం మొదలైన పనుల్ని శక్తిమంతంగా నిర్వర్తించడం ద్వారానే స్త్రీవాదం తెలుగు సమాజంలో ఇప్పుడున్న స్థితిని దాటి ముందుకు పోగలదు. అలా కానప్పుడు స్త్రీవాదం ఒక చారిత్రక సందర్భంలో ముందుకు వచ్చిన ఒక సాహిత్యోద్యమంగా మిగిలిపోతుంది. సాహిత్యోద్యమాలు సారాంశంలో వాటి లక్ష్యాన్ని సాధించినట్టు చరిత్రలో ఎక్కడా లేదు.

1980ల తరువాతే తెలుగు సాహిత్య, రాజకీయ ప్రపంచంలోకి చాలా ఉధృతితో దూసుకొచ్చిన మరొక ఉద్యమం దళితవాదం. తెలుగు సమాజంలో దళితవాదం మార్క్సిజాన్ని సంశయిస్తూ, మార్క్సిస్టుల్ని, కమ్యూనిస్టుల్ని మౌలిక ప్రశ్నలతో నిలదీస్తూ మొదలైంది. ఒకరకంగా తెలుగు సమాజంలో దళితవాదం రాజకీయోద్యమంగా కంటే సాహిత్యోద్యమంగా ఎక్కువ ప్రచారమైంది. దళిత రాజకీయోద్యమకారులు చేయలేని పని దళిత కవులు చేశారు. సామాజిక జీవితంలో దళితుల మీద నిరంతరం పెరిగిపోతూ ఉన్న భౌతిక దాడుల నేపథ్యంలో దళిత సాహిత్యోద్యమం విస్తరించింది.

దళిత కవిత్వం, దళిత ఉద్యమం వేస్తున్న ప్రశ్నలకు సమాధానాలు లేని కమ్యూనిస్టు పార్టీలు, మార్క్సిస్టు తాత్త్వికులు, విమర్శకులు నిరాపేక్ష ప్రేక్షకుల్లా మిగిలారు. త్రిపురనేని మధుసూదనరావు లాంటివాళ్ళు ఒకరిద్దరు తప్పితే మిగతా మార్క్సిస్టు తాత్త్వికులంతా పనికట్టుకుని రాయకుండా కూర్చున్నారు. ఇగ్నోర్ చేయడం ద్వారా కొన్నింటిని అధిగమించవచ్చుననే కుట్రకు ఇది తార్కాణం. ఈ లక్షణం ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టులకు ఉన్నదే. మార్క్సిస్టు తాత్త్విక చట్రంలో ఇమడని, ఆ చట్రానికి అందని ఏ ఉద్యమాన్నీ కమ్యూనిస్టులు సహించలేరు.

దళిత ఉద్యమం, దళిత సాహిత్య చేతన ఆధునికానంతర వాదానికి దగ్గరగా ఉంటుంది. నిజానికి ఒక నిర్దిష్ట ప్రాంతీయ సమస్యకు విశ్వజనీన పరిష్కారాల్ని కాక ప్రాంతీయమైన పరిష్కారాల్ని వెతుక్కోవాల్సిన అవసరాన్ని గుర్తించే చైతన్యాన్ని ఆధునికానంతరవాదమే ఇచ్చింది. ఈ చేతననుంచే అంబేద్కర్, ఫూలే లాంటి దేశీయ తాత్త్వికుల్ని చరిత్ర నుంచి వెలికితీసి రంగం మీదకు తీసుకురాగలిగారు దళితవాదులు. ఈ క్రమంలోనే దేశీయ మార్క్సిజం, అంబేద్కరిజం లాంటి వాదాలు ఊపందుకున్నాయి. ఆధునికానంతరవాద చేతన వల్లే దళితవాదులు దళిత గుర్తింపును సాహితీ క్షేత్రంలో నిలిపారు. కుల అంతరాలకు, నిర్మాణాలకు అతీతంగా విశ్వమానవ గీతాలాపన చేయడానికి నిరాకరించి నిర్దిష్ట మానవుణ్ణి గురించి మాట్లాడడం ప్రారంభించారు.

తెలుగునాట దళితవాదం ఒక వాదంగా రూపుదిద్దుకోవడంలో కె.జి. సత్యమూర్తి, కత్తి పద్మారావు, బి.యస్. రాములు, ఉ. సాంబశివరావు, కె. శ్రీనివాస్, సురేంద్రరాజు, సాహు, లక్ష్మీనరసయ్యల కృషి చాలా ఉంది. దళిత సాహిత్యం మీద, రాజకీయాల మీద కమ్యూనిస్టులు చేసిన విమర్శలకు వీళ్ళు



సమాధానాలు ఇచ్చి దళితవాదాన్ని తాత్త్వికంగా నిలబెట్టారు. మొదటినుంచీ మన సమాజంలో ఏ ఉద్యమం నిలదొక్కుకోవాలన్నా ఆ ఉద్యమం తన భావాల్ని చాలా తీవ్రంగానూ, ఆవేశంతోనూ ప్రచారం చేస్తే తప్ప అది సాధ్యం కాదు. అతివాదం అనివార్యం. సరిగ్గా సాహిత్య విమర్శలో ఈ అతివాద పాత్రని నిర్వర్తించడం ద్వారా దళిత సాహిత్య పరిణామాన్ని వేగవంతం చేశారు లక్ష్మీనరసయ్య. ఎక్కువ సందర్భాలలో కామన్ సెన్స్ మీద ఆధారపడి ఉండే లక్ష్మీనరసయ్య విమర్శలు కమ్యూనిస్టుల్ని నిలదీసి ప్రశ్నించాయి. త్రిపురనేని శ్రీనివాస్ సహ సంపాదకత్వంలో వెలువడిన చిక్కనవుతున్న పాటకు రాసిన ముందు మాటలో 'దేశీయ మార్క్సిజమే దళిత కవిత్వ అజెండా' అని ప్రకటించి గొప్ప సంచలనాన్ని సృష్టించారు లక్ష్మీనరసయ్య. అయితే, ఆ తరువాత ప్రచురించిన పదునెక్కిన పాటలో లక్ష్మీనరసయ్య ఆలోచన మరింతగా పదునెక్కింది. నిర్దిష్టత సంతరించుకుంది. 'భారతీయ సమాజం కుల- వర్గ సమాజం' అని చిక్కనవుతున్న పాటలో ప్రకటించి, ఆ తరువాత పదునెక్కిన పాటలో 'సోషలిస్టు విప్లవం కన్నా ముందు దళిత ప్రజాస్వామిక విప్లవం' జరగాలని ప్రకటించాడు. ఈ మార్పుకి కారణం దళిత సాహిత్యం నుంచి సమాజ వాస్తవికతని మరింత దగ్గరగా గ్రహించడం.

> దళితవాదులు కుల భేదాలకు అతీతంగా విశ్వమానవ గీతాలాపన చేయడానికి నిరాకరించి, నిర్దిష్ట మానవుణ్ణి గురించి మాట్లాడడం ఆరంభించారు.

తాత్త్విక అవగాహనకు లక్ష్మీనరసయ్య ఎక్కువగా సాహిత్యం మీద, మరీ ముఖ్యంగా కవిత్వం మీద ఆధారపడుతున్నారనిపిస్తుంది. అందుకు సాక్ష్యం ఇటీవల వెలువడిన లక్ష్మీనరసయ్య *దళిత సాహిత్యం-తాత్త్విక దృక్పథం* అనే రచన. పదిహేను వ్యాసాలున్న ఈ పుస్తకంలో దాదాపు అన్ని వ్యాసాలు కవిత్వం మీద రాసినవే కావడం ఆశ్చర్యం. "స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం ప్రాణంగా కలిగిన బౌద్ధ ధర్మం అంబేద్కరిజానికి కీలకం. అందుకే అంబేద్కరిస్టు కావలసిన ప్రతివాడు బుద్ధిస్టు కావలసిన అవసరం ఉంది" (దళిత సాహిత్యం- తాత్త్విక దృక్పథం, పేజ్-6) అని లక్ష్మీనరసయ్య ఒక విచిత్ర ప్రకటన చేశారు. ఇక్కడ లక్ష్మీనరసయ్య ఒక విషయాన్ని మర్చిపోతున్నారు. అంబేద్కర్ తన చారిత్రక స్థితిలోంచి, పరిమితుల్లోంచి బుద్ధిజానికి దగ్గరయ్యారు. దళితులు ఇవాళ ఆ పని చేయాల్సిన చారిత్రక అవశ్యకత ఏమీ లేదు.

బుద్ధిజం తాత్త్వికంగా ఏమి చెప్పినా ఆచరణలో అది మతరూపం తీసుకుంది. ఏ మతమయినా శ్రేణీకరణల్ని ముందుకు తెస్తుంది. అంటే మౌలికంగా ప్రజాస్వామిక విలువలకి అడ్డంకిగా తయారవుతుంది. అలాగే బుద్ధుడి ప్రతిపాదనల్ని సమకాలీన ఆలోచనలను పదును పెట్టుకోవడం కోసం వాడుకోవడానికి, దళితులందరూ బుద్ధిస్టులుగా మారడానికి మౌలిక వ్యత్యాసం ఉంది. ఈ విషయాన్ని గుర్తించడం అవసరం.

దళిత సాహిత్యం విస్తృతి చెందే క్రమంలో చిక్కనవుతున్న పాటకి, పదునెక్కిన పాటకి మధ్యలో వెలువడిన దళిత కవితా సంపుటి *బహువచనం* స్పష్టంగా ఆధునికానంతరవాద చేతనని ప్రదర్శించింది. దళిత సాహిత్యానికి, ఆధునికానంతరవాద తత్త్వశాస్త్రానికి ఉన్న సంబంధాన్ని ఈ సంపుటికి రాసిన ముందు మాటలో సుంకిరెడ్డి నారాయణరెడ్డి విశ్లేషించారు. ఎస్.సి, ఎస్.టి, బి.సి, ముస్లిం రచయితల ఉమ్మడి వాదంగా ముందుకు వచ్చిన దళితవాదంలో కూడా అనిర్దిష్టత, అమూర్తత ఉన్నాయి. ఈ సామాజిక బృందాల మధ్య కూడా విపరీతమైన అంతరాలు ఉన్నాయి. సరిగ్గా మాలలకి, మాదిగలకి మధ్యనున్న అంతరాన్ని బహిర్గతం చేస్తూ ముందుకు వచ్చిన ఉద్యమం మాదిగ దండోరా. ఒక సామాజిక సందర్భంలో అధికారాన్ని అమలు చేయడానికి అలవాటు పడ్డ బృందం, సమాజంలో కొన్ని రంగాల్లోనైనా యథాతథ స్థితి కొనసాగడం వల్ల లబ్ధి పొందే బృందం ఆ అధికారాన్ని వదులుకోవడానికి కానీ, ఆ లబ్ధిని కోల్పోవడానికి కానీ సిద్ధంగా ఉండదు.

అలా వదులుకోవాల్సిన చారిత్రక అవసరాన్ని గురించి చర్చకు పెట్టే బృందాలతో ఘర్షించడానికి కూడా ఆ బృందం వెనుకాడదు. సరిగ్గా ఈ విషయాన్ని రుజువు చేస్తూ వచ్చిన ఉద్యమమే మాల మహానాడు. కలేకూరి ప్రసాద్ మాటల్లో చెప్పాలంటే, 'మాల మహానాడు పుట్టుకే దళిత చైతన్యానికి వక్రీకరణ.' అధికార లేమి అనేది దళితుల, స్త్రీల, ఒకరకంగా మైనార్టీల గుర్తింపుల్ని నిర్దేశించేదిగా ఉంటుంది. అధికారం అనేది మొత్తం సాంఘిక, సాంస్కృతిక రంగాల్ని, ఇంకా మన ఆలోచనా విధానాల్ని ఆవరించి ఉంటుంది. అందువల్ల అధికార కేంద్రాలు బహుళంగా ఉంటాయి. వ్యక్తుల, సామాజిక బృందాల గుర్తింపుల్ని ఈ కేంద్రాలే నిర్వచిస్తూ ఉంటాయి.

ఈ పై క్రమం ఫలితంగా వ్యక్తులు నిరంతరం ఒకే గుర్తింపులో ఉండరు. దళితులకు కూడా ఇది వర్తిస్తుంది. గుర్తింపు మారినప్పుడల్లా అధికార సంబంధాల స్థితి కూడా మారుతూ ఉంటుంది. ఒక స్థితిలో అధికారానికి గురయినవాడు వేరొక స్థితిలో అధికార ప్రయోగం చేస్తూ ఉంటాడు. అందువల్లే ప్రముఖ ఆధునికానంతరవాద తాత్త్వికుడు మిషేల్ ఫుకో పిచ్చివాళ్ళు, చిన్నపిల్లలు తప్ప సమాజంలో అధికార ప్రయోగం చేయనివాళ్ళెవరూ ఉండరంటాడు. కాబట్టే బహుజన ఉద్యమంగా ప్రారంభమైన దళితవాదంలో దళితుల్లోని శ్రేణీకరణల ప్రస్తావన రాగానే అధికార లబ్ధిని, ప్రయోగాన్ని వదులుకోవడానికి సిద్ధంగా లేని బృందాలు అడ్డం తిరిగాయి. ఈ బృందాల మధ్య స్పర్థలు పొడచూపాయి.

బ్రాహ్మణవాద భావజాలాన్ని, అది రూపొందించి అమలు చేస్తున్న అధికారాన్ని, అధికార సంబంధాల్ని నిరాకరించడంలో, దానికి వ్యతిరేకంగా ఉద్యమించడంలో గొప్ప ఐక్యతని ప్రదర్శించిన బృందాలు ఆ తరువాత తమ మధ్య అంతరాల ప్రస్తావన వచ్చినప్పుడు అంతర్గత విభేదాల్లో చిక్కుకున్నాయి. ఈ విభేదాలకి ఒకానొక సంస్థాగత రూపమే మాల మహానాడు. ఈ విభేదాలు ముందు ముందు బి.సిల మధ్య మరింత తీవ్రంగా తలెత్తుతాయి.

ఎండ్లూరి సుధాకర్ రాసిన *మల్లెమొగ్గల గొడుగు*, *కొత్త గబ్బిలం*, నాగప్పగారి సుందర్రాజు *మాదిగోడు* కథలు దళితవాద ఉద్యమంలో ఎన్నదగిన రచనలు. ఒక నిర్దిష్ట సామాజిక బృందం అంతే నిర్దిష్టమయిన కులం అనే ఒక కేంద్రం నుంచి ఉపాంతం (మార్జిన్)లోకి నెట్టివేయబడడంలో ఉన్న హింసని ధ్వనించడం ద్వారా అవి గొప్ప రచనలయ్యాయి. ఒక సామాజిక బృందపు ఉపాంతీకరణ క్రమాన్ని అర్థం చేసుకోవడానికి, ఆవిష్కరించడానికి కవిత్వం కంటే వచనం గొప్ప సాధనం అనడానికి ఎండ్లూరి సుధాకర్ రాసిన *కొత్త గబ్బిలం*, *మల్లెమొగ్గల గొడుగు*ల మధ్య పోలిక చాలు. 'పాలిటిక్స్ ఆఫ్ సోషల్ మార్జినాలిటీని' ఈ కథలు, కవిత్వం శక్తిమంతంగా బహిర్గతం చేశాయి. మాలలు, మాదిగలు, స్త్రీలు, మైనార్టీలు అందరూ ఈ 'పాలిటిక్స్ ఆఫ్ మార్జినాలిటీ'కి గురయినప్పటికీ అందరూ ఒకే నిర్దిష్ట కేంద్రం నుంచి ఆ వివక్షతకి గురి కాలేదని, ఒకేరకంగా గురి కావడం లేదని గుర్తించాలి.

ఇదే సందర్భంలో *మల్లెమొగ్గల గొడుగు*, ఖదీర్ బాబు *దర్గామిట్ట కతలు*, నామిని *సినబ్బ కతలు* మొదలైనవి గతపు వర్తమానత్వాన్ని సూచిస్తాయి. ఈ కథలు 'సెల్ఫ్ రిఫ్లెక్సివ్'గా ఉంటాయి. ఆధునికానంతరవాద పరిభాషలో చెపితే ఇవి 'హిస్టారియోగ్రాఫిక్ మెటాఫిక్షన్'లో భాగం. సొంత చరిత్రని గుర్తించిన నిర్దిష్ట అవగాహన, గత కాలపు వస్తురూపాల్ని పునర్ నిర్వచించడం ఈ కథల లక్షణం. ఈ రచయితలు కథా రచనని వీలైనంతగా లిఖిత సాహిత్య లక్షణాల్నించి దూరం చేసి మౌఖికత్వానికి దగ్గర చేశారు (ఇది మాండలికానికి సంబంధించిన అంశం

నన్రెజ్



కాదు). తద్వారా ఈ రచయితలు ఆధునికత ముందుకు తెచ్చిన రూప నంబంధమైన నిర్వచనాల్ని, సూత్రాల్ని అధిగమించారు. ఈ అధిగమనం వల్లే తమది కూడా గొప్ప సాహిత్యమనే ఒకానొక 'ఎన్సర్షన్' ఈ రచయితలకు సాధ్యమయింది. ఆధునిక సూత్రాల ప్రకారం, ముఖ్యంగా కథ, నవలలకు నంబంధించిన సూత్రాల ప్రకారం వాళ్ళు రాసినవి అసలు కథలుగా గుర్తింపు పొందలేవు. అదే ఆధునికత లోని దారుణం.

ఆధునికతావాద కథాసూత్రాల్ని ప్రశ్నించడం ద్వారానే ఈ కథలు కథలుగా నిలుస్తాయి. కథల్ని ఈ రచయితలు జీవిత విమర్శగా కాక, విశ్లేషణగా కాక జీవిత వ్యక్తీకరణగా చూశారు. అందుకే ఆ కథల్లో అంత జీవం ఉట్టిపడుతోంది. ఒక దశాబ్దం పాటు దళిత ఉద్యమంలో భాగంగా కొనసాగిన ముస్లింవాద కవిత్వం జల్ జలా నంపుటితో ఒక నిర్దిష్ట రూపం తీనుకుంది. ముస్లింవాద కవిత్వానికి ఆ పేరు ఎవరు పెట్టారో కానీ అది కొంత మత వానన వేస్తోంది. ముస్లింవాద కవిత్వంలో ఆవిష్కరించబడిన అంశాలకి, ముస్లింవాదానికి ఎటువంటి నంబంధం లేదు. ముస్లింవాద కవిత్వంలో ముస్లిం మతం మీద కూడా విమర్శలున్నాయి.

ఈ విషయాన్ని పక్కన పెట్టి ఆలోచిస్తే, తెలుగులో ముస్లిం మైనార్టీ కవిత్వం గణనీయమైన కవిత్వాన్ని సృష్టించింది. ఖాదర్ పుట్టుమచ్చతో ప్రారంభమైన ముస్లిం మైనార్టీ కవిత్వం జల్‌జలా నాటికి నిర్దిష్టతని నంతరించుకుంది. నా దేశంలో నేను కాందిశీకుణ్ణి (ఖాదర్) అని ఒకానొక అస్తిత్వ ఆందోళనని వ్యక్తీకరించిన ముస్లిం మైనార్టీ కవి 'ఈ దేశ పటాన్ని చుట్ట చుట్టి నీ తల కింద పెట్టుకోవటానికి/ అది నీ అయ్య జాగీరు కాదు/ అంగట్లో దొరికే కుంకుమ కాదు దేశభక్తి/ తెగిన దేశ సరిహద్దు రేఖని/అతికిన వీరజవానుల్లో మేమూ ఉన్నాం" (నయ్యద్ గఫార్) అంటూ తన ఐడెంటిటీని ఎన్సర్ట్ చేనుకుంటున్నాడు.

ఈ పై వాదాలతోపాటు ఇటీవల బి.సి కవిత్వం కూడా మొదలైంది. 'గోనంగి నీలగిరి సాహితి' పేరుతో వెలువరిస్తున్న నంపుటాలలో ఇది చూడవచ్చు. ఇలా సాహితీ ప్రపంచం భిన్న పాయలుగా చీలిపోవడం ఆహ్వానించదగిన పరిణామమే. ఎవరి నమస్యల్ని గురించి వాళ్ళు మాట్లాడడమే సరైన ప్రజాస్వామిక లక్షణం. ప్రాతినిధ్యాలు ప్రమాదకరం. ప్రతి ప్రాతినిధ్యం సారాంశంలో తప్పుడు ప్రాతినిధ్యంగా మిగులుతుంది. ఆయా బృందాలు తమ తమ ప్రత్యేక నమన్యల గురించి మాట్లాడే క్రమంలో మాత్రమే వివిధ బృందాల మధ్య చర్చ, నంభాషణ నడున్తుంటాయి. ఆ క్రమంలోనే మానవ నంబంధాల్లో, సాంస్కృతిక నంబంధాల్లో ప్రజాస్వామిక విలువలు బలపడతాయి. అందువల్ల సాహితీ ప్రపంచంలో ఇప్పుడున్న 'చీలికలన్నీ' నంస్థల్నించి, బృందాల్నించి క్రమంగా వ్యక్తి వరకు విస్తరించాలి. ఎందుకంటే, వ్యక్తికీ వ్యక్తికీ మధ్య ఉండే నంబంధాల్లో విపరీతమైన అధికారం కేంద్రీకృతమై ఉంది. దానిమీద యుద్ధం జరగాలి. మిషెల్ ఫుకో మాటల్లో చెప్పాలంటే, ప్రతివ్యక్తి మెదడులో ఫాసిజం దాగి ఉంది. దాని మీద యుద్ధం చేయకుండా సామాజిక నంబంధాల్లో ప్రజాస్వామిక విలువలు రూపుదిద్దుకోవు. అందువల్లే ఈ నమస్త చీలికలు ఆహ్వానించదగినవి.

పై ధోరణులతో పాటు తెలుగు సాహిత్య క్షేత్రంలో ఇంకా అనేక పాయలున్నాయి. కొంతమంది వ్యక్తులుగా ఈ పాయలకి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. వ్యక్తి రోజువారీ జీవితంలో అమలయ్యే అనేక మూర్త, అమూర్త అణచివేత రూపాల్ని బహిర్గతం చేస్తూ రచనలు చేస్తున్నారు. కొంతమంది సౌందర్య శాస్త్ర ప్రమాణాల్ని పునర్ నిర్వచిస్తూ రచనలు చేస్తున్నారు. మరికొంత మంది నగర యాంత్రికత మధ్య పల్లె జీవితపు నాస్టాల్జియాని ఆవిష్కరిస్తున్నారు. మరికొంతమంది లైంగిక నంబంధాల నంతోషాన్ని ఆవిష్కరిస్తున్నారు. ఇంకొంతమంది భాషలో ఫాసిజాన్ని వెలికి తీస్తున్నారు. గత రెండు దశాబ్దాలలో వచ్చిన ఆధునికానంతర వాద సాహిత్యం వైవిధ్యంలోనూ, విస్తృతిలోనూ అంతకు ముందున్న ఎనిమిది దశాబ్దాల ఆధునిక సాహిత్యంతో పోటీ పడగలదు.

> ప్రతివ్యక్తి మెదడులో దాగివున్న ఫాసిజంపై యుద్ధం చేయనిదే సామాజిక నంబంధాల్లో ప్రజాస్వామిక విలువలు రూపుదిద్దుకోవు.

తెలుగులో ప్రముఖ ఆధునిక కథకులైన గురజాడ, శ్రీశ్రీ, కొకు, గోపీచంద్, బుచ్చిబాబు లాంటి రచయితలందరూ ఒకే నిర్దిష్ట (కొన్ని నందర్భాలలో జడాత్మక) తాత్త్విక చట్రాలలోంచి జీవితాన్ని చూశారు, చిత్రించారు. 'మార్క్సిజం అర్థం చేనుకోలేనివాడు జీవితాన్ని అర్థం చేనుకోలేడన్నారు కుటుంబరావు. నువ్వు రచయితవి కావాలంటే కమ్యూనిస్టువు కావాలన్నారు శ్రీశ్రీ. అలాగే గోపీచంద్ కొంతకాలం మార్క్సిజం, ఆ తరువాత రాయిజం, మరికొంత కాలం తరువాత కొంత ఆధ్యాత్మిక వాద ప్రభావంతో రచన చేశారు. బుచ్చిబాబు, ఫ్రాయిడ్, రస్సెల్‌ల ప్రభావంతో రచన చేశారు. ఫలితంగా ఈ రచయితలందరూ జీవితాన్ని ఏదో ఒక పార్శ్వం నుంచి మాత్రమే చూడగలిగారు. నమకాలీన రచయితలు ఈ పరిమితుల్ని అధిగమించి జీవితాన్ని బహుముఖంగా అర్థం చేసుకుంటున్నారు. బహుళత్వం ఈ రచయితలకి చేతన శకలీకరణ, విచ్ఛిన్నతలు, అనిశ్చితత్వం, స్వయం చేతన ఈ రచయితల ప్రత్యేకతలు. సైన్స్ ఫిక్షన్ నుంచి మాజికల్ రియలిజం దాకా తెలుగు కథకులు విస్తరించారు. కవిత్వం కొంత తగ్గు ముఖం పట్టిన నేపథ్యంలో కూడా కథ నిరంతరాయంగా కొనసాగుతూ ఉంది.

చివరగా గత దశాబ్దం మొత్తంలో సాహిత్య విమర్శ ఆధునికానంతర వాద ప్రేరణలో నడిచింది. నిర్మాణ వాద, ఉత్తర నిర్మాణ వాద, స్త్రీవాదాలకు నంబంధించిన అనేక కొత్త విమర్శ పరిమితులు బహిర్గతం చేయబడ్డాయి. ఈ క్రమంలో మార్క్సిస్టు విమర్శ పరిమితులు బహిర్గతం చేయబడ్డాయి. నంప్రదాయ సాహిత్య విమర్శనా పరికరాల్ని, విమర్శనారంగంలో కొనసాగించడం అసాధ్యమైంది. ఆటువంటి విమర్శకులు తెరమరుగయ్యారు. బాలగోపాల్, ఓల్గా, కంచ ఐలయ్య, కె. శ్రీనివాస్, సుధేంద్రరాజు, అఫ్సర్, సీతారాం, పవన్ కుమార్, లక్ష్మీనరసయ్య, సుంకిరెడ్డి నారాయణ రెడ్డి, అట్లూరి రఘురామరాజు లాంటి వాళ్ళు ఆధునికానంతర సాహిత్య విమర్శనా పరికరాల్తో విమర్శ రాస్తున్నారు.

చివరిగా ఆధానికానంతర సాహిత్య చేతనని వ్యక్తం చేసే వఝెర చండీదాస్ గారి మాటలతో ఈ వ్యాసం ముగిస్తాను –

"కాంక్షలోంచి విముక్తిస్తూ
విముక్తిలోంచి కాంక్షిస్తూ
యెన్ని కాంక్షలో, యెన్ని విముక్తులో
..............
కాంక్షా విముక్తులు యెంతకీ తీరవు
ముగియవు."

■

# కథానికలు



● మునిపల్లె రాజు ● కేతు విశ్వనాథ రెడ్డి ● సతీష్ చందర్
● మధురాంతకం నరేంద్ర ● వి. చంద్రశేఖరరావు
● మహమ్మద్ ఖదీర్‌బాబు ● తోలేటి జగన్మోహనరావు ● నవీన్

• మునిపల్లె రాజు
• చిత్రాలు: దీవక్




నిశ్శబ్దంలోనూ, మౌనంలోనూ ఒక మహత్తర శక్తి దాగి ఉంటుందని ఆయన సాహచర్యంలోనే నేను గ్రహించాను. మరి నాలుగేళ్ళ పైగా న్యాయవాద వృత్తిలో ఆయన జూనియర్‌గా ఎదిగినవాణ్ణే గదా. న్యాయస్థానంలో ఏ వివాదంలో తర్జనభర్జనలు జరుగుతున్నా, ఆయన అనర్గళ వాక్ప్రవాహానికి ఒకటీ రెండు నిమిషాల మౌనం తప్పనిసరి. ఏదో యోగ సమాధిలోకి జారిపోయినట్లుగా ఆ నిశ్శబ్దం. ఆ తదుపరి వెలువడే మాటలు ఒక ప్రవక్త పవిత్ర ప్రవచనంలాగా, ఒక మహాకవి అంతర్జ్వలనం అక్షరరూపం దాల్చినట్లుగా గంభీర వాతావరణాన్ని కోర్టులో నెలకొల్పడం నా స్వీయానుభూతి పరంపర.

నా అభ్యర్థనను ఆయన ససేమిరా అంగీకరించలేదు. రెండు మన్వంతరాల కాలవ్యవధిలాంటి మౌనం తర్వాత ఆయనన్నారు: "అరవై ఏళ్ళు గానుగెద్దులాగా జీవించినందుకు ఒక షష్టిపూర్తి ఉత్సవం, పాతికేళ్ళు న్యాయవాదిగా నెట్టుకొచ్చినందుకు ఒక సిల్వర్‌జూబిలీ– వీటిలో నాకు నమ్మకం లేదు– సరికదా అదొక అల్పమైన అహంభావమని నా భావన. అవి మహామనీషులకు మాత్రమే తేజో దీపాలుగా మనవంటి సామాన్యులం వెలిగించవలసిన దివ్వెలు. కాలాయ తస్మై నమః అని ఒక ప్రార్థనాంతర్గత పాదం ఉన్నది. దాని అర్థం ఇది: 'దేనివల్లనైతే అన్ని శుష్క భోగాలూ స్మరణపథంలోంచి మాయమయ్యాయో ఆ కాలానికి నా నమస్కారం.' కృతజ్ఞతలు చెప్పుకోవలసింది కాలానికి. ఈ పండుగలు అల్ప ప్రజ్ఞకు కాదు."

మళ్ళీ నిశ్శబ్దం. నేనిక సెలవు తీసుకొందామని నమస్కారం చేసి లేస్తుండగా మౌనభంగం చేస్తూ ఆయన వారించారు.

"కూర్చో మూర్తీ. ఇందాక మహామనీషులన్నావే వారిని గూర్చి నీకు వినాలని లేదా?"

"ఎందుకు లేదు సార్. మిమ్మల్ని విసిగించ కూడదని లేచాను."

"అయితే విను. నీకొక సప్తతి ఉత్సవం గురించిన ఉదంతం చెబుతాను."

గౌరీపతి గారి మాటలు గడచిపోయిన ఏ శతాబ్దపు చరిత్ర పుటల నుంచో సహజ గంభీరతతో వెలువడుతున్నట్లనిపించి విస్మయంగా చూస్తున్నాను. యోగసమాధి నుండి మేల్కొన్న నిశ్శబ్ద దేవత తన మౌనపు పెదవులను విప్పి పవిత్ర మంత్రోచ్చారణను వినిపిస్తున్నప్పుడు, మానస సరోవరం నుండి కైలాస శిఖరం పైకి ఎగురుతున్న రాజహంస రెక్కల మార్మిక సంగీతం వినపడుతున్నప్పుడు అర్ధరాత్రి అయితేనేం, అపరాత్రి అయితేనేం? ఆయన చెప్పాలి.

"పరవాలేదు. నీ సిగరెట్టు ముట్టించుకో."

"మీరా? మీ ముందా?"

"నా ముందే. మనం కలియుగంలో ఉన్నాం. కానీ, ఈ కథ ద్వాపర యుగంనాటిదిగా నీకు తోస్తుందేమో. అందుకని."

* * *

"ముప్పై ఏళ్ళ తర్వాత మళ్ళీ మా ఊరు వెళ్ళాను. అప్పటికి నేను ప్రయోజకుడినై మా జిల్లాలో సొంత ప్రాక్టీసు ప్రారంభించాలనుకొంటున్నాను. ఇప్పటికప్పుడు ఏదో అవాంతరం ఏర్పడి ఆగిపోయిన ప్రయాణం ఇది. 'ఏదో అవాంతరం' అని నేను చెప్పుకున్నా కూడా నిజానికి ఒక మహోదయ ముహూర్తం. నగర జీవితపు సాలె గూడు చిక్కుల్లో ఇరుక్కొన్న మనం జీవిత గమనంలో ఏమి కోల్పోతున్నామో గ్రహించలేము గదా!

'చెన్నకేశవస్వామి దేవాలయం ధర్మకర్తృత్వం తప్పిస్తే (అది కూడా ఒక పరోక్ష కార్యమే!), నాకూ స్వగ్రామానికీ ఋణం తీరి దాదాపు అర్ధ శతాబ్ది అవుతున్నది గదా. అక్కడి ఆ విశాల భవనం ఎవరికో ఒకరికి విక్రయించి పారేస్తే సరిపోతుంది గదా' అని మావాళ్ళు అంటుంటారు. దాని చుట్టూ ఉన్న అంటు మామిడి తోట మీద వచ్చే స్వల్పాదాయం నీ ఖర్చుల్లో ఏ మూలకు? (ఒకసారి నీవు కూడా ఈ ప్రశ్న వేశావని గుర్తు. నేనేం జవాబిచ్చానో స్మృతిలో లేదు.) జన్మభూమితో ఋణం తీరిందనటం కృతఘ్నులకే చెల్లుతుంది. తప్పిపోయిన పశువులు కూడా తమ గాటను పసిగట్టి ఆ ఇంటికే వస్తాయి అని నేను సమాధానం చెబుతుంటాను. ఏమిటింత సెంటిమెంటల్‌గా ఆలోచిస్తున్నాడని అందరూ అనుకోవచ్చు.

ఒక్క బాల్యానందం, పితరుల సమాధులు, వాగులు, చెరువులు, గుళ్ళు గోపురాలు, ఆనాటి మిత్రబృందం– ఇవే కాదు, ఒక అలౌకికమైన, అభౌతికమైన చిదానందం ఒక రంగురంగుల కేతనంగా, ప్రాచీన సంగీత రాగంగా, జనని మృదుల హస్త స్పర్శగా, జీవన మాల్యాలనొత్తి వలిచే ప్రాణశంఖంగా నాకు స్వప్న దర్శనమిస్తుంటుంది మా ఊరు. మా పెద్దల ఆధ్యాత్మిక, ఐహిక సంపదకు ప్రతీకగా మా స్వగృహం. ఏమో, నా సంతతిలో ఎవరైనా ఈ దుష్ట అమానవీయ సంస్కృతి అభద్రత నుండి దూరం పోవాలనిపించినప్పుడు ఆ ఇల్లు ఆహ్వానించదా?

ఇంతకూ విచిత్రమేమిటంటే, ఆ ప్రయాణానికి నాంది, ప్రేరణా, సంకల్పం ఒక కల. ఒక స్వప్న సంచలనం! మే నెలలో న్యాయస్థానాలకు వేసంగి సెలవులు. గనక, సారస్వత సభలు ఏర్పాటు చేయాలని కొందరు సాహిత్యాభిలాషులు మా ఇంట్లో ఒక సన్నాహక కమిటీని సమావేశపరిచారు. ఆతిథ్యం మీదే. కానీ, అది పుష్కర ముందే మొదలయ్యే అనేక ఆంధ్రోద్యమాల వంటి కేకపుగా మారింది. మైక్ దొరికితే చాలు పెద్ద ఉపన్యాసాలు, గీతలు, ఆశయాలు వినిపిస్తే ఆ మనుషుల్లో కళ్ళు మొదటిసారిగా ప్రత్యక్షంగా చూశాను. మాటలు కళ్ళు కాదు, కులం కళ్ళు ప్రాంతీయాభిమానం కళ్ళు వర్గ, వర్గ విభజనల కళ్ళు అక్క విద్వంసకుల మీసమ్ము, పదస్తాలో వలలు, పిక్కు, పిమ్మల మధ్య ఆ క్షణంలోనే ఆ కమిటీ రద్దయింది. ఈ గొడవతో ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు.

తెల్లవారు జామున కల ఒక దీర్ఘ చిత్ర విభ్రమంగా నన్ను వెంటాడింది. మా గ్రామ చెన్నకేశవస్వామి కోవెల ధ్వజస్తంభం కదిలి నన్ను వెతుకుతూ వస్తున్నదట. ఏమిటీ వైపరీత్యం? చెన్నకేశవుడికి ఎవరు తలపెట్టారు ఒక అమంగళాపచారం? స్థల పురాణాల్లో చాళుక్యుల పురా శాసనాల్లో, శతక గ్రంథకర్తల నిష్కామ భక్తి పదాల్లో వరప్రసాదుడుగా వినుతికెక్కిన స్వామి ఈ రాయబారం ఎందుకు పంపుతున్నాడు? ముస్లిం విధ్వంసకుల దండయాత్రల్లో రెండుసార్లు శిథిలమైనా మళ్ళీ ప్రాచీన వైభవంతో తలెత్తినవాడు గదా. క్షేత్రపాలకుడై ఆ తర్వాత వెలసిన ఉగ్రాంజనేయులు తన ధర్మాన్ని విస్మరించాడా? కమ్ముకొస్తున్న కాల మేఘాల లాంటి ఆందోళనలు, సంకీర్ణ, సంక్షుభిత అరణ్యమైన హృదయం– ఇది సాధారణ స్వప్నం కాదు.

నా ధర్మపత్ని అంటున్నది, "ఎందుకంత క్షోభపడ్తారు? ఒకసారి వెళ్ళొస్తే పోలా? పిల్లలు కూడా బియ్యపు చెట్లు చూడాలని ఉబలాటపడ్తున్నారు."

పిల్లలది కాన్వెంటు చదువుల సంస్కారం. వాళ్ళు మా ఊరు చూడలేదింతవరకూ. నా భార్య మా వివాహం తర్వాత గృహ ప్రవేశం నాడే చూసింది. చెన్నకేశవుడితో ఆమెకు పరిచయం లేదు.

రిపేరీలో ఉన్న కారు గ్యారేజి నుంచి తిరిగి వచ్చింది.

రాత్రికి పయనం. ఒంటరిగానే. ఆ మధ్యాహ్నం టపాలో రెండు జాబులు వచ్చాయి. నా దుస్స్వప్న సంకేతాలకు టిప్పణి లభించినట్లయింది.

* * *

మేమంతా అన్నగారు అని సంబోధించే మా దూరపు దాయాదులు సీతారాం గారి ఉత్తరం పరిధిలో చిన్నదే అయినా, అందులో ఈ లోకపు లౌకిక సంక్లిష్ట వ్యవహారాలన్నీ తేటతెల్లంగా ఉన్నాయి. మానవుడి ప్రమేయం లేకున్నా బాహ్యమైన బలవత్తర గతులు అతడి మీద ఎన్ని సమస్యలు మోపుతాయో న్యాయవాదిగా నేను గ్రహించని సంగతులెన్నో! ఆ జాబు కళ్ళు తెరిపించింది.

"తెలుసు గదా, మన ప్రపితామహులు ఆ శకంలో వందెకరాల మెట్ట భూమిని నిత్య కైంకర్యాల నిమిత్తం గుడి మాన్యంగా దానం చేశారని. ఆ శాసనం తూర్పు వైపు గోడలో ఇప్పటికీ ఉంది. పద్మాపురం ప్రాజెక్టు పుణ్యమా అని ఆ భూమి సస్యశ్యామలమైంది ఇటీవలనే. అర్చకస్వాములనుభవిస్తున్న పురాతన అగ్రహారంలో కొంతమేర భూములు అన్యాక్రాంతమైనా, వారి భుక్తికి లోటు లేదు. కొత్తగా ఆయకట్టు పరిధిలోకి వచ్చిన భూముల్ని చూడగానే సర్కారు వారి కన్ను కుట్టింది. ఈ ఆలయాన్ని దేవాలయ శాఖకు, జాయింటు వంశ పారంపర్య ధర్మకర్తలం మనం అధీనం చేయాలని నోటీసులు వచ్చాయి. నీకూ అంది ఉండాలి. గత వైభవాల్ని తలుచుకొని ప్రయోజనం లేదు. ధాత కరువు రోజుల్లో తమ ధాన్యాగారాల్ని తెరిచి పేదల్ని ఆదుకొన్న ఆ మహాత్ములు, దేవుడి తోటలో ఒక్క పుష్పాన్ని కూడా ముట్టుకోని మహితాత్ములు, ముస్లిం దండయాత్రికులు, పిండారీలు దోచుకొన్న నగలను తిరిగి చేయించడమేనా– వసతులు కల్పించడానికి రాజ గోపుర పునర్నిర్మాణం, ధ్వజస్తంభానికి ఇత్తడి తొడుగులు, ప్రహరీ గోడకు పటిష్ఠమైన మరమ్మతులు చేయించిన ఆ దానకర్తల మాట– ఈనాడు ఎవరు తలచుకొంటారు? వారికి కావలసింది దేవుని స్థిరచరాస్తులు.

శిష్టాచారులైన పాత తరం వృద్ధాచార్యులు మంచాన పడ్డారు. స్నేహపాశం చేత చెడిన వారి సుపుత్రుడు నా సంతకాన్ని కూడా ఫోర్జరీ చేస్తున్నట్టు

నేను స్వామికి పట్టువస్త్రాలు సమర్పించి ఊరు చూసేందుకు బయలుదేరు తుండగా, గోపురం కింద అప్రయత్నంగా నాలో నేను మాట్లాడుకొంటున్నాను: 'హే చెన్న కేశవా! నీ మీద నాకే అధికారం లేకుండా చేస్తున్నావా? కాల వృత్తంలో ఐతిహాసిక వాణి మొదటి సంతకం చేసింది. ఇంక రెండో సంతకానికీ ఎక్కువ గడువు లేదు గదా! అవును, ఆఖరి పూజ గదా!'

ఊరు విస్తరించి సంకీర్ణమై, పట్నం సొగసులు దిద్దు కొంటున్నది. సీతారాంగారి ఇంటివైపు పురా అనుభవంతో మలుపు తిరిగాను. అక్కడా విశాల భవనం ఏదీ? నాకు స్మృతి ఉన్నంత వరకూ కలయ జూశాను. ఒకనాటి ప్రాభవ అవశేషంగా అక్కడొక టెంటు సినిమా హాలు దర్శనమిచ్చింది. ఎవరో అంటున్నారు- 'ఆయ నుండేది ఊరి బయట యానాది గూడెంలో కదా!' టెంటు హాలు ముందు డప్పుల మోతమధ్య పాత చిత్రాల్లోని డ్యూయెట్ పాటలు. నన్ను వెతుక్కుంటూ వచ్చిన వెంకటస్వామిని చూసి తప్పుకొన్న యువకుడు. "ఆచార్లుగారి కొడుకయ్యా!"

* * *

ఇల్లు చేరేసరికి మెట్ల మీదకే ఏదో నన్ని సువాసన వస్తోంది. లైటు ముందు నేను తెచ్చిన ఆంగ్ల నవలను తిరగేస్తూ సీతారాం అన్నయ్య. ఎదురుగా బల్లమీద చిన్న తాటాకుల బుట్టలో పాల సపోటాలు. విస్మృత కథకుడా! హిమాలయపు ఒంటరి లోయల్లో వెన్నెల పరుస్తున్న విషాద చంద్రుడిలాగా తోస్తున్నాడు. ఏ రహస్య నదీ తీరానో ఉదయ భాస్కరుడికి అర్ఘ్యమిచ్చి ఆదిత్య హృదయం పఠిస్తున్న యోగాభ్యాసపరుడిలా గోచరిస్తు న్నాడు. టెంటు సినిమా హాలు చికాకు మాయమైపోయింది- ఆ దృశ్యం ముందు. పొందూరు ఖాదీ లాల్చీ, చలవ చేసిన ధోవతి, యౌవనమో, వృద్ధాప్యమో తెలియనీయని కాయపారు శరీరపు బంగారు ఛాయ. అయినా అలసట కమ్ముకొన్న కళ్ళు. నాకాయన వృద్ధుడిగా తోచలేదు. సీతారాంగారు గొప్ప సుందరరూపి. ఏ స్త్రీ అయినా ఆకర్షణ తరంగాల ఊపుతో ఆయన యౌవన ప్రాయంలో మోహస్పందన జల పాతంలో తడిసిపోయి ఉండదా అనిపించింది.

షాడబివందనం చేస్తుంటే వారించి, నా భుజాలనెత్తి కౌగలించుకుంటూ, "నీకు చాలా ఇష్టమని ఎప్పుడో అన్నమాటను గుర్తుపెట్టుకొని కల్యాణి పాలసపోటాలు పంపింది" అని కళ్ళతోనే నవ్వాడు.

"కల్యాణా?"

"యానాది సేవా సమితి కార్యదర్శి. నేనూ, చంద్రికా పెంచిన పాప."

చంద్రిక!

* * *

సీతారాంగారిది మా ఊరు కాదు. పెత్తల్లికి దత్తత వచ్చినవాడు. సంపన్న గృహస్థులు. నిజానికి మా ప్రాంతానికంతా పెద్ద మిరాశీదార్ల కుటుంబం.



లైటు ముందు నేను తెచ్చిన ఆంగ్ల నవలను తిరగేస్తూ సీతారాం అన్నయ్య. ఎదురుగా బల్లమీద చిన్న తాటాకుల బుట్టలో పాల సపోటాలు... కల్యాణి పంపినవి.

కవిపండిత సన్మానాలు, దసరా నవరాత్రి మహోత్స వాలను బ్రహ్మాండంగా నిర్వహించే సంస్కారులు. పెంపుడు తండ్రి శత గ్రంథకర్త దేశభక్తుడు. రాయని భాస్కరుల దానధర్మాలతో స్వాతంత్ర్య ఉద్యమ కార్యకలాపాల్లో అప్పటికే చాలా ఆస్తి కర్పూరహారతి తర్వాత పల్చనైంది.

సీతారాంగారు కాలేజీ దశలోనే అతివాద రాజ కీయాల్లో జోక్యం ఉన్నవాడు. ఎన్నో కథలు. వంగ దేశంలో ఆనాటి విప్లవవాదుల 'అనుశీలన సమితి'ని ఆంధ్రదేశంలో పునరుద్ధరించాలని కంకణం కట్టు కొన్నట్లు చెప్పుకొనేవారు. ఒక ఏడాది పాటు అజ్ఞాతంగా బెంగాల్‌లో తిరిగి బాంబులు తయారు చేయడం నేర్చాడని గూడా వదంతి. వారం వారం పోలీసుల రాక. నిఘా. వాళ్ళ నాన్నగారికెందుకో అతణ్ణి బారిష్టర్ చేయాలని మక్కువ.

అయితే, సీతారాంగారు లండన్ వెళ్ళలేదు. అప్పటికి డీవెలరా నాయ కత్వంలోని ఐర్లాండ్ రాజధాని డబ్లిన్‌కు పయనం. డీవెలరా బ్రిటిష్ శత్రువు గదా. కానీ, ఏ కారణం చేతనో ఒక సంవత్సరానికే డబ్లిన్ నుంచి తిరిగి వచ్చాడు. జనశ్రుతి వదంతుల్ని నమ్మితే, అక్కడొక ఐరిష్ యువతిని ప్రేమించాడనీ, సముద్రంలో ఈదుతూ ఆమె మరణించిందనీ, తాను భగ్నప్రేమి కుడై తిరిగి వచ్చాడనీ- సత్యా సత్యాలెవరికీ తెలియవు. ఆ తర్వాత ఒకటి రెండేళ్ళు జాతీయ కళాశాలలో అధ్యా పక వృత్తి. ఇంతలో గాంధీజీ సత్యాగ్రహ సమరం. మా నాన్నగారితో సేలం జైలులో రమారమి మూడేళ్ళ కఠిన శిక్ష. కారా గారవాసం అతనిలో సంపూర్ణ పరివర్తన తెచ్చిందని నాన్నగారం టుండగా విన్నాను. ఎన్నో యోగాభ్యాసాలు, ఆస నాల నిబంధనలతో సన్నగా, రివటగా మిలమిల లాడే శరీరకాంతితో బయటకు రావడం ఒక అద్భుత చర్య. గీతా శ్లోకాలను అనర్గళంగా వల్లించేవాడు.

అప్పటికి పెంపుడు జననీజనకు లిద్దరూ కాలధర్మం చెందడం, ఇంటి వ్యవహారాలు చక్కదిద్దుకొనే ప్రయ త్నంలో కొన్నేళ్ళు. చక్కదిద్దుకొనేం దుకు మిగిలింది దాదాపు శూన్యం. స్వార్థపరులైన కొందరు పెద్ద భూస్వాముల్తో కొన్ని చీకాకులూ పడ్డాడు. మనశ్శాంతి కోసమే కాబోలు వినోబా భావే ఆశ్రమానికి హఠాత్తుగా తరలిపోయాడు. చంబల్ నదీలోయ ప్రాంతంలో వినోబాజీ బందిపోటు దొంగల్ని సంస్కరించే ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడని గూడా విన్నాను. కొన్ని సాహసకృత్యాలూ చేశాడని చెప్పుకొన్నారు. ముఖ్యంగా అందరూ చెప్పు కొన్నదీ- గ్వాలియర్ నగరానికి వంద మైళ్ళ దూరం అడవుల్లోకి బందిపోట్లు అపహరించుకు పోయిన పెళ్ళి బస్సును వెంటాడి, ఎవరికీ హాని జరగకుండా స్త్రీల ఆభరణాలతో సహా రక్షిం చాడని. కొందరు దొంగల్ని వినోబా ముందుకు తెచ్చి అస్త్ర సన్యాసం చేయించాడని. అమోఘ మైన హిందీ వాక్చాతుర్యం కలవాడు. సంస్కృతం సరేసరి. ఏక సంథాగ్రాహి. బహుశా వినోబాజీ ప్రేరణతోనే కావచ్చు - తన స్వగ్రామ పరిసరాల్లో అశేషంగా ఉన్న- యానాదులనబడే అనాది ఆదివాసుల సేవకు అంకితమైనాడు. అప్పటికాయనకు శేషభుక్తంగా ఉన్న ఆస్తి రెండెకరాల మాగాణి భూమి. దేవాలయ ధర్మకర్తృత్వం ఆయన మటుకు నామమాత్రమే. తన పెద్దల ధర్మాన్నే అనుసరించిన ఆదర్శమూర్తిగా నిలిచాడు.

సంఘ బహిష్కృతులు కాకపోయినా, జన తిరస్కృతులుగా, పరిచ్యుతులుగా బతుకు వెళ్ళదీసే యానాదులనందర్నీ సమీకరించాడు. చిల్లర మల్లర దొంగతనాలకు అలవడినవాళ్ళను గూడా సంస్క రించాడు. ఆత్మగౌరవం నేర్పాడు గాంధీ వాదిగా గ్రామీణ పరిశ్రమల్లో, ముఖ్యంగా తేనెపట్టులు పెంచడం, బుట్టలు తట్టలు అల్లి అమ్మించడం, కూరనారలు పండించడంలో వాళ్ళకు తర్ఫీదు ఇచ్చాడు. యానాది బాలబాలికల ఆశ్రమ పాఠశాల

నెలకొల్పి కొత్త దీపాలు వెలిగించాడు.

అయినా, ఏదో అసంతృప్తితో, నిత్య శంకితుడుగా వేరేదో పరమ గమ్యాన్ని గవేషిస్తున్న నైష్ఠికుడిగా, సముద్ర దిశ కానక పరుగిడుతున్న నదీ ప్రవాహంలాగా తోచేవాడు. మకుటాయమానమైన ఒక చర్యగా, యానాదుల యక్షగాన భాగవత పునరుద్ధరణను చేపట్టాడు. గత స్మృతిగా ఉన్న ఉషాపరిణయ యక్షగాన నాటకాన్ని తర్ఫీదు చేయించాడు. యానాదుల్లో పరంపరగా వస్తున్న నలచరిత్ర నాటకం, ప్రభావతీ ప్రద్యుమ్నం తిరిగి జీవం పోసుకొన్నాయి. దసరా నవరాత్రుల్లో ప్రదర్శించడానికి ఎన్ని తిప్పలు పడ్డాడో, ఆ వివరాలన్నీ నాకంతగా తెలియవు. అప్పుడు ఓం ప్రథమంగా, ఒక అపురూప సౌందర్యవతి, ఒక యానాది యువతి బాణాసుర పుత్రి ఉషాకన్యగా మా గ్రామ యక్షగాన వేదిక మీద కనిపించింది. ఆమే చంద్రిక! శ్యామల వర్ణమైనా ద్రుపదరాజ తనయ అందం.

ప్రతి కదలికలో ఒక కులీన వంశపు సౌందర్యరాశిగా, ప్రతి పాటలో తన జీవితపు చిరమర్మ వేదనలకు గాత్ర రూపమిస్తున్న గాంధర్వ కన్యగా గోచరించేది. ఆ పాటల గమకాలు కొన్ని ఇప్పటికీ నాకు జ్ఞాపకమున్నాయి. గొప్ప అందానికి నల్లని చర్మం అడ్డురాదని చంద్రికను చూసింతర్వాత నేను గ్రహించాను. అప్పటికి నేను యువకుణ్ణి. ఊళ్ళో మదాంధులైన భూస్వామ్య పుత్రుల మాటలు కర్ణాకర్ణిగా వింటున్నాను. ఈ దుశ్శాసనుల పీడ నుండి చంద్రికను నిరాయుధులు, అమాయకులైన యానాదులు రక్షించుకోగలరా అని ఎందుకనుకొన్నానో, ఆర్నెల్ల తర్వాత లా కాలేజీ సెలవుల్లో ఇంటికి వచ్చినప్పుడు, ఒక ఘోర ఉదంతం విన్నాను. ఒక దుష్టుడు ఆమెను మానభంగం చేశాడనీ, మూడు రోజుల తర్వాత వాడి శవం సంజీవరాయుడి చెరువులో తేలిందనీ. ఆ రాత్రి మా ఇంటికి బంధువులెందరో వచ్చి ఉన్నారు- మా నాన్నగారి ప్రథమ సంవత్సరీకాలకు.

హడావిడిగా అర్ధరాత్రి సీతారాం వచ్చాడు. "ఇది నీ గదిలో భద్రంగా దాచు" అని ఒక చిన్న సంచీ ఇచ్చి పోయాడు అంత తొందరలోనే. హతుడి ఒడలి మీద గాయాలేమీ లేవుట. కానీ, శరీరం అంతర్భాగంలో విపరీత రక్తస్రావం కనపడ్డదట.

మా బంధువులందరూ నిర్గమించిన మరునటి దినాన ఉబుసుపోక సీతారాంగారి సంచీ తెరిచాను. ఒక తెల్లటి గుడ్డలో కప్పి ఉన్న పిస్తోలొకటి కంటబడ్డది. "మేడ్ ఇన్ రిపబ్లిక్ ఆఫ్ ఐర్"! అప్పటికే పోలీసులు రావడం, పోవడం జరిగింది. గ్రామంలో గుసగుసలేమీ వినబడలేదు. నేను తిరిగి కాలేజీకి బయలుదేరుతున్న రాత్రి సీతారాం ఆ సంచీని తీసుకువెళ్ళిపోయాడు. మరు సంవత్సరం వెంకటస్వామి పట్నం వచ్చినప్పుడు ఒక సమాచారం చెప్పినప్పుడు- నేను ఆశ్చర్యపోలేదు. సీతారాంగారు చంద్రికను యానాదుల సంప్రదాయం ప్రకారం, ఒక మిట్ట మధ్యాహ్నం రోకలిని భూమిలో పాతి, దాని నీడ హరించిపోయినప్పుడు శుభముహూర్తంలో పెళ్ళాడారని. సినిమా రీళ్ళ త్వరిత చలనం లాగా ఈ దృశ్యాలూ, సంఘటనలూ నా మనో క్షేత్రంలో కదలాడినాయి- ఆయన చెబుతున్న మాటలు ఎక్కువ రిజిష్టర్ కాలేక పోతున్నాయి. ఇంతలో సోమయాజులుగారు భోజనం పైకే పంపారు. నేనూ, అన్నయ్యా భోంచేశాం. ఎల్లుండికి గాని దేవాదాయ శాఖాధికారులు ఇక్కడకు చేరరట- ఆచార్లుగారంపిన వార్త.

* * *

ఎల్లుట పది గంటలవుతూన్న ఉదయంలో డిప్టీ కమిషనరూ, టిళ్ళ బంట్రోతూ, ఒక చప్రాసీ, కాబోయే అసిస్టెంటు కమిషనరూ జీపులో దిగారు. డిప్టీ కమిషనర్‌గారి నోట్లో స్పెన్సర్ చుట్ట పొగ.

**జనశ్రుతి వదంతుల్ని నమ్మితే, అక్కడొక ఐరిష్ యువతిని ప్రేమించాడనీ, సముద్రంలో ఈదుతూ ఆమె మరణించిందనీ, తాను భగ్న ప్రేమికుడై తిరిగివచ్చాడనీ...**

నేను దిగ్భ్రమ చెందాను. వీళ్ళా అధికారులు? ప్రభుత్వం? ఒక చరిత్రాత్మకమైన పురాతన దేవాలయాన్ని స్వాధీనం చేసుకోబోతున్నది- ఆ కళ్ళలో ఏ విషయ పరిజ్ఞానమూ గోచరించని వీళ్ళా! వినమ్రత, చారిత్రక దృష్టి కనబడదే- ఆ ఎర్ర జీరల నేత్రాల్లో! వీళ్ళు దేవదూతలు కారు. కమీషన్లు గుణించుకొంటున్న అల్పులు. అసురులు.

కర్ణంగారు, ఇన్నేళ్ళుగా స్వామి కార్యాన్ని ఏ ప్రతిఫలమూ ఆశించకుండా భూ ఆదాయ వ్యయాల్ని చిట్టాలలో భద్రపరిచిన రంగయ్య గుప్తా, సీతారాంగారితో పైకి వచ్చారు. కర్ణంగారు అడంగులూ, సర్వే మ్యాపులు తీసి చూపి దేవుడి స్థిరాస్తి వివరాలన్నీ సమర్పించారు. రంగయ్య గుప్తా చిట్టాలన్నీ ముందు పడేశాడు.

అణా పైసల్తో కచ్చితంగా ఉన్న లెక్కల్ని చూసే ఓపిక వారికి లేదు.

"ఈ భవనం మాటేమిటి" అన్నారు నన్ను చూస్తూ కమిషనర్ గారూ, వారి అసిస్టెంటు.

"ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ భవనం మీకు దక్కదు. ఆశను పెంచుకోకండి. నేను లాయర్ను. మీ నోటీసులో అవకతవకలన్నీ నాకు అవగతం. ఆలయ ప్రాంగణం విశాలమైనది- మీకు కావలసినంత. మీ కార్యాలయాలు అక్కడ నిరభ్యంతరంగా కొనసాగుతాయి."

ఆయన గుడ్లు మిటకరించి చూసి, ఏమనుకొన్నాడో యేమో, "మరొకసారి ఆలోచించండి. తొందర లేదు. ఈ భూముల్ని చూసుకొని మళ్ళా రేపు వస్తాం. చరాస్తులు, ఆభరణాలు, వస్తువాహనాల పట్టీ తయారుచేసి ఉంచండి. త్వరలో ముగిద్దాం" అంటూ లేచి నిలబడ్డారు.

సీతారాంగారేమీ మాట్లాడలేదు. వెంకటస్వామి అమర్చిన స్వల్ప ఆతిథ్యం స్వీకరించి, ఆ బృందం వెళ్ళిపోయింది. ఆ రాత్రి సోమయాజులుగారి సాయంతో ఆభరణాల పట్టీ తయారైనది. మా భోషాణంలో ఉన్న ఆ నగల్ని, హేమపాత్రల్నీ నేనిదివరకంత పరిశీలనగా చూసి ఉండలేదు. హేమపాత్రల మీద మా మాతామహిద్వయం పేర్లున్నాయి.



సీతారాంగారు గూడా ఆశ్చర్యంగా చూసి భక్తిభావంతో కళ్ళు మూసుకొన్నారు. కిరీటాలు, హస్తాభరణాలు, వెండి త్రిపుండ్రాలు, భుజకీర్తులు, కర్ణాభరణాల జతలు, పంచామృత పాత్రలూ- అన్నీ లెక్కిస్తే రెండు వందల దాకా తేలాయి.

కింద దేవాలయం పనివాళ్ళు వేచి ఉన్నారు. చోపుదార్లు, పల్లకి వాహకులు, దివిటీల వాళ్ళు, దైనందిన నైవేద్య పరిచాలకుడు గోవర్ధనాచార్యులూ. వారందర్నీ పలకరించి ధైర్యం చెప్పి పైకి వచ్చేసరికి, ఆభరణాలను సర్దుతున్న వెంకటస్వామి, "ఒక బంగారు పాత్ర కనిపించలేదయ్యా, నాలుగే ఉన్నాయి" అన్నాడు కంగారుగా. మళ్ళీ శోధించాం. కనిపించలేదు. చెన్నకేశవా! ఏమిటీ భౌతిక ఆధ్యాత్మిక కల్లోలం తెచ్చిపెట్టావ్ ఈ దశలో.

ఆ రాత్రి నాకు భోజనం సహించలేదు. ఎవరిదీ చౌర్యహస్తం? ఒకసారి సింహావలోకనం చేసుకొన్నాను. సోమయాజులుగారు ఒక్క వస్తువూ ముట్టలేదు.



దూరంగా టేబుల్ ముందు కూర్చొని మేము చెప్తున్న పట్టీని రానుకొంటూ పోయారు. వెంకటస్వామిని అనుమానించడం ఘోర పాపం. సోమ యాజులుగారు మా ముందే వెళ్ళిపోయారు. మిగిలింది నేనూ, సీతారాంగారూ. చివరకు నిర్గమించింది ఆయనే. చేతిలో సంచీ కూడా ఉంది. పరిపరివిధాల మనసు పరుగులెత్తుతున్నది. ఈ ఆఖరి క్షణాల్లో తన దరిద్రావస్థలో ఈ పనికి పాల్పడ్డాడా? ఒక్క పాత్రతో ఆ దురవస్థ తీరుతుందా? ఏమో, పేదరికం ఎంత నికృష్టానికైనా పాల్పడుతుంది గదా. రేపు ఆచార్లుగారి సమక్షంలో ఏ సమాధానం చెప్పాలి? అనాలోచితులైన అధికార్ల దృష్టిలో ఎంత పల్చపడిపోతాం? మళ్ళీ అటువంటి పాత్రను చేయించడం నాకొక సమస్యగాదు. గతించిన మాతామహికి ఎంత అపచారం?

**డిప్టీ కమిషనరూ, బిళ్ళ బంట్రోతూ, ఒక చప్రాసీ, కాబోయే అసిస్టెంట్ కమిషనరూ జీపులో దిగారు. డిప్టీ కమిషనర్‌గారి నోట్లో స్పెన్సర్ చుట్ట పొగ. నేను దిగ్భ్రమ చెందాను.**

కలత నిద్రలో ఒక స్వప్న దృశ్యం. సీతారాం అన్నయ్య- గీతా రహస్యం ఒంటపట్టిన వ్యక్తి అనుకొంటున్న నాకు- బంగరు పాత్రను సంగ్రహించి సంచీలో వేసుకొంటున్నాడు రహస్యంగా ఛీ... ఛీ... మానవత్వం మీద ఇన్ని నమ్మకాలు పెట్టుకొనడం నా బలహీనత. రేపు ముఖమెట్లా చూపగలడు? ఛీ! నేననుమానించిన హత్యకు అతనే బాధ్యుడు. ముమ్మాటికీ మనిషిని చంపగలిగిన వాడు చిన్న దొంగతనం చేయలేడా?

* * *

ఊహించినట్లే సీతారాంగారు మర్నాడు రాలేదు. దేవాదాయ శాఖవారూ రాలేదు. అశాంతితో, కుశంకలతో, అవమానభారంతో రోజంతా గడచింది. ఆచార్లుగారు ఫలహారాలు పంపారు. ముట్టలేక పోయాను. చీకటి పడుతుండగా ఒక యానాది యువకుడు సీతారాంగారి చీటీ తెచ్చి ఇచ్చాడు- "మా ఆశ్రమానికి రా. ఇవ్వాళ చంద్రిక సప్తతి ఉత్సవం."

ఛీ. ఏ ముఖం పెట్టుకొని? ఏమని మాట్లాడేందుకు? అయినా, అతనితో బయలుదేరాను. వెంకటస్వామికీ చెప్పలేదు.

యానాది సేవాశ్రమం గ్రామం వెలుపల మైలు లోపు దూరంలో ఏకాంతంగా ఉన్నది. ఆవరణలో కొబ్బరాకులు మీద సన్నని నక్షత్ర కాంతి కని పిస్తున్నది. దైన్య దేవత నిలయంలా ఆ పరిసరాలు. ఇంకేమీ కనబడలేదు యానాది మనిషి కొబ్బరాకుల తడికెను తొలగించి లోనికి పొమ్మన్నాడు. సన్నని దీపం వెలుగుకు కళ్ళు అలవడి పడుతున్నై కానీ, ఏదో మాగిన పండ్ల ముక్క వాసన ముక్కు పుటాలను అదరగొడుతున్నది. నన్ను చూసి హరికేన్ లాంతర్ను ఇంకొంచెం ముందుకు జరిపారు. హఠాత్తుగా నా అడుగులు స్తంభించి పోయినై. అదొక భయానక దృశ్యం.

ఒక పాత మంచం మీద చంద్రిక సింహం పోలికతో ఆమె ఒకనాటి చంద్రబింబం వంటి ముఖం. ముక్కును గూడా సగం తినేసిన ఘోరమైన కుష్ఠు వ్యాధి. గొంతు బొంగురుగా ఏదో పాడుతున్నది. పక్కనే స్టూలుబల్ల మీద కూర్చొని సీతారాం గారు ఆమెకు పాయసం తినిపిస్తున్నారు. ఆ పాత్ర కనపడకుండా పోయిన బంగారు పంచామృత పాత్ర. ఆమె నాకు ఓపికతో నమస్కారం చేయబోయింది. ఆ చేతులకు వేళ్ళులేవు. దుర్గంధం ఆగదు.

"రా, కూచో. ఇవాళ తన సప్తతి. దేవుని పాత్రలో ప్రసాదం తినాలని ఉందన్నది. గోల్డెన్ టార్చ్‌తో నా రోజుల్ని వెలిగించింది. జీవితం ధన్యమైందని కొద్ది క్షణాల క్రితం అన్నది" అంటున్నారు సీతారాం. నేనట్లాగే ఇంకో స్టూలు మీద కూలబడ్డాను.

కళంకభరితంగాని ఒక ప్రణయగాథ ముగింపు మట్టం. పైన ఏవో మృత్యు పక్షుల రెక్కల చప్పుడు వినిపించినట్లయింది. కనురెప్పల చప్పుడు గూడా వినవచ్చే నిశ్శబ్దం. తడికె మీద బల్లి, పురుగుల వేట మాని నిశ్చలంగా ఉంది. ఆవైపు మేజామీది అలారపు గడియారం ఆగిపోయి ఉంది.

ఆవరణలో చంద్రిక పెంచిన కుక్క శోక రాగాన్ని నిలిపివేసింది. కొబ్బరి చెట్ల ఆకులు కదులుతున్నట్లు లేవు.

కల్యాణి అగరుబత్తీల ధూపం వెలిగించింది. క్రమంగా దుర్వాసన మందగిస్తున్నది. తండ్రి చేతిలో పాత్రను కల్యాణి అందుకొంటున్నది. ఆయన ఒకనాటి చంద్రిక విశాల నేత్రాల మీద దుప్పటి కప్పాడు. చావుబతుకుల విభజనరేఖ నాకగుపించింది.

ఒక మనిషి మౌనమై, గీతాధ్యానమై, మహాయోగమై, మహిమాన్వితుడైన ఆ దివ్యక్షణాన సీతారాం గారికి ఈసారి మళ్ళీ పాదాభివందనం చేశాను.

మరునాడు కణ్వస భవన ప్రాంగణంలో చంద్రిక సమాధి అవుతుండగా, దేవాదాయ శాఖ వారు వచ్చే శారు. "ఈ భవనం, దీననుసరించుకొన్న భూములు, తోట యానాది సేవాసమితికి అంకితం చేసున్నాను. వీళ్ళు ముగ్గురూ దాని ధర్మకర్తలు" అని వారితో చెప్పాను. పదవ పాత్రతో సహా అన్ని ఆభరణాలు వారికి అనాడే అప్పగించాను. ■

● కేతు విశ్వనాథరెడ్డి
● చిత్రాలు: వి.ఆర్. పొశాల

అమ్మేయ్! ఎన్ని రోజులకే బట్టలెత్తేచ్చేది? రోజూ చలవ బట్టలు తెచ్చే కాలం పాయె. సరే, వారానికి మూడు సార్లు తెచ్చేది పాయె. పోనీ, వారం వారం అంటూ వచ్చేదీ పాయె. పదైదు రోజుల కాలం పాయె. ఇప్పుడు నెలనా?"

"ఏం చేస్తము తల్లీ? నీకు తెల్దా? వంకలు ఎండిపాయె. కపిల బావులు మట్టిగొట్టుకొని పాయె. ఇంజన్లు పాయె. కాలవలోనన్నా ఉతుకుదామంటే, బోరింగులొచ్చె గదమ్మా! యాడ చస్తాం? ఎన్నింద్ల మోదలో నీకు తెల్దా తల్లీ? రైతులిచ్చే మేరలూ పాయె. ఇనాములూ పాయె గదమ్మా."

"పోతే ఏం తెగులైంది? సెతుర్లు మాట్లాడతావు, ఏడో తరగతి చదివినానని. మీకు బడాశలే అమ్మేయ్?"

"ఏం బడాశ మాయమ్మా? నాలుగెకరలేమన్నా కొన్నామా? ఆ ఆశే ఉంటే మా తమ్ముని మాదిరి టౌను చేరుకొని ఉండేవాళ్ళం. మా మరిది మాదిరిగా తాడిపర్తి సిమెంటు ఫ్యాక్టరీ పనికి పోయుండేవాళ్ళం. మా కులపోళ్ళలో కొంత మంది మాదిరి ఫ్యాక్టరీ ఆఫీసర్ల బట్టల్ని నమ్ముకునేవాళ్ళం. ముండమోసిన మా యత్తా, నేనూ రైతుల్ని విడిచిపెట్టలేదు గదమ్మా?"

"అది గాదే. మీరుండేదేమో ఇద్దరు. రెడ్డేరిండ్లూ కావాల, కమ్మోళ్ళ ఇండ్లూ కావాల."

'ఇస్సో ఇస్సో' నవ్వు తెప్పించింది.

మెచ్చుకోలుగా అన్నాడు. "రాములమ్మా! నువ్వు బాగా చెప్పినావు. మైలకు కులం లేదు. మనుషుల్ని ఉతికి మైల పోగొట్టి, చలవ చేసేట్లున్నావు!"

"అమ్మో మల్లమ్మ తల్లీ! చిన్రెడ్డి అంతా విన్నాడు. పెద్ద చదువు చదువుకున్నోడు. చిన్రెడ్డికి తెలిసినంత నాకేం తెలుస్తుందమ్మా." రాములమ్మ నవ్వుతూ వినయంగా అంది.

తన కొడుకును మెచ్చుకున్నందుకు బ్రహ్మాం తల్లి ఎంతో మురిసిపోయింది. "ఇంత నంగటి తినిపో" అంది. వంటింట్లోకి వెళ్ళి ఒక చిన్న నంగటి ముద్దనూ, ఇంత కూరనూ తెచ్చి తెళ్ళలో పెట్టింది. మంచినీళ్ళ చెంబు తెచ్చి ఇచ్చింది. బ్రహ్మాం తల్లి గుడ్డలు లెక్కపెట్టసాగింది. బ్రహ్మాం పుస్తకం చదువుకుంటూ, మధ్య మధ్యలో గమనిస్తున్నాడు. రాములమ్మ తింటున్న ముద్దవైపు చూసి అనుకున్నాడు.

'ఇప్పుడు ఒకే ముద్ద తిన్నంతా కాదు. ఇంటికి తీసుకుపొయ్యేదీ కాదు. అదీ ఈ ఇంట్లో. అబ్బ(నాన్న నాన్న) కట్టడి. ఒకప్పుడు తాను పసితనంలో రాములమ్మ అత్త తింటున్న అన్నం పెట్టమని గొడవ చేసేవాడు. తినేవాడు కూడా. తల్లి కసిరేది. నాయన తిట్టేవాడు. అబ్బ నవ్వుతూ సమర్థించేవాడు.

"అమ్మేయ్! కోడలి చీరె ఒకటి తేలేదే ఎర్ర గన్నేరు పువ్వు రంగుది." తల్లి అంది.

"శేవు మల్లా రావాలి. తెస్తాలేమ్మా. ఇన్ని మజ్జిగ

వాళ్ళపనీ, వీళ్ళపనీ అంటూ తిరుగుతూనే ఉంటాడు. స్వాతంత్ర్యం రాకముందు కొంతకాలం జాతీయవాది. కొంత కాలం కమ్యూనిస్టు. చీలికల రాద్ధాంతాల్లో, ఎన్నికల పొత్తుల వ్యూహాల్లో ఇమడలేక తనకు తోచింది తాను చేస్తూ పోతున్నాడు. పేదా సాదకు మంచి చేస్తున్నాడని పేరు పల్లెల్లో. ఇంట్లో ఖాళీగా ఉంటే తోటపనికి పోతాడు. తోట దగ్గరకు ఎవరో వెళ్ళడం, ఆయన అటునుంచే ఏ పల్లెకో, పేటకో పోవడం! జేజి (నాన్నమ్మ) చనిపోయినాక ఆయన వ్యాపకం పూర్తిగా అదే అయింది. తన తండ్రికి అబ్బంటే గౌరవం. అన్నకు మాత్రం చులకన. కాంగ్రెసుకూ, తెలుగుదేశానికీ రెండింటికీ వ్యతిరేకమేనని, 'మనకంటే పేదోళ్ళు లేరా' అంటూ ఏ గొడవల్ని తెచ్చిపెడతాడో నని. మనకు ఎవరు మేలు చేస్తే వాళ్ళవైపు ఉండాలనేది అన్న వాదం. ఆ మేలనేది ఎప్పుడైనా కావచ్చు. ఏదైనా కావచ్చు. ఎక్కడైనా కావచ్చు.

తల్లి పిలుపుతో బ్రహ్మాం లోకంలోకి వచ్చాడు. "అబ్బీ బ్రమ్మం! నీకు పని చెప్పాలంటే నోరు రాదు. నెలకొక్కసారి ఇంటికొస్తావు. ఊళ్ళో పలికే మనిషి లేడు. కానికాలం వచ్చింది. మీ నాయనకు తోట కాడ పని. మీ వదినకూ అక్కడ పని సరిపోతుంది. గడ్డో గాదమో, కలుపో గిలుపో, ఏదో ఒకటి. మీ నాయన బయటకి ఎక్కడన్నా పోతే మోటరు ఆడించి మడవ గట్టేది కూడా మీ వదినే. మీ అన్న ఏదో వ్యాపారం గీపారం అంటాడు. ఇంటిపట్టున ఉంటే ఒట్టు. ఈ




"మాయ కాలమొచ్చి ఇట్లా మాట్లాడతా ఉండావు మల్లమ్మ తల్లీ. ఇప్పటికి మిగిలింది ఈ పల్లెలో అయిదిండ్లే. మన రెడ్డేరివి మూడు. కమ్మోళ్ళవి రెండూ. మూడు నాలుగు తరాల నుంచి చేస్తున్నవే. అయినా, ఒక్కమాట అడుగుతాను చెప్పు తల్లీ? నువ్వు పెద్ద మనసున్నదానివి. రెడ్డోరి మైల గుడ్డలు వేరు. కమ్మోరి మైల గుడ్డలు వేరూనా? ఉతకడానికి మైలంతా ఒకటే గద తల్లీ మాకు. నిన్నమొన్న ఎన్టీరామారావు వచ్చేదాకా మీ రైతులందరూ ఒకటే గాదా? చంద్రబాబు నాయుడొచ్చినాక..."

"అమ్మేయ్! నీతో మాట్లాడడం నాదే తప్పు. నీ తెలివితో నేనెక్కడ ఏగుదు? మీ అత్త అందుకే నిన్ను పంపుతుంది. అవును, మైల గుడ్డలన్నీ ఒకటే అయితే మాదిగోళ్ళవి ఉతుకుతావా? చెప్పు!"

"మల్లమ్మ తల్లీ! ఏదో నీదగ్గర వాగుతుండా. ఆ గొడవల్లోకి దించొద్దు నీకు పుణ్యముంటుంది. మనసు లోది చెప్పాలంటే, బాపనోళ్ళ మడికి కులముంటుం దేమోగానీ, ఎవరి మైల బట్టలకూ కులముండదు. మాపుడులో తేడా అంతే. కుళ్ళ మాపుడూ, మామూలు మాపుడూ. మైల పోగొట్టడానికి కొన్ని బట్టలకు సవుడు దండిగా పెట్టాలి. కొన్నిటికి తక్కువ పెట్టాలి. కొన్నిటిని బండ మీద ఇస్సో ఇస్సో మంటూ బాదాల. మాకు తెలిసిన చదువు అదే."

తల్లికీ, ఇంటి చాకలికీ మధ్య జరిగిన మాటలను బ్రహ్మాం శ్రద్ధగా విన్నాడు. టెలివిజన్ కార్యక్రమాలను చూడడం ఆపివేశాడు. చాకలిని పేరుతో పిలవక పోవడం గమనించాడు. తాను చదవని విషయాలూ, స్కూల్లో చర్చించని సంగతులూ అవి అనుకున్నాడు.

పొయ్యి. ఎండలో నడిచి పోవాల" అంది రాములమ్మ మాట మార్చి. బ్రహ్మాం తల్లి గొణిగింది.

"ఆ ఒక్క ఎనుమూ ఇచ్చే పాలు మాకే చాలడం లేదు. మా మామ ఊళ్ళో ఉంటే కాఫీలకూ, టీలకూ సరిపోతాయి వచ్చే వాళ్ళకూ, పొయ్యేవాళ్ళకూ. సరేలే నీకు మజ్జిగ పోస్తానే మా అన్నలు తరిగిపోవు." లోపలికి వెళ్ళి పల్చటి మజ్జిగ తెచ్చి రాములమ్మ తెళ్ళలో పోసింది. రాములమ్మ తినడం పూర్తి చేసింది. తెళ్ళ కడిగి అరుగు మీద పెట్టి బ్రహ్మాన్ని అడిగింది. "చిన్రెడ్డీ! మీ అబ్బ పెద్దరెడ్డి మా అనుమంటోళ్ళకు పక్క పల్లె కాడ కొండ కింద ఇండ్ల పట్టాలిప్పిస్తున్నా డంట! మా చిన్న చెల్లెలు ఆ పల్లెలోనే కదా ఉండేది. పట్టా ఇప్పించమని చెప్పు. నీ మాటంటే మీ అబ్బకు గురి. మీ అబ్బ మాదిరే నీది పెద్ద మనసు."

ఖాళీ బిందెను చంకనేసుకొని, బోరు నీళ్ళకు వెళ్ళబోతున్న బ్రహ్మాం తల్లి ఇది వింది. పోతూపోతు న్నది ఆగి అంది. "ఓమ్మేయ్! చిన్రెడ్డి అబ్బ ఉండాడే, అదే మా మామ ఇండ్ల పట్టాలేంది, భూముల్ని కూడా ఇప్పిస్తాడు మీలాంటోళ్ళకు. పేరు రావాల. ఇంటి అతీ గతీ పట్టదు. ఇంట్ల దాటి మూడు రోజులైంది."

"మాటవరసకు అన్నాన్లే మల్లమ్మ తల్లీ. పెద్దరెడ్డి ధర్మాత్ముడు అమ్మా! ఇంటిపని చూసుకోడానికి మా రెడ్డి ఉండె. మీ పెద్ద కొడుకు చిన పెదరెడ్డి ఉండె." రాములమ్మ మాసిన బట్టల మోవ తీసుకొని పోతూ పోతూ అంది. బ్రహ్మాం తల్లి బిందెను ఒక కంబం వార ఉంచి వాడ్లోకి వెళ్ళింది, సడవలోకి వచ్చిన కోడిపిల్లల్ని తరుముతూ. బ్రహ్మాం మనసులో తన అబ్బ మెదిలాడు.

ఆయన తీరే అంత. డెబ్బయ్ అయిదేళ్ళు కావస్తున్నా

పొద్దు మీ నాయన ఊళ్ళో లేడు. మీ వదిన తోట కాడుంది. మన ఇంటిని నమ్ముకున్న ఆ ముసలోడు ఉప్పరి కొండయ్య ఉండాడనుకో. నాలుగు బిందెలు కొట్టియ్యి అబ్బీ!"

తల్లి ముఖంలోని అలసట, గుబులు చూసి బ్రహ్మానికి జాలివేసింది. ఎవరిమీదో తెలియని కోపం వచ్చింది. మౌనంగా, ఇంటికి నూరు గజాల దూరం లోని మంచినీళ్ళ బోరు వద్దకు తానూ ఒక బిందె తీసుకొని నడిచాడు. ఆ ఇంట్లో మనుషులకూ, పశువులకూ, వచ్చిపోయే బంధువులకూ కనీసం యాభై బిందెలైనా నీళ్ళు కావాలి. ఒక్కొక్కప్పుడు అవి డెబ్బయ్యో, ఎనభైయ్యో, నూరో. జలశ్రమ! ఇరవై బిందెలు నీళ్ళు కొట్టి, తల్లితో పాటు తానూ తెచ్చి పోశాడు. తల్లి అలసట తీర్చుకోడానికి, కాళ్ళు ముఖం కడుక్కొని, చీర చెరుగుతో ముఖం తుడుచుకుంటూ ఒక కంబం దగ్గర కూచుంది. బ్రహ్మాం టీవీ దగ్గర కూర్చున్నాడు. సందేహిస్తూనే బ్రహ్మాంతో తల్లి అంది.

"అబ్బీ బ్రహ్మాం! మీ వదినకూ, కొండయ్యకూ అన్నం ఇచ్చిరా. ఆ ఆడపిల్లలిద్దరున్నా ఇట్లాంటి సాయం చేసేవాళ్ళు. పాత పల్లెకు వెళ్ళి ఇంకా తిరిగి రాలేదు. వాళ్ళ అవ్వా, తాత ఎప్పుడు పంపుతారో? ఇప్పటికే చానా ఆలస్యమయింది. నాకింకా ఇంట్లో తెమలనంత పని ఉంది. ఆ... కొండయ్యకు చెప్పు. సందేల తోటకాడున్న కొబ్బరికాయల్ని ఇంటికి పంప మను. మీ అన్న ఎక్కడుండేదీ ఆ ముసలోడికి తెలుసులే. ఎట్లాగో చెప్పి పంపుతాడు. మీ అన్న ఎవరితో ఒకరితోనో కొబ్బెలు పంపుతాడు. మనకా బండీలేదు. కాడెద్దులూ లేవు. ఏం చేస్తాం?" తమ

ఆరేడెకరాల తోట వ్యవసాయమూ బాడుగల మీద ఆధారపడి ఉందని బ్రహ్మానికి తెలియంది కాదు. మెట్ట పొలమూ, బండ్లూ బరకట్లూ, ఎద్దులూ, ఆఖరుకు మడకలూ, గొర్రెలూ అమ్మి నాలుగైదేండ్లు అయిందని తెలుసు. తల్లి ఇచ్చిన అన్నం గంపను ఎడమ అరచేతి మీద పెట్టుకొని భుజానికి మోపుగా, తోటకు బయలు దేరాడు. ఊరికి దూరంగా కిలో మీటరుకు పైగా నడిచి చేరుకోవలసిన తోట. బండ్ల బాటలో వెళ్తే రెండు కిలోమీటర్లు పైగా నడవాలి. బ్రహ్మం కాలిబాటలోనే బయలుదేరాడు. గుట్టకింద రాళ్ళూ రప్పల కాలిబాట. కాలిబాటకు అటూ ఇటూ ఎర్రనేలలు. కొన్ని తువ్వ నేలలు. ఒకటి రెండు తోట కట్టు పొలాలు తప్ప అన్నీ మెట్ట చేలు. పేరుకు మాత్రం పండీపండని ఎకరాలు ఎకరాల భూములు.

**"రాములమ్మా! నువ్వు బాగా చెప్పినావు. మైలకు కులం లేదు. మనుషుల్ని ఉతికి మైల పోగొట్టి, చలవ వేసేట్లున్నావు!"**



ఒక దగ్గర కాలి బాట పక్క, ఒక చేనిగట్టు వార కొందరు పిల్లలు ఎదురయ్యారు.

చంపిన ఒక తొండను తోక పట్టుకొని ఊపుతూ, నన్నగా చిన్న పీరు కర్రలాగా ఉండే ఏడెనిమిదేళ్ళ పిల్లవాడు పళ్ళు ఇకిలిస్తున్నాడు, మరో ఇద్దరు పిల్ల వాళ్ళ మీదికి విసురుతున్నట్లు నటిస్తూ. ఆ ముగ్గురికి ఎడంగా ఉండే కాస్త నదురైన పదిపదకొండేళ్ళ వాడు తొండ విజయుడితో ఎకసక్కెంగా అన్నాడు:

"అబ్బుబ్బు! చూడండ్రా వీణ్ణి! పెద్ద పోజు సినిమా హీరో మాదిరి. చంపి చంపి కుంటి తొండ బీకెను చంపినాడు, పెద్ద మొగోని మాదిరి. ఆ చంపిందీ మునలి తొండబీకెను. అదిగదిగో! ఆ పారిపోతాందే ఆ వగిసి దాన్ని వెంటబడమను. ఒకే ఒక్క రాయి తీసుకొని ఒకే ఒక్క ఏటుకు చంపమను తెలుస్తుంది వీని పన, దయిర్యం!"

పిల్లలకు బ్రహ్మం దగ్గరగా వచ్చి నిలిచాడు. చచ్చిన తొండను పట్టుకున్న పిల్లవాడు భయంతో దాన్ని కిందికి జారవిడిచాడు. తొండను బ్రహ్మం చూశాడు. తొండ మూతి నుజ్జునుజ్జు అయింది. ఎర్రటి రక్తం చారికలు తప్ప మూతి ఆకారం స్పష్టంగా కనిపించలేదు. పొట్ట పగిలి ఉంది. బ్రహ్మానికి వెలపరం పుట్టింది. ఎక్కడో ఏ మూలో భయం కూడా వేసింది. తొండ విరూపం చూసి.

"ఇంతకంటే వేరే ఆటల్లేవేమ్రా" అన్నాడు.

పిల్లలు మారు మాట్లాడలేదు. వెనక్కి పరుగెత్తారు. పిల్లలకు తన ముఖంలో తమ అయ్యవారు కనిపించి ఉండాలి. ఇంకా పెద్దల పట్ల అంతో ఇంతో గౌరవంతో కూడిన భయమైనా ఉండాలి అనుకున్నాడు బ్రహ్మం.

పిల్లల తొండల వేటలో బ్రహ్మం తన బాల్యాన్ని వెతుక్కున్నాడు. గుట్టకింది తుమ్మకుంటలో ఊపగడ్డి రిక్కల సాయంతో తాను చిన్న చిన్న ఎండ్రకాయల్ని పట్టేవాడు. పట్టి అటూ ఇటూ ఆడించి తిరిగి కుంట నీళ్ళలోకి వదిలివేసేవాడు. ఆ ఎండ్రకాయలు ముందరి కొండ్లూ, వెనక కాళ్ళూ నీళ్ళల్లో ఆడించి, ఆడిస్తూ నీళ్ళ ల్లోకి పోతోంటే అదొక ఆనందం. ముందుకూ, పక్క లకూ నడిచే వాటి నడక విచిత్రంగా ఉంటుంది. తన సావాసగాళ్ళు మాత్రం చిన్నచిన్న తొండల్ని తరిమి తరిమి చంపేవాళ్ళు. వాటిని తాడుకు గట్టి, కుంట రాతి గట్టుమీద కూర్చొని నీళ్ళలోకి వదిలేవాళ్ళు. ఎండ్ర కాయలు ఆ ఎర - ఆ తొండల మాంసం కోసం వచ్చేవి. కొండ్లతో పట్టేవి. వీళ్ళు నెమ్మదిగా తాడు లాగి గబు క్కున పట్టుకునేవాళ్ళు. పెద్ద వాటి కొండ్లను విరిచే వాళ్ళు. పొట్ట తీసి గుడ్లున్నాయో లేదో, పిల్లలు న్నాయో లేదో చూసేవాళ్ళు. ఒకరిద్దరు పట్టిన వాటిని కాల్చి కరకరా నమిలి తినేవాళ్ళు. అది తనకు ఏదో బాగుండేది కాదు. ఈ పిల్లలు ఎండ్రకాయల కోసం తొండల్ని చంపడం లేదు. తుమ్మకుంటలో నీళ్ళు లేవు. మరెందుకు చంపుతున్నట్లు? మనిషి స్వత సిద్ధంగా హింసాజీవి ఏమో! అదేమిటి? భారతంలో పద్యం "హింసం చేయనివాడు లేడిజ్జగంబున..." రాములమ్మది కుల హింస, అమ్మది ఇంటి హింస.

గోడ కంతలోంచి తోటలోకి వెళ్తూ, బ్రహ్మం తమ తోటనంతా కలయ చూశాడు. ఒక ఎకరాలో ఉల్లి, మరొక ఎకరాలో మిరప, మరో మూడు ఎకరాల్లో పత్తి వేసి ఉన్నది చూశాడు. కయ్యలో ఉల్లిగడ్డలు బాగా ఊరలేదు. దాదాపు అన్నీ అక్కడో ఇక్కడో పదో పరక తప్ప. పత్రికల ఫోటోల్లో చూసిన ఇథియోపియాలో కరువు వాత పడిన పిల్లలున్నట్లు అనుకున్నాడు. మిరప ఏపుగా పెరిగింది. కాయ పట్టింది. పత్తి మొలకలు బెత్తెడెత్తున్నాయి. గాలికి ఊగుతూ, ఊరిస్తూ. వార్తల్లో చదివిన నిన్న మొన్న జరిగిన తెలంగాణ పత్తి రైతుల ఆత్మహత్యలు గుర్తుకొచ్చాయి. వికలపరిచే ఆ ఆలోచనల నుంచి తప్పించుకోడానికి బ్రహ్మం వదిన కోసం, కొండయ్య కోసం అటూ ఇటూ చూశాడు.

దోకి తెచ్చిన గడ్డిని బోరు బావి గట్టున ఖాళీ స్థలంలో వదిన కుప్పగా వేస్తోంది. కొండయ్య మిరప పాదులకు నీళ్ళు గడుతున్నాడు. దగ్గరకు వెళుతూనే వదిన నవ్వుతూ పలకరించింది, "నువ్వే అన్నం తెచ్చావా" అంటూ. ముప్పయ్యేళ్ళ వదిన ముఖంలో అలసట, శ్రమ మూలంగా పైబడిన వయసూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. 'అమాయక కష్టజీవి నవ్వు అది' అని బ్రహ్మం అనుకున్నాడు. అన్నం గంప కింద బెట్టి, "నువ్వు ముందు తిను వదినా, ఈలోగా కొండయ్య తాతను పిల్చుకొని వస్తా" అంటూ బ్రహ్మం మిరప తోట వైపు నడిచాడు. మడవ తిప్పి కొండయ్య, బ్రహ్మాన్ని పలకరించాడు "సెలవుకొచ్చినావా, చూసిపోదామని?"

"అవును తాతా. రేపు మల్లా పోవాల. నువ్వు అన్నం తినిరా. అంతలో నేను మడవ గడతా" అన్నాడు బ్రహ్మం నిండు మనసుతోనే.

"రెండు కయ్యలే ఉన్నాయి. నువ్వు పోయి మోటరు ఆపిరా. నీతో చెప్పాల్సింది ఉంది. తర్వాత తింటా" అన్నాడు కొండయ్య.

బ్రహ్మం మోటరు ఆపటానికి తిరిగి వచ్చాడు. వదిన అన్నం తింటోంది. బ్రహ్మం మోటరు ఆపాడు. వదిన చనువుగా నవ్వులాటగా అడిగింది. "నీ పెళ్ళెప్పుడప్పా?"

"కష్టపడడానికా వదినా? 'నిన్నులాగా కష్టపెట్ట డానికా వదినా' అని బ్రహ్మం అందామనుకున్నాడు. అనలేకపోయాడు.

"ఉద్యోగం దొరికింది గదప్పా!"

"విద్యావాలంటీరు ఉద్యోగం వదినా!"



"పదైదు నూర్లు వస్తుందటనే?"

"అది మాట వరసకేలే వదినా. చేతికొచ్చేది ఏడు నూర్లేలే."

"ఏందోనప్పా ఇదంతా. మా చిన్నాయన కూతురు టీచరుంది. కట్నం ఇచ్చుకోలేరు. చేసుకో. అప్పుడు ఇద్దరి సంపాదనలు. నా బిడ్డల్నిద్దర్నీ నీ దగ్గర విడుస్తాలే. ఆడపిల్లలు. బరువు కాదులే. ఇంటిపని అదీ చేసి చదువుకుంటారు. మీ చిన్నన్న పిల్లలు విజయవాడలో బాగా చదువుకుంటున్నారు. పెళ్ళి చేసుకో తొందరగా."

"చేసుకోవాలనుకుంటే నీ మాటే వింటాన్లే వదినా. కొండయ్య తాతను పిలుచుకొని వస్తా ఉండు" అంటూ బ్రహ్మం కదిలాడు. వదిన మనసులోని వ్యధ అర్థమైంది.

కొండయ్య చివరి కయ్యకు నీళ్ళు మళ్ళించి, కాలవలో చేతులు కడుక్కుంటున్నాడు. బ్రహ్మానికి దక్షిణం వైపు గట్టుమీదున్న నాలుగు పెద్ద తుమ్మ చెట్లు ఎండిపోయి కనిపించాయి. వాటి మీద తాట పూర్తిగా ఒలిచేసినట్లుంది. తెల్లగా కనిపిస్తున్నాయి.

"అదేమిటి కొండయ్య తాతా! ఆ చెట్లు అట్లా ఉన్నాయి" అని బ్రహ్మం అడిగాడు.

"అదా? బోరు పక్కన ఖాళీ జాగాలో తుమ్మకంప కొట్టలు చూల్లేదా?" కొండయ్య అడిగాడు.

"సరిగ్గా చూల్లేదులే, వదినతో ఏదో మాట్లాడతా. ఇంతకూ ఆ చెట్లకేమైంది?"

"తోలు ఒలిసినారు అంటారే అది." కొండయ్య పరిహాసంగా అన్నాడు.

"ఎందుకు? ఎవరు?"

> **భారతంలో పద్యం "హింస చేయనివాడు లేడిజ్జగంబున..." రాములమ్మది కుల హింస... అమ్మది ఇంటి హింస...**

"నీతో మాట్లాడాలన్నానే. ఇదీ ఒకటి. ఇది చెప్పేముందు ఇంకొకటి చెప్పాలి. ఈ పత్తి వెయ్యొద్దు నాయనా అన్నా మీ అన్నతో. పోయిన ఏడు పెద్ద కుసుమలు (పొద్దుతిరుగుడు విత్తనాలు) వెయ్యొద్దు అన్నా. ఇప్పుడూ వినలేదు, అప్పుడూ వినలేదు. విత్తనాలు కల్తీ మందులు కల్తీ. నీళ్ళ పారకం ఇబ్బంది. వద్దు నాయనా అన్నా. ఆశ! లప్పలప్ప ఏదో ఒకేసారి వస్తుందని ఆశ. కూరగాయలూ అవీ వేసుకోమంటే ఆ చిల్లర పంటలు వద్దంటాడు. అది కమ్మోళ్ళ సేద్యమంటాడు. అందుకేలే ఏకంగా దొంగ సారాయి కూడా వండిస్తున్నాడు మీ అబ్బకు తెలియకుండా. మీ నాయన ఎవర్నీ ఏమీ అనలేనోడు."

బ్రహ్మం ఆశ్చర్యపోయాడు నమ్మలేనట్లు. కొండయ్య మళ్ళీ ఎత్తుకున్నాడు. "నువ్వడిగినావే, ఆ చెట్లకేమైంది అని. నేను తోలు ఒలిసినారని తమాసకు అన్నానా? మన తోటలో తుమ్మ తాటంతా సారాయికి పని కొచ్చింది. రైతులు కష్టపడి పనిచేసి, తాము తిని ఒకరికింత పెట్టే కాలం పోయింది బ్రహ్మం! కొంపలు కూల్చి అయినా సరే, అడ్డదిడ్డంగానైనా సంపాయిస్తేనే మొగోడు, లేకుంటే సేతగానోడు."

కొండయ్య లోలోపలి బాధను బ్రహ్మం అర్థం చేసుకోడానికి ప్రయత్నించాడు. తానేమీ బదులు చెప్పలేదు. చెప్పలేకపోయాడు. అరకొర చదువు అనుభవానికి దూరం!

"మీ అబ్బను చూసినా, నిన్ను చూసినా కడుపు నిండుతుంది. మీ అబ్బతో ఈ సంగతి చెప్పలేను. నీతోనన్నా చెప్తామని చెప్పినా. మనసు కుదటపడింది. పద!" కొండయ్య అన్నం గంప దగ్గరకు నడిచాడు.

బోరు బావిగట్టున ఒక మూలలో పేర్చిన తుమ్మ కొట్టెల్ని బ్రహ్మం చూశాడు. ఒక్క కొట్టెకు కూడా తాట లేదు. తెల్ల తుమ్మ చెక్క సారాయి అని చెప్పుకునే వాళ్ళు. ఇప్పుడు చీకుతుమ్మ చెక్క, సారాయి అన్నమాట. అమ్మ పొయ్యిలోకి కట్టెలు కావాలన్న సంగతిని కొండయ్యకు చెప్పి ఇంటి దారి పట్టాడు.

రెండు వారాలకో, నెలకో ఏ ఆదివారమో ఒకటి రెండు సెలవు లొస్తే స్వగ్రామానికి వచ్చే బ్రహ్మానికి ఈ ఆదివారం అనుభవాలు కొంత కుదుపు నిచ్చాయి. ఆలోచించడం కంటే జీవించడం నేర్చుకోవాలేమో అనుకున్నాడు. సోమవారం ఉదయానికి విద్యా స్వచ్ఛంద సేవక పదవీ నిర్వహణ బాధ్యతలు నిర్వర్తించడానికి యాభై మైళ్ళ దూరంలోని గ్రామం చేరుకున్నాడు. కొండలూ గుట్టలోని ఊరు అది.

మరునటి ఆదివారం. మండల కేంద్రంలోని ఉద్యోగ నిరుద్యోగ మిత్రులతో బ్రహ్మం ఆ ఆదివారం గడపాలనుకున్నాడు. ఆరో తరగతి నుంచి డిగ్రీ దాకా మంచి నేస్తుడు రాజు అక్కడ రిపోర్టరు. బ్రహ్మచారి. గదిలోనే ఉన్నాడు. మరో ఇద్దరు రిపోర్టర్లు అక్కడున్నారు. వార్తలు రాయవలసిన కార్యక్రమాల హడావిడులు లేనట్లున్నాయి. కబుర్లలో పడ్డారు. పత్రికల కబుర్లు, అధికార్ల కబుర్లు, రాజకీయుల కబుర్లు, గ్రామ స్థాయి నుంచీ అంతర్జాతీయ స్థాయి దాకా మాటల్లో దొర్లిపోతున్నాయి. తాము పత్రికల్లో రాసిన వార్తలనూ, వార్తా కథనాలనూ ఒకరివి మరొకరు మెచ్చుకోవాలని తాపత్రయపడుతున్నారు. ఒక క్రమమంటూ లేని ఆ చర్చల మధ్యకు, ఇటీవల రాజు రాసిన సీమ ఫాక్షన్ రాజకీయాలు అనే వార్తాకథనం వచ్చి కూర్చుంది.

"మనిషి సాంఘిక జంతువు, రాజకీయ జంతువు లనేవి కొంతే నిజం. అసలు నిజం! మనిషి క్రూర జంతువు. పరస్పర హరణోద్యోగం మనిషి సహజాతం. జనం హింస, జనం పేరుతో హింస రకరకాల పేర్లు మాత్రమే." ఒక రిపోర్టరు మిత్రుడు అనడంతో చర్చమంట రాజుకుంది.

"రాయలసీమ గ్రామాల్లోని మురాల కక్షల గురించి మాట్లాడుతున్నాం" అన్నాడు రాజు.

"మురాలు, ఫాక్షన్లు, ఫాక్షనిస్టులు, పాలెగాండ్లు అనే మాటలు కోస్తా జిల్లాల వాళ్ళు కల్పించిన మాటలు. గురజాలలో, నరసరావు పేటలో, విజయవాడ నడిబొడ్డులో, రామచంద్రపురంలో జరిగిన హింసల మాటేమిటి? సోడా బాటల్లు, సైకిల్ చైన్లు, బిచువాల కంటే, వేట కొడవళ్ళూ, ఈటెలు, బాంబులూ ఎక్కువేమిటి, తక్కువేమిటి? ఇప్పుడన్నీ ఒకటే. ఇప్పుడంతా ఒకటే. సర్వం హింసమయం" అన్నాడు మరో రిపోర్టరు మిత్రుడు.

"అది కాదు మిత్రమా! ఒకప్పుడు అనంతపురం ప్రశాంతంగా ఉండేది కదా! ఇప్పుడు కడప హింసా సంస్కృతి ప్రభావమేనంటున్నారు. మిగతా చోట్లకు పాకింది అంటున్నారు" అన్నాడు రాజు రెచ్చగొడుతూ.

మరో రిపోర్టరు మిత్రుడిది కడప జిల్లా.

మొదటి రిపోర్టరు మిత్రుడు రాజుతో అన్నాడు. "మనది వట్టి పోలీసు లెక్కల తర్కం. నేననేది ప్రతి హింస, రాజ్యహింస, విప్లవ హింస, మానవ హక్కుల హింస అన్నీ మనిషి హింసకు సంకేతా లేనని. ఒకటి గంగా నదిలా పవిత్రమైంది కాదు. మరొకటి మురికి కాలువలా చండాలమైందీ కాదు, ఆఖరుకు నక్సలైట్ల హింస కూడా. అంతే!"

"ఏందిరా నీ కాలజ్ఞానం" అన్నాడు రాజు.

"మారిన సంస్కారంతో పాటు హింస తగ్గుముఖం పట్టాల కదా? ఆటవిక ఉద్వేగాలు హింసకు మూలం అనుకుంటాను. అవి పరిణామంలో తగ్గుతూ పోవాల కదా?" బ్రహ్మం మిత్రులతో చర్చలో తలదూర్చాడు.

"అంటే?" అన్నారు ముక్తకంఠంతో ముగ్గురు రిపోర్టర్లూ.

"నాకు సమాధానమేదో తెలుసునని కాదు. మనిషి మనిషిగా ఎదిగే కొద్దీ హింస తగ్గాల కదా?" బ్రహ్మం మిత్రుల ప్రతిస్పందన కోసం ఆగాడు.

మొదటి రిపోర్టరు ఇల్లు అదిరేలా నవ్వి నవ్వి, నవ్వును ఆపుకుంటూ అన్నాడు:

"మనిషి ఎదగడమా? ఆఫ్ఘనిస్తాన్ - తాలిబాన్తో ఎదిగాడు. కొసావోలో ఎదిగాడు! చైనాలో తియాన్మిన్ స్క్వేయిర్‌లో ఎదిగాడు! పాకిస్తాన్‌లో ఇంతెత్తున ఎదిగాడు! ఇండియాలో ఎక్కడ ఒడితే అక్కడ - ఢిల్లీలో, బీహార్‌లో, తమిళ నాడులో, ఆంధ్రలో ఏమిటి? అన్నిచోట్లా ఎదిగి ఎదిగి కూలబడ్డాడు. అంతర్జాతీయ ఏకైక పోలీసు అమెరికా, ప్రజాస్వామ్య పరిరక్షణలో, విశ్వశాంతి పరిరక్షణలో మరీ ఎదిగి పోతున్నాడు. ఆత్మ సమర్థన చేసుకునే ఏ జాతి అయినా తనను తాను వంచించుకుంటుంది. ఇతరుల్ని వంచిస్తుంది. దానికి వర్తమానం ఉంటుంది. భవిష్యత్తు ఉండదు."

"ఒరేయ్, ఒరేయ్! వేమన్న లాగా శాశ్వత సత్యాలు చెప్పకురా. పోతులూరి వీరబ్రహ్మంలాగా భవిష్యత్తు పలకకురా" అన్నాడు రాజు నవ్వుతూ.

"శ్రీశ్రీ హింస, రిరింస అనే రెండు మాటలు వాడినాడు. మీకు గుర్తుందర్రా?" మొదటి రిపోర్టరు అడిగిన ప్రశ్నకు జవాబు రాజుకూ, రెండో రిపోర్టరుకూ తోచలేదు.

బ్రహ్మం అన్నాడు, "గుర్తుంది. రిరింస అనే మాటకే అర్థం స్ఫురించలేదు."

మొదటి రిపోర్టరు మళ్ళీ పసిపిల్లలు జడుసుకునే నవ్వు నవ్వాడు. నవ్వు ఆపకుండా "రి... రి... రిరిం... రిరింస... రిరింస ఒక హింస" అన్నాడు.

"తాము తిని ఒకరికింత పెట్టే కాలం పోయింది బ్రహ్మాం! కొంపలు కూల్చి అయినా సరే సంపాయిస్తేనే మొగోడు."

"వీడు చెయ్యబోయే కవిత్వ హింస ఎందుకు గానీ, మనం లైన్ అకౌంటు హింసను గురించి మాట్లాడుకుందాం." రాజు వాతావరణాన్ని తేలిక పరిచే ఉద్దేశంలో అన్నాడు.

"ఇదేమిటి?" బ్రహ్మం ఆశ్చర్యంతో అడిగాడు.

వార్తల కొలతలను బట్టి పత్రికలిచ్చే ప్రతిఫలాన్ని గురించీ, ప్రతిఫలం కోసం సాగతీసి సాగతీసి రాసే వార్తల గురించీ రాజు చెప్పసాగాడు- నవ్వుల మధ్య కథలు కథలుగా. ఇద్దరు రిపోర్టరు మిత్రులు పని ఉందంటూ వెళ్ళిపోయారు. రాజుతో కలిసి మధ్యాహ్నం వంట కబుర్లు, భోజనం, కబుర్లు, నిద్ర, టీ, కబుర్లు...

సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో సొంత ఊరి నుంచి సుడిగాలిలా వచ్చిన దాయాదిని చూసి బ్రహ్మం ఆశ్చర్యపడి పోయాడు. ఆ కుర్రాడు వణికిపోతూ, ఏడుపు గొంతుతో, పొందికంటూ లేకుండా చెప్పాడు. 'మన సిద్దారెడ్డి అబ్బును పొద్దున రాడిపర్తి బస్టాండులో వేట కొడవళ్ళతో నరికి, బాంబులు వేసి ఘోరంగా చంపి పారిపోయినా'రని. 'తన కోసం తానుండే పల్లెకు పోయి ఇక్కడున్నాడని తెలుసుకొని వచ్చేసరికి ఇంతటయం అయిం'దని. బ్రహ్మం నిశ్చేష్టుడయ్యాడు. రాజుకు బ్రహ్మన్ని ఎట్లా ఓదార్చాలో దిక్కు తెలియలేదు. వెంటనే చెయ్యవలసింది గుర్తుకొచ్చింది. "నువ్వు రూమ్‌లోనే ఉండు. కమాలుద్దీన్ అని ఒక మిత్రుడున్నాడు. అతనికి మోటార్ సైకిలుంది. అడిగి తెస్తాను. మీ ఊరికి ముగ్గురం కలిసి వెళ్ళవచ్చు" అన్నాడు- హత్య జరిగినప్పుడు జరిగే గుర్తింపులూ, విచారణలూ, పంచనామాలూ, పోస్టుమార్టమ్‌లూ, పోలీసుల కేసు నమోదు తతంగాలూ- వీటికయ్యే వ్యవధిని గురించి ఆలోచిస్తూ. "ఊరికి పోవడమే మంచిది. అయినా, రాడిపర్తిలో మా పత్రిక రిపోర్టరుకు ఫోన్ చేసి ఎక్కడికి వెళ్ళాల్సిందీ నిర్ణయించుకుందాం" అంటూ రాజు బయటికి వెళ్ళాడు.

బ్రహ్మానికి ప్రతి క్షణానికీ ఆందోళన పెరుగుతూనే ఉంది. అది ఆందోళనో, దుఃఖంతో బరువెక్కిన మనసో, హత్యకు కారణాలను వెతికే ఉద్వేగమో, కుటుంబం ఏ కల్లోలంలో చిక్కుకుంటుందో అనే భయమో, ఏది ఏమో తెలియని స్థితి. బ్రహ్మం, బ్రహ్మం కోసం వచ్చిన కుర్రాడూ మాటిమాటికీ తలుపు వైపు చూస్తున్నారు. ఉలికి ఉలికిపడుతూ బయట శబ్దాలను వింటున్నారు. గంట గడిచింది. మోటార్ సైకిల్ శబ్దం తలుపుకు దగ్గరగా ఆగింది. ఆగడంతో బ్రహ్మం చివాలున లేచి నిలబడ్డాడు. "పోదామా?" అక్కడికి, ఎక్కడికి అనే ఆలోచన లేకుండా.

"మనం మీ ఊరు చేరుకునేసరికి, శవం మీ ఊరికి వస్తుంది. మా రిపోర్టరుతో మాట్లాడినా, పద పోదాం." రాజు వివరాలు చెప్పలేదు. బ్రహ్మం అడిగే స్థిమితంలో లేడు.

ఊరు లోపలికి ప్రవేశిస్తూనే బ్రహ్మం గుండె దడ హెచ్చింది. ఇంటి దగ్గర జనం గుంపులు గుంపులుగా. పల్లెల జనం. కొందరాడవాళ్ళు చంపినవాళ్ళ మీద శాపనార్థాలు పెడుతున్నారు. కొందరు మగవాళ్ళు చనిపోయిన సిద్దారెడ్డి గుణగణాలను కీర్తిస్తున్నారు. బ్రహ్మం బంధువులైన యువకులు చంపింది ఎవరెవరో తెలిస్తే నరికి పోగులు పెట్టాలని బీరాలు పలుకుతున్నారు. వీళ్ళందరి మధ్యా ఏ సిద్ధుడి ముఖంలాగానో కనిపించే సిద్దారెడ్డి ముఖం. సైను గుడ్డతో కుట్టివేసి దుప్పటి కప్పిన శవం. అబ్బ శవాన్ని చూసి బ్రహ్మం దుఃఖం పెల్లుబికింది. బోరుబోరున విలపించాడు. రాజు పొదివి పట్టుకున్నాడు. ఓదార్పులేని అశక్తత.

గుంపులోని ఒక పేదరాలు అంది: "ఒకర్ని అని ఎరగడు. యాభై యేండ్లలో ఒకరి మీద చెయ్యెత్తగా వినలేదు, ఇంట్లోవాళ్ళ మీద కూడా. నేను చూడలేదు. పేదాసాదాను అట్లా చూసినోడు లేడు. రాకాపోక్కు,





మునలాయన్ని పొట్టనబెట్టుకున్నారు."

మరెవరో అన్నారు: "ఈ పెద్దాయన పెదపెద్దోళ్ళతో పెట్టుకున్నట్టుండి లేకపోతే ఈయన జోలికి పొయ్యేవాండ్లెవరు? ఎప్పుడూ ఏ పార్టీల్లోనూ తలపెట్టినోడు కూడా కాదు."

"ఖర్మ! ఖర్మ!" అని ఎవరో గొణిగారు.

బ్రహ్మం తల్లి, వదిన తలలు చేతులతో కొట్టుకుంటూ ఏడుస్తున్నారు. చుట్టాల ఆడవాళ్ళు, బీదా బిక్కీ స్త్రీలూ వాళ్ళను ఓదార్చడానికి చేసే ప్రయత్నంలో తామూ ఏడుస్తున్నారు. అక్కడ సామూహిక వేదనా, సంఘ దుఃఖం కన్పిస్తున్నాయి.

సిద్దారెడ్డి శవ ఖననం అయ్యిందాకా, ఊరు ఊరంతా పురుగుల వాతపడిన పత్తిపంట లాగుంది. హంతకుల ఆచూకీ మాత్రం తెలియలేదు. పోలీసులు గాలిస్తూనే ఉన్నారు. దివసం మాత్రం జరిగిపోయింది. దివసం జరిగిపోయిన రాత్రీ, ఆ మరునటి రోజూ చూడలేక విన్నవాటితో బ్రహ్మం మానసికంగా తలకిందులయ్యాడు.

దివసం జరిగిపోయిన రాత్రి ఇంటిబయట జాగా లేక, ఇంట్లో కరెంటు పోయి తాను దాట్లో పడుకున్నాడు. ఆటుపక్కగా విజయవాడ నుంచి వచ్చిన రెండో అన్న, ఆయన భార్య ఒకే మంచంలో పడుకున్నారు. దోమతెర కట్టుకొని తన పక్క మంచంలో పెద్దన్న పిల్లలు ఆడపిల్లలిద్దరూ గాఢ నిద్రలో ఉన్నారు. కటిక చీకటి. ఏ అర్ధరాత్రో అపరాత్రో గుసగుసలు వినిపించాయి. నిద్ర రాక ఆలోచనలతో సతమతమవుతున్న బ్రహ్మానికి వినిపిస్తాయి. "రాజే కమ్మనే చెప్పాడు. మన్ను చెప్పినట్టు చెప్పాలే మునలాయన మీదే మన్ను. ఒకటికేతే మరో నాలుగైదేండ్లు బతికేవాడు. మా నాన్న వైకుంఠలోకం. మా అన్న ఇప్పుడిప్పుడే ఎలక్షన్లకు నిలుచుకుంటున్నాడు. మా తమ్ముడికి మీ ప్రాంతంలోనే సంబంధాలు చూస్తాం. పిల్ల కుదుట పడితే మన మీద పడదు. ఇద్దరం ఉద్యోగులమని




ముందుముందు మనకే లాభం ఉండొచ్చు చూద్దాం..."

చిన్నన్న స్వరం పెద్దది. గుసగుసలైనా వినిపిస్తాయి.

చిన్నన్న మాటలకు బ్రహ్మానికి మతి పోయింది. చిన్న వదిన-విజయవాడ వదిన- మాటలు వినిపించలేదు. ఊఁ ఊఁలు తప్ప. ఒకే ఒక్క మాట- 'పాడు' వినిపించింది.

"ఈ రోజన్నా వదిలేదు లేదా? కానీ, నువ్వు వినవు గదా" అని.

బ్రహ్మం సిగ్గుతో, అవమానంతో చచ్చిపోయాడు. 'చావు వేరు. దుఃఖం వేరు. శరీరం ఆరాటపడే సుఖం వేరు. ఇదేమిటి' అని అనుకున్నాడు.

మరునటి రోజు చాకలి రాములమ్మ దొడ్లో ఒంటరిగా కూర్చున్న తనతో ఎవరికీ వినబడకుండా చెప్పింది.

"చిన్నోళ్ళే మూడు లక్షలిచ్చి చంపించినారంట. మా చెల్లెలి ఊర్లో వాడొకడు. మా కులపోడు కూడా చంపినోళ్ళలో ఉన్నాడంట పాపిష్టోళ్ళు."

ఆ తర్వాత వివరాలు ఎవరో రావడం వల్ల బ్రహ్మానికి రాములమ్మ ద్వారా అందలేదు.

ఏ నిజాలూ తెలియని స్థితిలో ఆ ఆదివారం ఆప్తమిత్రుడు రిపోర్టరు రాజా దగ్గరకు వెళ్ళి నిస్సిగ్గుగా తాను విన్నవి చెప్పాడు.

"మా పత్రిక రిపోర్టరు కూడా చెప్పినాడు మొన్న కలిసి. అన్నీ నిజమే. మీ అబ్బ సిద్దారెడ్డి పేదలకు ఇండ్ల పట్టాలకు పట్టుబట్టి క్వారీకి, కంకరు మిషను పెట్టడానికి అడ్డం తగిలాడట. పెట్టాలనుకున్న వాళ్ళకు అది ఇరవై లక్షలకు పైగా నష్టం. సిమెంటు ఫ్యాక్టరీ కొంటున్న చిన్న రైతుల, పేదల భూముల కొనుగోళ్ళ విషయంలో, వాళ్ళ దగ్గర చౌకగా బెదిరించి కొని తిరిగి ఫ్యాక్టరీ యాజమాన్యానికే అమ్మాలనుకున్న వాళ్ళకు అడ్డం పడ్డాడంట. ఇంకా..."

"ఆయన వెనుక మనుషులెవరున్నారు?" బ్రహ్మం పీల గొంతుతో ఆత్రం పట్టలేక అడిగాడు.

"అప్పటికప్పటికి ఉన్నారు. ఆయన మహాజర్లు, మొండితనం, ప్రభుత్వ పథకాల అమలు పరిధిలోనే అందుకున్న సూత్రం..."

"పత్రికలేమీ చెయ్యలేవా?"

"అంతో ఇంతో చేశాయి కాబట్టే మీ అన్నతో రాజీకొచ్చారు. మరో రెండు లక్షలిచ్చి మీ అన్న వారా వ్యాపారానికి తలుపులు కొంత తెరుస్తామని చెప్పి..."

"మరి ఇండ్ల పట్టాలు."

రాజా బదులు పలకలేదు. దిగులుగా కూర్చున్నాడు.

"ఇంతకూ కాంగ్రెసు వాళ్ళా? తెలుగుదేశం వాళ్ళా? రెడ్లా? కమ్మవాళ్ళా? కిరాయి మనుషులా? అసలు దీని వెనకున్న మనిషి ఎవరు?" బ్రహ్మం ఆవేశంగా ప్రశ్నించాడు.

"ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, దేని కోసం, ఏ పార్టీలో, ఏ కులంలో ఉంటారో వాళ్ళను నువ్వూ, నేనూ తెలుసుకుంటూనే సరిపోతుందా? తెలుసుకుంటే ఏం జరుగుతుంది? ఊఁ ఏం జరుగుతుంది చెప్పు" నిరావేశంగా నొక్కి నొక్కి అడిగిన రాజా ప్రశ్నలతో గ్రామ పిచ్చి వాలంటీరు బ్రహ్మం తపస్సులోకి వెళ్ళిపోయాడు.

ఏ తపస్సులైనా ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక ఫలితం ఉండకపోదు. ■

• కలువకొలను సదానంద
• చిత్రాలు: చంద్ర

ఆఖరికి దేవాలయం సమీపంలో రోడ్డు పక్కన హైవేస్ వారి చింతచెట్టు నీడలో కాపురం పెట్టాడు రంగదాసు.

చెట్టు బోదెకు చేరగిలబడిన ట్రంకుపెట్టెలు, సిరిచాపలు, దిండ్లు.

చెట్టు కొమ్మకు ఉరేసుకున్న పాత చీర మడతలో పడుకుని గడియారంలో లోలకంలా ఊగుతున్న పసివాడు.

స్నానాదికాలకు కాటోలు, రోడ్డువైపు నిలబెట్టిన తాటాకుల దడి ఒకటీ.

కొళాయి నుంచి నీళ్ళు తెస్తూనో, చెట్టు కింద పొయ్యి ఊదుతూనో గృహ(?)కృత్యాల్లో మునిగి పోయిన రంగదాను పెళ్ళాం.

బడి నుంచి వచ్చి చెట్టు కింద కంచాలు ముందర పెట్టుకుని కూర్చున్న ఇద్దరు పిల్లలూ.

దారిన పోయేవాళ్ళకి కనిపించే దృశ్యాలివన్నీ.

రంగదానుది సంచార జీవితం కాదు. పుట్టి పెరిగిన ఊళ్ళో నిన్న మొన్నటి వరకు పరమ నికృష్టంగానే అయినా పరువుగా కూడా బతికిన రంగదాను ఇవాళ చెట్టు కింద నిలబడ్డాడంటే, ఇంతకంటే వింత ఇంకొకటి లేదు. కాపురం ఉండటానికి సొంత ఇల్లే ఉండాలన్న నియమం లేదు కదా! అందరివీ సొంత ఇళ్ళే అయితే, పెద్ద మనుషులు కట్టించిన అద్దె కొంపల పేటల్ని నింప టానికి సరిపోయే దయ్యాల్ని ఎక్కణ్ణించి పట్టుకు రాగలం? లక్ష జనాభా ఉన్న మునిసిపల్ టౌన్‌లో- అనుకోగానే అద్దె ఇల్లు దొరకడమనేది లాటరీలో లక్షలాది రూపాయలొచ్చినంత అద్భుత విషయమే. అలాగని, పెళ్ళాం పిల్లల్ని రోడ్డు పక్కన దిగబెట్టే ప్రబుద్ధులుంటారా లోకంలో? ప్రయత్నిస్తే ఏ ఎలుకబొక్కో, పావురాయి గూడో దొరక్కపోదు గదా! రంగదాను ప్రయత్నించాడు. ఫలితం ఎలా ఉంటుందో అతనికి బాగా తెలును. అది పీకల మీదికి తెచ్చి పెడుతుంది.

అతన్ని గురించి ఊరు ఊరంతా ఈపాటికే పాకిపోయింది. నరమాంస భక్షకుడికి పిల్లనిచ్చేవాడు ఎంత మూర్ఖుడో, రంగదానుకు ఇల్లిచ్చేవాడు కూడా అంతే మూర్ఖుడు!

ఈ వైపరీత్యం ఎలా ఏర్పడిందంటారూ? కారణం ఉంది. జరిగిందంతా కల కానే కాదు. (వైష్ణవ మాయ కాదు గదా?) మాయాజాలం మతి కట్టూ అనలే కాదు. పదహారణాల పచ్చి వాస్తవం. మీరు దేవుడి ఉనికినీ, దేవుడి లీలల్నీ నమ్ముతున్నవాళ్ళయితే, ఈ కథనాన్ని నమ్మి తీరాలి. ఇందులో అతిశయోక్తి గానీ, వ్యంగ్యోక్తి గానీ ఆవగింజంతైనా లేదు. ప్రతి అక్షరమూ సత్యమే!

చెట్టు కిందికి రావడానికి ముందు ఎక్కడున్నాడు రంగదాను?

అద్దె కొంపలో.

అద్దె కొంపలోకి మారడానికి ముందు ఎక్కడున్నాడు?

తాతలిచ్చిపోయిన పాత పెంకుటింట్లో.

కథను అక్కణ్ణుంచి మొదలెట్టాలి.

రంగదాను అర్ధాకలితోనైనా బతుకుతున్నాడంటే, అదంతా 'ప్రజాబంధు' లక్ష్మీరంజన్‌గారి చలవే. డబ్బున్నవాడికి బిరుదులివ్వడం మన జాతి లక్షణం కనుక లక్ష్మీరంజన్‌గారు- ఎలాంటివాడైతేనేం, ప్రజాబంధువైనారు. అతని దగ్గర రాత్రీ పగలూ చేసినా క్షణం తీరిక లేనంత పని రంగదానుకి. ప్రజాబంధుకు మట్టిని బంగారంగా మార్చే మంత్రాగారాలు అనేకం! ఆ పని సవ్యంగా జరగటానికి మానవ యంత్రాల అవసరం ఎంతో ఉందతనికి. ఆ యంత్రాల్లో రంగదాసొకడు. ఈ యంత్రం ఇంట్లో పిల్లలు ఆకల్తో ఆవురుమంటూన్న సమయంలో బొద్దుగా, ముద్దుగా ఉన్న అయ్యగారి మనుమల్ని ఎత్తుకుని ఆడిస్తూ ఉంటుంది. కట్టుకున్న పెళ్ళాం ప్రసవవేదనతో బావురుమంటూన్న వేళలో ఈ యంత్రం అయ్యగారి కోడలుగారిని వైద్య పరీక్ష కోసం వేలూరు ఆస్పత్రికి తీసుకువెళుతుంది. అయ్యగారి సేవలో అంగాంగమూ అరిగిపోయిన ఈ యంత్రానికి ఆర్థికావసరాలు లేకుండా ఉంటాయా? ఆ విషయమై అయ్యగారిని కదిపితే ఆయన ప్రసన్నవదనంతో అనే మాటలు ఇవీ: "ఒరే రంగడూ! నువ్వొక్కడివేనా? నీలాంటివాళ్ళను ఎంతమందిని పోషించాలి నేను! నీ అదృష్టం కొద్దీ నేనంటూ ఒకణ్ణి ఉన్నాను గనుక నువ్వు ఈ మాత్రంగానైనా ఉంటున్నావు. సంతోషించు. అత్యాశలకు పోవద్దు!" ఎవరు ఎవర్ని పోషిస్తున్నారన్న విషయాన్ని పూజామందిరంలో దేవుడి దగ్గర తప్ప ఇంకొక చోట తలుచుకోడాయన. ఏకాంతంలో పెళ్ళాం పిల్లల దగ్గర తప్ప మరొకరితో చెప్పుకోడు.

ఒక రోజు రంగదాను పనిలోకి వెళ్ళలేదు. వరుసగా మూడు రోజులు కనిపించకపోయేసరికి, ఏమైపోయాడో కనుక్కురమ్మని మరో మానవ యంత్రాన్ని పంపారు ప్రజాబంధు. యంత్రం తిరిగొచ్చి, "రంగడు తపస్సు చెయ్యడానికి అడవికెళ్ళాడట" అని చెప్పింది.

ప్రజాబంధు అదిరిపడ్డాడు. "తపస్సా! ఎందుకూ?"

"వాడికి తిండీ, బట్టా చాలటం లేదట బాబూ! పైగా అప్పులు కూడానట!"

వెంటనే ఫోనులు మోగేయి. బంధు జనాన్నంతా సమావేశపరిచాడు ప్రజాబంధు. పనివాళ్ళనందర్నీ బయటికి పంపి సింహద్వారాలు మూయించాడు. బంధువుల్ని ఉద్దేశించి ఇలా అన్నాడు: "కొంప మునగబోతున్నది. యంత్రాలు ఆకలి తీరితే పనిచేస్తాయి. కానీ, మానవ యంత్రాలు మాత్రం ఆకలితో ఉంటేనే మన మాట వింటాయి. ఆకలి తీరని వాడొకడు తపస్సు చేస్తున్నాడిప్పుడు. వాడి తపస్సు ఫలిస్తే, తక్కినవాళ్ళు కూడా అదే తోవ పడతారు. తరువాత మన నోట్లో మట్టి. ఈ ప్రమాదాన్ని వెంటనే అడ్డుకోవాలి. కనుక ఓ నా మనవలారా! మునిమనవలారా! మీ క్షేమం కోసం, మీ మనవల, మునిమనవల క్షేమం కోసం నేనిప్పుడు తపస్సు చేయబోతున్నాను."

కొడుకులకు, అల్లుళ్ళకు, బావమరదులకు, మనవలకూ బాధ్యతల్ని పంచిపెట్టి అట్టహాసంతో అడవికి వెళ్ళాడు ప్రజాబంధు. కళ్ళు మూసుకుని నిశ్చల మనస్కుడై తపస్సు చేసుకుంటున్న రంగదాను ఎదుట యాభై గజాల దూరంలో ఒక చెట్టు కింద కూర్చున్నాడు. ముందర బంగారు ప్రతిమను పెట్టుకున్నాడు. పళ్ళెం నిండా నవరత్నాలు పోసుకున్నాడు. ఒక్కో రత్నం చొప్పున ప్రతిమ నెత్తిన పడేస్తూ బిగ్గరగా విష్ణు సహస్రనామం చదవడం మొదలుపెట్టాడు.



ఈ ఇద్దరిలో ఎవరి తపస్సు ఫలించిందో గానీ, కళ్ళు మూసుకున్న రంగదాను చెవులకు, "వత్సా! నీ భక్తికి మెచ్చితిని! ఇక కనులు తెరువుము" అనే మాట వినిపించింది.

రంగదాను చెవుల్ని నమ్మలేక కళ్ళు విప్పి చూశాడు. ఎట్ట ఎదుట మూడడుగుల దూరంలో దేవుని పాదాలు కనిపించాయి. అయితే, అవి వెనక్కి తిరిగి ఉన్నాయి. దయ్యమేమోనన్న అనుమానంతో కళ్ళు పైకెత్తి చూశాడు రంగదాను. దేవుడి వీపు, గిరజాల జుత్తు, దాని మీద కిరీటమూ కనిపించాయి.

"ఎవరు స్వామీ నువ్వు? విష్ణుమూర్తివేనా?"

"సందేహమేల భక్తా?"

"ఎక్కణ్ణుంచి వొచ్చావు స్వామీ?"

"చిత్రలోకము నుండి వచ్చిన నటరత్న నందమూరి తారకరామారాయడని అనుమానించు చున్నావా ఏమి? కాదు, కాదు! నిక్కమైన విష్ణుదేవుండనే నేను. మీ మానవ జాతి నేనుండుటకై సృష్టించి ఇచ్చినది వైకుంఠమే గదా! అక్కడి నుండియే వచ్చినాను."

"వొచ్చావు. బాగానే ఉంది. వెనక్కి తిరిగి నుంచున్నావెందుకూ? నీకు కళ్ళు ముఖాన లేవా?"

"అచట మరియొక భక్తుడున్నాడు గదా నాయనా! ఆ తపో వైభవమును నయనానందకరముగా తిలకించుచున్నాను."

విష్ణుదేవుని కాళ్ళ సందుల్లోంచి ప్రజాబంధును చూసిన రంగదాను, భయభక్తులతో చివాలున లేచి

**ఎవరు ఎవర్ని పోషిస్తున్నారన్న విషయాన్ని పూజా మందిరంలో దేవుడి పటం దగ్గర తప్ప ఇంకొక చోట తలచుకోనే తలచుకోడు ఆయన.**




**పుట్టి పెరిగిన ఊళ్ళో నిన్న మొన్నటి వరకు పరమ నికృష్టంగానే అయినా పరువుగా కూడా బతికిన రంగదాను ఇవాళ చెట్టు కింద నిలబడ్డాడంటే ఇంతకంటే వింత లేదు.**

నుంచున్నాడు. "స్వామీ! వరం కోరుకోమంటావా?" అన్నాడు.

"వత్సా! మొదట ఆ భక్తునికి వరమొసగి, పిదప నీకిత్తును."

"అదేం స్వామీ! మొదట నా దగ్గరికే గదా వచ్చావు?"

"మొదట వచ్చినది నీ వద్దకే! నేను మొదట చూచినది మాత్రము వానినే గదా!"

"సరే! మీ చిత్తం వచ్చినట్టే ఏడవండి!"

"భక్తా! ఏమి నీ కోరిక" అన్నాడు విష్ణుదేవుడు, దూరంగా ఉన్న ప్రజాబంధును ఉద్దేశించి బిగ్గరగా.

"ఇటు- దగ్గరికిరా చెబుతాను" అన్నాడు ప్రజాబంధు.

నడిచి వెళ్ళాడు దేవుడు.

ధన కనక వస్తు వాహనాలేవీ కోరలేదు ప్రజాబంధు. అవి కావాలనుకుంటే ఈ వెర్రినాగన్నే దిగిరావాలా ఏమిటీ? సంపాదించడం తనకు చేతగాకపోతే గదా? కావాలంటే ఆ కిటుకులేమిటో ఇలాంటివాళ్ళకు ముక్కోటి మందికి తాను చెప్ప గలడు. "స్వామీ! ఆ వెధవ సుఖపడరాదను. వాడికి వరమిచ్చేటప్పుడు ఈ విషయం కాస్త గుర్తు పెట్టుకో! ఇంతే నా కోరిక" అన్నాడు తగ్గు గొంతుకతో.

"తథాస్తు" అనేసి, వెనుదిరిగి రంగదాను దగ్గరికి వచ్చాడు దేవుడు. శంఖ చక్ర గదా పద్మాలతో కన్నుల పండుగగా నడిచివస్తున్న ఆ సుందర విగ్రహాన్ని కన్నార్పకుండా చూస్తూ మైమరచి నిలబడిపోయాడు రంగదాను.

"స్వామీ! ఎంత అందంగా ఉన్నావు నువ్వు!"

"ఇది మీ మానవులు తీర్చిదిద్దిన రూపమే కదా నాయనా! మీ కళానైపుణ్యమునే ప్రశంసింపవలె."

"ఎన్ని వేల సంవత్సరాలుగా ఉంటున్నావో నువ్వు. అయినా, నీలో ముసలితనమే లేదు. ఒక్క వెంట్రుకైనా తెల్లబడలేదు గదా!"

"మీ ఊహలలో నేను ఆదిమధ్యాంత రహితుండను. జరామరణములు లేనివాడను. అందుకే ఇట్టున్నాను. సరే, ఇక వరమొసంగుదునా?"

"ఇదిగో, కోరుకుంటున్నాను స్వామీ..."

"కోరుకొనుటేల? నేనే ఇత్తును. నీ ఇల్లు బంగారమగును గాక! చాలునా?"

ర్వ వచ్చినంత పనైంది రంగదానుకు. చాలినంత తిండీ బట్టా ఇమ్మనీ, కష్టాల నుండి గట్టెక్కించమనీ మాత్రమే కోరుకుందామనుకున్నాడు అతను. ఇల్లే బంగారమైపోతుందంటే, ఇక అతని సంతోషానికి అవధులుంటాయా?

"నిజమేనా స్వామీ? నమ్మమంటావా స్వామీ!... ఇది కల కాదు గదా? ఈ కల కరిగిపోదు గదా"

అంటూ తడబడిపోయాడు.

"సందేహమెందుకు భక్తా! నేను చెప్పినదేగానీ నా మాటకు తిరుగు లేదు. చూచెదవు గదా, ఇంటికి పొమ్ము."

"నువ్వు చెప్పిపోవటమేమి స్వామీ? నాబోటి ఎర్రాని వెధవతో నా నీ తమాషాలు!"

"ఇందు తమాషా ఏమున్నది తండ్రీ! మానవుడెంత గొప్పవాడు! ఎంతటి ఊహాశాలియ్యుడు! అట్టివానికే మరణము తప్పకున్నది. ఇక మనిషి చేసిన బొమ్మను, నాకు మరణము లేకుండునా! మేము నిర్జీవ ప్రతిమలము. మానవ మేధ అలసిపోయినపుడు, ఆ జడత్వములో, ఆ అయోమయములో పుట్టినవారము. మనిషిలోని భయము, స్వార్థము, మూర్ఖత్వము, బాధ, వేదన, నిస్సహాయత, అజ్ఞానము, ఆశ, అవకాశవాదము మాకు ముక్కోటి రూపములిచ్చినవి. మా అండ జానుకాని రాజ్యములు వర్ధిల్లినవి. మతములు విస్తరిల్లినవి. సామ్రాజ్యము, వనసామ్రాజ్యము మా రెక్కల నీడలలో కంచుకోటలు నిర్మించుకొన్నవి. నీవే కాదు, మేము గూడ ధనికుల పిడికిళ్ళలో చిక్కుకున్న యంత్రములమే! భక్తి పేర, పూర్వజన్మ కర్మ ఫలము పేర దారిద్ర్యమునకు జోలపాటలు పాడి, మానవజాతిలో అసమానతలను సుస్థిరము చేయుటయే మా పని. అందుకే పరిగణన మాకు

ఒప్పించినది. మాకు నిత్యారాధనకు కొదువలేదు. ప్రతి దినము మాకు ఊపిరిపోయుటకు కోట్లాదిమంది ప్రజలున్నారు గనుక నడచిపోయినది. లేకున్న మేము గాలి పోయిన తిత్తులమే'

విష్ణుదేవుడు మాటలు ఆపి చూసేసరికి అక్కడ రంగదాసు లేడు. ఈ గోడు వినటం ఎందుకని, ఎప్పుడో ఇంటికి పరుగుతీశాడు.

దగ్గరగా వచ్చి నుంచున్న ప్రజాబంధు, 'పిచ్చి మొహమా వాడితోనా ఈ ప్రేలాపనలన్నీ! చాలుగానీ, ఇక వెళ్లిపో వైకుంఠానికి' అంటూ ముద్దుముద్దుగా విష్ణుదేవుడి మూతి మీద పొడిచాడు.

ఇల్లు చేరుకున్న రంగదాసుకు కళ్లు మిరుమిట్లు గొలిపేయి. మిట్టమధ్యాహ్నపు ఎండలో తన పాత పెంకుటిల్లు బంగారు వన్నెతో ధగధగా మెరిసిపోతోంది. ఇంటి చుట్టూ జనం పోగై విడ్డూరంగా చూస్తున్నారు. గోడ పగుళ్లలో నిలబడి ఉన్న ఒక బంగారపు బెడ్డను చేతికి తీసుకుని, 'అప్పటమైన బంగారమే' అంటున్నాడు కంసాలి కనకాచారి.

రంగదాసు ఒక్క దూకు దూకి ఆ బంగారపు బెడ్డను లాక్కున్నాడు. జనాన్ని దూరంగా తోలేసరికి అతని తల ప్రాణం తోకకొచ్చింది. పెళ్లాం పిల్లల్ని ఇంటి చుట్టూ కాపలా ఉంచాడు. తాను వీధిలోనే నుంచున్నాడు.

ఇంత బంగారాన్ని ఏం చెయ్యాలి, దీన్ని ఎలా కాపాడుకోవాలి అనే ఆలోచనలు అతని తల నిండా ముసురుకున్నాయి.

'ఇంట్లో బియ్యపు గింజ లేదండీ! పిల్లలంతా మూడు రోజులుగా పస్తులుంటున్నారు' అంది అతని పెళ్ళాం.

రంగదాసు ఇంటి కప్పులోంచి ఓ బంగారపు పెంకును లాగాడు. చాలా బరువుగా ఉంది. దాన్ని సంచీలో వేసుకున్నాడు. వీధిలో వెళ్తుంటే సంచీ బరువనిపించలేదతనికి. బంగారం షాపు యజమాని దగ్గర అంత డబ్బు ఉండదేమోనన్న సంతోషం వల్ల కాబోలు.

బంగారం కొట్టు చేరుకోగానే, 'సేటుగారూ! బంగారం కొంటారా' అన్నాడు.

'ఎంతుంది?'

'నాలుగైదు కిలోలుండొచ్చు!'

ఆ మాట విన్న సేటుగారు నిర్ఘాంతపోయారు.

ఆ తరువాత సంచీ నుంచి పెంకును బయటికి లాగిన రంగదాసు కూడా నిర్ఘాంతపోయాడు. ఇప్పుడది బంగారం కాదు. మట్టిపెంకు మాత్రమే! ఇల్లు ఇల్లుగా ఉన్నప్పుడు మాత్రమే బంగారంగా ఉంటుందనీ, విడగొట్టి బయటికి తెస్తే యథాప్రకారం పెంకుగానో, మట్టిబెడ్డగానో మారిపోతుందనీ అర్థమైపోయిందతనికి.

బంగారం కోసం కాకపోయినా, నీడకోసం ఇంటిని రక్షించుకోవలసిన అవసరం ఏర్పడింది రంగదాసుకు. ఇంటిల్లిపాదికీ నిద్ర దూరమైంది. అయినా, దొంగలూ దౌర్జన్యకారుల బెడద తప్పలేదు. అది పసిడిరాని బంగారమే అయినా, వారం తిరిగేసరికి రంగదాసు ఇల్లు పునాదులతో సహా మాయమైపోయింది.

ఊరికి రెండో చివర ఉన్న మరో పేటలో ఒక అద్దె ఇల్లు కుదుర్చుకున్నాడు రంగదాసు. అది పూరిల్లు. చుట్టూ మదురు గోడ ఉంది. అర్ధరాత్రి పూట ఆ ఇంట్లో ప్రవేశించింది రంగదాసు కుటుంబం. తెల్లవారి లేచి చూసేసరికి ఇల్లు బంగారంగా మారిపోయి ఉంది. ఇంటి ముందున్న మదురు గోడ అప్పటికే సగం మాయమైపోయింది. ఇంటి యజమాని సంగతంతా తెలుసుకుని, రంగదాసును మెడ పట్టి గెంటేశాడు. మరుక్షణం బంగారు పాక మామూలు పూరిపాక అయింది. పోయిన మన్ను పోగా, మదురుగోడ మాత్రం మొండిగా ఉండిపోయింది.




"స్వామీ! ఆ వెధవ సుఖపడకూడదు. వాడికి వరమిచ్చేటప్పుడు ఈ విషయం కాస్త గుర్తు పెట్టుకో!"

అంతే! ఆ తరువాత రంగదాసుకు మరెక్కడా అద్దె ఇల్లు దొరకలేదు. అతనికే కాదు, మరెవరికీ కూడా ఇల్లు దొరకటం గగనమైపోయింది. ఇల్లు కావాలన్న ప్రతివాణ్ణీ అనుమానించసాగారు ఇళ్ళుగల ఆసాములు. పేరు, ఫోటో, సంతకం మొదలైన వివరాలతో సహా, బాధ్యతగల ప్రభుత్వాధికారుల నుంచీ ధ్రువీకరణ పత్రాలు తెమ్మంటున్నారు. వేల మొత్తంలో అడ్వాన్సులు అడుగుతున్నారు.

ఆఖరికి చెట్టు నీడే ఆశ్రయమైంది రంగదాసుకు. దేవుళ్ళనీ, దగాకోరుల్నీ నమ్మి మోసపోయాడతను. బతుకు దైవాధీనమైపోయింది. అరచేతిలో స్వర్గం చూపించిపోయే నాథులే అందరూ! అద్దె ఇంట్లోకి వెళ్ళలేడు తానూ, సొంత ఇల్లూ కట్టుకోలేడు. దేవుడు చచ్చిపోవటమొక్కటే అతని సమస్యకు పరిష్కారం. ఏనాటికైనా దేవుడు అంతరించకపోతాడా అన్నదే అతని ఆశ. అయితే, దేవాలయానికి వెడుతున్న వాళ్ళను చూసినప్పుడల్లా అతని ఆశ నీరుగారిపోతుంటుంది. ఆ కోపంలో అప్పుడప్పుడూ భక్తాగ్రేసరుల వెంటబడి తరుముతూ ఉంటాడు. అందుకతన్ని పిచ్చివాడన్నారందరూ. మరేమో, వాళ్ళందరికీ దేవుడి పిచ్చి బాగా తలకెక్కిందంటాడు రంగదాసు. ■

# దూద్ బఖ్ష్

● మహమ్మద్ ఖదీర్‌బాబు
● చిత్రాలు: లక్ష్మణ్

గుప్పుమనే మంటతో పొయ్యి వెలిగింది. దొడ్లో వీస్తున్న గాలికి నవక్క బెట్టెలు చిరచిర లాడతా మండుతున్నాయి. ఎండ సెగ ముఖాన తగలతా ఉంటే నజీరత్త వచ్చి పొయ్యి ముందర కూచునింది.

"నువు పోయి లోపల కూచోపో అకా. నేను నీళ్ళు కాగబెడతా" అంది బషీరత్త పొయ్యి మీద ఇత్తడి గంగాళాన్ని పెడతా. నజీరత్త కదల్లా. మోకాళ్ళు ముడుచుకుని మంటతట్టే చూస్తా ఉంది.

"పో అకా" అంది మళ్ళీ. నజీరత్త ఉలకనైనా ఉలకలా. బషీరత్తకు భయమేసింది.

తెల్లారి నుంచి నజీరత్త మాటాపలుకూ లాకుండా అట్నే ఉంది. ఒక ఏడుపు ఏడ్చిందీ లా. ఒకమాట పలికిందీ లా. మూగరాయాల బిగునుకుపోయి కూచోనుంది. ఆమె కరిగి కన్నీళ్ళు బెట్టుకుంటే కడుపు కోత రొంతయినా చల్లారద్ది గదా అని అంతా చూస్తా ఉన్నారు. నజీరత్త కరగట్లా.

"మోవ్! నీకే చెప్పేది" అంది బషీరత్త, అదిలించైనా చూద్దామని. ఆ అదిలింపుకు అదురులో ఉన్న పసిబిడ్డాల ఇంకాస్త ముణగదీసుకుంది నజీరత్త. జబ్బ పట్టుకొని బలవంతంగా లేపబోతుంటే, "రొంతసేపైనా ఈడ కూచోనీమ్మా బషీర్. నా బిడ్డకు ఆఖరుసారి నీళ్ళు కాగబెడతా ఉంటే నన్ను లాకుండా జేస్తావా" అంది ప్రాధేయపడుతూ.

ఆ మాటకు బషీరత్త కడుపులో నుంచి ఏడుపు పొర్లుకొచ్చింది. "నువ్వు ఈ వాటాన ఉంటే ఎట్లా అకా. వాడెట్లా పోయినాడు... నువు కూడా పోయే దానికి రెడీ అయినావా" అని లబలబా నెత్తి కొట్టుకుంటా కింద కూలబడింది. బషీరత్త ఏడుపు విని పెదత్త దొడ్లోకొచ్చింది. పొర్లకింతలు పెడుతున్న బషీరత్తను చూసి, ఆ ఏడుపుకు నజీరత్త ఏమైపోతుందో నన్న గాబరాతో కయ్యిన కసిరింది.

"చాల్లే గాని ఆపు మే. ఏందో సొంత కొడుకు పోయినట్టుగా శోకండాలు పెడుతున్నావే. ఇప్పుడేమైందనీ... వాడి టైమొచ్చిందీ, ఎల్లిపోయినాడు. మనవంతా పోవాల్సినోళ్ళంగామా? లే లే. ఇస్కూల్లో కెళ్ళి నాలుగు రేగాకులు దూసుకొద్దూగానీ. చావు నీళ్ళు బోసే ముందు వేణ్ణీళ్ళలో రేగాకులు కలపాలి గదా" అంది. అన్నాక, బషీరత్తను అణ్ణుంచి అవతలికి పంపి నజీరత్త తట్టు తిరిగింది.

"నువ్వేందిమే ఈడ... ఇట్టా పడున్నావా? పోయి నీ కొడుకు దెగ్గిర కాసేపు కూచోరాదా? కంటి నిండా చూసుకోరాదా? ఇంకాసేపు తాలితే కనపడమన్నా కనపడతాడా వాడు" అని గద్దించింది.

అంతలోనే తోడబుట్టిన దాని దీనావస్థకి తల్లడిల్లతా, "లెయ్యే పిచ్చితల్లీ... లెయ్యమ్మా" అంటూ నజీరత్త ఒడిపట్టి ఇంట్లోకి పిలచకెళ్ళింది.

లోపల నులకమంచం మీద తూరుపు తట్టు తల పెట్టించి పడుకోబెట్టున్నారు షఫీగాడి శవాన్ని. తల పక్కన స్టీలు గ్లాసులో బియ్యం పోసి, అందులో గుప్పెడు సాంబ్రాణి కడ్డీలు గుచ్చున్నారు. ఇల్లంతా గంధపు పొగల వాననతో నిండిపోయి ఉంది.

శవం చుట్టూ పెదత్త, బషీరత్త కూతుళ్ళూ, వాళ్ళ పిలకాయలూ మూగి కూచోనున్నారు. ఇరుగు పొరుగు ఆడోళ్ళలో, దూరపు బంధువుల్లో ఒకరిద్దరూ టీ గ్లాసులని పట్టుకొని తాగకుండా చూస్తా ఉన్నారు.

బయటి మొగోళ్ళు వచ్చినప్పుడల్లా కఫన్ తొలగించి కడ చూపులు చూపిస్తున్న షమీమ్ ఆపా షఫీగాడి మొఖాన్ని చూసే కొద్దీ ఇంకాస్త ఏడస్తానే ఉంది.

"చేతులారా నిన్ను పోంగొట్టుకున్నాం గదరా నాయనా. ఇంకే బరోసాతో బతకబోయేదిరా తండ్రీ" అని తరస్తా ఉంది.

ఆమె వాడి కంటే ముందు నజీరత్తకు పుట్టింది. నజీరత్త తరువాత నజీరత్తయ్యి షఫీగాణ్ణి చిన్నప్పట్నించి సాకి సంతరించింది. చేతుల్లో పెరిగి ఎదిగినోడు కళ్ళ ముందరే కాటికి పోబోతా ఉన్నాడంటే ఆరాయించుకోలాకపోతా ఉంది.

"ఊరుకోమ్మే ఊరుకో. నువ్వే ఇట్టయిపోతే చిన్నదేమైపోవాలా? ధైర్యం పెట్టు. దేవుడి మీద బరోసా పెట్టి ముందా అమ్మిని లేపు" అంది పెదత్త, నల్మా తట్టు చూపిస్తా.

పొద్దుటి నుంచి ఏడ్చీ ఏడ్చీ సోషొచ్చి పడిపోయి ఉంది నల్మా. ఊపిరిపోయే ముందు 'నల్మా... నల్మా' అంటా చెల్లెల్ని కలవరించాడంట షఫీగాడు. ఊపిరి



పోయాక వచ్చిన ఆ అమ్మికి ఆ సంగతి తెలిసి పోయింది. ఇంకంతే. స్పృహ తప్పిపోయింది –

"షఫీ... ఒరే... నీ కడమాటలు వినలేకపోతినే. నేనెంత కర్మురాలినే ఏమి చెప్పాలనుకున్నావో గదారే" అని పలవరింతలు మొదలు పెట్టింది. ఆరు నెలల కిందట పెళ్ళి చేసి పంపిన అన్న అంతలోనే శవమవుతాడని ఆ అమ్మి కలైనా కనుండలేదు. ఏ అచ్చటకైనా, ఏ ముచ్చటకైనా నేనుండానంటా వచ్చే అన్న ఇంక లేడన్నమాట ఆ అమ్మి తలకెక్కడం లేదు. ఒకోసారి ప్రేలాపిస్తా ఉంది ఒకోసారి సొమ్మసిల్లి పడిపోతా ఉంది. ఇదంతా చూస్తే ముసలాయన అలివికాడని, షఫీవాళ్ళ నాయనని ఆయన స్నేహితులు ఇంట్లో ఉంచలేదు. నేరుగా తీసకెళ్ళి టీకొట్టు దెగ్గిర కూచో బెట్టుకున్నారు. ఆ మాటా ఈ మాటా చెప్తా ఆయన్ను మామూలు మనిషిని చేయడానికి అవస్థపడతా ఉన్నారు.

కాసేపటికి రిక్షాలో జనాజా(శవాన్ని మోసుకెళ్ళే బల్ల)ని పెట్టుకొని వచ్చాడు బషీరత్త భర్త. రావడంలోనే దాన్ని కడిగే పనిని బయటున్న పిలకాయలకు ఒప్పజెప్పి నేరుగా ఇంట్లోకి వచ్చాడు.

"మోవ్! టైము మూడవతా ఉంది. అయిదు గంటల నమాజు లోపల శవాన్ని మసీదు కాడికి చేర్చాలి. ఆనేక ఖబరస్తాన్‌కు మోయాలి. ఇప్పట్నించి మొదులుబెడితే కదా. వాడు నీళ్ళకి సిద్ధం చేసినారా" అన్నాడు.

ఆ మాటలకి సన్నగా ఏడుస్తున్నవాళ్ళంతా గొంతు పెంచేసినారు.

"అయ్యో నా బిడ్డా, నీకప్పుడే వేళయిపోయిందా నాయనా" అని అరచేతులు చరస్తా ఏడ్చింది షమీమ్ ఆపా.

పెదత్త లేచి, బషీరత్త భర్తని పక్కకి తీసకెళ్ళింది. "అప్పుడే ఏమి తొందర? కాసేపు తాలరాదా" అంది ఆయనతో.

"దేనికి" అన్నాడాయన.



"జీనత్ రాబళ్ళా? అక్క రాకుండా తమ్ముణ్ణి మట్టైట జేస్తారు" అంది. ఆయన నెత్తి కొట్టుకున్నాడు.

"సరే కానీయండి. నేను పోయి సరిగ్గా తవ్వినారో లేదో చూసుకొని వస్తా" అని వెళ్ళిపోయినాడు. పెదత్త లోపలికొచ్చి కూచునింది.

టైము మూడున్నర, నాలుగయ్యేటప్పటికి దావల సిపోళ్ళంతా వచ్చేశారు. రామాయపట్నం బంధువులు. నెల్లూరు బంధువులు. దావూర్లో ఉండేవాళ్ళు అందరూ కడచూపులకు దిగబడ్డారు. ఇంక జీనత్‌దే ఆలస్యం.

నజీరత్త నడిమి కూతురు జీనత్ షమీమ్ ఆపాకూ, షఫీగాడికీ మధ్యన పుట్టిందది. బెజవాడలో ఇచ్చి వేశారా అమ్మిని. దాని మొగుడు ఎస్ ఫ్యాక్టరీలో పని చేస్తాడు.

పొద్దున తొమ్మిదింటికి షఫీగాడి ప్రాణాలు పోంగానే బెజవాడకు ఫోను చేసి, ఫ్యాక్టరీ వాళ్ళకు చెప్పి, వెంటనే బయలుదేరమని కబురు చేశారు జీనత్‌కు. చార్జీలకు డబ్బులు చూసుకొని ఎంత

> "మోవ్! టైము మూడ వతా ఉంది. అయిదు గంటల నమాజు లోపల శవాన్ని మసీదు కాడికి చేర్చాలి. ఆనేక ఖబరస్తాన్‌కు మోయాలి."

గబుక్కున బయలుదేరినా బెజవాడ నుంచి కావలి రావడానికి అయిదు గంటలు పడుతుంది. ఆ లెక్కన ఇప్పుడో ఇంకాసేపట్లోనో జీనత్ రాబోతా ఉందని అంతా చూస్తా ఉన్నారు.

"సింగరాయకొండ దగ్గిర ట్రాఫిక్ జాము లేదంటలే. వచ్చేస్తది" అంటా వచ్చినాడు బషీరత్త కొడుకు రియాజు. బజారు నుంచి తెచ్చిన పూలబుట్టను కిందకి దించతా.

ఆ బుట్టలో మల్లెపూలు, కారబ్బంతి కలిపి పూలకవన్ ఉంది. జనాజాలోకి ఎక్కించినాక శవం మీద అలంకరించాలి దాన్ని. పెళ్ళి కుదిరితే పూలసెహెరా తొడుక్కోవాల్సిన వయసు షఫీగాడిది. దానికి బదులుగా దీన్ని తొడుక్కోబోతా ఉన్నాడు.

ఆ కవన్‌ని చూసి, దగ్గిరపడుతున్న టైమును చూసి, వచ్చిన ఏడుపు దిగమింగుకుంటా, "ఎందుకైనా మంచిది. ఎవరో ఒకరు బస్టాండ్‌కాడికి పోయిరా పోండ్రా" అంది పెదత్త, జీనత్ కోసం చూసిరావడాని కని. ఆమె ఆ మాట అంటుండగానే వాకిట్లో రిక్షా ఆగింది.

"అదిగో వచ్చింది" అన్నారెవరో.

జీనత్‌ని చూడగానే ఆడోళ్ళంతా గొల్లున ఏడుపందుకున్నారు. చెల్లెల్ని కావలించుకుందామని షమీమ్ ఆపా లేచి నిలబడింది. "హాయ్ జీనత్. చూద్దాగాని రామ్మా... నీ తమ్ముడు ఎంత పని చేశాడో చూద్దాగానీ రా" అని ఎదురుపోయింది బషీరత్త.

దారిపొడుగునా ఎంత ఏడ్చుకుందో, ఎన్నిమార్లు గుండెలు బాదుకుందో గానీ తమ్ముడి శవాన్ని చూడ గానే పనిపిల్లాల కిందబడి గిలగిలమని తన్నుకుంది జీనత్. గాజులు పగిలేలా తలబాదుకుంటా "ఎంత పని చేశావురా షఫీ" అని అల్లల్లాడిపోయింది.

కాసేపటికి స్తిమితపడి, "అసలెట్టా జరిగింది" అంది కళ్ళు తుడుచుకుంటా.

"టీబీ అంటమ్మా. ఆ నా కొడుకు ఎవరితో చెప్పకోలా. ఎవరికీ తెలీనీలా" అంది పెదత్త.

"ఏందో ఊకినెస్ వల్ల పొద్దస్తమానం దగ్గతా ఉన్నాళ్ళే అని మీ అమ్మ తాత్సారం చేసిందిగాని ఇంత పని జరగద్దనుకోలా తల్లీ" అంది బషీరత్త.

ఆ మాటలు వినగానే జీనత్ ముఖం కమిషి మంటగా మారింది. "ఈ నజీరమ్మ బుద్ధి నాశినంగాను. ఈ మహాతల్లిని మట్టిలో పెట్టి కప్పెట్ట. దీపలకొచ్చే రోగాలని మందులు తినిపించో, మంచి చోట చూపించో నయం చేయించుకునే రాత ఈ తల్లికి ఆ దేవుడు రాయలేదు కదా. తెచ్చింది కడుపుకు మెక్కితే సరిపోతుందా? డాక్టర్లకు పెట్టబళ్ళా? ఆస్పత్రులకు తిప్పబళ్ళా? ఆ ఆకూ ఈ ఆకూ నమిలిచ్చి, కంపోడర్లు రానిచ్చే మాత్రలు మింగిచ్చి పోయే ప్రాణాలని నిలబెట్టెయ్యాలనుకుంటే సాధ్యమా? అట్టా చెయ్యాలని చూసే ఈ మనిషికి పుట్టగతులుంటాయా" అని శాపనార్థాలు మొదలు పెట్టింది.

"అట్టా మాట్లాడబాకు మే జీనత్. రోగం బయటపడేటప్పటికే కత చేయి దాటిపోయింది. అప్పటికే చేయాల్సిందంతా చేశాం... దారబోయా ల్సిందంతా దారబోశాం. పాపం మీ అమ్మ... కంటికి రెప్పాల నీ తమ్ముణ్ణి చూసుకొనింది. రోగం కత ముందే తెలిసుంటే ప్రాణాలు అట్టమేసుండేది కదా" అంది పెదత్త. జీనత్ తలదిప్పి నజీరత్త తట్టు చూసింది. కూతురికి మొకం చూపించలాక తలదించేసుకుందామె.

"ఏందీ... ఈ మనిషా? మా అమ్మ సంగతి నాకు చెపబాకండి. మా ఇంట్లో పుల్లు మందుచీటీని ఏనాడు తేనిచ్చిందని? పది రూపాయలకు ఎన్నొస్తే అన్నేనే. బెస్టులు బుస్టులు చేయించి చస్తే గదా" అంది జీనత్.

"బెస్టులంటే తేరకున్నాయంటమ్మే. వేలకు వేలు లాగతా ఉన్నారు. వాటికి మోటుకోవడం మనబోటోళ్ళకు అయ్యేపనేనా" అంది పెదత్త.

"అయితే మటుకు... ఈ నజీరక్కది మరీ లోద్యం లేమ్మా. జబ్బు ముదిరినాక కూడా వాణ్ణి పట్టించుకుంటే గదా... వాడి ఒళ్ళును వాణ్ణే చూసుకోనిస్తే కదా. ఇంటికి రావడమే ఆలస్యం. దానిక్కావాలి, దీనిక్కావాలి అని జేబులు పెరుక్కునేదే పనాయే. వాడు ఇల్లు చూసుకుం టాడా? మందు చూసుకుంటాడా" అంది బషీరత్త.

నజీరమ్మకు చెప్పలేదు కానీ నాకు నెల కిందే పక్కాగా తెలిసిపోయింది వాడికి టీబీ ఉందని. అప్పటికీ జెప్పా... రే షఫీ, ఎవురికీ చెప్పాల్సిన పన్లా. నేరుగా పోయి మదనపల్లిలో చేరిపో చేర్చేసుకుంటారు. రెండు నెల్లు ఉన్నావంటే రోగం దారికొచ్చేస్తది. డబ్బులు ఎట్టోకట్ట చేద్దాం అని. వాడు వింటేగా. ఇంటి దెగ్గిర కష్టం లేరా అని మానేసినాడు" అన్నాడు రియాజు.

"మదనపల్లి దాకా ఎందుకురా నాయనా. ఇట్టాంటి రోగానికి ఇంటికాడ కూచుంటే చాలదా. యాడా... ఈ మనిషి కూచోనిస్తే కదా. పనికి నాగా పెట్టి వాడు ఏ రోజు పొణుకున్నా ఎంటబడి ప్రాణాలు తీసినే. అంతెందుకా? జబ్బు ముదిరి ఈడిట్టా ఉంటే మందులా మాకులా అవతల పారేసి కనుమూరు దర్గాకి తీసక పోయిందంటే ఇంకేమి చెప్పేది? అక్కడ మూడు నిద్దర్లు చేసొచ్చినాక పూర్తిగా అడ్డం పడిపోయినాడు. పైకి లేవకుండా అట్టే పోయినాడు" అంది బషీరత్త.

"అదీ సంగతి. నాకు తెలుసు. మా అమ్మ గుండెలు తీసిన బంటు. రోగాన ఉన్నోణ్ణి నీడ పట్టున ఉంచక నెమ్మ రోజుల్లో కనుమూర్లకీ, రహమతాబాద్లకీ తిప్పుంటుంది. దెబ్బకు అయిపోయినాడు. లాకుంటే నాల్రోజులు బతికేవాడే" అని ఏడ్చింది జీనత్.

ఇందరు ఇన్ని మాటలు అంటా ఉన్నా నోరు తెరచి ఒక్కమాట కూడా బదులు చెప్పలేదు నజీరత్త. తలదించుకునే కూచునింది. ఇంతలో బషీరత్త భర్త

మల్లా వచ్చినాడు. ఈసారి ఆయనతోపాటు నలుగురు మసీదు మనుషులు ఉన్నారు.

"రెడీ అయింది. నీళ్ళు పొయ్యాలి మే" అన్నాడు. ఆడోళ్ళంతా గబగబా లేచి పక్కకు జరిగారు. వచ్చిన నలుగురు మనుషుల్లో అటిద్దరు, ఇటిద్దరు చేరి శవాన్ని దొడ్లోని చెక్కబల్ల మీద పొణుకోబెట్టారు. నీళ్ళు పొయ్యడాన్ని ఆడోళ్ళు చూడకుండా ఉండేందుకు దుప్పట్లని అడ్డం కట్టారు.

ఇదంతా చూసి షమీమ్ ఆపా, జీనత్‌లు శోకండాలు తీస్తుంటే నజీరత్త వడివడిగా బషీరత్త భర్తకాడికి వచ్చింది.

"ఏంది" అన్నాడాయన నజీరత్తను చూసి.

నజీరత్త భయపడతా భయపడతా చెప్పింది.

"వాడికి మసలే మసలే నీళ్ళుబోసుకునే అలవాటు లేదు నాయనా. కాస్త గోరువెచ్చటి నీళ్ళు బోయండి" అంది వేడుకుంటున్నట్టుగా..

బషీరత్త భర్త కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"అట్నే" అన్నాడు.

రేగాకులు కలిపిన వేడినీళ్ళతో రివాజు ప్రకారం స్నానం చేయిస్తున్నారు షఫీగాడికి. కొయ్యబల్ల మీద ఎండుకుపోయిన వాడి ఒంటిని చూస్తుంటే అక్కడున్నోళ్ళెవరికీ ఏడుపు ఆగడంలా. చెంబుతో నీళ్ళు కుమ్మరించినప్పుడల్లా ఛాతీ మీద కదులుతున్న తావీజులాగా వాడు కూడా లేచి కూచుంటే బాగుండనిపిస్తోంది వాణ్ణి చూస్తోంటే.

"వీళ్ళ నాయన్ని పిలవండి. ఆయనొచ్చి చెంబెడు నీళ్ళు పోయాలి" అన్నాడు బషీరత్త భర్త.

అప్పటికే నజీరత్త భర్త పిచ్చోడాల ఈదంతా కలతిరుగుతున్నాడు. "ఈ" అని పళ్ళు బిగబట్టి పిచ్చి ఏడుపు ఏడుస్తున్నాడు. నీళ్ళు బోయడానికి 'రాను' అన్నట్టుగా ఆయన చేతులు అడ్డంగా ఊపుతుంటే, రియాజు వెళ్ళి నడుము మీద చెయ్యేసి పట్టుకొని దొడ్లోకి తీసుకొచ్చాడు. నీళ్ళు ముంచిచ్చిన చెంబును పట్టుకొని, ముందుకొచ్చి, షఫీగాడి శవాన్ని చూడగానే రాప్పున కిందకొదిలేసి, 'రే షఫీ... ఎట్టరా మేం బతకబోయేది' అని కూలబడిపోయాడాయన. వెంటనే బయటికి తీసుకచ్చేసినా నంబాళించుకోవడం ఆయన వల్ల కావడంలా. శరీరం వణికిపోతా ఉంది.



ఒకప్పుడు ఈ పక్క కుటుంబాల్లో గానీ, ఆ పక్క కుటుంబాల్లో గానీ అందరికంటే దయిర్యస్తుడిగా ఉండి, ఎవరికి ఏ కష్టం వచ్చినా నేనున్నానని ఆదుకున్న మనిషాయన. అందరి ఆస్తులు కరిగిపోయినాక కూడా ఆయన చేతిలో అయిదెకరాల భూమి ఉండేది. పడకండపాడు నుంచి కావలికి కాపరం మార్చినా యవసాయం ఒదులుకోకుండా మహారాజల్లే బతకతా ఉండేవాడు.

ఒక తడవ ఏం కరువొచ్చిందో ఏమోగానీ ఆయనేసిన పొగాకు సరిగా పండలా. ఆకు ఎదగలా. మోచెయ్యంత పొడుగుండే కాడే చివరకి దక్కింది. దాన్ని బోర్డు కొనలా. ఒక్క యాపారస్థుడూ వానన చూళ్ళా. ఆడ పడింది దెబ్బ. ఇంకాణ్ణుంచీ తేరుకోలేక పోయినాడు. యవసాయంలో అప్పులకి, షమీమ్, జీనత్‌ల పెళ్ళిళ్ళకి పొలం ఖర్చయిపోయి షఫీగాడు ఎదిగొచ్చేటప్పటికి పూర్తిగా దివాలా తీశాడు. ఒంట్లో సత్తవ లేని, ఇంకో పని చేతగాని ఆ మనిషిని చూసి పద్నాలుగేళ్ళకే పనిలో పడ్డాడు షఫీగాడు.

అప్పట్నించి కుటుంబానికి వాడే పెద్ద దిక్కు.

వాడు తెస్తేనే తినడం, లాకుంటే గమ్మున పొణుకోవడం. అట్టా గమ్మున పడుకోబెట్టలాక చిన్నోడైనా పెద్ద పనులెన్నో నేర్చినాడు షఫీగాడు. చెప్పుల షాపులో గుమాస్తాగా చేరి, అందులో మెలకువలన్నీ నేర్చుకొని, వచ్చే ఆదాయం చూసి ఉద్యోగం మానేసినాడు. ఇరవై వేల చీటీ పాడి, బెజవాడ నుంచి స్టాకు తెచ్చి పల్లెలకి వేయడం మొదలు పెట్టినాడు. అందులో ఆదాయం కనిపించాక ఊర్లు తిరగడం ఎక్కువ చేసినాడు. అట్టా తిరిగీ తిరిగీ కావలి చుట్టుపక్కల ఊళ్ళలో 'చెప్పుల షఫీ'గా పేరు తెచ్చుకున్నాడు గానీ దానితోపాటు టీబీని కూడా తెచ్చుకున్నాడు.

అయితే, బయటికి చెప్పలా. కూడబెట్టిన నాలుగు డబ్బులతో పని మానేసి కొన్నాళ్ళలో కుదురుకుందామనుకున్నాడు గానీ ఇంతలో నల్మా పెళ్ళి కుదిరింది.

"నాయన్నాయనా, పిల్ల పెళ్ళి కాస్త జరిపిస్తే" అంటా వాడి వెంట పడింది నజీరత్త.

మంచి సంబంధం. వాయిదా వేయలేని బాధ్యత. రంగంలోకి దూకినాడు షఫీ. కట్నం కోసం, కానుకల కోసం అడదెచ్చి, ఈడదెచ్చి, పల్లెల నుంచి వసూళ్ళు చేసి, యాభైవేల చీటీ పాడి ఆ పని కూడా పూర్తి చేశాడు. పెళ్ళయితే జరిగిపోయింది గానీ, ఆ గొడవలో వాడి ఒళ్ళు పూర్తిగా దెబ్బతినిపోయింది. ఒక తట్టు ఇంటి జరుగుబాటుకీ, మరో తట్టు పెళ్ళి అప్పులకీ ఇంకా తిరుగుళ్ళు పెంచినాడు. ఒకోసారి తిరగలాక, జ్వరం కాసి ఎప్పుడైనా పనికి పోకుండా పొణుకుంటే వాడి వెంటబడి నజీరత్త తరమతా ఉండేది.

"ఆ అప్పులు కాస్తా తీరిపోనీ నాయనా, మళ్ళా నువ్వు హాయిగా నిద్రపోదూ గానీ" అని బతిమిలాడేది.

ఆమె కోరుకున్నట్టే ఆ అప్పులు తీరిపోయినాయి. వాడు హాయిగా పడి నిద్రపోయినాడు, మళ్ళా లేపకుండా.

దాపు నీళ్ళు పోయడం పూర్తయింది. శవాన్ని లోపలికి తీసుకొచ్చి తెల్లటి చాపమీద పడుకోబెట్టారు.

జనాజాలోకి ఎక్కించే ముందు కళ్ళకు సుర్మా రాసి, పక్కలో కర్పూరం పోడి చుట్టి, పైన అత్తరు పూసి, గులాబ్ నీళ్ళు చల్లి ముస్తాబు చేస్తుంటే ఏడుపు మొదలెట్టారు ఆడోళ్ళంతా.

"పెళ్ళికొడుకాల తయారవతా ఉన్నావా నాయనా. ఖబరస్తాన్ పోబోతా ఉన్నావా తండ్రీ." పెదత్త ఏడస్తా ఉంటే అందరి ఏడుపూ కలగలిసింది.

ఆ గోలకి తాళలేక 'ఆపండి మే' అని గావుకేక వేసి అందర్నీ కంట్రోలు చేసినాడు బషీరత్త భర్త.

"ఇప్పుడేడిస్తే వచ్చేదుందా? లేచేదుందా? జరగండట్టా" అని నజీరత్తని దగ్గరకి పిలిచినాడు.

ఆమె కదలకపోయేసరికి లాక్కొనొచ్చి శవం కాడ నిలబెట్టినాడు.

'కానీమ్మా' అన్నాడు ఒక మసీదు మనిషి.

నజీరత్త ఎతిమతంగా చూసింది అర్థంగాక.

"అట్టా చూస్తావేందమ్మా. గబాల్నగానీ. నీ బిడ్డకి పాలబిక్ష పెట్టాలి గదా" అన్నాడు.

ఆ మాట వినేసరికి, ఆమె చేయాల్సిన పని గుర్తొచ్చేసరికి- అప్పుడు ఏడ్చింది నజీరత్త. ఒళ్ళంతా నీలుక్కుపోతా ఉంటే, పిట్టంత మనిషి నిలువెల్లా వణకిపోతా వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ ఏడుపులోనే తల అడ్డంగా ఊపతా, "పెట్టలేను నాయనా పెట్టలేను" అంది.

అందరూ బిత్తరపోయారు. ఏడుపు ఆపేసి నజీరత్త తట్టు వెర్రిగా చూశారు.

"సాల్లేగానీ ఆపు మే. పాలబిక్ష పెట్టనంటే ఎట్టా కుదరద్దీ? తొరగా పెట్టు. అవతల టయిమవతా ఉంది" అంది పెదత్త.

"నువ్వు పెట్టకుంటే నీ కొడుక్కి పైలోకంలో మోక్షం లేదే ముండదానా!" బషీరత్త తిట్టింది.

"కానీ మా. ఈ టైములో హఠం చేస్తారా ఎవురైనా" అంది షమీమ్ ఆపా, నజీరత్తని సముదాయిస్తా.

అందరి మాటలకీ తల అడ్డంగా ఊపుతుందే గానీ నజీరత్త కదలడంలా. ఆమె వాటం చూసి అందరూ చేష్టలు మాని నిలబడిపోయారు.

ఎందుకనంటే, ఆమె పాలబిక్ష పెట్టకుంటే శవాన్ని ఎత్తేదానికి లా, మట్టి చేసేదానికి లా.

తొంభై తొమ్మిది రక్తపుచుక్కలు కలిస్తే ఒక పాల చుక్క అవద్దనీ, అట్టాంటి పాలచుక్కలెన్నిట్నో కుడిపి బిడ్డల్ని పెద్ద చేస్తుంది గనక ఆ తల్లి రుణం ఆ బిడ్డ ఎన్నటికీ తీర్చుకోలేడని చెప్పే ధర్మంలో షఫీగాడు పుట్టాడు. అందుకని వాడు నజీరత్తకి రుణపడి ఉన్నాడు. సచ్చినా, బతికినా ఆ రుణం నుంచి బయట పడడం వాడి చేతుల్లో లేదు. నజీరత్త చేతుల్లో ఉంది. ఆమె పెట్టబోయే దూద్‌బఖష్‌లో ఉంది.

> అందరి మాటలకీ తల అడ్డంగా ఊపుతుందే గానీ నజీరత్త కదలడంలా. ఆమె పాల భిక్ష పెట్టకుంటే శవాన్ని ఎత్తేదానికి లా.

ఆమెకై ఆమె ముందుకొచ్చి, "నాయనా! నేను నీకు పాలు కుడిపే పెద్దవాణ్ణి చేశాను. నువు నా పాలు తాగి రుణపడి ఉన్నావు. నా దర్మాన నేను పోకముందరే నీ కర్మాన నువు పోయినావు గనక, ఇదిగో ఈ నలుగురు మనుషుల ఎదట, నేను నా మనను నిండుగా నీకు పాలబిక్ష పెడతా ఉన్నా. నా పాలు తాగిన రుణం ఇయ్యాలితో చెల్లిపోతా ఉంది" అని చెప్పాలి. అలా చెబితేనే వాడికి పై లోకాల్లో ముక్తి, శాంతి.

బతికుండగా కొట్టినా, తిట్టినా, కూడు పెట్టకుండా మలమలమని మాడ్చినా, ప్రాణాలు పోయిన కొడుకును చూసి ఏ తల్లయినా పాలబిక్ష పెట్టేస్తుంది, పెట్టెయ్యాలి కూడా. అందరికీ అలా పెట్టెయ్యడమే తెలుసు. నజీరత్తలాగా అడ్డం తిరుక్కున్నోళ్ళని ఎవురూ చూళ్ళా. అందుకని ఎవరికీ ఏమీ పాలుబోవట్లా.

కొడుకు శవాన్ని పట్టుకొని తడిమి తడిమి ఏడుస్తున్న నజీరత్తని అందరూ బతిమాలగలుగుతున్నారే గానీ, ఎవరూ బెదిరించలేకపోతా ఉన్నారు.

"ఏమ్మే, ఇంకనైనా వింటావా వినవా" అని చూసింది పెదత్త.

ఇంక లాభం లేదనుకుని, "రే అబయా. పోయి వాళ్ళాయన్ని పిలచకరా పో. ఆ మనిషి మాట తప్పితే ఇంకెవురి మాటా వినదిది" అందామె రియాజుతో.

అప్పటికే ఆ సంగతి బయటికి తెలిసినట్టుంది. నజీరత్త భర్తే లోపలికొచ్చేశాడు. ఆయన్ని చూడ్డంతోటే గబాల్న వచ్చి వాటేసుకుంది నజీరత్త.

"చూడయా. నేను అన్యాయమైపోయానయా. దిక్కులేని దాన్నయిపోయానయా. చేతులారా నా బిడ్డను చంపుకున్నానయా" అంటా విలవిలలాడింది.

ఆమె ఏడుపు చూసి ఆయన కూడా ఏడ్చేసినాడు.

"ఊరుకోమ్మే ఊరుకో. ముందే తెలిస్తే ఇట్టా జరగనిచ్చుండేవాళ్ళమా. ఇప్పుడనుకొని ఏమి లాబం. జరగాల్సిన పని చూడు. మన బిడ్డకి పాలబిక్ష పెట్టెయ్" అన్నాడు మూసుకుపోయిన గొంతుతో.

నజీరత్త ఆయన చొక్కాని ఆసరాగా పట్టుకుంటా, "నేను చేయలేనయా. నన్ను మన్నించయా" అని ఏడ్చింది.

"ఎందుకని మే" అన్నాడాయన అనునయిస్తా.

"నాకు తెలుసయా. నా బిడ్డకి టీబీ ఉందని ముందే తెలుసు. ఏం చేసేది చెప్పు. ఒళ్ళు బాగాలేదు మా. మదనపల్లికి పోయి రెండు నెలలు ఉండేసొస్తాను మా అని నా బిడ్డ బతిమిలాడుకుంటే, నువు లాకుంటే ఇల్లు నడవదు నాయనా, అప్పులోళ్ళు మమ్మల్ని బతకనీయరు నాయనా అని కాళ్ళు కట్టేసిన పాపిష్టి దాన్ని. ఇయ్యాల ఈళ్ళు ఇన్నేసి మాటలు అంటుండారే ఒక్కరైనా నా కూతురి పెళ్ళికి సాయం చేసినారా?' రే షఫీ ఇదుంచు' అని నయాపైసైనా వాడి చేతిలో పెట్టినారా? వాడు లాకుంటే నిన్నూ, నన్నూ తీసకెళ్ళి రెండు దినాలు ఇంట్లో పెట్టుకొని తిండి పెట్టే గతి ఈళ్ళలో ఎవురికైనా ఉందా? మందుకు గతిలాక, ఆపరేషన్‌లకు డబ్బులాక కడకు ఆ దేవుడే దిక్కు అని దర్గాల మీద భారం వేశాను గానీ నా బిడ్డను చంపుకునేదానికి కాదయా. పదారేళ్ళ పిల్లోడప్పటి కాణ్ణుంచి వాడి రెక్కల కష్టం తిని, వాడి రక్తం తాగి, వాడి ఎముకలు జుర్రి, వాడి ప్రాణాలనే కాజేసిన నేను వాడి కడుపున వెయ్యి సార్లు పుట్టినా తీర్చుకోలేనంత రుణపడిపోయి ఉంటే, వాడు నాకు రుణపడి ఉండటం ఏందయా. ఇదేమి లెక్కయా" అని నజీరత్త కన్నీళ్ళలో తడిసిపోతా ఉంటే ఆ దుఃఖం తీరేదెట్టా? శవం కదిలేదెట్టా? ■

● సతీష్ చందర్
● చిత్రాలు: నర్సిం

నా చావుకు నేనే ముహూర్తం నిర్ణయించుకున్నాను. అది ఈరోజే.

మిట్టమధ్యాహ్నం పన్నెండు గంటలు.

మండుటెండలో గడ్డపార నిలువునా దిగవేస్తే, దాని నీడ తగ్గుతూ, తగ్గుతూ వచ్చి మాయమవుతుంది. సరిగ్గా అప్పుడే సూర్యుడు నడినెత్తికొస్తాడు.

అదే ముహూర్తానికి నా కథ సుఖాంతంగా ముగుస్తుంది. ముగింపు విషాదం కాదు. ప్రయాణం సగంలో ఆగిపోవడమే అసలు నరకం.

నాకిప్పుడు మరణమంటే లోయలోకి దూకటం కాదు, పర్వతాన్ని అధిరోహించటం.

*    *    *

రాజు మరణించి నేటికి మూడవరోజు. రాజు నా కుక్క పేరు. గమ్మత్తు చూశారా! నా పేరు కూడా రాజే.

నా పేరే కుక్కకు కూడా పెట్టింది అమ్మ. నామీద కోపంతో కాదు, నా కుక్క మీద ప్రేమతో.

రాజు మేలుజాతి జాగిలం కాదు. కనీసం ఊరకుక్క కూడా కాదు. ఊరు వెలుపలి కుక్క. కడజాతి కుక్క!

రాత్రికి రంగు లేనట్టే, నా రాజుకి కూడా రంగు లేదు. లోకం దృష్టిలో అదొక డర్టీ బ్లాక్ డాగ్! నాకూ, నా తల్లికీ నల్లబంగారం.

నిన్న కాక మొన్న, రాజు పట్టపగలు చనిపోయింది. అదికూడా పన్నెండు గంటలకే. చక్రవర్తులకు కూడా ఆ చావు రాదు. విజయాన్నీ, వీరస్వర్గాన్నీ ఒకేసారి పొందగలిగింది నా రాజు.

రాజు అంతిమయాత్రను ఘనంగా చేయించాను. టాపులేని జీపులో, పేట పేటంతా ఊరేగించాను. నా మిత్రులందరూ తెల్లని దుస్తుల్లో సైనికుల్లా నడిచారు. అంతటా నిశ్శబ్దం!

నిశ్శబ్దం ఎప్పుడూ విషాద సూచిక కాదు. పంట కాలువ ప్రవాహం నిశ్శబ్దం. మదర్ థెరెసా చిరునవ్వు నిశ్శబ్దం. అంతెందుకు, పల్లెల్లో తెల్లవారటం కూడా నిశ్శబ్దమే.

రాజు శవపేటికను సమాధిలో ఉంచేటప్పుడు మాత్రం నిశ్శబ్దాన్ని భంగపరచాను. నాన్న పిస్తోలు తీసి మూడుసార్లు గాలిలోకి పేల్చాను. ఎందుకలా చేశానో నాకే తెలియదు. ఆరోజు నేను స్వేచ్ఛను కొత్తగా అనుభవించాను. ఎన్నో ఏళ్ళు బందీగా ఉన్న బానిసకు సంకెళ్ళు తెగిపోతే ఇలాగే ప్రవర్తిస్తాడన్న హామీ లేదు. అతడు ఏమైనా చెయ్యవచ్చు. లేడిలా పరుగెత్తవచ్చు. లేదా బోరున ఏడ్వనూవచ్చు.

నేను కాల్పులు జరిపాను. బహుశా తుపాకీ ఏడ్చినప్పుడు తూటాలే కన్నీళ్ళు కావచ్చు. నేను గర్వంగా ఏడ్చాను కదా! కన్నీళ్ళు నేలమీద పడకుండా నింగికి ఎగరటమే ధర్మం.

నల్లని రాజుకు తెల్లని సమాధి. దానిమీద రెండే రెండు పదాల 'ఎపిటాఫ్':

గాయమే హృదయం.

అవును. ఒక నిరాడంబర వాక్యం. 'ఐ లవ్యూ' అన్నంత సర్వసాధారణ వాక్యం. తొలిసారిగా అన్నవాళ్ళకి మాత్రమే అందులోని నొప్పి తెలుస్తుంది.

నా జీవితానికి కూడా ఇదే వాక్యాన్ని 'మలి పలుకు'గా చెక్కించి పెట్టుకున్నాను.

*    *    *

అర ఎకరం పొలం పక్కనే చిన్న చెరువు. ఆ చెరువు గట్టుమీదనే నా రాజు సమాధి.

నా ప్రేమ వికసించిన చోటనే నా రాజుకి సమాధి.

నాదేవి... కాదు, కాదు. రాజరాజేశ్వరీ దేవిగారు నాకోసం భువినుంచి దివికి వచ్చింది ఇక్కడికే.

చెరువులోని కలువ మొగ్గల్ని చూసి, "ఏయ్! ఎన్ని మొగ్గలో" అంటూ నవ్వింది. కానీ, అప్పుడామె బుగ్గమీద పడింది ఒకే ఒక గుంట. అదే లోయ.

నా జీవిత వేదిక మీదికి నేను తొలిసారిగా ఆహ్వానించిన ముఖ్య అతిథి రాజరాజేశ్వరీ దేవి. ఆరోజు ఆమె నాతో ఉన్నది అర్ధగంట మాత్రమే. కానీ, ఆమె అప్పుడేమేమి చేసిందో, ప్రతిక్షణాన్ని ఒక అధ్యాయంగా మలిచి ఒక మహాగ్రంథాన్ని రచించగలను.

ఆమె మోనుకొచ్చిన సాయంకాలపు వెండి ఎండనుంచి, ఆమెగారికి పూసి వెళ్ళిన సన్నజాజి పరిమళం వరకూ అన్నీ తాజాగా నా వద్దనే ఉన్నాయి.

నా హృదయేశ్వరి నాదగ్గరకొచ్చిన రోజున నా మిత్రులెవ్వరూ దగ్గర లేరు. నేనే రాకూడదన్నాను. నేను కాకుండా ఈ అపూర్వ సన్నివేశంలోకి



ఇద్దరే ఇద్దరు ప్రవేశించారు. ఒకరు: నా తల్లి. మరొకరు: నా రాజు. నా తల్లి స్వాగతం పలికితే, నా రాజు తోక్కూని వచ్చాడు.

నన్ను చల్లగా చూసేవాళ్ళెవరైనా నా తల్లికి ఆప్త బంధువులే. దేవి గురించి కూడా అలాగే చెప్పాను.

"నా బిడ్డ చెప్పాడు తల్లీ. నీ మనసు వెన్నపూస లేమ్మా!"

దేవి నుదుటి మీద పోసిన చిరు చెమట్లను తన మెత్తటి చెంగుతో తుడిచి ఆహ్వానం పలికింది. ఈ భూప్రపంచంలోనే అంతకు మించిన మనస్సాగరాన్ని నేను ఊహించలేను.

అప్పటికే నా రాజు చెవులు రిక్కించి, ముందు కాళ్ళు పైకెత్తి నా దేవికి అభివాదం చేసి ఆమె చుట్టూ తిరిగింది. దేవి పాదాలను వాసన చూసింది.

ప్రపంచాన్ని అర్థం చేసుకోవటంలో నాకూ, నా తల్లికీ, నా రాజుకీ- ఎవరి పద్ధతులు వారికున్నాయి. నేను చూసి నమ్ముతాను. అమ్మ చూడక నమ్ముతుంది. రాజు వాసన చూసి నమ్ముతుంది.

నా రాజు కూడా నమ్మి తోకాడించింది.

"ఒరేయ్ రాజూ! బడాయి చాలుగాని, అమ్మాయిని చెరువు గట్టుకి తీసుకెళ్ళు నా బిడ్డ చూస్తుంటాడు." నా తల్లి నా రాజుని ఆదేశించింది.

పొలం గట్టును పావుగంటసేపు జాతీయం చేసింది నా రాజు.

ఎవరూ దేవికి ఎదురు రావటానికి వీల్లేదు. పక్కన నడవటానికి వీల్లేదు. రాజు పైలట్‌లా ముందు పరుగెత్తింది. నడిచేటప్పుడు ఆమె పాదాలకు అడ్డు పడకుండా, చిన్న కాగితం ముక్క కూడా లేకుండా నోటితో, కాళ్ళతో శుభ్రపరిచింది నా రాజు.

మంచుతో చీర నేస్తారా? ఎవరో అంతపనీ చేశారు. ఆ చీరతోనే వచ్చింది నా సాయంకాలపు సుందరి రాజరాజేశ్వరీ దేవి.

ఆ పూట రాజేశ్వరీ దేవి నా తల్లిని పొగిడింది. నా రాజును కీర్తించింది. మరి నన్నూ! తెలియదు. అడగాలనుకున్నాను.

చిరుగాలినీ, చిన్నదాని ప్రశంసనీ అడిగి తీసుకోకూడదు. పోయి చిగలదు. అందుకే ఆమెవైపే చూశాను. బుగ్గమీది లోయ చెక్కు చెదరకుండా ఉంది. అంటే, ఆమె ఇంకా నవ్వుతూనే ఉన్నట్టు లెక్క.

ముంచుకొచ్చిన సిగ్గు ఆమె చూపును కలువ మొగ్గల వైపు మళ్ళించింది.

"బాగున్నాయి" అని కినుకప్పుమంది.

"అంటే ఎలా ఉన్నాయి! జోడించిన చేతుల్లా లేవూ! అన్నీ అభివాదాలూ దేవిగారికే" అన్నాను.

ఈసారి గలగలా నవ్వింది.

"ఒక మొగ్గ కోసి తేనా?" దిగబోయాను.

"దిగకండి. మురికినీళ్ళు" వారించటానికి నన్ను చెయ్యి పట్టుకుని తనవైపు లాక్కుంది.

తన ప్రశంసను నా పెదవుల మీద, తన పెదవులతో లిఖితపూర్వకంగా రాసి ఇచ్చింది.

తొలి ముద్దూ, మలి పొద్దూ ఒకేసారి విడిచాయి.




ఆమె నన్ను చేరటానికి ఇంకా ఆమడ దూరం ఉందనగానే నా రాజు కుక్కలా, కాదు లేడిపిల్లలా గెంతింది. నావైపూ, ఆమెవైపూ మార్చి మార్చి క్రికెట్ పరుగులు తీసింది. నా దేవి రాకతో నా ముఖంలో వచ్చిన స్వచ్ఛమైన వెలుగును గుర్తించి నాట్యమాడింది, మూలిగింది.

దాని భాష నాకు తెలును. దానిదొకరకమైన మార్మిక కవిత్వం. నా కళ్ళు చెమర్చాయి. దాని రెండు చెవుల మధ్యా నిమిరాను. అంతే, మరుక్షణం అక్కడ ఉంటే ఒట్టు. ఒక్కటే పరుగు. ఎందుకో తెలుసా? వెంటనే అందించాలి. వార్త! గొప్ప వార్త. మనిషి ప్రకాశించటం నా రాజుకి గొప్ప వార్త.

ఆప్యాయత విరజిమ్మినప్పుడే మనిషి ప్రకాశిస్తాడు. అనుమానం లేదు. నా దేవిని చూసిన వెంటనే నేను ఎంతో కొంత ప్రకాశించే ఉంటాను. ఆ విషయాన్ని నా తల్లితో చెప్పాలి. అందుకే దాని స్పీడు.

దూరంగా నా రాజు మా ఇద్దరి కోసం ఎదురు చూస్తున్నది. ఆ రోజు దేవినీ, వెలుతురునీ ఒకేసారి సాగనంపాను.

అభం శుభం తెలీని అమ్మ నాకు బువ్వ మాత్రమే పెట్టి నిద్రపోయింది. ఆ పిల్ల ఎందుకొచ్చిందని ఒక్క ముక్కా అడగలేదు.

* * *

నా దేవి వచ్చివెళ్ళాక నాకు రాత్రి పగలయింది, పగలు రాత్రయింది. వరండాలో మడత మంచం మీద నడుం వాలిస్తే స్వర్గం దిగి వచ్చేది. మంచం కింద ముడుచుకుని నా రాజు.

స్వప్నాలు. అందమైన స్వప్నాలు. నాకు ఇష్టం వచ్చిన స్వప్నాలు. నా అదీనంలో ఉండే స్వప్నాలు. తెరచిన కళ్ళకు అలాంటి స్వప్నాలే వస్తాయి.

నాకు మౌనం ఎంత ఇష్టమో, నా రాజుకు మొరగటం అంత ఇష్టం. ఆకు కదిలితే చాలు, అదే పెద్ద వంక. ఆరా తీస్తున్నట్టు మొరుగుతుంది.



పొరపాటున వేరే కుక్క ఎప్పుడయినా మొరిగినట్టు అనిపించిందో రాజును పట్టుకోలేం. పరమ వీరోచితంగా మొరుగుతుంది.

అమ్మ మధ్య మధ్యలో లేచి, "ఏమయ్యిందిరా దానికి! నోరు ముయ్యమను" అని కేకలు పెట్టేది.

అమ్మ మాటకు అది కుయ్ కుయ్‌మని గారాలు పోతూ, అమ్మ అలికిన అరుగును గోళ్ళతో గీస్తుండేది.

ఏ మాట కామాటే చెప్పాలి. రాత్రిపూట కుక్కలదే ప్రభుత్వం. అవి రాత్రి సింహాలు. కొందరు వాటిని 'గ్రామ సింహాలు' అంటారు. నా రాజు 'వాడసింహం'. తన కునక సామ్రాజ్యంలోకి ఒక్క ఊరకుక్క ప్రవేశించినా అది నిలదీస్తుంది.

తెల్లవారకనే నేను నిద్రలోకి జారుకునేవాడిని. నా స్వప్నం కరిగిపోయేది.

కాలేజీకి సెలవులు ఇచ్చారు కదా! మరో పదిహేను రోజులవరకూ తెరవరు. ఈలోపుగా దేవీ దర్శనం ఉండదు.

ఉత్తరం రాస్తానన్నది. నిజానికి మా ఊరికీ, వాళ్ళ ఊరికీ పది కిలోమీటర్లే దూరం. అయినా వెళ్ళాలని లేదు. నా దేవి నన్ను వెతుక్కుంటూ రావాలన్నదే నా జీవితేచ్ఛ. ఆ కోరిక కాస్తా తీరిపోయింది. ఆమెను ఆరాధించటం తప్ప నాకిప్పుడు వేరే పనిలేదు.

అయినా, ఆమె నుంచి ఒక వరం; ఒక ఉత్తరం! ఆమె చేతివ్రాత! నాకోసం పెదిమలు అదిమిపెట్టుకుని అల్లిన అక్షరమాల! అందులోని ప్రతి అక్షరం లోనూ రెండు పెదవుల ఆమరికను సున్నష్టంగా చూడగలను. నాకు ఒక గట్టి అనుమానం కూడా కలుగుతోంది. అసలు తెలుగు లిపే తెలుగు అమ్మాయిల లిప్స్‌లోంచి పుట్టి ఉండాలి. లేకుంటే అక్షరం అంత గుండ్రంగా ఎలా ఉంటుంది!

అందుకేనేమో, నా దేవి పెదవి ముద్రల కోసం అంత నిరీక్షణ. నా ఎదురుచూపు నా రాజుకి తెలును. పోస్ట్‌మాన్ సైకిల్ బెల్లు వినపడితే చాలు మీదకి దూకేది. పోస్ట్‌మాన్ దండం పెట్టేసేవాడు. నా ప్రేమ అతడి ప్రాణం మీదికి వచ్చింది. ఎప్పటిలాగే పోస్ట్‌మాన్ మా ఇంటి దగ్గర ఆగకుండా వెళ్తుంటే, ఒకరోజు నా రాజు అతని ప్యాంటు పట్టుకుంది. కింద పడ్డాడు. ఉత్తరాలన్నీ చెల్లా చెదురయ్యాయి. అతని మోచేతులు చీరుకుపోయి నెత్తురు వచ్చింది. నేను పరుగున వెళ్ళాను. కానీ, అతన్ని లేవదీయలేదు. కిందపడ్డ ఉత్తరాలను హడావిడిగా వెతికాను. ఎక్కడా చిరునామా లేదు. అప్పటికి వారం గడిచింది.

ఒకరోజు నేనే మోపెడ్ తీసుకుని బయలుదేరాను. మోపెడ్‌కన్నా ముందుగా నా రాజు. చేరాల్సిన గ్రామం చేరాం.

ఊరు మధ్యలో ఊడలు వేసిన మర్రిచెట్టు. చెట్టు చుట్టూరా సిమెంటు అరుగు. అరుగు మీద వృద్ధుడు. నెరసిన మీసాలు కూడా మెలి తిప్పి ఉన్నాయి. ఖద్దరు పెంచె, ఖద్దరు బనీను. జానంపట్టు వేసుకుని కూర్చున్నాడు. మందపాటి కళ్ళజోడులోంచి పేపరు చదువుతున్నాడు.

ఫలానా సుబ్బరాజు గారి ఇల్లు ఎక్కడా అని అడిగాను. ఎదురుగా ప్రహరీ గోడ ఉన్న డాబా చూపించాడు. గేటు తెరిచే ఉంది. అటువైపే ఆత్రంగా చూశాను.

నా దేవి గుమ్మం ముందు ముగ్గులు పెడుతోంది. తొలుత ఆమె మెత్తని పాదాలు చూశాను. మనసు కుదుటపడింది.

నా రాజు చూసిందే తడవుగా దూసుకుంటూ వెళ్ళి ఆమె చుట్టూ తిరిగింది. కంగారుపడి కొట్టబోయింది.

"దేవీ." అరిచాను.

వెనక్కు తిరిగింది. ఆమె ముఖంలో హరివిల్లు విరియలేదు. పెదవులమీద ఏ భావమూ లేని నరళ



రేఖ కనిపించింది. నా గుండె జారిపోయింది. ఆపే చూస్తూ ఉండిపోయాను. ఆమె లోనికి వెళ్ళిపోయింది.

ఒక నిరాదరణ, ఒక నిర్లక్ష్యం, ఒక తిరస్కారం!

కళ్ళు గట్టిగా మూసుకున్నాను. తెరిస్తే నా చెక్కిళ్ళు తడిసిపోతాయి.

"ఏ ఊరబ్బాయ్ నీది?"

చెట్టుకింద ముసలి కంఠం గంభీరంగా ప్రశ్నించింది.

"గుమ్మలూరు" అన్నాను, నా కళ్ళ నీళ్ళు అదిమి పెట్టుకుంటూ.

"ఎవరి అబ్బాయివు?"

"జాన్ రత్నంగారి అబ్బాయిని."

"ఏం చేస్తాడు మీ నాన్న?"

"కువైట్‌లో ఉన్నాడు."

"మీరు పంచములా?"

ఆ ప్రశ్న నన్ను బాధపెట్టలేదు. అలవాటయినదే. కానీ, అతను నన్ను చూసిన చూపు తలయెత్తనివ్వలేదు. అంత నీచంగా ఉంది. అయినా సరే, అవునన్నట్లు తల ఊపాను.

ఈలోపుగా కాళ్ళ దగ్గర రాజు అలికిడి. దాని నోటిలో ఒక కాగితం ముక్క. ఉత్తరం! నా దేవి నాకోసం పంపిన 'శునక సందేశం' అనుమానంతో, కేవలం దింపుడు కళ్ళం ఆశతో ఉత్తరం తెరిచాను.

రాజుగారూ,

మీరూ, నేనూ చాలా దూరం. ఈ విషయం ఎందుకు దాచారు? మీ ఇంటికొచ్చి చూసేవరకూ నేను తెలుసుకోలేకపోయాను. ఏదో కులమన్నా సరిపెట్టుకునేవాళ్ళం. మరీ ఆ కులమా?

వద్దు ఇక్కడితో ఆపండి.

-దేవి

అక్షరాల్లో పెదవులు కాదు ఉండలు చుట్టుకున్న పాములు కనిపించాయి. ఆ ఉత్తరం అక్కడే వదిలేశాను. దాచాలన్న అనక్తీ, చించాలన్న చికాకూ రెండూ కలుగలేదు. నిర్లిప్తత. నిర్లిప్తతలోనే మోపెడ్ స్టార్ట్ చేసుకుని వెనుదిరిగాను.

నా బండి నన్ను నడిపింది. శివుడి కంఠంలో గరళంలా దుఃఖం పీక దగ్గరే గడ్డ కట్టింది. ఇంటికొచ్చిపడ్డాను.

"నాయనా! వచ్చావా? కాళ్ళు కడుక్కో, అన్నం పెడతాను" అంటూ గబగబా అన్నం వడ్డించింది. అన్నం గిన్నెవైపు కాకుండా, ఆమె అరచేతులవైపు చూశాను. ఆ చేతుల్లోనే ముఖం పెట్టుకుని బావురుమంటూ ఏడ్చాను.

"ఏమయ్యిందిరా తండ్రీ! ఇంత కష్టం ఎవరు తెచ్చార్రా కన్నా" అని అమ్మ కూడా ఏడుస్తూనే తల్లడిల్లిపోయింది.

నేను ఏడ్చి ఏడ్చి తేరుకున్నాను. అప్పుడు మాత్రం ఆరా తీసింది అమ్మ.

"నాన్న గుర్తొచ్చాడు" అని తప్పించుకున్నాను.

అంతే. తన కొంగుకు కట్టుకున్న వంద రూపాయల నోట్లు నాలుగు తీసి, "నాయనకి ఫోన్ చెయ్యి. బెంగ తీరుద్ది" అని నా తల నిమిరింది అమ్మ.

నాకు ఊహ వచ్చాక అమ్మకు చెప్పిన తొలి అబద్ధమది.

నేను అన్నం తిని లేచి వెళ్ళిపోబోతుండగా, "నువ్వొక్కడివే వచ్చావ్? ఆ రాజు ఎక్కడ చచ్చింది" అని అడిగింది అమ్మ. అప్పటివరకూ నా రాజు నా స్మృహలోకే రాలేదు. వస్తుంది కదా అని ఎదురుచూశాను.

గంట... రెండు గంటలు... మూడు గంటలు గడిచినా రాజు రాలేదు. చీకటి పడిపోయింది. ఫలితం శూన్యం.

నేను మోపెడ్ తీసుకుని మళ్ళీ కోడేరు వరకూ వెళ్ళి వచ్చాను. చీకట్లో ఎక్కడా కనపడలేదు.

ఇప్పుడు నా కళ్ళముందు దేవి లేదు. నా రాజు రూపమే కదలాడుతోంది. ఏమయింది? రెండు రోజులు గడిచిపోయాయి. మూడవరోజు ఉదయం- నేనింకా నిద్ర లేవకుండానే- నా పక్కనే ఏదో దుర్వాసన. కళ్ళు మెల్లిగా తెరచి చూశాను.

కుక్క ఆకారం. నా రాజే. ఒంటినిండా గాయాలతో, ఒక కాలు విరిగి వేలాడుతూ, పరమ భయంకరంగా నా రాజు.

"అమ్మా! రాజు!" పెద్దగా అరిచాను. అమ్మ ఇంట్లో లేదు.

రాజు దగ్గరకు రాబోయింది. భరించలేని వాసన. దాని గాయాలలోంచి దుర్వాసన. కానీ, దీనంగా దాని కళ్ళు. ఈలోగా అమ్మ వచ్చింది. బాధపడి, [illegible] వెండి అన్నం తెచ్చింది. ఎప్పటిలాగే అరుగుమీద దాని గిన్నెలో అన్నం పెట్టింది. నేను ముక్కు మూసుకున్నాను. అది గమనించిన అమ్మ రాజు గిన్నెను దూరంగా వాకిలి బయట పెట్టింది. నా రాజు మెతుకు ముట్టలేదు. నావైపే చూస్తూ ఉండిపోయింది.

ఆ దృశ్యాన్ని భరించలేక మోపెడ్ తీసుకుని బయటకు వెళ్ళిపోయాను.

"మొన్న మీ రాజుని స్కూటర్ కొట్టేసింది కదా! బతికిందా?" స్కూలు నుంచి వచ్చే పేట కుర్రాడు అడిగాడు. నేను సమాధానం ఇవ్వకుండా వెళ్ళిపోయాను.

అలా అలా లోకమంతా తిరిగి వచ్చాను. మిట్ట మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. బాగువేసే పేరుమీద ఒకచోట రోడ్డు తవ్వుతున్నారు.

అక్కడ గడ్డపార నిలువునా దిగేస్తుంటే నేను చూశాను దాని నీడ దాని కిందే మాయమయ్యింది.

నా వెనుక నుంచి లారీ వస్తోంది. నేను పక్కగా డ్రైవ్ చేస్తున్నాను. ముందుకు చూసేసరికి ఎదురుగా నా రాజు. స్రవించే గాయాలతో నా రాజు. వేలాడే కాలుతో కుంటుకుంటూ వస్తున్న నా రాజు. లారీకి ఎదురుగా!

"రాజూ" అని పిలిచాను. అది చూసింది. కానీ నడక మార్చలేదు.

ఘోరం జరిగిపోయింది. లారీ దానిమీద నుంచి వెళ్ళిపోయింది.

కడజాతి కుక్క మరణించింది. కావాలనే మృత్యువును ముద్దాడింది. తలయెత్తుకుని వెళ్ళిపోయింది. అభిమానంతో తెర దించుకుంది.

ఒక నిరాదరణ, ఒక నిర్లక్ష్యం, ఒక తిరస్కారం భరించలేక మరణించింది.

గాయం అంటరానిదయ్యిందా?

ఈ ప్రశ్న నన్ను తలకిందులు చేసింది. నేను తొడుక్కున్న తెల్ల చొక్కాను విప్పేశాను. ఆ చొక్కాలోకి నా రాజు మృతదేహాన్ని ఎత్తుకున్నాను.

నా ప్రేమ సకల దుర్గంధాలనూ జయించింది.

హృదయం! హృదయం అంటారు కానీ, దాన్ని తీసి బయట ప్రదర్శిస్తే పారిపోతారు. ప్రతి గాయం ఒక తెరచిన హృదయం.

నా దేవి కూడా నా గాయాన్ని చూసి ముక్కు మూసుకుంది. తల తిప్పుకుంది. నా కుక్కకు ఉన్న అభిమానం కూడా నాకు లేదా?

నా రాజు మరణించిన మూడవ రోజునే నేను కూడా తుదిశ్వాస వీల్చాలనుకున్నాను.

* * *

ఉదయమే లేచాను. తలస్నానం చేశాను. నా తల్లి తన చల్లని చేతుల్తో దీవించింది. పరీక్షకు వెళ్తున్నానని చెప్పాను. అబద్ధం కాదుకదా! 'నువ్వు గెలుస్తావురా కన్నా' అన్నది అమ్మ. నేను కోరినట్టుగానే నా స్నేహితుడు జీపు సిద్ధం చేశాడు. నాన్న పిస్తోలును రహస్యంగా జేబులో పెట్టుకున్నాను.

చిన్నప్పుడు నాన్న నేర్పించిన అన్ని విద్యలూ జీవితంలో అక్కరకు వచ్చాయి. గురి తప్పకుండా పిస్తోలు పేల్చటం కూడా నా జీవిత పరమార్థంలో ఉపయోగపడబోతోంది.

నా ప్రణాళికను సగమే నా స్నేహితుడికి చెప్పాను. లేకుంటే జీపు కాదుకదా, సైకిల్ సాయం కూడా చేసేవాడు కాదు.

కొత్త దుస్తుల్లో ఠీవిగా ఉన్నావని నా స్నేహితుడు ప్రశంసించాడు. జీపు బయలుదేరింది. నా స్నేహితుడే నడుపుతున్నాడు. నిజం చెబుతున్నాను. ఆనాటి అద్భుత ప్రయాణం నా మనసు గాలిలో తేలుతోంది.

జీపు ఊడల మర్రిచెట్టు పక్కనే ఆగింది. అదే మీసాల వృద్ధుడు. అదే కళ్ళజోడు. అదే సన్నివేశం. మన గ్రామాల్లో దృశ్యాలు అంత సులభంగా మారవు.

నేను దిగాను. మీసాల వృద్ధుడు నాలుగు కళ్ళతో చూశాడు. అందులో నాలుగు వర్ణాలూ కనిపించాయి.

నేను చాలా దర్జాగా, స్వాతంత్ర్య దినోత్సవం రోజున ప్రధానమంత్రి ఎర్రకోట ఎక్కినంత రాజసంగా, రాజరాజేశ్వరీ దేవి ఇంటి గుమ్మం వైపు వెళ్ళాను. ఎవరూ లేరు.

**కుక్క ఆకారం. నా రాజే. ఒంటినిండా గాయాలతో, ఒక కాలు విరిగి వేలాడుతూ, పరమ భయంకరంగా నా రాజు. దాని గాయాల నుంచి దుర్వాసన.**

"దేవీ!" అని పిలుపు మూడుసార్లు పిలిచాను.

బయటకు వచ్చింది. ఎందుకు రాదూ? పరువు పోతుందని పరుగు పరుగున వచ్చింది.

"ఎందుకొచ్చావు?" అనుమానపడుతూ అడిగింది.

నవ్వాను మౌనంగా.

ఆ ప్రశ్న పదిసార్లు వేసింది. అదే సమాధానం.

దృశ్యానికి తగినంత మంది ప్రేక్షకులు సిద్ధమయ్యారు. గోడచాటు కొందరు, తలుపు పక్క కొందరు. పక్కగా ముగ్గురు నలుగురు. వారిలో మీసాల వృద్ధుడొకడు.

ఆమెకు దగ్గరగా వెళ్ళాను. రొప్పుతోంది. పాము బుసకొట్టినట్లు.

ఆమె ఉత్తరం లోని చివరి వాక్యం, "మరీ ఆ కులమా?" అదురుతున్న ఆమె పెదవులు అదే వాక్యాన్ని పదే పదే అంటున్నట్లనిపించాయి.

ఆమె రెండు చెంపల్నీ నా రెండు చేతుల్లో మూశాను.

ఆమె పెదవుల మీద ముద్దు పెట్టాను.

అవును ఆమె ఇష్టం ప్రకటించకుండానే, ఆమె అనుమతి లేకుండానే ఆ పని చేశాను. అక్రమమే. అసభ్యమే. ఐ డోంట్ కేర్ ఫర్ మాడెస్టీ.

ఏం చెయ్యను? నా మృత్యువును ఆమె పెదవుల మీద రాసుకున్నాను.

జీప్ స్టార్ట్ అయింది. ఒక్కట్లే పరుగెత్తుకుని వచ్చి జీపు ఎక్కాను.

"ఆమెను లేవదీసుకొస్తానన్నావు కదరా! ఒంటరిగా వచ్చావే?" అడిగాడు స్టీరింగ్ దగ్గర ఉన్న నా మిత్రుడు. వాడికి తెలిసినదంతే. జీపు పోనివ్వమని సైగ చేశాను.

నా పని పూర్తయింది. నాగుపాము తోక తొక్కాను. ఇక కాటు వెయ్యటం దాని పని.

దేవి తండ్రి సుబ్బరాజు ఆ గ్రామానికి మాజీ సర్పంచ్. ఆస్తి పెద్దగా లేదు.





అయినా, రాజు రాజే కదా! ఒక అంటరానివాడి ఎంగిలితో తన కుటుంబం అల్లరి పాలయ్యాక చూస్తూ ఊరుకుంటాడా? నరికి పోగులు పెట్టడూ? నాకు కావలసిందీ అదే.

విజయోత్సాహంతో ఇంటికి చేరుకున్నాను. నేను చనిపోయాక, నా సమాధి నా రాజు సమాధి పక్కనే చెయ్యాలని చీటీమీద వీలునామా రాసి పెట్టాను. పదకొండు గంటలైంది. ఆరు బయట గడ్డపార దిగవేశాను. గడ్డపార నీడ పొట్టిగా ఉంది కానీ పూర్తిగా మాయం కాలేదు.

"మరణించే ముందు చివరి కోరిక ఏమిటి?"

నాకు నేనే తలారిని కాబట్టీ నన్ను నేనే ఆ ప్రశ్న వేసుకున్నాను.

పెరుగు బువ్వ లాంటి అమ్మ ముఖాన్ని చూడాలి వంట గదిలోకి వెళ్ళాను. అమ్మ రొయ్యల వేపుడు చేస్తోంది. మూకుడులో రొయ్యలు ప్రశ్నార్థకాల్లా వేగుతున్నాయి.

అప్పుడు గుర్తొచ్చింది. రాగానే, "అమ్మా! పరీక్ష బాగా రాశానే" అని నేనన్నమాట. నేను శుభవార్త చెప్పినప్పుడల్లా అమ్మ నాకిష్టమైనది వండి పెడుతుంది.

"అమ్మా" అన్నాను. నా స్వరంలో ఏమి తేడా గమనించిందో నా వైపు గిరుక్కున చూసింది. ఎప్పుడో కానీ అమ్మ నా ముఖంవైపు చూడదు. కడుపు వైపే చూస్తుంది.

ఇంత చల్లని తల్లి లోకానికి అంటరానిదెలా అయింది.

కుర్చీ తెచ్చుకుని ఆరుబయట కూర్చున్నాను. అది నా 'భస్మ సింహాసనం!' గడ్డపార కింద తగ్గుతున్న నీడను గమనిస్తున్నాను.

నీడ దాదాపు మాయమయ్యింది. నిటారుగా గడ్డపార! కులం మాయమయితే మనిషి కూడా ఇంతే నిటారుగా కనిపిస్తాడు.

కారు ఆగిన చప్పుడు.

తలయెత్తకుండా వాచీ చూసుకున్నాను. ఇంకా పన్నెండు కావటానికి అయిదు నిమిషాలు ఉంది.

నో! నేను పెట్టుకున్న ముహూర్తానికి ఒక్క నిమిషం కూడా ముందు మరణించటానికి వీలు లేదు.

నా జననం ఎలాగూ నా చేతుల్లో లేదు. లేకుంటే కులంతో పంకిలమైన ఈ గడ్డమీద పుట్టేవాణ్ణే కాదు. నా మరణాన్ని నా చేతుల్లోకి తీసుకోవాలి నేను నిర్ణయించినవేళకే మరణించాలి. ఈ అయిదు నిమిషాలూ నా ప్రాణం నిలబెట్టుకోవటం కోసం యుద్ధం చేస్తాను.

ఈ తీర్మానంతోనే పిస్తోలు చేతపట్టి తల పైకి ఎత్తాను. సరిగ్గా నా తల్లిలాంటి ముఖంతోనే మరో పెద్దావిడ. ఆమె వెనుక రాజరాజేశ్వరీ దేవి.

"నన్ను చంపటానికి మీరొచ్చారా?" పిస్తోలు జేబులో పెట్టుకున్నాను.

"చావాల్సింది నువ్వు కాదు మేం. ఇలాంటి పేటలో... ఈ ఇంటిలోకి నా కూతురు కాపరానికొస్తే చావాల్సిందెవరో నువ్వే చెప్పు?" బొంగురుపోయిన ఏడుపు గొంతుతో అడిగింది పెద్దావిడ.

నాకు చిర్రెత్తుకొచ్చింది.

"అయితే, చావలేకపోయావా" అన్నాను గట్టిగా.

"నేను చావగలనయ్యా! దీన్ని చంపుకోలేనుకదా! అక్కడికీ మనసు చంపుకుంది. ప్రాణాన్ని కూడా తీసుకోమని ఎలా చెప్పనయ్యా" అని నా భుజం మీద పడి బావురుమంది.

దేవి పరుగున మా ఇంట్లో దూరింది.

తనను తాను తిట్టుకుని, పట్టుకుని తేరుకున్న దేవి తల్లి ముఖం చూశాను. బాగా కమిలి, వర్ణం మారింది.

రొయ్యలు వేయిస్తున్న నా తల్లి, ఇద్దరి ఆడవాళ్ళ కన్నీళ్ళూ తుడిచింది కానీ, ఒక్క ప్రశ్నా వెయ్యలేదు. కానీ నేను వేశాను.

"నువ్వు చేసిన అల్లరికి మేమక్కడే ఉండిపోతే మా ఆయన నిన్ను చంపుతాడు. ముఖం చూపలేక నా బిడ్డ చస్తుంది. మేమే ఇక్కడికి వచ్చామని తెలిస్తే... మా ఆయనే ఉరేసుకుంటాడు. నా కడుపు తీపి కోసం నా భర్తనే చంపుకొంటున్నానయ్యా"

ఏడుస్తూ చెప్పిందో, చెబుతూ ఏడ్చిందో మొత్తానికట్లా చెప్పింది దేవి తల్లి.

పన్నెండు గంటలయిపోయింది. నా పుట్టుకే కాదు, నా చావు కూడా నా చేతుల్లో లేదని తేలిపోయింది. ఒక మరణం వాయిదా పడింది.

నా గాయాన్ని నా దేవి చూడనట్టే, నా దేవి గాయాన్ని నేను చూడలేకపోయాను.

నేను కుల పీడితుణ్ణి. ఆమె కులం చేతిలో బందీ.

ఆయామ్ ద విక్టిమ్. షీ ఈజ్ ద ప్రిజనర్.

కూతురు కోసం కులాన్ని వదిలిన నా దేవి తల్లికి రెండు చేతులూ జోడించాను.

మై డాగ్ ఈజ్ ఆల్వేస్ రైట్.
గాయమే హృదయం. ■

**సరిగ్గా నా తల్లిలాంటి ముఖంతోనే మరో పెద్దావిడ. ఆమె వెనుక రాజేశ్వరీ దేవి. రొయ్యలు వేయిస్తున్న నా తల్లి, ఇద్దరి ఆడవాళ్ళ కన్నీళ్ళూ తుడిచింది.**

● తోలేటి జగన్మోహనరావు
● చిత్రాలు: నర్సిం


ఈ పిట్టలకి తెల్లవారబోతోందని ఎలా తెలుస్తుందో? వేగుచుక్క కనిపించగానే ఎక్కడో పిట్ట లేచిన సవ్వడి అవుతుంది. క్షణాలలో మావిడి చెట్టు మీంచి, వేప చెట్టు నుంచీ, అన్నివైపుల నుంచీ పిట్టల కలకలారావం విని పిస్తుంది. క్రమంగా ఆకాశం తెల్లబడుతుంది. రెక్కలు తపతపలాడిస్తూ, హడావిడిగా అటూ ఇటూ ఎగురుతూ పిట్టలు...

నాకూ ఆ పిట్టలలాగా ఎగిరిపోవాలనిపిస్తుంది. కానీ...

"నాన్నా! లేచావా" అంది పెద్దమ్మ వంటింట్లోంచి.

పెద్దమ్మ పిట్టల కంటే ముందే లేస్తుంది. కానీ, వెలుగొచ్చేవరకూ ఏదో గొణుగుతూ, భగవంతుడిని ప్రార్థిస్తూ, చాప మీద అలాగే పడుకునుంటుంది. వెలుగొస్తేకానీ పెద్దమ్మకు సరిగా కనిపించదు.

"నువ్వు లేవద్దు పెద్దమ్మా. ఇంకా బాగా వెలుగు రాలేదు."

నేను పెరట్లోకి దారితీసి, మావిడిచెట్టు చప్టా మీద కూర్చున్నాను.

ఉదయం వేళ చల్లటి గాలి వీస్తోంది. మనసు రోజూలాగా గజిబిజిగా లేక ప్రశాంతంగా ఉంది. మండుతున్నట్లుండే నా కళ్ళు ఇవాళ శాంతంగా చట్టూ ఉన్న ప్రపంచాన్ని చూడగలుగుతున్నాయి. ఎన్నో రోజుల తర్వాత నాకెంతో ఉత్సాహంగా ఉంది.

ఈ రోజు నుంచీ నేను కొత్త జీవితాన్ని ప్రారంభిస్తాను.

గతమంతా పీడకలలా మర్చిపోతాను.

తెగిన గాలిపటంలా అటూ ఇటూ కొట్టుకు పోకుండా నా జీవితాన్ని నా చేతుల్లోకి తీసుకుని నడిపిస్తాను.

ఈ నిర్ణయం నాకు మరింత ఉత్సాహాన్నిచ్చింది. గుండెల నిండా చల్లటి గాలి పీల్చి మెల్లిగా వదిలాను.

కొత్త శక్తి ఒళ్ళంతా పాకినట్లయింది.

కళ్ళు మూసుకుని, మళ్ళీ మెల్లిగా గాలి పీలుస్తుండగా, అగరొత్తుల వాసన.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను.

ఎవరో పూజ చేసి వెలిగించినట్టున్నారు. అగరొత్తుల వాసన మెల్లిగా అలుముకుంటోంది.

అగరొత్తుల వాసన తగిలినప్పుడల్లా నాన్న శవం గుర్తొచ్చి భయం వేస్తుంది.

మనసంతా కంగారుగా అయిపోతుంది.

నాన్న ఇరవై ఏళ్ళ క్రితం, నా చిన్నతనంలో పోయినా, అదంతా నిన్న కాక మొన్న జరిగినట్లనిపిస్తుంది.

చెరువు.

చెరువు ముందు స్తంభాల ఇల్లు.

ఎర్రటి గచ్చు.

ఎత్తు అరుగులు.

అరుగు మీద నాన్న శవం. అంతకు ముందు నాన్నని ఎప్పుడూ చూసినట్లు లేదు. అసలు అక్కడికి ఎలా చేరానో కూడా గుర్తు లేదు.

పెద్దమ్మ నన్ను అరుగు మీద దింపి. "మీ నాన్నగారా" అంది. నాన్న పడుకుని ఉన్నాడు. తల దగ్గర ప్రమిదలో నూనె దీపం వెలుగుతోంది. అక్కడ అంతా హడావిడిగా, నిశ్శబ్దంగా. నీడల్లా తిరుగుతున్నారు.

అక్కడ అగరొత్తుల వాసన.

"నిన్నెవరు పిలిచారో" అంటూ పెద్దమ్మని చూడగానే దూకుడుగా మీదకు వచ్చాడు ఒకతను.



ఒత్తుగా మెలితిరిగిన మీసాలు. ఎర్రగా ఉబ్బిన కళ్ళు. అతని మొహం భయం గొలిపేలా ఉంది. "...నీ బాబు సొమ్ము ఇక్కడేం దాచిపెట్టలేదు..."

అతని అరుపుకి నాకు భయం వేసింది. మెల్లిగా స్తంభం చాటుకు జరిగాను.

"నా బాబు సొమ్ము గురించి కాదు, వీడి బాబు సొమ్ము గురించి."

"వీడి బాబు సొమ్మా? ఎవడికి పుట్టాడే వీడు? కానీ ఇవ్వను. దిక్కున్న చోట చెప్పుకో."

"అది బతికున్నంత కాలం దాన్ని వేపించుకు తిన్నారు. శవం చేత వేలి ముద్రలు వేయిస్తారా? తల్లీ, తండ్రీ లేని పిల్లాణ్ణి అన్యాయం చేస్తారా? మీరు నాశనమైపోతారు. పురుగులు పడి చస్తారు..."

"ఏవిటే వాగుతున్నావు?" అతను ముందుకొచ్చి పెద్దమ్మ జుట్టు పట్టుకున్నాడు. పెద్దమ్మ వాడి పట్టు విడిపించుకోలేక గొల్లుమని ఏడ్వసాగింది.

నాకు వాడి పీక పిసికెయ్యాలన్నంత కోపం వచ్చినా, చెయ్యి కదల్చలేని అశక్తత. నాకు ఏడుపొస్తోంది. 'పెద్దమ్మా' అని అరుద్దామనుకున్నాను కానీ భయంతో నోరు పెగలలేదు.

అరుపులు, కేకలు, పెద్దమ్మ ఏడుపు.

నేను ఏడవడానికి కూడా భయపడుతూ స్తంభం చాటున నిలబడి చూస్తుండడం గుర్తుంది కాని ఆ తర్వాత అక్కడ ఏం జరిగిందీ జ్ఞాపకం లేదు.

మళ్ళీ పెద్దమ్మ వెన్నెల్లో, పొలాల మధ్య నుంచి, పంట కాలవ గట్టున, ఏడుస్తో, తిడుతూ, కొంత దూరం ఎత్తుకునీ, కొంత దూరం నడిపించీ నన్ను తీసుకెళ్ళడం గుర్తుంది.

కాలవకి అడ్డంగా రైలు కట్ట.

వంతెన దాటుతుండగా వెన్నెలలో తళతళలాడిన రైలు పట్టాలు.

నెమ్మదిగా ప్రవహిస్తున్న కాలవలో వెండి పువ్వులా తేలుతున్న చందమామ...

అంతా స్పష్టంగా ఇప్పటికీ గుర్తుంది.

"పెద్దమ్మా" అన్నాను నేను భయంభయంగా, రైలుకట్ట దిగుతుంటే.

"ఏం భయం లేదు నాన్నా! ఎవరున్నా, లేకపోయినా నేను లేనా?"

"ఆ... క... లేస్తోంది పెద్దమ్మా."

"అయ్యో! పొద్దున్ననగా తిన్నవాడివి. కనీసం పిల్లాడికింత పెడదామనేనా తోచలేదు."

రైలుకట్ట దిగువకి కాలవ పక్కన చిన్న దిబ్బ మీద పాక ఉంది. అక్కడ రెండు గేదెలు కొబ్బరి చెట్టు నీడని పడుకుని నెమరేస్తున్నాయి. కాలవ ఒడ్డున ఒకతను గొంతుక్కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు.

"బాబూ! పిల్లాడికేదైనా తినడానికి దొరుకుతుందా నాయనా? పొద్దున్ననగా తిన్నాడు" అనడిగింది పెద్దమ్మ.

అతను లేచి కొబ్బరి బొండాలు, అరటిపళ్ళు తీసుకొచ్చాడు. దిబ్బ మీద కంది చెట్ల నుంచి పది రెమ్మలు తెంపి, గడ్డి అంటించి, ఆ మంట మీద కాల్చి, "తినరా బుల్లోడా" అని ఇచ్చాడు. పెద్దమ్మ కొంగు ముడి విప్పి డబ్బులివ్వబోయింది. అతను వద్దన్నాడు.

"కుర్రాడికి ఓ అరటిపండిచ్చినంత మాత్రాన నా ఆస్తులేవన్నా కరిగిపోతాయా? పోయేవి ఎలాగూ పోయాయి..." అతను ఏదో చెబుతున్నాడు. నేను పెద్దమ్మ ఒడిలో పడుకుని నిద్రపోయాను. తిరిగి కళ్ళు తెరిచేటప్పటికి అతను ఏడుస్తున్నాడు. పెద్దమ్మ అతడిని ఓదారుస్తోంది.

ఎవరేనా ఏడుస్తున్నా, పెద్దగా అరుచుకుంటూ దెబ్బలాడుకుంటున్నా నా గుండెలు భయంతో వేగంగా కొట్టుకుంటాయి. లోకంలో దుఃఖం, దౌర్జన్యం తప్ప మరేవీ లేవా అని భయం వేస్తుంది. అక్కడ నుంచి పారిపోవాలనీ, ఎవరికీ కనిపించకుండా ఎక్కడేనా దాక్కోవాలనీ అనిపిస్తుంది.

"పెద్దమ్మా" అన్నాను నేను భయంగా లేచి కూర్చుని.

"దేవుడు పై నుంచి కనిపెడుతూనే ఉంటాడన్నా. ఏం ఫరవా లేదు. అంతా సవ్యంగా జరిగిపోతుంది. బెంగెట్టుకోకు" అంది పెద్దమ్మ అతడిని ఓదారుస్తూ.

దేవుడు అతడిని చల్లగా చూశాడా?

అతను ఇప్పుడెలా ఉన్నాడు?

చాలాసార్లు ఆలోచిస్తుంటాను.

పెద్దమ్మకు మాత్రం దేవుడు న్యాయం చెయ్యలేదు.

అప్పుడు నా చెయ్యి పట్టుకు నడిపిస్తూ, వార్ధక్యంలో ఈ కొడుకు ఒంటరి బతుకుకి ఆసరాగా ఉంటాడని అనుకుని ఉంటుంది పెద్దమ్మ.

పెద్దమ్మ నాటిన మావిడి మొక్క కాపుకొచ్చింది.

కానీ, పెద్దమ్మ కన్నీళ్ళు పోసి పెంచి పెద్దచేసిన నువ్వు?

కానీ సంపాదన లేని అడ్డగాడిదవి!

పెద్దమ్మకొచ్చే మూడువందల యాభై పెన్షన్ మీద బతికే చవటన్నర చవటవి. నా మీద నాకే అసహ్యం కలిగి, "ఛీ" అని ఖాండ్రించి ఉమ్మేశాను.

రోడ్డు మీద పోతున్న ఒకడు ఒకసారి ఆగి నాకేసి చూశాడు.

"నా ముఖంలో కోతులాడుతున్నాయా? ఫో."

అతను వెనక్కు చూడకుండా త్వరత్వరగా నడుస్తూ వెళ్ళిపోయాడు.

నేను ఎందుకిలా ప్రతీదానికీ చలించిపోతాను?

అతను ఆగి చూస్తే నాకెందుకంత కోపం?

పోనీ అని ఊరుకోవచ్చు కదా.

నా నిర్ణయం మరిచిపోతున్నాను.

ఈ రోజు నుంచీ మామూలుగా ఉండాలి.

ప్రయోజకుణ్ణి కావాలి.

ప్రయోజకుడు అంటే?

లోకం 'రెండు చేతులా సంపాదించేవాడు' అని నిర్వచనం ఇస్తుంది.

లోకం నిన్ను కాసులతో తూస్తుంది.

నీ తెలివితేటలూ, చదువూ కాసులు కూడబెట్టలేకపోతే నువ్వు లోకం దృష్టిలో దద్దమ్మవి. ఎందుకూ పనికి రాని వెధవ్వి.

నువ్వు ప్రయోజకుడివి కావాలంటే లౌక్యం కావాలి.

చలాకీగా ఉండాలి.

దెబ్బ తప్పించుకుంటూ దెబ్బ తియ్యాలి.

మనసులో విషం దాచుకుని పెదాల మీదికి చిరునవ్వు తేవాలి.

కానీ...

*"నట చక్రవర్తులారా!*
*మునుగులు తగిలించి నటించలేను!*
*నన్ను ప్రేక్షకుడిగానే ఉండనివ్వండి!*
*నడి సముద్రంలో ఒంటరి నావని*
*అలాగే కొట్టుకుపోనివ్వండి!*
*నా సమాధిలో నిశ్శబ్దంగా*
*ఇలాగే నన్ను రోదించనివ్వండి!"*

"నాన్నా! ఏం రాస్తున్నావు?" పెద్దమ్మ అడిగింది.

"ఏదోలే-గేయం."

"నాకు వినిపించు."

ఒక్క కవిత కూడా ఏ పత్రికలోనూ రాకపోయినా పెద్దమ్మ నేనేదో కవిని అనుకుని సంతోషపడుతుంది. గూట్లోంచి నా నోటు పుస్తకాలు తీసి, లావుపాటి కళ్ళద్దాలు తగిలించుకుని, కూడబలుక్కుంటూ ఒక్కొక్క కవితా చదువుతుంది. అర్థమైనా, కాకపోయినా నా కవిత్వం అంటే పెద్దమ్మకి ఇష్టం.

నేను వాస్తవంతో రాజీ పడలేక, కలల్లోకీ, కవిత్వంలోకీ పలాయనం సాగిస్తున్నానని పెద్దమ్మకి తెలియదు.

బయట ప్రపంచంతో నేను విసిగిపోయినప్పుడు, నా మనో ప్రపంచంలోకి వెళ్ళిపోతాను. ఊహలలో నాకిష్టమైన ప్రపంచాన్ని సృష్టించుకుంటాను. ఆ ఊహల లోకం నా కవిత్వానికి జన్మస్థానం.

కానీ, కవిత్వం కూడు పెట్టదే!

ఈ బోడి కవిత్వం కానీ సంపాదించలేదే!

కానీ సంపాదించని వాడు నిష్ప్రయోజకుడే!

పెద్దమ్మ నన్ను ప్రయోజకుణ్ణి చెయ్యాలని ఎన్ని కలలు కంది?

ఎంత కష్టపడి చదివించింది?

నాకు ఓ దారి చూపించాలని, చివరకు మిగిలిన ఎకరం వీరాసామికి అమ్మేసింది. వీరాసామి ఏ టీచరు ఉద్యోగవో, అటెండరు ఉద్యోగవో వేయిస్తాడని పెద్దమ్మ ఆశ.

"వీళ్ళు డబ్బులు తినడవే కానీ ఉద్యోగాలు వేయించరు పెద్దమ్మా."

"నీ గురించి అని కాదులే. మన చెక్క వాడి పొలాల మధ్య ఉంది. అంచేత అమ్మమని బలవంతపెడుతున్నాడు. మనం అమ్మకపోయినా వాడు కలిపేసుకుంటాడు. కోర్టుల చుట్టూ ఎవరు తిరగ్గలరు నాయనా! పోనీ, ఏ ఉద్యోగవేనా వేయిస్తాడేమో..."

మూడేళ్ళయినా ఉద్యోగం వేయించడు.

పొలం అమ్మిన డబ్బు ఇవ్వడు.

నువ్వు?

నువ్వు నంబర్ వన్ హిపోక్రేట్‌వి.

అవినీతి మీద నిప్పులు కక్కుతావు.

కలంతో చీల్చి చెండాడుతావు.

"ఏవిటే వాగుతున్నావు?" అతను ముందుకొచ్చి పెద్దమ్మ జుట్టు పట్టుకున్నాడు. పెద్దమ్మ వాడి పట్టు విడిపించుకోలేక గొల్లుమని ఏడ్వసాగింది. నాకు వాడి పీక పిసికెయ్యాలన్నంత కోపం వచ్చినా, చెయ్యి కదల్చలేని అశక్తత. నాకు ఏడుపొస్తోంది.

నీ విషయం వచ్చేటప్పటికి నీ ప్రిన్సిపల్సు గాలిలోకి ఎగిరిపోతాయి.

వీరాసామి ఉద్యోగం వేయిస్తే జాయినవడానికి రడీ అయిపోతావు.

నువ్వు ముసుగులు తగిలించలేనంటూ ముసుగులో తిరిగే దొంగ వెధవ్వి.

పెద్దమ్మ పెన్షన్ మీద బతికేసే పేరసైట్‌వి.

రెండు పూట్లా నుష్టుగా దున్నపోతులా తినడం...

పెళ్ళాం కోసం కలలు కనడం...

"వెధవా, నీకు పెళ్ళాం కావాలా?"

పక్క వాటా కుర్రాడు, మూడేళ్ళ బుజ్జిగాడు, అప్పుడే నిద్ర లేచినట్టున్నాడు. ఇంకా కళ్ళైనా సరిగా తెరవకుండా అరుగు మీద నిలబడి ఉచ్చ పోయబోతున్నవాడు, నేను వాణ్ణే తిడుతున్నాననుకున్నాడు కాబోలు, ఉచ్చ పోయడం ఆపు చేసి లోపలకు పారిపోయాడు.

నాకు నవ్వొచ్చింది.

పగలబడి నవ్వాను.

మూడో వాటా శాంతమ్మ, తీరిగ్గా ముగ్గు వేస్తున్నది, త్వరత్వరగా నాలుగు గీతలు గీసి వెళ్ళిపోయింది.

వీళ్ళందరికీ నన్ను చూస్తే భయం.

రేవతికి?

నేనంటే ప్రేమా? జాలా? అసహ్యమా?

రేవతి గుర్తుకు వచ్చినప్పుడల్లా మనసంతా దిగులుగా అయిపోతుంది.

ఏడుపొస్తుంది.

ఎన్ని రాత్రులు ఒంటరిగా ఏడుస్తూ ఎలా గడిపాను?

సంతోషం కలిగించే సంఘటనలు ఏవైనా నా జీవితంలో ఉన్నాయేమో నాకు గుర్తు లేదు కానీ, దుఃఖం కలిగించే విషయాలు మాత్రం వదలని పీడకలల్లా, ఎంత మర్చిపోదామనుకున్నా మరుపు రాకుండా నన్ను వెంటాడుతూనే ఉంటాయి. నా విషయంలో ఏదీ, ఎప్పుడూ సవ్యంగా ఎందుకు జరగదో నాకు అర్థం కాదు.

ఆ రోజు శనిగాడు నా చేత అలా మాట్లాడించకపోతే నా జీవితం మరోలా ఉండేదా?

మధ్యాహ్నం రెండు గంటల వేళ నేను మాటినీకి వెడదామని బట్టలు వేసుకుంటుంటే ఓ ముసిలాడు, "అనంతం" అంటూ చెమటలు కక్కుకుంటూ లోపలికి వచ్చాడు.

కాళ్ళకు తెగిపోయి, పిన్నీసు పెట్టిన హవాయి చెప్పులు, మాసిపోయిన చిరుగుల పంచె, పేటీలున్న లాల్చీ, నెరిసిన గడ్డం, చింపిరి జుట్టు- నడుస్తున్న దరిద్రంలా ఉన్నాడు.

అతను నన్ను పలకరించబోతుంటే, ఆ అవకాశం ఇవ్వకుండా, "పెద్దమ్మా, నీ కోసం ఎవరో వచ్చారు" అంటూ నేను లోపలికి వెళ్ళి పెద్దమ్మను పంపించాను.

"అనంతం! మనవరాలి గురించేనే నా బెంగ! తిరగలేక చచ్చిపోతున్నానే! దాని పెళ్ళయితే నా బాధ్యత తీరిపోతుంది. ఇంకెలా చచ్చినా పరవాలేదు. విసిగిపోయానే వెధవ జీవితంతో..." అతను పెద్దమ్మతో అంటున్నాడు.

"వాడికి ఏదైనా ఉద్యోగం వచ్చాకే ఓ ఇంటివాణ్ణి చేద్దామని ఉందన్నయ్యా."

"ఉద్యోగానికేవిటమ్మా! ఏదో ఒకటి దొరక్కపోదు. బంగారం లాంటి పిల్ల. కుర్రాడినొకసారి అడిగి చూడు."

ముసిలాడు లౌక్యంగా మాట్లాడి వాడి దరిద్రాన్ని నాకు అంటగట్టి నా పీక నులువు దామనుకుంటున్నాడు. నేను లోపల్నుంచే, "పెద్దమ్మా! నేను ఉద్యోగం వస్తే కానీ పెళ్ళి చేసుకోను." గట్టిగా అరిచాను.

"నా ఉద్దేశం కూడా అదే అన్నయ్యా! వాడు వాడి కాళ్ళ మీద నిలబడితేనే కదా ఓ బరువు మోసేది."

ముసిలాడు లేచాడు. "అనంతం కుర్రాడికి పెళ్ళి చెయ్యాలనుకున్నప్పుడు ఓ మాట నా చెవిని వెయ్యి. నాకున్న దానిలో ఏ లోటూ లేకుండా చేస్తాను."

అతను వెళ్ళగానే పెద్దమ్మ, "నాన్నా! ఓసారి నెంబరుగార్ని కలిసొస్తాను" అంది. పెద్దమ్మ ఎమ్మెల్యేలు, ఎంపిలు, కౌన్సిలర్లు అందర్నీ నెంబర్లు అంటుంది.

నంబరు వీరాసామిగారు ఉద్యోగం ఇప్పిస్తే, ఆ పిల్లని వెంటనే తోడుగా చేసుకోవాలని పెద్దమ్మ కలలు కంటోందన్నమాట.

నేను నవ్వుకున్నాను. "ఎందుకు పెద్దమ్మా! ఆయన ఏ ఉద్యోగం వేయించడు కానీ డబ్బు ఇచ్చెయ్యమను."

పెద్దమ్మ నంబరుగార్ని కలవడానికి పొరుగూరు వెళ్ళి రాత్రి పదింటికి తిరిగి వచ్చింది.

"ఏవిటి పెద్దమ్మా! బస్సుస్టాండు నుంచి రాత్రివేళ నడిచి వచ్చావు? రిక్షాలో రాలేకపోయావా?"

"నాలుగడుగులికి పది రూపాయలు. రిక్షా ఎందుకు?"

"నెంబరుగారేవన్నాడు?"

"ఏవంటాడు? చూద్దాం అంటాడు. ఉద్యోగం వేయించడు. డబ్బు ఇవ్వడు. వీడి కొంప తగలడ." పెద్దమ్మ ఎంతో విసిగిపోతేనే కానీ, అలా మాట తూలదు.

రాత్రి పెద్దమ్మకి పెళ్ళున జ్వరం వచ్చింది. మగత నిద్రలో కలవరింతలు...

పెద్దమ్మని డాక్టరు దగ్గరకు తీసికెళ్ళాలి.

గూట్లో, పెట్లో, అన్ని చోట్లా వెతికాను. అయిదు రూపాయల చిల్లర దొరికింది. మరో వారానికిగాని పెన్షన్ రాదు. రిక్షాకి డబ్బుల్లేక అంత జ్వరంలోనూ, పెద్దమ్మ అంత దూరం నడిచి వచ్చింది.

దొరగారు?

దొరగారు సినిమాలకి, షికార్లకి వెడతారు గాని నెంబరుగారితో మాట్లాడరు.

ఏంచేతంటే ఆయనకి బోడి ప్రిన్సిపల్స్!

ఆయన స్వయంగా అడగరు. పెద్దమ్మ ద్వారా ఉద్యోగం వస్తే దొరగారు చికాకు పడుతూ జాయినవుతారు. హిపోక్రైట్!

"పెద్దమ్మా, పద! డాక్టరు దగ్గరకు వెడదాం." హిపోక్రైట్‌లాగా మాట్లాడాను. ఖాళీ జేబుల్లో చేతులు పెట్టుకుని.

"ప్రయాణం బడలిక వల్ల వచ్చింది కానీ, ఇలా రా నాన్నా." మంచం దగ్గరకు పిలిచింది పెద్దమ్మ. "చూడు నాన్నా. డాక్టరొద్దు కానీ నాకేదన్నా అవుతే

సంతోషం కలిగించే సంఘటనలు ఏవైనా నా జీవితంలో ఉన్నాయేమో నాకు గుర్తు లేదు కానీ, దుఃఖం కలిగించే విషయాలు మాత్రం వదలని పీడకలల్లా నన్ను వెంటాడుతూనే ఉంటాయి.

ఇదిగో-" కుడిచేతి వేలికున్న ఉంగరం చూపిస్తూ అంది పెద్దమ్మ. "ఈ ఉంగరం అమ్మితే వెయ్యో, పదిహేనువందలో వస్తాయి. క్లుప్తంగా కార్యక్రమం జరిపించు."

నాకు వచ్చే భయంకరమైన ఆలోచనల్లో పెద్దమ్మ చావు ఒకటి!

ఆ ఆలోచన రాగానే నాకు కాళ్ళూ, చేతులూ ఆడవు.

భయంగా, కంగారుగా ఉంటుంది.

పెద్దమ్మ మంచం మీద పడితే? చచ్చిపోతే...

చేతిలో కానీ లేని, కానీ సంపాదించడం చేతకాని నేను ఏం చెయ్యగలను?

తల్లి రుణం ఎలా తీర్చుకోగలను?

బహుశా పెద్దమ్మకి నా అసమర్థత తెలుసు.

అందుకే తన ఏర్పాట్లు తాను చేసుకుంటోంది.

"పె...ద్ద...మ్మా!" నాకు దుఃఖం ముంచుకొచ్చింది.

"చ... చ. చిన్న పిల్లాడిలా అలా ఏడవకూడదు. ఊరికే అన్నాను కానీ, నాకేం రాయిలా ఉన్నాను. నీకే ఏ దారీ చూపించలేకపోయాను."

పెద్దమ్మ త్వరలోనే కోలుకుంది.

నాలుగైదు వారాల తర్వాత పెద్ద గుళ్ళో ఏదో పూజ జరుగుతోందంటే పెద్దమ్మని తీసి కెళ్ళాను. గుళ్ళోకి వెళ్ళబోతుంటే, "అనంతం బాగున్నావా" అంటూ పలకరించాడు ముసిలాడు. వాళ్ళు అలా మాట్లాడుకుంటుంటే, 'తాతా, వెడదామా' అన్నమాట వినిపించి వెనక్కి తిరిగి చూశాను.

ఎదురుగా... చామంతి పువ్వులా పచ్చగా... నన్నజాజి తీగలా నన్నగా... శాపగ్రస్తురాలయిన ఓ దేవకన్య...

"ఇదేనే అనంతం నా . మనవరాలు. దేవుడి దయవల్ల సంబంధం కుదిరింది. గంతకు తగ్గ బొంత. వచ్చే మాఘమాసంలో పెళ్ళి. అమ్మాయ్! అనంతం అత్తయ్య అని చెప్పానే... ఆవిడ... ఇతను.. వాళ్ళబ్బాయి..."

ఆ అమ్మాయి నువ్వేనా అనంతంగారబ్బాయివి అన్నట్లు ఓ క్షణం పరిశీలనగా చూసింది. కళ్ళూ కళ్ళూ కలిసినప్పుడు గుండె ఝల్లుమంది. నేను సరే అంటే ఈ అందం నా సొత్తు అయ్యేది. ఇప్పుడు...

"పద తాతా" అంటూ ఆ అమ్మాయి తాతగార్ని తీసుకుని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

ఒక్కసారి నిరాశ, శూన్యం నన్ను ఆవరించి నట్లయింది.

"బంగారంలాంటి పిల్ల. చిదిమి దీపం పెట్టు కోవచ్చు."

"పెద్దమ్మా! నువ్వు గుళ్ళోకి వెళ్ళు. నేనిక్కడే ఉంటాను."

నాకు ఒంటరిగా ఉండాలని ఉంది.

ఎవరూ లేని చోట, ఎవరూ చూడకుండా గుండె బరువు తగ్గేదాకా ఏడ్వాలని ఉంది.

ఇంటికి తిరిగి వెడుతుంటే పెద్దమ్మ తప్పిపోయిన ఆ సంబంధం గురించి ఏదో మాట్లాడుతూనే ఉంది. ఒక్క ముక్క కూడా నా బుర్రకెక్కడం లేదు.

"పెద్దమ్మా! ఆ... అమ్మాయి... పేరేవిటన్నావు?"

"పేరు ఏదైతేనేం, కుందనపు బొమ్మ."

కనీసం పేరైనా తెలుస్తే బావుండును.

ఆ అమ్మాయి పేరేమై ఉంటుంది?

సరోజ... కమల... వసంత...

రేవతి... రేవతి బాగుంది.

"వడ్డించమంటావా?"

"నువ్వు తిను! నాకు ఆకలిగా లేదు."

ఆ రాత్రంతా నిద్ర పోలేదు.

ఆ రాత్రే కాదు... ఆ తర్వాత అనేక రాత్రులు నిద్రపోలేదు.

పెద్దమ్మ బలవంతం మీద నాలుగు మెతుకులు


> **అతి కష్టం మీద రక్తం ఆగింది. ప్రాణం నిలిచింది. కానీ... ఎందుకీ బ్రతుకు? ఎవరి కోసం? రాత్రీ పగలూ, రోజులు, వారాలు. ఎడతెగకుండా ఏవో ఆలోచనలు. ముసురు కమ్మినట్లు ఏదో దిగులు.**


తింటున్నానే కానీ, తినబుద్ధి కావడం లేదు.

ఏ పనీ చెయ్యాలనిపించదు.

ఎవరితోనూ మాట్లాడాలనిపించదు.

నిరంతరం అలా మంచం మీద పడుకుని కిటికీ లోంచి శూన్యంలోకి చూస్తూ... ఎడతెగని ఆలోచనలు.

కనీసం పిల్లనైనా చూస్తానని చెప్పొచ్చు కదా!

ఎలా చెబుతావు? ముసిలాడు నడుస్తున్న దరిద్రంలా కనుపించాడు కదా!

నీకు అందాల రాకుమారి అర్ధరాజ్యం తీసుకు రావాలని మనసులో కోరిక.

ఎలా చెబుతావు?

నువ్వు హిపోక్రేట్‌వి!

నీకు బాగా శాస్తి అయింది.

ఒకవేళ... పెళ్ళయినట్లయితే... ఎలా ఉండేది?

హాయిగా చిలకాగోరింకల్లా ఉండేవాళ్ళమా?

ఎందుకూ పనికిరాని అప్రయోజకుణ్ణి పెళ్ళాడా



నని అసహ్యించుకునేదా?

పేరైనా తెలియదు.

చూసినది క్షణకాలం.

ఎందుకు ఈ తపన?

ఎందుకు ఈ బాధ?

*"లోకం శూన్యం.*

*నింగీ నేలా ఘనీభవించిన శూన్యం.*

*ప్రియతమా!*

*నువ్వు మెరుపులా మెరిసి*

*మాయమైపోయిన తర్వాత.*

*ఈ అంధకారంలో*

*నాకు నేనే కనిపించడం లేదు..."*

ఈ భయంకరమైన ఒంటరితనాన్ని, ఈ శూన్యాన్ని నేను భరించలేను.

నాకు బతకాలని లేదు.

నాకు చచ్చిపోవాలని ఉంది.

బ్లేడుతో మణికట్టు దగ్గర కోశాను.

రక్తం ప్రవాహంలా కారుతోంది.

ప్రాణం పోయేంతవరకూ అలా ఆగక కారుతూనే...

"అయ్యో నాన్నా! ఎంత రక్తం. ఏమైంది?"

"బ్లేడు తెగింది."

"అయ్యో! అక్కడెలా తెగింది నాన్నా." పెద్దమ్మ కంగారుగా కాఫీపొడి తీసుకొచ్చి అద్ది కట్టుకట్టింది.

అతి కష్టం మీద రక్తం ఆగింది.

ప్రాణం నిలిచింది. కానీ...

ఎందుకీ బ్రతుకు?

ఎవరి కోసం?

మళ్ళీ రేవతి మీదకు ఆలోచనలు...

ఆ చూపుకి అర్థం ఏమిటి?

నన్నెందుకు చేసుకోనన్నావు అనా?

నువ్వు కాదంటే నా పెళ్ళి ఆగిపోతుందనుకున్నావా అనా?

నా కాలి గోటికైనా నువ్వు తగవు అనా?

రాత్రీ పగలూ, రోజులు, వారాలు.

ఎడతెగకుండా ఏవో ఆలోచనలు.

ముసురు కమ్మినట్లు ఏదో దిగులు.

"ఏవిటి నాన్నా అలా చిక్కిపోతున్నావు? ఒంట్లో బాగాలేదా?" పెద్దమ్మ నుదిటి మీద చెయ్యి వేసింది.

"అయ్యో ఒళ్ళు కాలిపోతోంది."

పెద్దమ్మ డాక్టరు గారిని తీసుకొచ్చింది.

టేబ్లెట్స్, కేప్సుల్స్..

మనసంతా మాటల కొలిమిలో ఉన్నట్లున్నా, వారం రోజుల్లో జ్వరం తగ్గింది.

"ఆ పిల్ల కాకపోతే ఇంకో పిల్ల. లోకం గొడ్డు పోయిందా?" పెద్దమ్మ తల నిమురుతూ అంది.

పెద్దమ్మకు అంతా తెలుసన్నమాట.

నా మనసు లోతుల్లోకి పెద్దమ్మ ఎలా చూడగలిగింది?

నాకు సిగ్గేసింది.

"రేపు కాదు. ఇవాళే, ఇప్పుడే మొత్తం యాభైవేలూ వడ్డీతో సహా కావాలి."

నాలోంచి నేను కాక మరెవరో మాట్లాడుతున్నట్టు వచ్చాయి మాటలు.

నేను అలా నిక్కచ్చిగా మాట్లాడ్డం వీరాసామికి, ఖద్దరు ఆసామీకి కోపం కలిగించినట్టుంది.

"ఎవడీడు" అన్నాడు ఖద్దరు ఆసామీ.

"అనంతమ్మని... ఆవిడ కాళ్ళా వేళ్ళా పడితే... ఏదో నౌకిరీ వేయిద్దామని చూస్తుంటే వీడి పొగరు చూడు. ఆవిడ మొహం చూసి ఊరుకుంటున్నాను కానీ..."

"లేకపోతే వెంట్రుకలు పీకుతావా?" అలా నిర్భయంగా, నిర్లక్ష్యంగా, మొరటుగా, నా ప్రయత్నం లేకుండా నాలోంచి మాటలు వస్తుంటే తమాషాగ అనిపించింది.

అలా అంటాననుకోలేదు కాబోలు, ఒక క్షణం అవాక్కయిపోయాడు. మరుక్షణం నిప్పులు కురిపిస్తూ నా దగ్గరికి వచ్చాడు. "ఏం కూశావు?"

"వెంట్రుకలు..."

నా మాట పూర్తి కాకుండా చాచి లెంపకాయ కొట్టాడు. "కానీ ఇవ్వను. నీ దిక్కున్న చోట చెప్పుకో."

నా గుండెల్లో ఏదో పేలినట్లయింది.

నరాల్లోంచి విద్యుత్తు ప్రవహించింది.

ఒక శక్తి తరంగం నన్ను కుదిపేసింది.

'కానీ ఇవ్వను... నీ దిక్కున్న చోట చెప్పుకో.'

అవే మాటలు.

అదే దుర్మార్గం.

దుశ్శాసనుడి గుప్పిట్లో పెద్దమ్మ జుట్టు...

నిస్సహాయంగా పెద్దమ్మ ఏడుపు...

వణుకుతూ స్తంభం చాటుకు...

లేదు పెద్దమ్మా. నీ కొడుకు ఈ రోజు స్తంభం చాటుకు పారిపోయే పిరికిపంద కాదు. స్తంభం చీల్చుకువచ్చే ఉగ్ర నరసింహమూర్తి.

కొట్టం వైపుకు పరిగెడుతుంటే పారిపోతున్నాననుకున్నాడు కాబోలు.

"దెబ్బకు దయ్యం దిగింది నాకొడుక్కి" అని నవ్వాడు ఖద్దరు ఆసామీ.

నీళ్ళపొయ్యి దగ్గర ఉన్న గొడ్డలి అందుకుని పరిగెట్టుకొచ్చాను.

నా చేతిలో గొడ్డలి చూసి వాళ్ళిద్దరూ ఉలిక్కిపడ్డారు.

"ఈడికి పిచ్చెక్కింది... ఆ కళ్ళు చూడు." కంగారుగా అన్నాడు ఖద్దరు ఆసామీ.

నాలో తెగింపు.

వాళ్ళ కళ్ళల్లో భయం.

ఆస్తి, అధికారం కలిగించిన మదం దిగిపోయింది వీరాసామికి. నా చేతిలో గొడ్డలి చూడగానే కంగారుగా రెండడుగులు వెనక్కు వేశాడు. "ఏ... య్... ఏ... వి... టి... ది?"

ఇప్పుడు తడబడుతున్నది, భయపడుతున్నది, వణుకుతున్నది నేను కాదు, వాడు. పెద్దమ్మా! నీ కొడుకు ఈ రోజు, ఈ క్షణం భయాన్ని జయించాడు. ఇంతవరకూ తన్ను భయపెట్టిన లోకాన్ని ఇప్పుడు తాను భయపెడతాడు.

పెద్దమ్మా! నువ్వు అలా నిస్సహాయంగా, దీనంగా ఏడ్వద్దు.

నీ జుట్టు పట్టుకున్న దుర్మార్గుడి చేతులు ఇవాళ తెగిపడతాయి.

నిన్ను లంజ అన్నవాడి తల వెయ్యి ముక్కలవుతుంది.

గొడ్డలి విసురుగా దిగింది.

రక్తం చిమ్మింది.

ఖద్దరు ఆసామీ కేసి తిరిగాను. "ఏవన్నావ్? దెబ్బకు దెయ్యం దిగిందా?"

"నాకేం తెలీదు సార్." గొడ్డలి వాడికి కొత్త భాష నేర్పినట్టుంది. క్షణం క్రితం 'నా కొడుకు' అన్నవాడు



ఇప్పుడు 'సార్' అంటున్నాడు. 'యమ్మెల్యేగారూ! జల్సా చేద్దాం రండి' అని ఈరాసామి పిలిస్తే వచ్చాను. కానీ, నాకు బేక్గ్రవుండు తెలీదు సార్. నన్నొదిలేసెయ్యండి. మీ కాళ్ళట్టుకుంటా." తోడుదొంగ గజగజ వణుకుతున్నాడు.

దొంగనాకొడకా! నీ వాటా నువ్వు తీసుకో!

గొడ్డలి మరోసారి దిగింది.

పెద్దమ్మా! వీడి కొంప తగలడ అని శపించావు.

నీ శాపం వృథా కాదు.

అలాగే జరుగుతుంది.

వీడి పాపం భగ్గున మండుతుంది.

వీడి కొంప కాలి బూడిదవుతుంది.

అలాగే జరుగుతుంది పెద్దమ్మా!

నీళ్ళపొయ్యి లోంచి మండుతున్న కొర్రిలాగి గడ్డిమేటు మీద విసిరాను.

ఆకాశంలోకి మంటలు లేచాయి.

గడ్డిమేటు...

ట్రాక్టరు...

ధాన్యం గాదె...

స్తంభాల ఇల్లు...

నీ దుర్మార్గం...

నీ దౌర్జన్యం...

అన్నీ తగలడుతున్నాయి.

అంతా బూడిదవుతోంది.

ఇప్పుడు నీకు దిక్కెవరో నేను చూస్తాను...

"దిక్కున్న చోట చెప్పుకోవాలా! కొడకల్లారా! ఒక్కొక్కళ్ళనే నరికిపడేస్తాను. మీ కొంపలు కాల్చి బూడిద చేసేస్తాను. దిక్కున్న చోట చెప్పుకోవాలా. మీయమ్మల్ని..."

పెద్దమ్మ లోపలి నుంచి పరిగెత్తుకొచ్చింది. ఆయాసంతో, దుఃఖంతో మాట్లాడలేక తన బలహీనమైన చెయ్యి నా మీద వేసింది.

"ఇదంతా ఏంత లోకం పెద్దమ్మా! వినయంగా తల వంచితే జుట్టు పట్టుకుంటుంది. ఈడ్చి తన్నే కాలు నెత్తి మీద పెట్టుకుంటుంది. ఇదంతా తలకిందులు లోకం పెద్దమ్మా... ఈ లోకాన్ని కాల్చి బూడిద చేసెయ్యాలి. ఈ దౌర్జన్యాన్ని ముక్కలు ముక్కలుగా నరికి పడెయ్యాలి. దిక్కెవరని అడుగుతార్రా కొడకల్లారా..."

నా చేతుల మీద కన్నీటి చుక్కలు పడ్డాయి.

"ఉన్నట్టుండి ఏమవుతుంది నాయనా? ఎందుకలా అయిపోతావు?" పెద్దమ్మ ఏడుస్తోంది.

నా ఆవేశం మీద నీళ్ళు చిలకరించినట్టయింది.

పెద్దమ్మ కంట తడిపెడితే నేను చూడలేను. పెద్దమ్మ కూడా నన్ను పిచ్చివాడనడం నేను భరించలేను.

"పెద్దమ్మా! నువ్వు కూడా... నాకు... పిచ్చనుకుంటున్నావా?"

"లేదు నాయనా! ముందు లోపలికి పద."

పెద్దమ్మ వెనకాలే లోపలికి నడిచాను.

గదిలో అద్దంలో నా రూపం కనుపించింది.

చింపిరి జుట్టు...

పెరిగిన గడ్డం...

లోతుకుపోయిన కళ్ళు...

నా మొహమేనా ఇది?

దుఃఖం ముంచుకొచ్చింది.

ఎందుకిలా అయిపోయాను?

ఎందుకిలా అయిపోతున్నాను?

వెక్కివెక్కి ఏడుస్తూ మంచం మీద కూలబడ్డాను.

పెద్దమ్మ మాత్రలు తీసుకొచ్చి ఇచ్చింది. మాత్రలు మింగి పడుకున్నాను. పెద్దమ్మ తల నిమురుతూ చెప్పసాగింది. మాత్రల ప్రభావమో, చల్లని తల్లి చెయ్యి మహిమో, నా ఆవేశం మెల్లిగా తగ్గుతోంది.

"నువ్వు పిచ్చివాడివి అన్న వాళ్ళు పిచ్చి వాళ్ళు నాయనా! కానీ... దారి వంకరటింకరగా ఉంటే సూటిగా ఎలా పోగలం నాయనా! తప్పో ఒప్పో నలుగురు నడిచే దారినే నడవాలిగానీ..."

నేను లౌక్యం తెలియనివాణ్ణి.

బతకడం చేతకాని అసమర్థుణ్ణి.

వంకర టింకర దారిలో సూటిగా నడవాలనుకునే పిచ్చివాణ్ణి.

నా జీవితం ఇలాగే ఉండనీ!

కానీ... అతను...

కాలవ ఒడ్డున నాకింత తిండిపెట్టిన అమాయకపు రైతు... అతని కన్నీళ్ళు...

అసలు లోకంలో ఇంత దుఃఖం ఎందుకుంది?

ఈ దుర్మార్గాలు, దౌర్జన్యాలు, మోసాలు...

ఈ నిర్బలత్వం, ఈ నిస్సహాయత, ఈ కన్నీళ్ళు...

వసంతంలో పువ్వుల తోటలా ఉండాల్సిన మనిషి జీవితం నిప్పుల మంటలో ఎందుకిలా కాలిపోతుంది?

వంకర టింకర దారిలో వంకర టింకరగా నడవక తప్పదు అంటే నీ బాధ్యతా, నా బాధ్యతా ఏదీ లేదా? మంచీ - చెడూ, పాపం - పుణ్యం అనే మాటలకి అర్థం లేదా? అసలు...

"ఈ లోకం... ఈ దారి... ఇలా వంకర టింకరగా ఎందుకుంది పెద్దమ్మా?"

పెద్దమ్మ నిట్టూర్చి చెప్పసాగింది.

"ద్వాపర యుగం అంతమైంది. కలియుగం ప్రారంభమైంది. కలిపురుషుడు పరీక్షిత్తు మహారాజు కలలో ప్రత్యక్షమై, నీ రాజ్యంలో నివసించడానికి అనుమతించు అని అడిగాడు. మహారాజు కలి మాయలో పడి, వ్యాసమహర్షి చేసిన హెచ్చరిక పెడచెవిని పెట్టి, కలి స్వర్గంలో నివసించడానికి అంగీకరించాడు. కలి చిరునవ్వు నవ్వి స్వర్గంలో ప్రవేశించాడు..."-పెద్దమ్మ కథ చెబుతోంది.

నేను పెద్దమ్మ ఒడిలో పసివాడినై, చిన్నప్పటి లాగే పెద్దమ్మ చెప్పే కథ ఊకొడుతూ వినసాగాను.

స్వర్గంలో అడుగు పెట్టిన కలి స్వర్గంలో ఉండిపోలేదు. స్వర్గంలోంచి మెల్లిగా మనుషుల మనస్సుల్లోకి ప్రవేశించాడు.

ఎన్నడూ లేనిది గురుపత్నికి బంగారు కుండలాల మీద మోజు కలిగింది.

గురుదక్షిణగా తృణమో పణమో కాక మహారాణిగారి బంగారు కుండలాలు కోరింది.

శిష్యుడు తెల్లబోయి దిక్కు తోచక మహారాజుని ఆశ్రయించడం...

మహారాజు మహారాణిని కుండలాలు ఇమ్మని అడగడం...

ఎన్నడూ రాజు మాట జవదాటని రాణి తన కుండలాలు ఇవ్వననడం...

బదులుగా కుంతీదేవి కుండలాలు ఇస్తానని రాజు ఆశపెట్టడం...

కలి అందరి మీదా తన ప్రభావం చూపిస్తున్నాడు.

మహారాణి కుండలాలు తీసుకువెడుతుంటే దారిలో శిష్యుడి హత్య...

ఆశ... లోభం... దగా... మోసం... దౌర్జన్యాలు... నేరాలు... శిక్షలు... వ్యధలు... కన్నీళ్ళు..."

"అది నాయనా కలియుగం అంటే... స్వర్గంలో ఉండి వాడు ప్రపంచాన్ని ఆడిస్తున్నాడు. లోకం కానుకి దాసోహం అంటోంది. వాడు వేసిన దారిన నువ్వూ, నేనూ, అందరం - ఇష్టమైనా, కష్టమైనా నడవక తప్పదు. వాడి మాయ నుంచి ఎవరూ తప్పించుకోలేరు."

పెద్దమ్మ మాటలు దూరం నుంచి వస్తున్నట్లు వినిపిస్తున్నాయి.

నా కనురెప్పలు బరువెక్కుతున్నాయి.

ఈ కలియుగం - కానుల యుగం - అధర్మ యుగం.

ఈ అధర్మం అజేయం కాదు...

కానివ్వకూడదు.

అధర్మం ప్రబలినప్పుడల్లా ధర్మ సంస్థాపనార్థం దేవుడు అవతరిస్తాడంటారు.

దేవుడు దీనుల కోసం అవతరిస్తాడన్న ఆశ నాకు లేదు.

కలి అజేయుడన్న నిరాశా నాకు లేదు.

ఏదో ఒక రోజు, కలిని అంతం చేసి, ఈ కానుల మాయ నుంచి ప్రపంచాన్ని విముక్తి చేసే యుగపురుషుడు అవతరిస్తాడు.

కానీ వాడు...

"దేవతలు పూలవర్షాలు కురిపిస్తుండగా ఆకాశ మార్గాన రాడు!

**ఏదో ఒక రోజు, కలిని అంతం చేసి, ఈ కానుల మాయ నుంచి ప్రపంచాన్ని విముక్తి చేసే యుగపురుషుడు అవతరిస్తాడు. మనిషే నా దేవుడంటూ నేల తల్లి గర్భం చీల్చుకు వస్తాడు.**

మనిషే నా దేవుడంటూ నేల తల్లి గర్భం చీల్చుకు వస్తాడు".

వాడు నీ కన్నీరు, నా కన్నీరు చూసి ఆవేశపడతాడు. తిరగబడతాడు.

వాడు నీ కోసం, నా కోసం శిలువలు మోస్తాడు.

ఉరికంబాలెక్కుతాడు.

వాడికి మరణం లేదు.

నేలకు రాలిన ప్రతీ నెత్తుటి చుక్క నుంచీ మళ్ళీ మళ్ళీ జన్మిస్తాడు.

ఏదో ఒక రోజు ఆ కానికాలం అంతం చేసి నిన్నూ, నన్నూ విముక్తుల్ని చేస్తాడు...

ఇది ఎన్నటికీ ఫలించని జోస్యమా?

మతి చలించినవాడి స్వప్నమా?

నాకు తెలియదు.

కానీ, ఈ ఆలోచన నాకు ఎంతో ఉపశమనాన్నిస్తుంది.

మనసు ఆనందంతో తేలికవుతుంది.

లోకమంతా చల్లని వెలుగుతో నిండిపోయి నట్లనిపిస్తుంది.

అప్పుడు కానుకి ఆత్మ అమ్ముడుపోదు.

అప్పుడు మనిషి నిరంతరం వంచిస్తూ, వంచించబడుతూ, వేటాడుతూ, వేటాడబడుతూ, ఈ జనారణ్యంలో జంతువులా బతకడు. నిజమైన మనిషిలా, స్వచ్ఛమైన మనసుతో జీవిస్తాడు.

అక్కడ...

వంచన ఎరుగని మనుషులు

వెన్నెల కురిసే మనసులు

అక్కడంతా... వెన్నెలే

అక్కడంతా... పువ్వులే

అక్కడంతా... పువ్వుల నవ్వులే...

అక్కడంతా... నవ్వుల వానలే...

అ...క్క...డ... వె...వె...న్నె...లే... పు...వ్వు...వ్వు...లే...

...న...న... వ్వువ్వు... లే... లే... లే... లే... ■



# బ్లాస్ట్... బ్లాస్ట్

• నవీన్
• చిత్రాలు: లక్ష్మణ్

అర్ధరాత్రి గాఢ నిద్రలో ఉన్న వెంకటయ్యకు బయటెవరో తనింటి తలుపుల్ని బాదుతున్న శబ్దం అదే పనిగా వినిపించడంతో మెలకువ వచ్చింది.

సందేహం లేదు. బయటెవరో తమింటి తలుపుల్నే వెంటనే తెరవాలంటూ బాదుతున్నారు. ఇంత రాత్రివేళ తనింటికి ఎవరొచ్చి ఉంటారో ఊహించడానికి అతడు ప్రయత్నించాడు.

"వెంకటయ్యా! వెంకటయ్యా! జల్దీ తలుపులు తెరువు. లేకపోతే తలుపుల్ని విరగ్గొట్టవలసి వస్తుంది." బయట్నించో గొంతు కఠినంగా ధ్వనించింది. ఆ గొంతు ఎవరిదో వెంకటయ్య గుర్తు పట్టాడు.

"ఓహో! వీళ్ళు మళ్ళొచ్చిండ్రన్నమాట! వీళ్ళకిప్పుడేం గావాల్నో" అనుకుంటూ వెంకటయ్య వెళ్ళి తలుపులు తెరిచాడు.

బయట మసకమసక చీకట్లో అతనికి ఆరుగురు వ్యక్తులు కనిపించారు. వాళ్ళందరూ లుంగీలు కట్టుకొని, హాఫ్ షర్ట్సు వేసుకొని, తలకు రుమాళ్ళు చుట్టుకున్నారు. ఇద్దరి చేతుల్లో గన్స్ ఉన్నాయి. వాళ్ళందరూ ఇరవై అయిదు ముప్పై మధ్య ఉన్నవాళ్ళే. తలుపులు తెరవగానే వాళ్ళల్లో అందరికంటె ముందు నిల్చున్న వ్యక్తి "వెంకటయ్యా మీ ఇంట్లో ఉన్నవాళ్ళందర్ని తొందరగా బయటికి రమ్మను. జల్దీ... టైమ్ లేదు" అన్నాడు.

"ఎందుకు" అన్నాడు వెంకటయ్య. తనింటికేదో గొప్ప ప్రమాదం జరగబోతున్నదని అతనికర్థమైంది.

"మీ ఇంటిని బ్లాస్ట్ చేస్తున్నం. జిలెటిన్ స్టిక్స్‌ని మీ ఇంటికింద నాలు చోట్ల పెట్టినం. వాటితో కనెక్ట్ చేసిన వైర్లను బాటరీకి అంటించినమంటె చాలు. నీ ఇల్లు మొత్తం పేలిపోతది. మేమా పని చెయ్యకముందే నీ ఇంట్లో ఉన్న వాళ్ళందర్నీ బయటకు రప్పిస్తే వాళ్ళ ప్రాణాలు దక్కుతాయి. లేదా వాళ్ళందరు చస్తరు. ఆ తర్వాత మమ్మల్నంటే లాభం లేదు. కమాన్... క్విక్... అయిదు నిమిషాల టైమిస్తున్న... ఇంట్లో వాళ్ళందర్నీ బయటకు రప్పించే బాధ్యత నీది" అన్నాడతడు.

"ఎందుకు? నా ఇంటినెందుకు బ్లాస్ట్ జేస్తున్నారు. నేనేం జేసిన? నేనెవరి జోలికి పోయేటోన్ని కానని మీకూ్కడ ఎరికే కద. నేను మీ తోటి కూడ మంచిగనే ఉన్న కద. ఎందుకంత అన్యాయం జేస్తున్నరు. నా ఇల్లు బ్లాస్ట్ చేయకండ్రి. మీ బాంచెనైత. మీ కాల్మొక్త" అన్నాడు వెంకటయ్య ముందు నిల్చున్న వాళ్ళ నాయకుని కాళ్ళు పట్టుకోబోతూ.

"ఎందుకు జేస్తున్నమో తర్వాత జెప్తుతం. మొదలైతే నీ పెండ్లాం పిల్లల్ని బయటకు రమ్మనుపో."

"గవాళ్ళను రమ్మనంగనే యేమైతది బాంచెను! ఇంట్ల గరిశెల ఐదు పుట్ల వడ్లున్నాయి. ఇంకో అర్రల అయిదు బస్తాల బియ్యం ఉన్నయి. బస్తా పెసలున్నయి. బస్తా కందులున్నయి. బస్తా పనుపు

**"కట్టుబట్టలతోనే బయటకు నడుచుడేనా? యేం తెచ్చుకోవద్దా?" అడిగింది రాజవ్వ. "ఏం తెచ్చుకోవద్దట. నువ్వు దబ్బున బయటకురా" అన్నాడు వెంకటయ్య. పిల్లలు, పెద్దలు కలిసి ఇంట్లోని ఆరుగురూ బయటకొచ్చేశారు.**



గొమ్ములున్నయి. గవ్వన్నెట్ల రావాలె" అన్నాడు వెంకటయ్య. అతనికి దుఃఖం ఆగలేదు. బోరున ఏడ్వడం మొదలెట్టాడు.

"గయ్యన్ని కాలిపోతయి. ఇంకొక్క క్షణం గిట్లనే దొంగేడ్పులు ఏడ్చుకుంట టైమ్ వేస్ట్ జేసినవంటే నీ పెండ్లాం పిల్లలు కూడా కాలి మసైపోతరు."

"మీ కాళ్ళు పట్టుకుంట బాంచెను. ఒక్క అయిదు నిమిషాల టైమియ్యండ్రి. గా అర్రల సందుకల పదివేల రూపాయలున్నయి. నిన్ననే జివాలనమ్ముకొచ్చిన. రేపా పైసల్ని బాంకుల కట్టాలె. లోన్ దెచ్చిన. అది వడ్డీతోటి కలిసి పదివేలయ్యిందని, వెంటనే కట్టకపోతే ఇల్లు జప్తు చేస్తమని బాంకోళ్ళు నోటీసిచ్చిండ్రు. మీకాల్మొక్త బాంచెను. నన్నన్యాయం చెయ్యకుండ్రి" అన్నాడు వెంకటయ్య మరోసారి వాళ్ళ నాయకుని కాళ్ళు పట్టుకోబోతూ.

నీ పెండ్లాం పిల్లలు తప్ప లోపల్నించి బయటికింకేమీ రాదు. నీ ఇంటినే మేం పేల్చేసినంక బాంకోడొచ్చి నీ ఇంటినెట్ల జప్తు చేస్తడు. లోపలున్నోళ్ళను పిల్చుకొస్తవా? మా పని కానిచ్చుకొమ్మంటవా? అంతా రెడీ అయిపోయింది. వైర్లను కలపడమే ఆలస్యం. మాకు టైమ్ లేదు. తర్వాత మమ్మల్నంటే లాభం లేదు."

"లోపలున్నోళ్ళను పిల్చుకొస్త బాంచెను. ఒక్క క్షణం ఆగండ్రి. మీ కాల్మొక్త. నన్నన్యాయం చెయ్యకుండ్రి" అంటూ వెంకటయ్య ఇంట్లోకెళ్ళాడు.

వెంకటయ్యకు యాభైయ్యేళ్ళుంటాయి. ముతక ధోతి కట్టుకొని, బనీను తొడుక్కున్నాడు. బక్క పలచగా ఉంటాడు. అతని కాళ్ళూ చేతులూ వణుకుతున్నయి. అతడు సరిగ్గా నడవలేకపోతున్నాడు. అతని గొంతుపెగిలి మాట రావడం లేదు.

అతడు లోపలకెళ్ళేటప్పటికి అతని భార్య రాజవ్వ మేల్కొనే ఉంది.

"బయట తలుపు కొట్టిందెవరు? నీతోటి మాట్లాడుతున్నోళ్ళెవలు" అందామె భర్తకు ఎదురుగా వెళ్ళి.

"అన్నలు మనిల్లు పేల్చేస్తరట. పిల్లల్ని తోలుకొని నువ్వు దబ్బున బయటికిరా. వాళ్ళు మనకు రెండే రెండు నిమిషాల టైమిచ్చిండ్రు. రెండు నిమిషాల్ల అందరం బయటకు రాకపోతే మనం లోపలున్నానరే ఇంటిని పేల్చేస్తరట."

"వామ్మో! నాయనో... ఇదెక్కడన్యాయం దేవుడో... ఎమ్మాల రాజన్నో! మేం ఎవరికన్యాయం జేసినం రాజన్నో... మా ఇంటినెందుకు పేల్చేస్తరట నాయనో... మనమేమన్న దొరలమా? దాతలమా? కాలం కలిసొచ్చి ఆ ఎమ్మాల రాజన్న దయతోటి నాల్గు రాళ్ళు సంపాయించుకున్నందుకు అందరి కండ్లు మనమీద నేనాయే" అంటూ రాజవ్వ గుండెలు బాదుకుంటూ ఏడ్వసాగింది.

"ఎక్కువ మాట్లాడకు. ఏడ్వకు. పిలగాండ్లను లేపు" అంటూ వెంకటయ్య, "అరేయ్ రాజయ్యా! అరెయ్ శంకరీ... అరేయ్ ఉప్పలయ్య... ఒసేవ్ సరోజన... అందరు దబ్బున లేండ్రి... లేండ్రి" అరచినట్టుగా అన్నాడు వెంకటయ్య.

రాజవ్వ కూడా, "అరేయ్ రాజన్నా... శంకరీ... ఉప్పలి... సరోజి... లేవుండ్రి... ఎమ్మాల రాజన్న మన మీద కన్నెర్ర జేసిండు. మనకు కష్టకాలమొచ్చింది. లేండ్రి...లేండ్రి" అంటూ మంచాల మీద పడుకొని గాఢ నిద్రలో ఉన్న వాళ్ళ నల్గురి పిల్లల్ని కుదుపుతూ లేపసాగింది.

వాళ్ళ నల్గురు పిల్లలూ పదిహేను ఎనిమిదేళ్ళ మధ్యలో ఉన్నవాళ్ళే. వాళ్ళు నల్గురూ కళ్ళు నులుముకుంటూ లేచి కూర్చున్నారు. ఆ అర్ధరాత్రి వాళ్ళ అమ్మా, నాన్నలు వాళ్ళనలా అకస్మాత్తుగా ఎందుకు లెమ్మంటున్నారో వాళ్ళకర్థం కాలేదు.

"గిప్పుడెందుకు లేపిండ్రు" అన్నాడు అందరికంటె పెద్దవాడు రాజయ్య.

"అన్నలొచ్చిండ్రురా! మనిల్లు కూలగొడ్తరట. మందుపాతర్లు పెట్టిండ్రట. మనందరం ఈ క్షణం బయటికి వెళ్ళకపోతే మనం ఉండంగనే ఇంటిని పేల్చిపారేస్తరట. లెండ్రి. దబ్బున బయటకి రండ్రి" అన్నాడు వెంకటయ్య.

వాళ్ళు నల్గురూ వెంటనే దిగ్గున లేచి నిల్చుని బయటకు పరిగెత్తుతున్నట్టుగా నడవసాగారు.

"కట్టు బట్టలతోటే బయటకు నడుచుడేనా? యేం తెచ్చుకోవద్దా? సందుకలున్న నా నగలు... నిన్న నువ్వు జివాలమ్ముకచ్చిన పైసలు. ఏవీ తెచ్చుకోవద్దట్నా" అంది రాజవ్వ.

"ఏం తెచ్చుకోవద్దట. నువ్వు దబ్బున బయటకురా" అన్నాడు వెంకటయ్య. పిల్లలు, పెద్దలు కలిసి ఆ ఇంట్లో ఉన్న మొత్తం ఆరుగురూ బయటకొచ్చేశారు.

"ఇంట్లో ఏదో క్యాష్ ఉన్నదంటివి కదా. పోయి తెచ్చుకో. అట్లనే ఏమన్నా బంగారం ఉన్నా తెచ్చుకోపోండ్రి. ఇంకో అయిదు నిమిషాల టైమిస్తా" అన్నాడు వాళ్ళ నాయకుడు.

"మీ కాల్మొక్త నాయనో. మీ బాంచెనైత నాయనో. మీ కెంత దయ పుట్టిందో నాయనో. మీ కడుపు చల్లంగుండ నాయనో. ఎమ్మాల రాజన్న మిమ్ముల చల్లంగ జూస్తడు నాయనో" అంటూ రాజవ్వ, వెంకటయ్య ఇంట్లో ప్రవేశించి ఐదు నిమిషాల్లో తిరిగొచ్చారు.

"వాటినిటివ్వండ్రి. జల్దీ" అన్నాడు వాళ్ళ నాయకుడు వెంకటయ్యనూ, అతని భార్యనూ ఉద్దేశించి.

"వేటిని" అన్నాడు వెంకటయ్య.

"నీ చేతిలో ఉన్న క్యాష్. నీ పెండ్లాం చేతిలో ఉన్న నగలు. జల్దీ. ఇచ్చేయండ్రి."

"వాటిని మీరే తెచ్చుకొమ్మంటిరి కదా..."

"తెచ్చుకొమ్మంటే వాటిని మీకిస్తమన్నట్టుకాదు. మాకు వాటితో చాలా అవసరముంది. కమాన్ ఇచ్చెయ్యండ్రి."



"ఇయ్యం. గివ్వి మీకెందుకియ్యాలె. ఇల్లు పేల్చేయడమే గాకుంట గివ్వి కూడ తీసుకుంటారా? అసలు మీరు నిజంగా అన్నలేనా? లేక నకిలీలా" అన్నాడు వెంకటయ్య.

"అరెయ్ కాపోడా! ఎక్కువ తక్కువ మాట్లాడిన వంటె కాల్చి పారేస్త... అవ్విటుతే... జల్దీ" అన్నాడు వాళ్ళ నాయకుడు.

వెంటనే వెంకటయ్యా, అతని భార్యా తమ చేతిలో ఉన్న క్యాష్, నగలూ అతని చేతిలో పెట్టేశారు.

"ఇంట్లనైతే ఇగ మనుషులు లేరు కదా" అన్నాడు వాళ్ళ నాయకుడు.

"లేరు" అన్నాడు వెంకటయ్య.

"కమాన్! ఫినిష్ ది జాబ్" అన్నాడు వాళ్ళ నాయకుడు.

వెంటనే వాళ్ళల్లోంచి ఓ ఇద్దరు కొంచెం దూరం వెళ్ళారు. అక్కడ ఇంటికింది భాగంలోంచి బయటకు తీసుకరాబడిన వైర్లున్నాయి. వాటిని తీసుకొని వాళ్ళ చేతిలో ఉన్న బాటరీకి అంటించారు. అంతే. మరుక్షణంలో దిక్కులు పిక్కటిల్లే బ్రహ్మాండమైన శబ్దమైంది. ఫెళఫెళమంటూ ఆ పెంకుటిల్లు అందరూ చూస్తుండగానే నేలమట్టమైపోయింది. ఆ ప్రదేశమంతా పొగతోనూ, దుమ్ముతోనూ నిండి పోయింది. కన్ను మూసి తెరిచేటంతలో ఆ ఇల్లంతా కొన్ని రాళ్ళుగా, కొన్ని ఇటుకలుగా, కొన్ని కర్రలుగా, కొంత మట్టిగా కుప్పకూలిపోయింది. ఇసుకమేడలా కూలిపోతున్న తమ ఇంటిని చూస్తూ వెంకటయ్య, రాజవ్వలు కూడా కుప్పకూలిపోయారు. ఆ ఇల్లు కూలిపోతున్నప్పుడు ఉత్పన్నమైన ఆ భయంకరమైన చప్పుళ్ళు వాళ్ళ గుండెల్లో మారుమోగాయి.

"మా ఇల్లు కూలిపోయింది నాయనో, మా ఇల్లు కూలిపోయింది. మేమెక్కడబోము నాయనో, మేమెక్కడబోం" అంటూ ఆ భార్యాభర్తలిద్దరూ చూస్తున్నవాళ్ళ గుండెలు పగిలేలా రోదించారు. వాళ్ళ నల్గురు పిల్లలు కూడా వాళ్ళ తల్లితండ్రుల్ని కౌగలించుకొని బిగ్గరగా ఏడ్వసాగారు.

బాంబుల మోతతో ఆ చుట్టుపక్కల ప్రదేశమంతా దద్దరిల్లిపోవడంతో నిద్రపోతున్న ఆ ఊరి ప్రజలందరూ లేచి వెంకటయ్య ఇంటికి పరిగెత్తుకుంటూ వచ్చారు.

"ఇదిగో... మేం మీ ఇల్లెందుకు పేల్చేసినమో ఈ కాగితంలో రాసినం. మీ దగ్గరకొచ్చే పోలీసోళ్ళకు, పత్రికలోళ్ళకు ఈ కాగితం చూపించుండ్రి" అంటూ వాళ్ళ నాయకుడు వెంకటయ్య చేతిలో ఓ కాగితాన్ని కుక్కాడు. ఆ తర్వాత వాళ్ళు,

"బూటకపు ఎన్‌కౌంటర్లు - నశించాలి."

"విప్లవం వర్ధిల్లాలి."

"నూతన ప్రజాస్వామ్య విప్లవం - వర్ధిల్లాలి" అన్న నినాదాలు చేసి అక్కడకు కొంచెం దూరంలో ఆగి ఉన్న జీపెక్కి వెంటనే వెళ్ళిపోయారు. అక్కడికొచ్చిన వాళ్ళందరూ, "గీ వెంకటయ్య ఏం పాపం చేసిండని గీయన ఇల్లు పేల్చేసిండ్రు" అంటూ ఒకర్నొకరు ప్రశ్నించుకోవడం మొదలెట్టారు.

వాళ్ళల్లో చదవడం, రాయడం దెలిసిన ఓ యువకుడు వెంకటయ్య చేతిలో ఉన్న కాగితాన్ని తీసుకొని, "పోలీసులు బూటకపు ఎన్‌కౌంటర్లో మా నల్గురు నాయకులను అమానుషంగా హింసించి చంపినందుకు నిరసనగా మేం ఈ ఇంటిని పేల్చేస్తున్నాము" అని అక్కడున్న వాళ్ళందరికీ వినిపించేలా చదివేడు.

పోలీసులకు వాళ్ళ నాయకులను చంపుండ్రని నేను జెప్పిన్నా" అంటూ వెంకటయ్య మరోసారి బోరుమని ఏడ్చాడు.

"గంతగనం ఎందుకు బాధ పడ్తున్నవు వెంకటన్నా? అన్నలు గిట్లొచ్చి ఎవరిల్లన్నా బ్లాస్ట్ చేస్తే సర్కారోళ్ళు బోల్డు డబ్బులిస్తున్నారు. గా డబ్బుల్తోటి నువ్వు ఇంతకంటె పెద్దిల్లే కట్టుకోవచ్చు" అన్నాడు ఆ ఊర్లో టీచర్‌గా పనిచేస్తున్న సోమనర్సయ్య.

"మనూరి సర్పంచ్‌ను పట్టుకో... నీకాయన పైరవి జేసి, నీకు సర్కారోళ్ళ తోటి మస్తు పైసలిప్పిస్తడు" అన్నాడు వెంకటయ్య ఇంటికి దగ్గర్లోనే ఉండె కొమురయ్య.

"సర్పంచ్ నెట్ల పట్టుకోవాలె? ఆయన మనూర్లె ఉంటనే లేడాయే. అన్నల భయానికి ఆయన బొయి పట్నంల ఉంటాండె" అన్నాడు వెంకటయ్య ఇంటి దగ్గరుండే మరో వ్యక్తి వీరయ్య.

"కరీంనగర్‌కు బోతె ఆయనే దొరుకుతడు. నేను తీసికపోతలేవే వెంకటన్న" అన్నాడు ఉప్పలయ్య. ఉప్పలయ్య ఇప్పుడిప్పుడే రాజకీయాల్లో పాల్గొంటూ సర్పంచ్‌కి ఆ ఊర్లో ఏజంట్‌గా పనిచేస్తున్నాడని ఆ ఊర్లో చాలామందికి తెలుసు.

ఇదివరకు ఆ ఊర్లో ఉండె ముఖ్యమైన వాళ్ళంతా ఇప్పుడు ఆ ఊర్ని విడిచిపెట్టి కొందరు హైదరాబాద్ లోనూ, కొందరు కరీంనగర్లోనూ ఉంటున్నారు.




వాళ్ళు అప్పుడప్పుడూ మాత్రమే ఊర్లోకొచ్చి వాళ్ళ పనులు చూసుకొని వెళ్తుంటారు.

"ఇల్లొక్కదానికే కాదు, ఇంట్లో ఉన్న ధాన్యం, ఇతర వస్తువులకూ్కడా ప్రభుత్వం నష్టపరిహారం చెల్లిస్తుంది. నువ్వేం రంధి పెట్టుకోకు వెంకటన్నా! పోయినదానికంటె ఎక్కువే వసూలు చేద్దాం" అన్నాడు ఉప్పలయ్య.

అయ్యో ఉప్పలన్నా! ఏం జెప్పమంటావే. శనీశ్వరుడు నానెత్తి మీదనే కూర్చున్నడు. పోయి పోయి నేను నిన్ననే నా జివాలను అంగడికి తోలుకపోయి అమ్ముకచ్చిన. గా పైసల్ని రేపు బాంకుల తీసుకున్న అప్పుకింద కడదామనుకున్న. అవి పోయినయి. మా రాజవ్వ మీది పది తులాల బంగారు నగలు పోయినయి. పదిపుట్ల వడ్లు పోయినయి. బియ్యం పోయినయి. పెసల్లు పోయినయి. సర్వనాశనం అయిపోయిన..." అంటూ ఉప్పలయ్యను కౌగలించుకొని ఏడ్చాడు వెంకటయ్య.

"ఏమేం పోయినాయో మంచిగ యాది జేసుకొని రేపు సర్కారొళ్ళొచ్చినప్పుడు చెప్పు" అన్నాడు ఉప్పలయ్య.

"చెప్తే పోయినయన్నిస్తరా" అడిగింది అక్కడే ఉన్న ఓ ముసలావిడ.

"ఎందుకియ్యరు? మన ధన, మాన, ప్రాణాలను కాపాడే బాధ్యత సర్కారోళ్ళది. దాంట్లె ఏది పోయినా ప్రభుత్వం మనకు నష్ట పరిహారం చెల్లించాలె" అన్నాడు ఉప్పలయ్య.

"గిది బాగనే ఉన్నదే. గిట్లని నాకెరుకనే లేదు" అందా ముసలావిడ.

ఉప్పలయ్య చెప్పిన మాటలు వినగానే అక్కడ కొచ్చి వెంకటయ్య మీద, అతని భార్య మీద సానుభూతి చూపిస్తున్న వాళ్ళందరి హృదయాల్లో వాళ్ళకు తెలియకుండానే ఈర్ష్య భావం పొడసూపింది.

అయినా, అందరూ వెంకటయ్య పట్ల తమ ప్రగాఢమైన సానుభూతిని తెలియజేసి ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోవడం మొదలెట్టారు.

"పాపం వెంకటయ్య ఇప్పుడిప్పుడే కొస్త రెపరెపమంటాండు. ఈ దెబ్బతో వాని పని ఖతం" అన్నాడు అనపురం కొమురయ్య.

"గట్లెందుకంటున్నవు? తంతె బూర్లబుట్టల పడ్డట్టు ఇయ్యాళ రేపు అన్నలు ఇండ్లను బ్లాస్ట్ చేసినోళ్ళ పని కూడ బాగనే ఉంటున్నది. పైరవి మంచిగ జేసుకోవాలెగని మస్తు పైసలొస్తయట" అన్నాడు కునెబోయిన వీరయ్య. వీళ్ళిద్దరూ వెంకటయ్యింటికి చెరో పక్కన ఉంటారు. అనపురం కొమురయ్య, అనపురం వెంకటయ్య ఇద్దరూ చిన్నాయన పెద నాయన కొడుకులే.

"గట్లయితే అన్నలు మనిండ్లు బ్లాస్ట్ చేసినా మన దశ తిరుగుతుండెనేమో. అన్నలు గాపనన్న చెయ్యరైరి" అన్నాడు కొమరయ్య.

"ఈసారి అన్నలు మనూరికొచ్చినప్పుడు మా ఇండ్లు కూడ పేల్చేయండ్రి అని అడుగుదాం" అన్నాడు వీరయ్య.

"మనం వెంకటిగానోలే కొస్త తెల్లంగ పుల్లంగ లేం గద... వాళ్ళు మనిండ్లెందుకు పేల్చేస్తర్లే... వెంకటి గానికి వాని పెండ్లాంతోటి మస్తు ఆస్తొచ్చిందిలే. వాని మామకు మగ పోరగాళ్ళు లేరు గద. గట్లొచ్చిన పైసల తోటి వాడు అక్కడ కొంత భూమి, ఇక్కడ కొంత భూమి కొనుక్కొని పైకొచ్చిండు" అన్నాడు కొమురయ్య.

"గదే వాడు చేసిన తప్పు. మనూరి దొరోళ్ళు భూమిలమ్ముకొని పట్నం బొయిరి. వాళ్ళ భూములు కొనొద్దని అన్నలు చెప్పినా వినకుంట వీడు దొరోళ్ళు అమ్మిన భూములు కొన్నడు. గది మనసుల పెట్టుకునే గిప్పుడు అన్నలు వీని ఇల్లు కూలగొట్టిండ్రు" అన్నాడు వీరయ్య. అలా మాట్లాడుకుంటూ వాళ్ళు వాళ్ళ ఇళ్ళల్లోకెళ్ళిపోయి పడుకున్నారు.

"నువ్వేమన్న జెప్పు. గీ ఇండ్ల కూలగొట్టుడైతే యేం బాగలేదు. ఎక్కన్నో పోలీసులు వాళ్ళోళ్ళను ఎన్‌కౌంటర్ జేస్తే వీళ్ళొచ్చి గిక్కడ గీ వెంకటయ్య ఇల్లు కూలగొడ్తె యేమొస్తది" అన్నాడు సోమనర్సయ్య - ఆ ఊరి స్కూల్లో పని చేసే టీచర్- అతనితో పాటు అదే స్కూల్లో పనిచేసే విక్రమ్ కుమార్‌తో.

"ఏమొస్తదని కాదు. సమ్ సార్టాఫ్ ప్రొటెస్ట్. పోలీసులు బూటకపు ఎన్‌కౌంటర్లు చేసుడు తప్పు కాదా" అన్నాడు విక్రమ్ కుమార్.

"తప్పే. అది తప్పే. ఇది తప్పే."

"అంతే మరి. విప్లవకారులెప్పుడూ హింసకు ప్రతి హింస చేస్తారే తప్ప, తామే హింసను ప్రారంభించరు."

"ఏం విప్లవకారులో యేమో. విప్లవం వస్తుందని నువ్వు నమ్ముతున్నావా?"

"విప్లవం వచ్చి తీరుతుంది. విప్లవం అనివార్యం. ఈ కుళ్ళిన వ్యవస్థనూ, భ్రష్టుపట్టిన వ్యవస్థనూ సమూలంగా బ్లాస్ట్ చేస్తే తప్ప నూతన సమ సమాజం ఆవిర్భవించదు. అందుకే ఇలాంటి బ్లాస్ట్‌లు ఎన్నో జరిగితే తప్ప ఈ ఫ్యూడల్ వ్యవస్థ మొత్తం బ్లాస్టయిపోదు."

"సరె పోనీయ్... ఇంటిని బ్లాస్ట్ చేసిండ్రు... ఇంట్లో ఉన్న కాష్‌ను, బంగారాన్ని తెచ్చుకొమ్మని చెప్పి, దాన్ని కూడా వాళ్ళే తీసుకోవడమేమిటి?"

"తీసుకుంటారు. ఈ పైసల్ని వాళ్ళేమన్నా తమ సొంతానికి వాడుకుంటరనుకుంటున్నావా? వాళ్ళ కెన్ని ఖర్చులున్నాయో మనకు తెలుసు కదా! ఆ ఖర్చులన్నీ ఎక్కన్నించొస్తయి? ఈ డబ్బులేమన్న ఈ వెంకటయ్య న్యాయంగ చెమటోడ్చి సంపాయించిండా? మామగారి ఆస్తి వచ్చి పడ్తే పెద్దోడయ్యిండు."

వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకుంటూ ఆ ఊరి స్కూలు దగ్గరే ఉండే వాళ్ళ ఇళ్ళల్లోకెళ్ళి పడుకున్నారు.

ఆ మర్నాడు ఆ ఊరికి పోలీసులొచ్చారు.

పత్రికలవాళ్ళొచ్చారు. కూలిపోయిన వెంకటయ్య ఇంటిని ఫోటోలు తీశారు. ఇంటికింద ఎక్కడెక్కడ జిల్లెటిన్ స్టిక్స్ ఎన్నెన్ని పెట్టారో పరిశీలించారు. వాళ్ళ వెంట పేలుడు పదార్థాలను స్టడీ చేసే నిపుణుల్ని కూడా తీసుకొచ్చారు.

ఆ తర్వాత డి.ఎస్.పి ఆ ఊరి పంచాయతీ బోర్డు ఆఫీసులో కూర్చుని వెంకటయ్యను ఇంటరాగేట్ చేశాడు. అతనితోపాటు ఇంకో ఇద్దరు ముగ్గురు పోలీసాఫీసర్లు కూడా ఉన్నారు. ఆ ఊరి సర్పంచ్ కూడా తెల్లారేటప్పటికి ఆ ఊరు చేరుకున్నాడు ఆ ఊరి ఇతర ముఖ్యులు, కొందరు యువకులూ, పోలీసులూ ఎక్కడికి వెళ్తే అక్కడికి వెళ్ళి వాళ్ళు చేస్తున్న పనుల్ని గమనించారు.

వెంకటయ్యను పంచాయతి బోర్డు ఆఫీసు దగ్గరకు పిలిపించారు. అతడు లోపలకు వెళ్ళగానే, "నీ పేరేనా అనపురం వెంకటయ్య" అన్నాడు లోపల కూర్చొని ఉన్న డి.ఎస్.పి రాఘవరావు.

"అవునయ్యా" అన్నాడు చేతులు జోడించుకొని నిల్చున్న వెంకటయ్య.

"రాత్రి వాళ్ళొచ్చి బ్లాస్ట్ చేసింది మీ ఇంటినేనా?"

"అవునయ్యా."

"రాత్రి ఎన్ని గంటల కొచ్చిండ్రు?"

"అర్ధరాత్రి దాటిందయ్యా. టైమ్ చూళ్ళేదు."

"ఎంతమందొచ్చిండ్రు?"

"ఆర్గురున్నరయ్యా."

"వాళ్ళను గుర్తుపట్టావా?"

"చీకట్ల చూసిన... గుర్తుపట్టలేనయ్యా."

"వాళ్ళను నువ్వెప్పుడన్న ఇదివరకు చూసినవా?"

"చూసిన గుర్తు లేదయ్యా."

"మీ ఊరికి అన్నలెప్పుడొచ్చినా వాళ్ళకు నువ్వే షెల్టరిస్తవట కద. నిజమేనా?"

"గవాళ్ళకు నేనెందుకు షెల్టరిస్తనయ్యా."

"ఎందుకిస్తవో నీకె తెల్వాలె. షెల్టరిచ్చినోని ఇంటినే కూలగొట్టిండ్రు. వాళ్ళెటువంటోళ్ళో ఇప్పుడన్న నీకు ఎరుకైందా?"

"ఏమొ దొర... నాకేం ఎరుకలేదు."

"వాళ్ళకూ నీకూ దోస్తీ బాగనే ఉండని మాకు రిపోర్టులొచ్చినయ్. నువ్వు వాళ్ళకు చందాలిచ్చినవట. అన్నం పెట్టినవట. షెల్టరిచ్చినవట..."

"వాళ్ళకు చందాలిచ్చినమాట నిజమే. అన్నం పెట్టిన మాట కూడా నిజమే. గీ ఊళ్ళె ఉన్న మోతుబరి రైతులల్ల వాళ్ళకు చందాలివ్వనోళ్ళెవరో చెప్పుమనుండ్రి. అన్నం పెట్టనోళ్ళెవరో చెప్పుమనుండ్రి. ఎవ్వరో ఎందుకు మా ఊరి సర్పంచ్‌నే చెప్పుమనుండ్రి. చందాలు గాయనే వసూలు చేసి అన్నలకిచ్చిండు."

"మీ ఊళ్ళె వాళ్ళకెవరెవరు చందాలిచ్చిండ్రో వాళ్ళందరి పేర్లు చెప్పు."

"గవాళ్ళ పేర్లను నా నోటితోటి ఎందుకు చెప్పిస్తరు? నేను కంటు కావాల్నా. ఇల్లు కూలిపోయి నేనేడుస్తుంటె నన్ను గిట్లమాయింతురేంది?"

"నువ్వు వాళ్ళకు చందాలిచ్చినవు. షెల్టరిచ్చినవు. నీ ఇల్లు ఊరి బయటుండె కాబట్టి వాళ్ళకు ఇటే కలిసొచ్చింది. నువ్వు వాళ్ళతోటి ఇంత దోస్తీ చేసినా వాళ్ళు నీ ఇల్లే కూలగొట్టిండ్రు. ఎందుకంటవు?"

"ఎందుకో నాకెట్ల తెలుస్తదయ్యా? ఎక్కన్నో మీ పోలీసోళ్ళు వాళ్ళోళ్ళను చంపిండ్రట. ఆ కోపం వాళ్ళు నా ఇంటి మీద చూపిచ్చిండ్రు. ఉరిమి ఉరిమి మంగలం మీద పడ్డట్టు వాళ్ళు నా మీద పడ్డరు."

"ఆ ఇంటిని నువ్వే కట్టిచ్చినవా?"

"అవును. నేనే కట్టిచ్చుకున్న. మా నాయన ఊరి మధ్యలున్న పాతింట్ల ఉండెటోడు. అది పూర్తిగ పాడుబడిపోయింది. దాన్ని వదిలిపెట్టి మొన్న మొన్ననే నేను ఈ ఇల్లు కట్టించుకున్న."

"దాని విలువ ఎంతుంటదంటవు?"

"ఎట్ల చెప్పొస్తదుండి..."

"అందాజెంబడి చెప్పు."

"మూడు లక్షలుంటది కావొచ్చు."

"గా పెంకుటింటికి మూడు లక్షలయితదా?"

"ఇంట్ల ఓ పది వేల రూపాయల పైసలు, పది తులాల బంగారం ఉండె. గవ్వి కూడ వాళ్ళే పట్టుకపోయిండ్రు."

"మంచి పని జేసిండ్రు. మీకు గట్లనే గావాలె."

డి.ఎస్.పి అడుగుతున్న ప్రశ్నలకు వెంకటయ్య ఇస్తున్న జవాబుల్ని మఫ్టీలో ఉన్న ఓ పోలీసాఫీసర్ ఓ రిజిస్టర్‌లో రాయడాన్ని వెంకటయ్య గమనించాడు. డి.ఎస్.పి ప్రశ్నలడగడం పూర్తిచేశాక ఆ రిజిస్టర్లో వెంకటయ్యను సంతకం పెట్టమన్నారు. వెంకటయ్య దాని మీద తన వేలిముద్ర వేశాడు.

పోలీసులొచ్చి వెళ్ళిపోయిన మర్నాడే ఎం.ఆర్.ఓ వచ్చాడు. కూలిపోయిన ఇంటి చుట్టూ తిరిగాడు. స్కేలుతో ఆ ఇంటి పొడుగును, వెడల్పును కొలిపించాడు. గ్రామ పెద్దల్ని పిలిపించి, పంచనామా చేయించాడు. ఎం.ఆర్.ఓ ఊర్లోకొచ్చినప్పుడు ఆ ఊరి సర్పంచ్ కూడా అతని జీపులోనే వచ్చాడు. ఎం.ఆర్.ఓ తన రిపోర్టును ఆర్.డి.ఓకు పంపిస్తానని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత చాలా రోజుల దాకా మళ్ళీ ఎవరూ వెంకటయ్య ఇంటి వైపు రాలేదు. ఆ కూలిపోయిన ఇంటి వెనకనే వెంకటయ్య ఓ గుడిసెను నిర్మించుకొని దాంట్లోనే తన కుటుంబంతో ఉండసాగాడు.

* * *

"నువ్వు గిట్ల గీ గుడిసెల ఎన్నిరోజులుంట కూకుంటె నిన్నెవ్వడు జూస్తడు" అంటూ ఓ రోజు వెంకటయ్య దగ్గరకు ఉప్పలయ్య వచ్చాడు.

"మరేం జెయ్యమంటవు? సర్కారోళ్ళిచ్చి పైసలిస్తరంటివి కద. ఏది? ఎవ్వడు ఇటు మొకాన్నొచ్చిన పాపాన పోలేదు కద" అన్నాడు వెంకటయ్య.

"నువ్వు గిట్ల ఇంట్ల కూకుంటె నీ దగ్గరికెవ్వడు రాడు" అన్నాడు ఉప్పలయ్య.

"ఇంట్ల కూకోక ఏం జెయ్యమంటవు" అన్నాడు వెంకటయ్య.

"పట్నం బోవాలె. నాయకులను కలవాలె. పైరవీజేసి నీ ఫైలు కదిలేటట్టు జెయ్యాలె. గట్ల జేస్తనే నీకేమన్న పైసలొస్తయి" అన్నాడు ఉప్పలయ్య.

"పట్నంల నాకెవ్వడెరుకలేదు. ఎవ్వని దగ్గరకి పొమ్మంటవు? నా మొఖం ఎవ్వడు జూస్తడంటవు?"

"నేనున్న గదనే వెంకటన్న. కరీనగరం పోదాం. మన సర్పంచ్‌ను పట్టుకుందాం. అన్నీ ఆయనే చూసుకుంటడు" అన్నాడు ఉప్పలయ్య. లోపల్నించి వాళ్ళిద్దరి మాటల్ని వింటున్న వెంకటయ్య భార్య వెంకటయ్యను లోపలికి రమ్మని పిలిచింది.

"ఇంకేం ఆలోచించకుంట ఉప్పలయ్యతోటి బొయ్యి సర్పంచ్‌ను కలిసిరా పో" అంది. వెంకటయ్య బయటకొచ్చి, "సర్పంచ్ దగ్గరికి ఎప్పుడు పోదామంటవు" అన్నాడు.

"నువ్వెప్పుడంటె గప్పుడే."

"రేపు మబ్బుల్ల పోదామా?"

"పోదాం. పైసలు తయారుజేసుకో."

"ఎన్ని పైసలయితయంటవు?"

"ఓ వెయ్యి రూపాయలు తయారుజేసుకో. కోడి కూత పొద్దుండగనే లేచి మా ఇంటికి రా..."

"వెయ్యి రూపాయలా!" వెంకటయ్య నోరు తెరిచాడు.

"పట్నం బోవుడంటె ఏందనుకున్నవు? వట్టిగనే పనయితదనుకుంటున్నవా? దేనికైనా పైసలు బెట్టాలె. ఇప్పుడు ఖర్చుబెడ్తేనే రేపు మల్ల నీకు పైసలొస్తయి. వట్టిగనే వస్తయను కుంటున్నవా?"

"గట్లనేలే. నేను పైసలు తయారు జేసుకోని నువ్వన్నట్టే కోడి కూత పొద్దుండగనే నీ దగ్గరకస్త" అన్నాడు వెంకటయ్య.

కాసేపు వేరే విషయాలు కూడా మాట్లాడి ఉప్పలయ్య వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు వెంకటయ్య తెలతెలవారుతుండగానే లేచి ఉప్పలయ్య ఇంటికి వెళ్ళాడు. ఇద్దరూ కలిసి ఆ ఊరికి నాల్గు కిలోమీటర్ల దూరంలో ఉండే మెయిన్ రోడ్డు దగ్గరకు నడుచుకుంటూ వచ్చారు. అక్కడికి కరీంనగర్‌కు వెళ్ళే బస్సొచ్చింది. ఆ బస్సెక్కి ఉదయం ఎనిమిదింటి వరకే వాళ్ళు కరీంనగర్ చేరారు. వెంకటయ్యను ఉప్పలయ్య ఆటో ఎక్కించి ఓ హోటల్‌కు తీసుకెళ్ళాడు. ఆ హోటల్లో ఓ రూమ్ తీసుకున్నారు. ఉప్పలయ్య స్నానం చేసి, వెంకటయ్యను కూడా స్నానం చెయ్యమన్నాడు. తర్వాత టిఫిన్ తెప్పించాడు. ఆ తర్వాత హోటల్లోంచి బయటకొచ్చి ఆటో మాట్లాడుకొని సర్పంచ్ ఇంటికెళ్ళారు. వాళ్ళు వెళ్ళేటప్పటికి సర్పంచ్‌గారు ఇంట్లో లేరు.

"ఎక్కడకు బోయిండ్రని ఉప్పలయ్య సర్పంచ్ భార్యనడిగితే, "పొద్దున్నే ఎవరో వచ్చి ఆయన్ను మనూరికే తీసుకపోయిండ్రని చెప్పింది. "ఎప్పుడొస్తరంటే, సాయంత్రం అయితది కావొచ్చు" అందామె.

మళ్ళీ ఆటో ఎక్కి వాళ్ళిద్దరూ హోటల్‌కొచ్చారు. ఉప్పలయ్య రెండు మీల్స్‌కు ఆర్డరిచ్చాడు. భోజనం చెయ్యగానే ఉప్పలయ్య తెల్లగా తళతళ మెరుస్తున్న బెడ్ మీద పడుకొని హాయిగా గుర్రుపెట్టి నిద్రపోయాడు. మరో బెడ్ మీద పడుకున్న వెంకటయ్యకు ఎంతకూ నిద్ర రాలేదు.

ఆ సాయంత్రం కూడా వాళ్ళకు సర్పంచ్ కలవలేదు.

వాళ్ళు మళ్ళీ హోటల్‌కొచ్చారు. ఉప్పలయ్య ఆ టౌన్లో ఉన్న తన దోస్తులకు కొందరికి ఫోన్లు చేసి, వాళ్ళను తాను దిగిన హోటల్‌కు రమ్మన్నాడు. వాళ్ళొచ్చాక రాత్రి సీసాలు, సోడాలు, చికెన్, మటన్లు తెప్పించాడు. అందరూ తిన్నారు, తాగారు. వాళ్ళతో పాటు వెంకటయ్య కూడా తిన్నాడు- తాగాడు. ఆ ఖర్చంతా వెంకటయ్యనే భరించమన్నాడు ఉప్పలయ్య.



"వీళ్ళందరూ మనకు కావలసినోళ్ళే. రేపు నీ ఫైలు కదల్నాలంటె వీళ్ళందరి మద్దతు గావాలె. అందుకే వీళ్ళకు పార్టీ ఇచ్చిన" అన్నాడు ఉప్పలయ్య, బయట్నించి వచ్చినవాళ్ళు వెళ్ళిపోయాక.

ఆ మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకే సర్పంచ్ ఇంటికి వెళ్ళారు. సర్పంచ్ ఇంట్లోనే ఉన్నాడు.

"నిన్న నేను మనూర్లోనే ఉన్న గద. గీ వెంకటయ్యను నేను నిన్న మనూర్లోనే కలిసెటోన్ని గద. ఇక్కడికెందుకు తేసుకచ్చినవు" అన్నాడు సర్పంచ్ రాజిరెడ్డి ఉప్పలయ్యనూ, వెంకటయ్యనూ చూడగానే ముఖం చిట్లించి.

"మీరు నిన్న మనూరికొస్తున్నట్టు నాకు ఎరుకలేదు" అన్నాడు ఉప్పలయ్య.

"ఎరుకలేకపోవుడేంది? బుధవారం వస్తనని నీకు చెప్తిని గద. నువ్వన్ని గిట్లాటి పనులే జేస్తవు. అనవసరంగ వెంకటయ్య తోటి ఖర్చుపెట్టిచ్చినవు." వినుగ్గా అన్నాడు సర్పంచ్.

"మీరొచ్చేది వచ్చే బుధవార మనుకున్న. ఈ బుధవార మనుకోలేదు. అయినా, మేం నిన్నొచ్చుడు మంచిదే అయింది లేండ్రి. రేపు ఈయన ఫైలు చూసెటోళ్ళందర్ని కలిసినం లేండ్రి" అన్నాడు ఉప్పలయ్య.

"అసలు సంగతేందో చెప్పు."

"మన వెంకటయ్య ఇంటిని అన్నలు బ్లాస్ట్ చేసి రెండు నెలలయిపాయె. ఆయనకు నష్టపరిహార మేమన్న ఇప్పిచ్చుడం లేదా" అన్నాడు ఉప్పలయ్య.

"ఎందుకు ఇప్పించొద్దు? తప్పకుంట ఇప్పియ్యాలె. ఇంజనీరొచ్చి వాల్యూయేషన్ చేసిండా" అన్నాడు సర్పంచ్.

"రెండుమూడు సార్లు పోలీసులు మాత్రం వచ్చి పోయిండ్రు. గంతే. ఇంకెవ్వరు రాలె" అన్నాడు వెంకటయ్య.

"పోలీసులు కాదులే. ఆర్ అండ్ బి ఏ.ఇ రావాలె. ఈ.ఈ రావాలె. వాల్యూయేషన్ జరగాలె. అప్పుడే నీ ఫైలు కదుల్తది. నేనియ్యాళ మన ఎం.ఎల్.ఏ సాబ్‌ను కలిసి ఆర్ అండ్ బి ఈ.ఈకి ఫోన్ జేపిస్త. వాల్యూయేషన్ జర ఎక్కువ జరిగేటట్టు చూడమని చెప్పుత. రెండు మూడు రోజులల్ల ఆర్ అండ్ బి వోళ్ళు వస్తరు. వాళ్ళ తోటి జర మంచిగ రాయించుకోండ్రి" అన్నాడు సర్పంచ్.

"నేను వాళ్ళ తోటి మంచిగనే రాయిస్తగని మీరైతే వాళ్ళను తొందరగ పంపించుండ్రి" అన్నాడు ఉప్పలయ్య.

"తొందరగనే పంపిస్త పోండ్రి. ఎం.ఎల్.ఏ సాబ్‌తోటి ఒక్క ఫోన్ చేపిస్తే వాడే ఉచ్చపోసుకుంట ఉరికొస్తడు. నాకు జర సిటీకి పొయ్యే పనిబడ్డది. బయిల్దేరుతున్న. అక్కన్నే ఎం.ఎల్.ఏ సాబ్‌ను సుత కలుస్త. మీరింక పోయిరాండ్రి" అన్నాడు సర్పంచ్ లేచి నిల్చొని.

ఉప్పలయ్య, వెంకటయ్య ఆయనకు నమస్కారం చేసి బయటకొచ్చారు. హోటల్ రూమ్ ఖాళీ చేసి బస్సు స్టేషన్‌కొచ్చి బస్సెక్కి మెయిన్ రోడ్డులో ఉన్న వాళ్ళూరి బస్‌స్టాప్‌లో దిగి నాల్గు కిలోమీటర్లు నడిచి వాళ్ళూరు చేరుకునేటప్పటికి మధ్యాహ్నం దాటింది.

బస్సులో కూర్చున్నాక వెంకటయ్యతో ఉప్పలయ్య, "రేపు ఆర్ అండ్ బి ఇంజనీర్ వచ్చినప్పుడు మీ ఇంట్ల బ్లాస్టింగ్ జరిగినప్పుడు ఏమేం వస్తువులున్నయో జర జాగ్రత్తగ చెప్పు. కలర్ టీవీ, ఫ్రిజ్, గ్రైండర్, వాషింగ్ మెషీన్ - ఇయ్యన్నీ ఉన్నయని చెప్పు. అట్లనే ఇంటికి పెట్టిన కర్రంతా టేకు కర్రే అని చెప్పు. బునాది పది ఫీట్ల వరకు తవ్వించిన్నని చెప్పు. ఇంకా బట్ట, బాతా, బోళ్ళు, కుర్చీలు, బెంచీలు చాలా పోయినయని చెప్పు. సమఝయిందా" అన్నాడు.

"కలర్ టీవీలు, ఫ్రిజ్‌లు మా ఇండ్లెక్కడున్నయి" అన్నాడు వెంకటయ్య.

"ఉన్నయో, లేవో. గది నీకు అనవసరం. ఉన్నయని నేను చెప్పమంటున్న గదా. నేను చెప్పమన్నట్టు చెప్పితెనే రేపు నీకేమన్న పైసలొస్తయి" అన్నాడు ఉప్పలయ్య.

"నువ్వు చెప్పమన్నట్టే చెప్పుత. నాదేం పోయింది" అన్నాడు వెంకటయ్య విషయం అర్థం చేసుకని.

**వారం రోజుల తర్వాత ఆర్ అండ్ బి ఏ.ఇ వచ్చాడు. ఇంటి నంతా కొలిపించాడు. కూలిన ఇంట్లో ఉన్న ఇటుకల్ని, కర్రల్ని, రాళ్ళని, వంట పాత్రల్ని, బట్టల్ని, ఫర్నిచర్‌నీ పరీక్షించాడు. వివరా లడిగి రాసుకున్నాడు.**

వారం రోజుల తర్వాత ఆర్ అండ్ బి ఏ.ఇ వచ్చాడు. ఇంటినంతా కొలిపించాడు. కూలిపోయిన ఇంట్లో ఉన్న ఇటుకల్ని, కర్రల్ని, రాళ్ళని, వంట పాత్రల్ని, బట్టల్ని, ఫర్నిచర్నీ- అన్నింటినీ పరీక్షించాడు. వెంకటయ్యను చాలా ప్రశ్నలడిగాడు. ఇంట్లో ఎన్నెన్ని వంట పాత్రలున్నాయో, వాట్లో ఇత్తడివి ఎన్నో, స్టీలువి ఎన్నో మొదలైన వివరాలన్నీ వెంకటయ్యనడిగి రాసుకున్నాడు. కర్రను పరీక్షించి అది టేకుదేనని నిర్ధారించాడు. ఎలక్ట్రానిక్ గూడ్స్ ఏమేం ఉన్నాయో అడిగాడు. వెంకటయ్య కలర్ టీవీ, ఫ్రిజ్ మొదలైనవన్నీ ఉన్నాయని చెప్పాడు. అవి ఏ కంపెనీలవో అడిగాడు. పక్కనే ఉన్న ఉప్పలయ్య కంపెనీలను గురించి, వాటి ధరల్ని గూర్చి చెప్పడమే కాకుండా, వాటి బిల్స్‌ని కూడా వెంకటయ్య ద్వారా ఆర్ అండ్ బి వాళ్ళకు అందేట్టుగా చేశాడు. అన్నీ వివరంగా రాసుకొని ఏ.ఇ, అతనితో వచ్చిన ఇతర ఆర్ అండ్ బి అధికారులు వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళేముందు "ఇంటిని ఇన్సూర్ చేశారా" అని అడిగితే, వెంకటయ్య "చెయ్యలే"దన్నాడు. తన వాల్యూయేషన్ రిపోర్టును ఈ.ఈకి సబ్‌మిట్ చేస్తానని, అక్కణ్ణించి అది డీ.ఇకి వెళ్తుందని ఏ.ఇ ఉప్పలయ్యకు చెప్పాడు. ఈలోగా వెంకటయ్య తన ఇంటిని ఇన్సూర్ చెయ్యలేదని ఆ జిల్లాలో ఉన్న నాల్గు ఇన్సూరెన్స్ కంపెనీవాళ్ళ నుండి సర్టిఫికెట్లు తెచ్చుకోవాలని చెప్పాడు.

ఆ మర్నాడు ఆ ఊర్లో ఉండే అపొజిషన్ పార్టీ లీడర్ పోచయ్య వచ్చి వెంకటయ్యను కలిశాడు.

"ఏమే వెంకటన్న! నష్టపరిహారం కోసం పైరవీ జోరుగా చేస్తున్నవట కద" అన్నాడు పోచయ్య.

"అంతా గా ఉప్పలయ్యే చేస్తున్నాడు. నేనేం జేస్తలేను" అన్నాడు వెంకటయ్య.

ఇద్దరూ ఇంటి బయటున్న వేపచెట్టు కింద మంచం వేసుకొని కూర్చున్నారు.

"నీ ఇల్లు మొత్తం టేకు కర్రతోటే కట్టిచ్చినవా? నీ ఇంట్ల కలర్ టీవీలు, ఫ్రిజ్‌లు ఉండెనా? గవ్వన్ని నీ ఇంటికెప్పుడొచ్చినయే వెంకటన్న, నాకు తెల్వక అడుగుతాను, ఏమనుకోకు" అన్నాడు పోచయ్య.

"ఇండ్ల అనుకునుడేమున్నదిలే. ఉప్పలయ్య గట్ల చెప్పమన్నడు. గట్ల చెప్పితెనే నాల్గు పైసలొస్తయట. గందుకే నేను గట్ల చెప్పిన" అన్నాడు వెంకటయ్య.

"వాడెట్ల చెప్పమంటే గట్ల చెప్పుతవా? వాడు గడ్డి తినమంటే తింటవా? చెప్పంగనే అయిపోయిందను కున్నవా? ఇల్లు అలకంగనే పండగైపోయిందను కుంటున్నవా? వానింట్ల టీవీ లేదు గీవీ లేదు. ఫ్రిజ్ లేదు గ్రిజ్ లేదు. వాడు పెట్టింది టేకు కర్ర కాదు వేప కర్ర అని నేను రేపుబోయి ఆర్ అండ్ బి వోళ్ళకు దరఖాస్తు ఇచ్చొస్త. గవర్నమెంట్ సొమ్ము పుణ్యాని కొస్తాందని ప్రతోక్కడు తిందామనుకునెటోడే. గట్లాటి

వేయించారు. ఊర్లో ఉన్న బల్లపీటలనన్నింటినీ తెప్పించి స్టేజి నిర్మించారు. టెంట్ కింద రెండు మూడు వందల కుర్చీలను వేయించారు. స్టేజిమీద మైక్‌సెట్ అరేంజ్ చేసి మూడు నాల్గుచోట్ల స్పీకర్లను పెట్టించారు.

పెద్ద సౌండ్‌తో సినిమా పాటల క్యాసెట్స్ వేయడంతో ఊర్లో ఉన్న పిల్లలూ, పెద్దలూ అందరూ బిలబిలమంటూ అక్కడకు పరిగెత్తుకొని వచ్చారు.

ఆ తర్వాత కాస్సేపటికి పెద్ద దుమ్ము లేపుకుంటూ కార్లొచ్చాయి. జీపులొచ్చాయి. వాటిల్లోంచి చాలామంది అధికారులూ, అనధికారులు దిగారు.

ఎం.ఎల్.ఏగారు కారు దిగి, సరాసరి వాటర్ ట్యాంక్ దగ్గరకెళ్ళి దాన్ని లాంఛనంగా ప్రారంభించి, స్టేజి మీదికొచ్చేసి, సభలో కూర్చున్న ప్రజలందరికీ వందనం చేశాడు.

"ఎం.ఎల్.ఏ గార్కి జై" అన్న నినాదాలతో సభంతా మారుమోగిపోయింది.

ఇద్దరుముగ్గురు ఫోటోగ్రాఫర్లు అదేపనిగా ఎం.ఎల్.ఏగార్ని ఫోటోలు తీయసాగారు.

ఆ తర్వాత సభ ప్రారంభమైంది.

మొదలు సర్పంచ్, ఆ తర్వాత జిల్లా నాయకులు మాట్లాడారు.

ఆ తర్వాత ఎం.ఎల్.ఏగారు లేచారు. ఎం.ఎల్.ఏ నరసింహారావుకు అరవై ఏళ్ళుంటాయి. ఆ నియోజకవర్గం నుండి ఆయన వరుసగా ఆరుసార్లు ఎం.ఎల్.ఏగా ఎన్నికయ్యారు.

ఏ పార్టీ అధికారంలో ఉంటే ఆయన ఆ పార్టీలోకి మారారు.

మొత్తమ్మీద ఆ నియోజకవర్గం వరకు మాత్రం ఆయన ఎదురు లేని నాయకుడన్న ముద్ర ఆయన మీద పడిపోయింది.

ఎం.ఎల్.ఏ గారు ఏం మాట్లాడ్తారో విందామని ప్రజలంతా ఆసక్తితో ఎదురు చూడసాగారు. ఎం.ఎల్.ఏగారు గొంతు సవరించుకొని ఉపన్య సించడం మొదలెట్టాడు.

"మహాజనులారా! ఈ రోజు మీ ఊర్లో మీకందరికీ మంచి నీళ్ళ సప్లై కోసం నిర్మించబడిన వాటర్ ట్యాంకును ప్రారంభించడం కోసం నేను మీ ఊరికొచ్చాను. మీకిక ఇప్పట్నించి మంచినీటి సమస్య ఉండదు. ఇలా ఒకదాని తర్వాతొకటి మీ సమస్య లనన్నిటినీ తీర్చడానికి నేను అహర్నిశలు పాటు పడ్తున్నానని మీకందరకూ తెలును... అందుకే మీరు నన్ను ఆరుసార్లు గెలిపించారు."

సభ చప్పట్లతో మారుమోగిపోయింది. "ఎం.ఎల్.ఏగార్కి జై" అన్న నినాదాలు మరోసారి మిన్నుముట్టాయి.

కాస్సేపాగి ఎం.ఎల్.ఏగారు మళ్ళీ మొదలెట్టాడు. ఆయన ఆ నియోజకవర్గానికి చేసిన సేవలన్నింటినీ ఏకరవు పెట్టాడు. తర్వాత ఆయన గొంతు చాలా గంభీరంగా మారింది.

"చాలా విచారించదగ్గ విషయమేమిటంటే, ఈనాడు సమాజంలో నైతిక విలువలు పూర్తిగా దిగజారిపోయాయి. ప్రతివాడూ ఎలాగైనా తన జేబు నింపుకోవాలని ప్రయత్నించేవాడే తప్ప సమాజం కోసం ఏమన్నా చేద్దామని ఆలోచించడం లేదు. ప్రతివాడూ డబ్బు సంపాదించడాన్నే తన లక్ష్యంగా పెట్టుకుంటున్నాడు తప్ప దేశాన్ని గూర్చి ఆలోచించడం లేదు. డబ్బు సంపాదించడం కోసం ఎంత గడ్డి కరవడానికైనా సిద్ధమౌతున్నారు. ఇలా నైతిక విలువలు భ్రష్టు పట్టిపోవడం చూస్తోంటే నాకు చాలా బాధ కలుగుతున్నది. సొంత లాభం కొంత మానుకు పొరుగు వాడికి తోడు పడవోయ్ అన్నారు. కానీ, సొంత లాభం ఎవడు మానుకుంటు న్నాడు? ఎవడూ మానుకోవడం లేదు. అలాంటప్పుడు సమాజం ఎలా బాగు పడ్తుంది? మీరందరూ ఈ విషయాన్ని గూర్చి ఆలోచించాలి. సమాజ శ్రేయస్సు కోసం నా వంతు కర్తవ్యంగా నేనేం చేస్తున్నానని మీరంతా ఆలోచించాలి. దేశం నాకేమిచ్చిందని కాదు, దేశానికి నేనేమిచ్చానని మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోవాలి. ఇవ్వాళ ఎన్నో చోట్ల హింస, విధ్వంసం పెచ్చుపెరిగిపోతున్నాయి. ప్రభుత్వ ఆస్తుల్ని యధేచ్ఛగా నాశనం చేస్తున్నారు. బస్సుల్ని కాల్చేస్తున్నారు. ఇండ్లను బ్లాస్ట్ చేస్తున్నారు. దీనికంతటికీ కారణమేమిటి? నైతిక విలువలు దిగజారిపోవడమే. బ్లాస్టయిపోతున్నవి ఇండ్లు కాదు, నైతిక విలువలు. మన సంప్రదాయాలు, మన ఆచారవ్యవహారాలు, మన నైతిక విలువలు- అన్నీ బ్లాస్టయిపోతున్నాయి. మనలోని మానవత్వం, మంచితనం బ్లాస్టయిపోతున్నాయి. మనలోని సభ్యతా, సంస్కారాలు బ్లాస్టయిపోతున్నాయి. మనలోని బాధ్యతలు, మన విధులు, మన అంతరాత్మలు బ్లాస్టయిపోతున్నాయి. ఈ పరిస్థితి




మారితే తప్ప ఈ దేశం బాగుపడదు. బ్లాస్ట్ అనేది బ్లాస్టయిపోతే తప్ప ఈ దేశం బాగుపడదు. నైతిక విలువల్ని పునరుద్ధరించడం కోసమే నేను కంకణం కట్టుకున్నాను. ఆ లక్ష్య సాధన కోసమే నా శేష జీవితాన్ని వినియోగించదల్చుకున్నాను" అంటూ ఎం.ఎల్.ఏగారు చాలా ఆవేశంగా తన ఉపన్యాసాన్ని ముగించారు.

రెండు మూడు నిమిషాల వరకు సభలో ఉన్న ప్రజలందరూ చప్పట్లు కొట్టారు. ఎం.ఎల్.ఏగారు ఎంత అద్భుతంగా మాట్లాడారని వేనోళ్ళ కొనియాడారు.

ఆ తర్వాత ఎం.ఎల్.ఏగారు వృద్ధాప్య పింఛన్లు లభించినవారికి చెక్కుల్ని అందజేస్తూ అదే సందర్భంగా అనపురం వెంకటయ్యను కూడా పిలిచి అతని ఇంటిని అన్నలు బ్లాస్ట్ చేసినందుకు నష్టపరిహారంగా ప్రభుత్వం మూడు లక్షల రూపాయల్ని చెల్లిస్తున్నదని ప్రకటించి అనపురం వెంకటయ్యకు ఎం.ఎల్.ఏ గారు మూడు లక్షల రూపాయల చెక్కును అందజేశారు. మరోసారి అందరూ చప్పట్లు కొట్టారు. వెంకటయ్యంత అదృష్టవంతుడు మరొకడు లేడన్నారు.

సాయంత్రం నాలుగింటికి సభ ముగిసింది. బయట్నించి వచ్చినవాళ్ళంతా కార్లెక్కి, జీపులెక్కి మరో ఊర్లో సభ ఉందని చెప్పి దుమ్ము లేపుకుంటూ వెళ్ళిపోయారు.

చెక్కు జేబులో పెట్టుకొని వెంకటయ్య ఇంటి దారి పట్టాడు. ఈ డబ్బుతో కూలిపోయిన ఇంటిని మళ్ళీ నిర్మించుకోవాలని కలలుగనటం మొదలెట్టాడు.

వెంకటయ్య ఇంటికొచ్చి తన భార్యతో "చెక్కు ఇచ్చింద్రు. దీన్ని ఎం.ఎల్.ఏ సాబ్ తన చేతులతోటి నా చేతిలో బెట్టిండు" అని సంతోషంతో చెబుతుండ గానే, "వెంకటన్నా!" అని పిలుస్తూ వాళ్ళింటికి ఉప్పలయ్య వచ్చాడు. వెంకటయ్య వెంటనే ఆయనను వేపచెట్టు కింద మంచం వేసి కూర్చోబెట్టాడు.

"ఏం వెంకటన్నా! ఇప్పుడన్న సంతోషంగున్నవా? పైసలు ఖర్చయిపోతున్నయని అప్పుడు తెగ రంది పడ్తివి గదా" అన్నాడు ఉప్పలయ్య.

"ఏదో తెల్వక..." అన్నాడు వెంకటయ్య.

"మరి ఈ మూడు లక్షలు నాయే అనుకుంటాన్నవా ఏంది? ఈ పైసల్తోటి ఏం చేద్దామనుకుంటున్నావు?"

"ఏం జేస్త? మల్ల ఇల్లు కట్టుకుంట."

"కట్టుకుంటె కట్టుకుందువుగని. రేపు పొద్దుగాల బాంకుకు బొయి, ఆ చెక్కును విడిపించుకో. ఎవరికిచ్చే పైసలు వాళ్ళకిచ్చినంక మిగిలిన పైసల్తోటి ఇల్లే కట్టిచ్చుకో. ఇంకేమన్న జేసుకో. నీకిచ్చింది క్రాస్ చెక్కు. అంటే, ఈ డబ్బుల్ని మొదలు నీ ఎకౌంటుల వేస్తరు. తర్వాత నువ్వు మరో చెక్కు బాంకోళ్ళ కిచ్చి ఈ పైసలు దీసుకోవాలె. నీకైతే మనూరి గ్రామీణ బాంకుల ఎకౌంటున్నది గద" అన్నాడు ఉప్పలయ్య.

"మాగున్నది" అన్నాడు వెంకటయ్య.

"అయితే, మన పని పక్కా అయిపోయినట్టే. రేపు కాష్ తీసుకోంగనే ఎవరికెంతియ్యాల్నో నేనో కాగితం మీద రాసిస్త. రేపు నేను గూడ నీతో పాటు బాంకు కస్త" అన్నాడు ఉప్పలయ్య.

"ఎవరికెంతియ్యాల్నట. అది గూడ జెప్పు" అన్నాడు వెంకటయ్య.

"ఎం.ఎల్.ఏ సాబ్‌కు టెన్ పర్సెంట్, అంటే, ముప్పై వేలు. గట్లనే ఇ.ఇ సాబ్‌కు టెన్ పర్సెంట్. ఏ.ఇ సాబ్‌కు టెన్ పర్సెంట్. డి.ఇ సాబ్‌కు టెన్ పర్సెంట్. రెవెన్యూవోళ్ళకు టెన్ పర్సెంట్. ఇద్దరు సూపర్‌వైజర్లకు ఫైవ్ ఫైవ్ పర్సెంట్. ఇద్దరు సూపరింటెండ్లకు ఫైవ్ పర్సెంట్. ఇద్దరు సీనియర్ అసిస్టెంట్లకు ఫైవ్ పర్సెంట్. నల్గురు జూనియర్ అసిస్టెంట్లకు ఫైవ్ పర్సెంట్. పోలీసోళ్ళందరికి కలిపి టెన్ పర్సెంట్. ఇక పోతే సర్పంచ్‌కు ఫైవ్ పర్సెంట్. అప్పొజిషనోడు పోచయ్యకు టూ పర్సెంట్. ఇకపోతే..."

వెంకటయ్య నోరు తెరచుకొని ఉప్పలయ్యకేసి అలాగే చూస్తూ ఉండిపోయాడు.

"ఇక పోతే నాకో ఫైవ్ పర్సెంట్" అన్నాడు ఉప్పలయ్య.

"నాకీ పైసలొద్దు. ఈ ముదనష్టపు చెక్కు నువ్వే తీసుకో" అంటూ వెంకటయ్య తన జేబులో ఉన్న చెక్కును తీసి ఉప్పలయ్య చేతిలో పెట్టబోయాడు. ఉప్పలయ్య అతన్ని వారిస్తూ, "గీ క్రాస్డ్ చెక్కును నేనేం జేసుకుంట. దీన్ని నువ్వే విడిపించాలె. నీకింకో విషయం చెప్పడం మరచే పోయిన" అన్నాడు ఉప్పలయ్య.

"ఇంకేమిటి" అన్నట్టుగా చూశాడు వెంకటయ్య.

"దీంట్లో అన్నలక్కూడా టెన్ పర్సెంటియ్యాలె" అన్నాడు ఉప్పలయ్య.

వెంకటయ్యకు ఒళ్ళంతా గిర్రున తిరుగుతున్నట్ట నిపించింది. ఏ క్షణంలోనైనా కింద పడిపోతానని పించింది.

"ఏం భయపడకు. ఈ పర్సెంటేజిలన్నీ పోయినంక కూడ నీకు కొంచెం పైసలు మిగుల్తయి" అన్నాడు ఉప్పలయ్య.

"వొద్దు... వొద్దు. నాకీ పైసలు వద్దే వద్దు" అంటూ జేబులో ఉన్న చెక్కును చింపెయ్యబోతున్న వెంకటయ్య చేతుల్లోంచి చెక్కును ఉప్పలయ్య తన చేతిలోకి లాక్కున్నాడు. "నీకు పిచ్చిగిన లేచిందా? రేపటొర్కె నీ పిచ్చి కుదుర్తదిలే. రేపు నేను మల్లొస్త" అంటూ, "ఏమే రాజవ్వ! నీ పెనిమిటిని జర జూసుకో. జర సమఝాయించి దార్ల బెట్టు. రేపు నేను మల్లొస్త" అన్నాడు అక్కడే నిల్చున్న వెంకటయ్య భార్య రాజవ్వకేసి చూసి. ఆమె "సరే"నన్నట్టుగా తలూపింది. ఉప్పలయ్య మంచం మీదినుంచి లేచి చెక్కు జేబులో పెట్టుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు. ■

# చలికాలం, ఒక మేఘం, అంతే కథ!

• వి. చంద్రశేఖరరావు
• డిజిటల్ చిత్రాలు: నర్సిం

లోకేష్ మరణం దగ్గర మొదలు పెడదామను కొని, లోపలేదో కదిలినట్లయి, గొంతు కలేదో పాడినట్లయి- కథను నేను హైదరాబాద్ స్టేషన్‌లో దిగిన క్షణం దగ్గరే మొదలు పెట్టడానికి నిర్ణయించుకొన్నాను.

నల్లని పెను మబ్బు సినిమాల్లో చూసే స్పెషల్ ఎఫెక్ట్ దృశ్యంలా నగరాన్ని కప్పివెయ్యటం చూసి నేను నివ్వెరపోయాను. యుద్ధం, మందుగుండు వాసన, పురాతనమైన గాయం, ఒంటరి కోట, యోధుడి దిగులు లాంటి ప్రతీకలు ఎందుకో వెంటనే గుర్తుకొచ్చాయి. హైదరాబాద్‌లో నేను గడిపిన ఇరవైనాలుగు గంటలూ ఈ నల్లమబ్బు గురించిన పరిశోధనగానే మిగిలిపోయింది.

నిజానికి నేను హైదరాబాద్ వచ్చిన కారణం వేరు. ఒక ప్రియురాలికి లేదా ఫియాన్సీకి కానుకలేవో ఇవ్వడానికి అనే అతి మామూలు కారణం. ఖరీదైన ఫ్రెంచ్ సెంట్ బాటిల్, పెర్ఫ్యూమిక్ గార్డెన్ అనే ఎరోటిక్ కావ్యం, 'మారేజ్ అండ్ హిందూ సొసైటీ' అనే వ్యాసాల పుస్తకం- మూడింటినీ గిఫ్ట్ పేపర్‌లో చుట్టి- మోహిని అనే పేరున్న తన ప్రియురాలికి అందజెయ్యమని ఒక మిత్రుడి కోరిక- ఇవాళ్ళ తర్వాత ఒక విసుగులా, అనిష్టంగా హైదరాబాద్‌లో దిగాను.

ఉదయం ఏడు గంటలకు ట్రైన్ దిగాను. వాతావరణమంతా చీకటి చీకటిగా ఉంది. ప్లాట్‌ఫామ్‌లో లైట్లు ఇంకా వెలుగుతున్నాయి. ఏమిటీ వింత అనుకుంటూ కిందకు దిగాను.

'లోకేష్! నీ మరణానికి మేం రోదించకూడదను కున్నాము. కానీ, సాధ్యం కావటం లేదు' అంటూ ఒక ప్లకార్డ్ పట్టుకున్న అమ్మాయి ప్లాట్‌ఫాంపై మౌనంగా నడిచి వెళ్తుంది. చూస్తుండగానే ఆ అమ్మాయి ప్లకార్డ్‌తో సహా గుంపులో మాయమైంది. క్షణాల్లో మళ్ళీ ఆ అమ్మాయే, అదే ప్లకార్డ్‌తో మరో దిశలో వెళ్తుండటం కనిపించింది. ఆ అమ్మాయిని ఎక్కడో చూసినట్టుగా గుర్తు. గుర్తు చేసుకోవడానికి వీలు లేకుండా లోకేష్ మరణవార్త గుండెపై దెబ్బలా తగిలింది. ఆ అమ్మాయిని ఆపి, 'నన్ను లోకేష్ తెలుసా' అని అడగాలనిపించింది.

అయితే, ఈ లోపలే వెనక నుండి జనం తోసేయటం మొదలుపెట్టారు. గేటు దగ్గర టికెట్ ఇచ్చిన తర్వాతగాని ఆ మేఘాన్ని నేను గమనించలేదు. విశాలమైన మచ్చలా, అంత నల్లగా, అంత గాఢంగా మేఘం ఉండటము-నేను విస్తు పోయాను. ఉహూఁ. దీనమైన వర్షమో, మరింత పెను విపత్తో- వాటన్నిటికీ సూచికలా ఉందా మబ్బు. అయితే, మిగిలిన జనం ఎవరూ ఆ మేఘాన్ని పట్టించుకొన్నట్టు లేదు. అదో మామూలు విషయంలా యథావిధిగా సాగిపోతోంది జీవితం. స్టేషన్ బయట సిటీ బస్సులు బారులు తీరి నిలబడ్డాయి. ఆటోలు ముసిరిన కందిరీగల గుంపులా ఉన్నాయి. మెడలో ఎయిర్ బాగ్ చేతిలో గిఫ్ట్ పాక్- నేను బయట నిలబడి మేఘాన్ని చూస్తున్నాను. సామూహిక మరణాన్ని చూసినంతగా గుండె కలత చెందింది. 'ఏమి మబ్బులివి? జాలి ఏం క్రోధాగ్ని కీలల' అంటూ పాతకాలపు కవుల పద్యాలేవో గుర్తుకొచ్చాయి. అదో పాపిలాగా, ముప్పులాగా. ఆకాశమంతా కాకుండా, కొన్ని ప్రదేశంలోనే, బహుశా హైదరాబాద్ పైనే నిలబడి ఉందేమోననిపించింది.

మాట్ చేసుకొన్న యువకుడొకడు నా వైపు నడుచుకుంటూ వచ్చి 'ఆర్ యూ న్యూ టు దిస్ సిటీ' అంటూ పలకరించాడు. నేను మాట్లాడకుండానే అతను చేయిలు సాచి, 'వెల్కం టు సైబర్ సిటీ. ఐ యామ్ అర్వి సాకినేని' అంటూ పరిచయం చేసుకున్నాడు. 'సైకోసాఫ్ట్‌వాళ్ళ అడ్వైజర్ ఏజెన్సీ మాది. మా దగ్గర అన్ని రకాల సాఫ్ట్‌వేర్ పాకేజీలు దొరుకుతాయి. మా వెబ్ అడ్రసు డబ్ల్యుడబ్ల్యుడబ్ల్యు సాకినేని.కామ్. గుర్తుంటుంది కదూ' అంటూ వెనక్కు తిరిగాడు. నలుగురు వస్తాదుల్లాంటి, రౌడీల్లాంటి కుర్రాళ్ళు చేతుల్లో సూదులు, ఏవో రంగుల యాసిడ్ బాటిళ్ళు పట్టుకొని నావైపు వచ్చారు. నేను ఉలిక్కి పడ్డాను. ఆ నలుగురూ నా చుట్టూ మూగి, 'వాటీజ్ దిస్' అని అరుస్తుండగానే చొక్కా బటన్స్ పైకి తీసి, చొక్కా పైకి లాగి, ముంజేతిపై సూదితో 'పచ్చబొట్టు' (టాటూ), ఆకుపచ్చరంగులో డబ్ల్యుడబ్ల్యుడబ్ల్యు సాకినేని.కామ్ అంటూ పొడిచారు. భయంతో బిగుసుకుపోయాను. 'సాకినేని అండ్ కో తరఫున ఇదో కాంప్లిమెంట్ సర్. నైస్ మీటింగ్ టు యు' అంటూ వస్తాదుల్లాంటి కుర్రవాళ్ళతో సహా ముందుకు కదిలాడా యువకుడు.

ఆశ్చర్యం నుండి తేరుకోక మునుపే, మరో యువకుడు సీదా టక్ చేసుకొని టై కట్టుకొని, 'సర్! ఐయామ్ ఆర్ ప్రమ్ వెబ్ పీపుల్! ఇస్రో టెక్ వాళ్ళ ప్రతినిధులం. లాప్‌టాప్‌లు, సర్వర్లు మా స్పెషాలిటీ' అన్నాడు. నేను అతని వైపు భయంగా చూస్తూ రెండు చేతుల్నీ బిగించి పట్టుకున్నాను. 'హలో' అంటూ నవ్వులీ గొంతు వినబడింది. ఈసారి ఆడ వస్తాదులు. నా చొక్కా కాలరును వెనక్కు లాగి, వీపుపై నవ్వుగా పొడిచారు డబ్ల్యుడబ్ల్యుడబ్ల్యు వెబ్‌పీపుల్.కామ్ అని. వినయంతో, 'థ్యాంక్స్ సర్' అంటూ ముందుకు కదిలాడు. మరింక ఎటూ చూడకుండా రోడ్డువైపు నడక సాగించాను. రోడ్డుపైకి చేరేలోపల సుమారు పదిహేను చోట్ల నా శరీరంపై పచ్చబొట్లు పొడిచారు. నా శరీరం సొంత రంగును కోల్పోయి బొమ్మల మ్యూజియంలా తయారైంది. అప్పటికి ఉదయం ఎనిమిది అయింది. క్రమంగా సూర్యుడు పైకి వచ్చి మబ్బు విడిపోతుందనుకున్నాను. కానీ, అది మరింతగా చిక్కబడినట్లయి, నిరసనను సూచించే విశాలమైన నల్లజెండాలా నిలబడి ఉంది.

పేపర్ స్టాల్ వైపు వెళ్ళి 'లోకేష్ పత్రిక' అడిగాను. 'ఈ వారం పత్రిక రాలేదు. ఈ ఒక్క షీటు మాత్రం ప్రింటు చేశారు' అంటూ ఒక పేపరు ఇచ్చారు. ఆశ్చర్యంగా నవ్వుతున్న లోకేష్ ఫోటో ఉంది అందులో. 'లోకేష్ మరణం- ఒక నిజం, ఒక విషాదం' అని రాసి ఉంది ఫోటో కింద. చుట్టూ నల్లరంగు బోర్డర్. హఠాత్తుగా ప్లకార్డు పట్టుకొన్న అమ్మాయి గుర్తుకొచ్చింది. లోకేష్ పత్రికలో ఒకసారి ఆ అమ్మాయి ఫోటో చూశాను. అవే పోలికలు. ఎక్కడో జర్నలిస్టుగా పనిచేస్తుందని చెప్పాడు. పేపర్ చదువుతుండగా కాలిపై ఏదో పాకుతున్నట్టు తోచి- ఎవరో కింద కూలబడి కాలిపై పచ్చబొట్టు పొడుస్తున్నాడు. డబ్ల్యుడబ్ల్యుడబ్ల్యు ఆల్వావిరియాని.కామ్ అంటూ అక్కడ నుండి పరిగెత్తుకుంటూ వెళ్ళి అయిదో నంబరు బస్సు ఎక్కాను. బస్సు ఎక్కి మసాబ్ టాంక్ దగ్గరున్న వాతావరణ పరిశోధన సంస్థకు వెళ్ళాలని నా ఆలోచన. మబ్బు గురించి వాళ్ళేం చెబుతారో తెలుసుకోవాలని.

అయిదవ నంబరు సిటీ లైనర్‌లో కూర్చుని కిటికీలోంచి నల్ల మబ్బును చూస్తుండగా, బస్సు లోపల మసక మసకగా తోచి, 'లైటు వెయ్యకూడదా' అని లేడీ కండక్టరును రిక్వెస్టు చేసి- లైటు వెలగానే కళ్ళు జిగేలుమన్నాయి. ఏదో పౌరాణిక కాలంలోకి ప్రవేశించినట్లయింది. పక్క సీట్లో రవి వర్మ పెయింటింగ్‌లోని అమ్మాయిల్లాగా భారీ కొప్పులు ముడులు, నగలు వేసుకొని ఒక అమ్మాయి కూర్చుని ఉంది. బహుశా టీవీ షూటింగ్‌కో, నాటకం రిహార్సల్‌కో వెళుతున్నట్టు ఉంది. 'ఐ యామ్ సీత. ఐ రిప్రజెంట్ ది ఫెమినైన్ క్యారెక్టర్ ఆఫ్ ది నేషన్' అని తనలో తాను గొణుక్కుంటోంది. బహుశా డైలాగులు ప్రాక్టీసు చేస్తుందేమో.

బస్సులో చిన్న మెరుపులు మెరిసినట్లయి, స్టేషన్‌లో ప్లకార్డ్ పట్టుకొని నడిచిన అమ్మాయి కూడా కనబడి

ఆశ్చర్యపోయాను. వాటర్ సినిమాలో షబానా ఆజ్మిలా తల నున్నగా మెరుస్తోంది. గంభీరంగా యుద్ధానికి తరలివెళ్తున్న సైనికురాలిలా ఉంది.

"ఆర్ యూ చిత్రా" అన్నాను దగ్గరకు వెళ్ళి.

"నో. ఐ యామ్ సీత" అని నాలుక కరచుకొని నవ్వి, "ఐ యామ్ మోహిని" అంది.

మోహిని, మోహిని అంటూ నాలుగైదుసార్లు గొణుక్కున్నాను. నేను వెతికే మోహిని, గిఫ్ట్ పాక్ అందించాల్సిన మోహిని ఈవిడ కాదు కదా అనిపించింది. "ఆర్ యూ రిలేటెడ్ టు లోకేష్" అన్నాను, ఆమె గురించి తెలుసుకోవాలనే పట్టుదలతో. తాను దిగాల్సిన స్టాప్ వచ్చినట్లుంది. ఆమె నవ్వుతూ "గుడ్ బై" చెప్పింది.

"ఐ యామ్ సీత..." రవివర్మ పెయింటింగ్‌లోని అమ్మాయి నోట్‌బుక్ తెరిచి డైలాగులు సీరియస్‌గా ప్రాక్టీను చేస్తోంది. రవీంద్రభారతి స్టేజి దగ్గర ఆ అమ్మాయి లేచి నిలబడింది. ఆమె వెనకనే మేకప్ బాక్స్ పట్టుకొని నడుస్తున్న కుర్రాడొకడు నా వైపు తిరిగి, "సాయంకాలం రవీంద్రభారతిలో మా ప్లే ఉంది. మైథలాజికల్ డ్రామా. మంచి కళాత్మక విలువలున్న నాటకం. యు ఆర్ వెల్‌కమ్" అంటూ చటుక్కున పెన్‌లాంటిదేదో పైకి తీసి నా ముఖంపై రాశాడు. మరో పచ్చబొట్టు అనుకుంటుండగా, "డబ్ల్యుడబ్ల్యు డబ్ల్యు.రామాయణం ఫర్ న్యూ ఏజ్.కామ్. మా వెబ్‌సైటది. మర్చిపోకుండా చూడండి" అంటూ ఆ అమ్మాయితో పాటు అదృశ్యమయ్యాడు.

బస్సు మసాబ్ టాంక్ వైపుగా వెళ్తోంది. రోడ్డంతా వాహనాలు కిక్కిరిసి ఉన్నాయి. మాటి మాటికీ కిటికీ లోంచి బయటకు చూస్తున్నాను. నల్లమబ్బు అడవి దున్నల గుంపులా వెంటాడుతూనే ఉంది. చుట్టుపక్కల ఎవరికీ దాన్ని గురించి పట్టినట్లు లేదే అనిపించింది.

"ఈ మబ్బు చూశారా? భయం గొలిపేలా..." పక్కనున్న మనిషిని పలకరించాను.

అతనేం మాట్లాడలేదు. అతన్ని కాదన్నట్టుగా ఎటో చూస్తున్నాడు. రెండు నిమిషాలయినాక, "అంతగా పరేషాన్ అవడానికేముంది? ఈ కాలంల మబ్బులిలానే ఉంటాయి" అన్నాడు తాపీగా.

"కానీ, ఇట్లా నల్లగా, కారు మబ్బులా, అదీ ఒక్క హైదరాబాద్‌పైనే..." అన్నాను. అతను నా వైపు అసహనంగా చూశాడు.

వాతావరణ పరిశోధన సంస్థలోనూ ఇదే పరిస్థితి. డైరెక్టర్ నావైపు వింతగా చూశాడు. "వాటీజ్ గ్రేట్ వండర్ ఇన్ ఇట్! మబ్బులు లేకపోతే, ఎండలు ఎక్కువయితే కంగారు పడాలిగానీ... ఇవి మామూలు మబ్బులు. వేపరైజేషన్‌తోటి... చిక్కబడి..." ఆయన మబ్బులు ఏర్పడ్డం గురించి చెప్పటం మొదలు పెట్టాడు. నేను లేచి నిలబడి ఆయన దగ్గర సెలవు తీసుకొని బయలుదేరుతుండగా వెనక్కు పిలిచాడు. "ఈ మబ్బుల గురించిన వివరాల కోసం ఒక అధికారిక వెబ్‌సైటు ఏర్పాటు చేసింది. దాన్ని ఓపెన్ చెయ్యండి! కొన్ని వివరాలు తెలుస్తాయి" అంటూ ఒక కార్డు నాకు ఇచ్చాడు. కార్డుపై డబ్ల్యుడబ్ల్యుడబ్ల్యు నల్లమబ్బు. కామ్ అని రాసి ఉంది. ఆ వెబ్‌సైటు అడ్రసు దొరికినాక నాకు కొంచెం ఉత్సాహం కలిగింది. హుషారుగా రోడ్డుపైకి వచ్చాను.

మళ్ళీ బస్సు ఎక్కి- బస్సు లకిడీకాపూల్ దాటి మరింక ముందుకు వెళ్ళలేకపోయింది. ముందు రోడ్డుపైన ఒక పెద్ద ఊరేగింపు. గొడవ గొడవగా కోరస్ సాంగ్‌లా ఉంది. గంధపు మంటలా ధగధగమంటోంది.

"లోకేష్ అమర్ రహే" అనే నినాదం వినబడి, ఉలిక్కిపడి బస్సు దిగి అటువైపు నడిచాను. టాటా సుమోపై లోకేష్ శవాన్ని ఉంచి చుట్టూ పూల గుచ్ఛాలు పేర్చారు. బుట్టలతో పూలు వెదజల్లుతున్నారు వందలాది కుర్రవాళ్ళు. జాతరలా ఉందా ప్రదేశం. రోడ్డుపై వాహనాలన్నీ ఆగిపోయాయి. షాపుల్లో వాళ్ళు షట్టర్లు మూసేసుకుంటున్నారు. డప్పుపై మోగుతున్న శబ్దం సాయంతో ఒక పాటగాడు దుఃఖపు పాట పాడుతున్నాడు. ఆ పాటకు గుండెలు అలిసిపోతున్నాయి. నెత్తురు

"ఈ మబ్బు చూశారా? భయం గొలిపేలా..." పక్కనున్న మనిషిని పలకరించాను. "అంతగా పరేషాన్ అవడానికేముంది? ఈ కాలంల మబ్బులిలానే ఉంటాయి" అన్నాడు తాపీగా.
"కానీ, ఇట్లా నల్లగా, కారు మబ్బులా, అదీ ఒక్క హైదరాబాద్‌పైనే..."



మరిగిపోతోంది. శరీరంపై గాయమేదో తిరిగి తెరుచుకొని రక్తం రక్తంగా, తడి తడిగా-

దుఃఖమా? ఆవేశమా? ఏమిటి దీని పేరు? తట్టుకోలేనంత వేడి. నిప్పుల మధ్య నడుస్తున్నట్టుగా ఉంది ఊరేగింపులో నడుస్తుంటే.

ఊరేగింపు వెంట నడుస్తున్నా నల్లమబ్బు గురించిన ఆలోచన మాత్రం నాలోంచి తొలగిపోలేదు. దుఃఖంలా, విపత్తులా ఉన్న ఈ పెనుమేఘం గంటగంటకీ నల్లగా, చిక్కనవుతూ- నిజానికి లోకేష్ మరణానికి, ఈ నల్ల మబ్బుకి ఏదో సంబంధం ఉండి ఉంటుందని పించింది. పురాణ కాలంలోలాగా, మహాపురుషుడి మరణానికి ప్రకృతంతా విలపించినట్టుగా, ఊరేగింపు గంధపు దీపంలా రోడ్డుపై మహా కోపంగా ప్రవహిస్తున్నట్టుగా అనిపించసాగింది. ఊరేగింపు కదులుతుండగా, ఒక ప్రదేశంలో నాలుగైదు బూడిద కుప్పలు కనపడ్డాయి. జనం ఆగారు. ఎవరో అరిచారు. "లోకేషన్న దిష్టిబొమ్మను తగలబెట్టింది ఇక్కడే! షాపులపై రాళ్ళువేసి, వాళ్ళు దొమ్మీ చేసింది కూడా ఇక్కడే. ఇక్కడి నుంచే అరుచుకుంటూ, కేకలు వేసుకుంటూ లోకేషన్న ఆఫీసు వైపు పరిగెత్తుకుంటూ వచ్చింది! ఆఫీసులో ఉన్న డెబ్బయ్ వేల లోకేష్ పత్రికల్ని రోడ్డుపైకి విసిరేసి వాటికి నిప్పు పెట్టింది ఈ స్థలంలోనే, ఇక్కడే ఇక్కడే!" ఒక కుర్రవాడు పెద్దగా అరిచాడు. క్షణంసేపు ఊరేగింపులో నిశ్శబ్దం!

అక్షరాలు తగలబడింది ఇక్కడే! మన స్వేచ్ఛ, మన ఆలోచన, మన హేతువు తగలబడింది ఇక్కడే!" ఎవరో అమ్మాయి నినాదంలా అరిచింది. అటువైపు తిరిగి చూశాను. నున్నగా, మిలమిలలాడుతూ బోడిగుండుతో ఉన్న అమ్మాయి వేన్ ముందు శవంపై చెయ్యివేసి- మోహిని మరోసారి ప్రత్యక్షమైంది.

కొన్ని క్షణాల నిశ్శబ్దం ముగిసింది. మళ్ళీ నినాదాలు, కేకలు. గాయపడ్డ పాటగాడి దుఃఖం, క్రోధం. ఊరేగింపు కదిలింది. గంధపు చెక్కల మంటలా రోడ్డుపై ధగధగమని పాకుతూ వెళ్తోంది మంట.

"ఇదంతా ఆయన రాసిన సంపాదకీయం వలననా? ఆయన మాత్రం ఏం రాశాడు. మళ్ళీ వెనక్కు, పాత రాతియుగంలోకి ప్రయాణమా అని ప్రశ్నించాడు! అంతే." ఊరేగింపులో ఎవరో గుసగుసలాడారు. డప్పు వాయించే కుర్రాడు అటువైపు కోపంగా చూసి, మళ్ళీ జనక్ జనక్‌మంటూ డప్పును లంకించుకున్నాడు. "పాతికేళ్ళ జర్నలిస్టు జీవితం! రచయితగా దేశం మెచ్చినవాడు! లోకేష్ పత్రిక, జర్నలిజంలో కొత్తదారి చూపింది. నిర్భయం, పరిశోధనలకు అది నిర్వచనం. అతడెన్నడూ, దేనికీ బెదిరిపోలేదు. ఇవాళ ఇట్లా గుండె ఆగిపోవటం- ఇదొక సింబాలిక్ డెత్. మనం పోగొట్టుకొంటున్న భావస్వేచ్ఛ గురించి తొలి హెచ్చరిక!" ఊరేగింపు మధ్య నుండి ఒక వృద్ధుడు ఉద్రేకంగానే చెప్పుకుపోతున్నాడు.

హఠాత్తుగా ఒక జ్ఞాపకం గుండెను కదిపి-

పాలిపోయిన ముఖం, మీసాలు, గుబురు గడ్డం గుర్తుకొచ్చాయి. ఖద్దరు లాల్చీ, దానిపైన జాకెట్ లాంటిది. గిరజాల జుట్టు- లోకేష్ ఆకారం ప్రత్యేకంగా ఉండేది. నాటకాల్లోని పాత్ర స్టేజి పై నుంచి నడిచివచ్చినట్టుగా ఉంటుంది. అతని భుజానికో గుడ్డ సంచి ఉండేది. అందులో పేపర్ కటింగ్స్, కొత్తగా వచ్చిన కవితా సంకలనాలు, ఆయన కవితలు- చిత్తు కాగితాల్లో రాసి, నాలుగైదు మడతలు వేసి- కాఫీ తాగుతూనో, కబుర్లు చెబుతూనో ఆ కాగితాల్ని బయటకు తీస్తాడు. శ్రావ్యమైన కంఠం.

మొదటిసారి ఆయన్ను కలవటం జైలు సెల్లో.

లోకేష్ పత్రికను నిషేధించాలని ప్రభుత్వం- ఆయన ఆమరణ నిరాహారదీక్ష- బలవంతంగా హాస్పిటల్‌కు తీసుకెళ్ళి సెలైన్ ఇచ్చి, తరువాత సెల్లో వేశారు.

ఆయన అరెస్టుకు నిరసనగా బంద్, ఊరేగింపూ- పోలీసులు మమ్మల్ని వేన్‌లో ఎక్కించారు.

ఆయన్ని చూడటం అదే మొదటిసారి. "ఆయనే లోకేష్" అన్నారు ఎవరో! "మార్నింగ్ సార్" అన్నాను. ఆయనేం మాట్లాడలేదు. కిందకు వంగి, నేలపై పాకుతున్న చీమను చూసి, "గుడ్ మార్నింగ్, గుడ్ డే, ఆల్ ది బెస్ట్ ఫర్ ఎవర్" అని మావైపు చూసి, "నేను కీటకాలకు, జంతువులకు తప్ప మనుషులకు తల వంచను. విష్ చెయ్యను" అన్నాడు. "ఆయన కాస్త డిస్టర్బ్ అయ్యాడు." మిత్రుడు సంజాయిషీలాగా చెప్పాడు.

మౌనవ్రతం పట్టినవాడిలా ఉన్నాడు ఆ రోజంతా. ఉండీ ఉండీ ఏదో గుర్తుకొచ్చిన వాడిలా, "మనం మనుషులమేనా" అని ప్రశ్నించేవాడు. ఆయన ఆలోచనల్ని డైవర్టు చెయ్యాలని, "చెస్ ఆడదామా



సార్" అన్నాను.

"చెస్ ఆడటం ద్వారా మనం మనుషులమని నిరూపించుకోవచ్చా" అన్నాడు నావైపు తీక్షణంగా చూస్తూ.

"తినటం, తాగటం, నిద్రపోవటం, సెక్స్‌లో పాల్గొనటం- ఇవేనా మనం మనుషులం అనిపించుకోవడానికి లక్షణాలు" అనేవాడు కోపంగా.

ఇంకోసారి కూడా ఇలాంటి సందర్భంలోనే కలిశాడు.

అసెంబ్లీ ముందు ధర్నా ప్రైవేటీకరణపై. లాఠీచార్జీ జరుగుతోంది. పొడవాటి లాల్చీ, భుజంపై గుడ్డ సంచీ- ఆయన్ను గుర్తు పట్టాను. ఆయనపై లాఠీ దెబ్బ పడకుండా ఆయన్ను పక్కకు లాగాలని ఆయన వైపు పరిగెత్తాను. సంచిలోంచి కెమేరా తీసి లాఠీచార్జీ చేస్తున్న పోలీసుల్ని, చెదిరిపోయి పరిగెడుతున్న జనాన్ని ఫోటోలు తియ్యటం మొదలు పెట్టాడు. నేను చెప్పినా వినిపించుకోలేదు. ఫట్‌మంటూ ఆయన తలపై తగిలింది లాఠీ. పక్కకు తూలి పడబోయాడు. ఆయన్ను రెండు చేతుల్తో పట్టుకొని ఒక మూలకు పరిగెత్తాను. తల పైనుండి సన్నటి రక్తపు ధార.

"భూమిపైనా, ఆకాశంలోనూ అది ధ్వనిస్తుంది" అంటూ కవితను ఆశువుగా చెప్పటం మొదలు పెట్టాడు. తలపైనున్న రక్తాన్ని చేతితో అద్దుకొని, ఎర్రగా అయిన చేతిని చూస్తూ-

"నా తలలో వేయి చేతులు. ఒక్కో చెయ్యి ఒక పొయమ్‌ని రాస్తూ" అన్నాడు. కొద్దిగా కంగారు వేసింది. "కంగారు లేదులే. మతి చెడలేదు" అని నవ్వి, జేబులోంచి సిగరెట్ ప్యాకెట్ తీసి వెలిగించి, ఒక చిత్తు కాగితం లాంటి కాగితం ఇచ్చి, "చదువు. వింటుంటే కాస్త ఊరటగా ఉంటుంది" అన్నాడు.

ఆ దృశ్యం చాలా అబ్సర్డ్‌గా ఇంకా నాకు గుర్తుంది. బయట లాఠీచార్జీ, పోలీసులు మౌత్‌పీసుల్లోంచి కేకలు వేస్తున్నారు. జనం అటూ ఇటూ పరుగెడుతున్న చప్పుడు. ఈ మనిషి ఒక గోడ పక్కన కూలబడి, ఒక పొయమ్ చదవమని ఆర్డర్ వేస్తున్నాడు.

శిరస్సు తెగిపోతుంది, గాలిలోనో
ఆకాశంలోనో, భూమిపైనో
అట్లా వేలాడుతూనే ఉంటుంది
అరుస్తుంది, కేక వేస్తుంది
ధ్వనిస్తుంది, ప్రతిధ్వనిస్తుంది!
శిరస్సు అట్లా వేలాడుతూనే ఉంటుంది
దాని కేక వెంటాడుతూనే ఉంటుంది-

మరింక చదవలేకపోయాను. ఆ వాతావరణం, అట్లా పొయమ్ చదవటం, నాకు ధైర్యం చాలలేదు. ఆయన్ను లేవదీసి, "ఇంక వెళ్దాం సార్" అన్నాను. అభ్యంతరం చెప్పకుండా మౌనంగా నా వెంట నడిచాడు.

దృశ్యాలు, జ్ఞాపకాలు, వెంటాడే కంఠస్వరం-

హఠాత్తుగా నిశ్శబ్దం. రోడ్డుపైన ఎవరో నిలబడి- కొండవాటి మనిషి, లాల్చీ, ఖద్దరు సంచి- పోయెమ్ చదువుతున్నాడు. దగ్గరగా వీధంతా వినపడేలా ఉందా కవితా పఠనం. మృదువుగా, మంద్రంగా, హఠాత్తుగా పెనుకేకలా వినపడే స్వరం- లోకేష్.

ఊరేగింపు ఉగ్రంగా ఉంది సామూహిక కవితా పఠనంలా ఉంది. ఊరేగింపు అట్లాగే అంబేద్కర్ విగ్రహం దాకా సాగింది. భుజానికి జోలెల్ బాగ్, చేతిలో అజ్ఞాత ప్రియురాలి కోసం తెచ్చిన గిఫ్ట్ పార్శిల్‌తో సహా నేను.

హఠాత్తుగా పైకి చూశాను. పైన నల్లమబ్బు అట్లాగే క్రూరంగా నిలబడి ఉంది. "ఈ మబ్బుకు, లోకేష్ మరణానికి లింక్ ఏమైనా ఉందా!"

సీరియస్‌గా పక్కనున్న వ్యక్తిని అడిగాను. అతను కోపంగా నావైపు చూసి, "వాట్ నాన్సెన్స్! ఇట్లాంటి సూపర్‌స్టిషన్ అంటే లోకేష్‌కి అసహ్యం! ఏ కాలంలో ఉన్నారు మీరు? చలికాలంలో మబ్బులు రాకుంటాయా" అని విసుక్కున్నాడు.

ఆయనట్లా నన్ను విసుక్కుంటున్నప్పుడే దూరంగా నాలుగైదు పోలీసు ట్రక్కులు, అందులోంచి దిగుతున్న యూనిఫారాల పోలీసులూ కనపడ్డారు.

"ఊరేగింపులు నిషేధించాం! శాంతిభద్రతల దృష్ట్యా రెండు వారాల పాటు నగరంలో ఊరేగింపులకు అనుమతించేది లేదని సి.పి ఆర్డర్ వేశారు."

"వెళ్ళండి. అందరూ డిస్‌పర్స్ అవ్వండి. కావాలంటే పైన అల్లుకొని ఉంది మేఘం. నల్లగా కమిలిన ఆకులు పడునగా పిచ్చిపట్టినట్లుగా ఉందా మేఘం. చీకటి అడవిలో మండుతున్న ఒకే ఒక్క నెగడు లాంటి ఆ స్థలాన్ని వదిలి మెల్లగా ముందుకు కదిలాను. భుజాన జోలెల్ బాగ్, చేతిలో గిఫ్ట్ పేపర్ చుట్టిన పార్శిల్.

గ్రామర్ స్కూలు మలుపు దగ్గర శివరావు కనిపించాడు. శివరావు కనబడ్డం తోటే నాకు కొంత ఉల్లాసం- ఏ విషయాన్నైనా లాజికల్‌గా చర్చించి వివరించగలవాడు. నల్లమబ్బు గురించిన చిక్కు ఆయన విప్పగలడనిపించింది.

రోడ్డుపైన నాలి గోడలపై వీధి పిల్లలతో బొమ్మలు వేయిస్తున్నాడాయన. ఆ పిల్లలు, ఆ దృశ్యం ఎంతో ఫోటోజెనిక్‌గా ఉంది. మొత్తం పన్నెండు మంది. మసకమసగ్గా ఉన్న వాతావరణంలో, రంగులు, కుంచెలతో గోడలను వర్ణమయం చేస్తున్నారు. పదమూడో పిల్ల పెట్రోమాక్స్ లైటును ఎత్తి పట్టుకొని నిలబడింది. వెలుగు ప్రసరించే దేవతలా- శివరావు వాళ్ళ మధ్య నిలబడి సలహాలిస్తున్నాడు.

వెళ్ళి ఆయన వెనక నిలబడ్డాను. "నాతో ఏ విషయం గురించి చర్చించాలనుకుంటున్నావు" అన్నాడు ఏ ఉపోద్ఘాతం లేకుండానే. "ఈ పదమూడో పిల్ల గురించి, ఇట్లా పగటిపూట వెలుగును పిండుకోవాల్సిన పరిస్థితి గురించి, ఈ నల్లమబ్బు గురించి" అన్నాను.

"దేనికైనా ఒక కారణాన్ని వెతికితే గాని నిద్ర అడుగు పెడుతుండగానే ఒక వింత వాసన. "నిర్మాణానికి ఒక వాసన ఉంటుంది. ముఖ్యంగా గాఢమైన సిద్ధాంతానికి! ఓడిపోయిన ఉద్యమం, ఓడ్డుపై దుమ్ముపట్టి పలకటం ఆగిపోయిన పియానో, అడివి, వెలిసిపోయిన జెండాలు, నిశ్శబ్దంగా నిలకడగా పడిపోయిన ఉద్యమం- వీటన్నిటికీ ఒక వింత వాసన ఉంటుంది" అంటాడు వన్నెగట్. అది మోహిని పియానో అట్లాంటి వాసనేదో ఆ బిల్డింగ్‌లోంచి గుప్పుమన్నట్లుగా. నా ప్రేమికా చాలా ఏళ్ళ కిందట కట్టిన అపార్ట్‌మెంట్స్ అవి. టేకువంటి మనుషులు, పాత పట్టీ, పురాతనత్వం... ప్రాచీనత్వం ఆవరించిన వాసనా?

అపార్ట్‌మెంట్స్ ముందర ఖాళీ స్థలంలో కుర్రవాళ్ళు క్రికెట్ ఆడుతున్నారు. అపార్ట్‌మెంట్స్‌లోంచి టీవీల చప్పుడు. వెళ్ళి తలుపు తట్టాను. తలుపు తెరుచుకో లేదు. కిటికీలోంచి లోపలికి చూశాను. పెద్ద హాలులా ఉంది అపార్ట్‌మెంట్ కిటికీలోంచి ఏదో పైకి లేస్తున్నట్లుగా. తలుపు తెరుచుకొని ఒక లావాటి యాభై ఏళ్ళ శరీరం బయటకు తొంగి చూసింది.

"మోహిని, మోహిని కోసం..." అన్నాను.

"ఏకో, కృష్ణుడివి! నాలుగా, అయిదా" అంటూ జుగుప్సగా ముఖం పెట్టి.

నాలుకెండిపోయింది నాకు. "కాదు, గిఫ్ట్ పార్శిల్ ఇచ్చి వెళ్తాను."

అపనమ్మకంగా చూసింది నా వంక. నిప్పుల గుండంలా ఉందావిడ. ఊహూ! కాలుతున్న కో

"లోకేష్ పత్రిక, జర్నలిజంలో కొత్తదారి చూపింది. నిర్భయం, పరిశోధనలకు అది నిర్వచనం. అతడు దేనికీ బెదిరిపోలేదు. ఇవాళ ఇట్లా గుండె ఆగిపోవటం- ఇదొక సింబాలిక్ డెత్. మనం పోగొట్టుకొంటున్న భావస్వేచ్ఛ గురించి తొలి హెచ్చరిక!"



శవం, బంధువులు మాత్రం మౌనంగా రోడ్డుపైనుండి వెళ్ళవచ్చు!

వింటారా! అంత కోపంగా, అంత చండ ప్రచండంగా మండుతున్న కుర్రవాళ్ళు వింటారా?

అరుపులు, కేకలు, నినాదాలు- ఫటాఫట్ మంటూ లాఠీలు విరిగాయి. దెబ్బలయినా తింటున్నారు గానీ జనం మాత్రం చెదిరి పోవటం లేదు. రక్తపు మంటలా ఉందా ప్రదేశం. ఇదంతా పైన నల్లటి కారుమబ్బు ముసిరిన సమయంలోనే జరిగింది. రెంటికీ ఏదో సంబంధం ఉందన్న ఒక మెటాఫిజికల్ భ్రాంతి నన్ను వదలడం లేదు.

అప్పుడు వేన్ పక్కన ఉన్న అమ్మాయి లోకేష్ కూతురో, లేదా మోహినో, మిలమిలలాడే గుండుతో ఉన్న అమ్మాయి- ముందుకు నడిచి, ఎదురుగా ఉన్న అంబేద్కరు విగ్రహానికి నమస్కారం పెట్టి- "ఇక్కడే దహనం చేద్దాము! ఇంతకన్నా పవిత్రమైన స్థలం ఈ భూమిపైన ఎక్కడుంటుంది" అని అరిచింది.

పోలీసులు క్షణంసేపు ఉలిక్కిపడ్డారు. వాళ్ళు తేరుకునే లోపలే ఒక మహాజ్వాల లేచింది. గంధపు చెక్కలు పేర్చిన వేన్‌తో సహా దహనం అవుతున్నాడు లోకేష్. శబ్దాలన్నీ ఆగిపోయి ఒకే ఒక్క పాట. పాటగాడు డప్పు అందుకొని గద్దర్ బాణీలో, సన్నగా చిందువేస్తూ, కన్నీళ్ళు కారుతుండగా పాడిన పాట. పాట కూడా మండుతుందని తెలిపిన ఆ మధ్యాహ్న సమయం-

పోలీసులు సాక్షిగా అక్కడో సాంస్కృతిక మేళా మొదలైంది.

తల పైకెత్తి చూశాను. దట్టమైన గుబురు అడవిలా పట్టదా మీకు? దేనికదే ఒక అనుభవంగా ఎందుకు తీసుకోరు? ఈ మబ్బును ప్రకృతి వైపరీత్యంగా కాకుండా, ఆకాశం చేసుకొన్న ఒక అలంకారంగా ఎందుకు తీసుకోకూడదు" అన్నాడు.

నా ముఖంలో నిరుత్సాహాన్ని దాచుకోలేక పోయాను. అప్పుడు ఆ పదమూడో పిల్ల నావైపు ఓదార్పుగా చూసి, లైటు నా వైపుకు తిప్పి, కాంతి నా ముఖంలో పడుతుండగా, "అంకుల్! నేను చెప్తాను. చాన్నాళ్ళ క్రితం మన ఊళ్ళో గొడవలయి నాయి కదా! అందులో ఇళ్ళు తగలబడి, మనుషులు చచ్చిపోయి- మా ఏడోది షాజహానా వాళ్ళ అమ్మా నాన్నలు అట్లాగే చనిపోయారు- అట్లా చనిపోయిన వాళ్ళ ఆత్మలన్నీ ఆకాశంలో తిరుగుతూ, మబ్బుల్లా గడ్డకట్టి..."

ఆ పిల్ల ఇమాజినేషన్‌కు నేను అబ్బురపడి పోయాను. ప్రేమగా ఆ పిల్ల బుగ్గలు నిమురు తుండాగా వాళ్ళలోంచి ఒకటోవాడు పరుగెత్తుకుంటూ వచ్చి, "ఆగండి సార్" అంటూ దగ్గరగా వచ్చి బ్రష్‌తో నా చెంపపై వారిస్తున్నా వినకుండా రాశాడు. రాసి నాక తృప్తిగా చూస్తూ, "డబ్ల్యుడబ్ల్యుడబ్ల్యు వీధిబడి. కామ్ సార్! మా శివరావు సార్ ఉపన్యాసాలు ఉంటాయి అందులో" అన్నాడు. కొంచెం కంగారులో అడుగు ముందుకు వేశాను.

రోజులో చాలాభాగం గడిచిపోయింది. మెల్లగా ఆకలి మొదలైంది. కొత్త చీకటి కొద్దికొద్దిగా అలవాటు పడుతోంది. మబ్బు గురించిన రహస్యపు ఆలోచన లతో అట్లాగే నడుస్తూ వెళ్ళాను రోడ్డుపై.

'దేశీ టవర్స్' అనే సైన్‌బోర్డు కనబడి టక్కున ఆగిపోయాను. నా మిత్రుడు ఇచ్చిన అడ్రస్ అదే.

జరంలా- నేనేం మాట్లాడలేదు. "మాటకో స్నేహితుడు! ఇట్లాంటి వేషాలిక్కడ చెల్లవు! నా ఫ్రెండ్స్ అంటూ నీలుగుతుంది ఆవిడ. ఫ్రెండ్స్ ఏమిటి ఫ్రెండ్స్, ఆడదానికి మొగుడొక్కడే ఫ్రెండ్. తాళిబొట్టు గుట్టు, మట్టు."

"ఫో! ఆపై ఏపార్ట్‌మెంటులో ఉంది. వెళ్ళు, వెళ్ళి చెప్పు. ఇట్లాంటి సరదాలు ఇక్కడ చెల్లవని. అదేమిటో ఫెమినిజమా, గిమినిజమా! అట్లాంటివేమీ చెల్లవని చెప్పు. మొన్న ఒట్టి వార్నింగే ఇచ్చాను. ఈసారి ఏకంగా జైల్లోనే పెట్టిస్తానని చెప్పు."

మహా నియంతలా గర్జించింది.

"ఫౌల్, ఫౌల్." దూరం నుంచి ఆటలమధ్య పిల్లల అరుపులు.

మొదటి అంతస్తుకు దారితీసే మెట్లు.

చీకటిగా ఉంది. భయంకరమైన దుర్గంధం. మూత్రం, పాసిపోయిన ఆహారపదార్థాలు- ఊడ్చిన చెత్తంతా ఒక మూలన. గోడలకు వేసిన రంగు వెలిసిపోయి- పెట్టిపోయి భయం కలిగించేలా ఉంది. బూతు సినిమా పాట ఒకటి కిటికీలోంచి బయటకు తోసుకువస్తోంది. పోట్లాడుకుంటున్న రెండు గొంతుకలు (ఆడ, మగ) కిటికీలోంచి బయటకు రావడానికి ప్రయత్నిస్తున్నాయి.

బయట ఆకాశంలో నల్లమబ్బు ముసిరే ఉంది. మహా ప్రమాదంలా చీకటిగా ఉంది సాయంకాలమో, రాత్రో తెలియనట్లుగా ఆఫీసులకు వెళ్ళే మగవాళ్ళు, వంటగదుల్లో మగ్గే ఆడవాళ్ళు, రిక్షాల్లోను, ఆటోల్లోను స్కూళ్ళకు పరిగెత్తే పిల్లలు- సినిమాలో ఫాస్ట్ ఫార్వర్డ్ దృశ్యంలా- ఒక్కసారిగా సంవత్సరాలు ఇవాళ దగ్గర ఫ్రీజ్ అయినట్లు అందరి ముఖాలపై




నల్లగా. భయంలాంటి భావన పులుముకున్నట్టు- అట్లా రోడ్డుపైకి చూస్తే మనుషులు కాకుండా నల్లటి బొగ్గు గీతలు అటూ ఇటూ కదులుతున్నట్టు.

గది ముందు ఆగి తలుపు తట్టాను. ఎర్రటి చీర కోల బొమ్మలా మోహిని.

ఉదయం నుండి చాలాసార్లు చాలా సమావేశాల్లో చూశాను అమ్మాయిని.

"లోపలికి రండి" అంటూ నడిచింది. ఎమ్మెస్ పంపిన గిఫ్ట్ అంటూ పాకెట్ ఆమె చేతికి అందించాను. దాన్ని తీసుకొని విప్పకుండా బల్లపై పెట్టింది. కాఫీ తెస్తానని లోపలికి వెళ్ళింది.

చాలా మౌనంగా, అసహజంగా ఉంది వాతావరణం.

అర్థం లేని చెత్త ఏదో మాట్లాడటం మొదలు పెట్టాను. తాను వింటున్నట్టు లేదు. పక్క అపార్టుమెంట్ వాళ్ళ పిల్లలు కాబోలు. వాళ్ళు గదుల్లో అటూ ఇటూ నిర్భయంగా తిరుగుతున్నారు.

ఆ పిల్లలు ఒక గది వైపు వెళ్ళి, తలుపు తెరిచి, తొంగి చూసి, గుసగుసలాడుకొని, మళ్ళీ వెనక్కు పరుగెడుతున్నారు.

అట్లా చాలాసార్లు చేశారు.

ముందు అదో ఆట అనుకున్నాను కానీ, వాళ్ళ ముఖంలో ఆట తాలూకు ఉత్సాహం లేదు.

"ఏముంది ఆ గదిలో...!" ఆమేం మాట్లాడ లేదు. నేను లేచి ఆ గది వైపు వెళ్ళాను.

తలుపు తెరిచి. క్షణం పాటు షాక్ లాంటి స్థితిలోకి వెళ్ళాను.

గది ఐదుకు ఐదుగా ఉంది. రెండు విశాలమైన గోడలు. వాటిపై పుస్తకాలు, దిండ్లు. ఒక గోడపై వార్తాపత్రికలు, మ్యాగజైన్లు అటూ ఇటూ పడేసినట్టుగా. టేప్ రికార్డర్. దాని పక్కనే న్యూస్ పేపర్లు. గోడనిండా పోస్టర్లు బొమ్మలు- గోడపైన ఒక మూలన వెలిసిపోయిన జెండా. ఏ పార్టీదో తెలియటం లేదు. గోడకింకో వైపు పొడవాటి పోస్టర్- వాటర్ కలర్స్‌తో వేసింది- ఒట్టి తల మాత్రం ఉంది.

గడ్డం. బండపెదాలు. కారికేచర్ లాంటిది- వాటన్నిటి మధ్య నిర్జీవంగా పడి ఉన్న మనిషి శరీరం- మామూలు మనిషి కాదు. మహా కాయుడు. తల ఒక గోడకు, కాళ్ళు మరో గోడకు తగిలేలా- ఏళ్ళ క్రితం ఎప్పుడో చనిపోయినట్టు- దుమ్ముపట్టి- శిథిలమై- భయంతో కేకవేశాను.

"ఏమైంది" అంటూ కంగారుగా వచ్చింది మోహిని. క్షణం సేపు నిశ్శబ్దం. ఇందాక కనిపించిన పొడవాటి మనిషి దేహం అక్కడ లేదు. కానీ, మిగతా దృశ్యం- పరిచిన చాప, నలిగిన దుప్పటి, టేప్‌రికార్డర్, పేపర్లు, గోడపై పోస్టరు, పోస్టరులోని బొమ్మలో పోలికలు ఇప్పుడు స్పష్టంగా తెలుస్తున్నాయి. గద్దర్‌లాంటి, ఉద్యమాలకు పాటలు పాడే ఒక గాయకుడి పోలికలున్నాయి.

"ఇది మా నాన్న గది."

నర్వస్‌గా ఉందామె ముఖం. ముఖంపై పట్టిన చెమటను కొంగుతో తుడుచుకుంటూ అటూ ఇటూ సీలింగ్ వైపుకో, గది వైపుకో చూసింది. ఎందుకో సారీ చెప్పాలనిపించింది. "సారీ" అన్నాను సానుభూతితో.

కిటికీలోంచి బయటకు చూస్తోంది. చాలాసేపు నేను అట్లాగే తలుపు దగ్గర నిలబడ్డాను. మధ్యలో పిల్లవాళ్ళు రెండుసార్లు వచ్చి తొంగిచూసి వెళ్ళారు.

ఆమె అట్లాగే కిటికీలోంచి అనంతంలోకి చూస్తూ ఉంది. నేను గదిలోపలికి వెళ్ళాను. మనిషి కదులుతున్న సవ్వడి. కిటికీలోంచి బయటకు చూస్తున్నట్టు, లేచి టేబుల్‌పై కాగితాలపై ఏదో బొమ్మ వేస్తున్నట్టు, లేదా మరణంలాంటి ఒక భంగిమలో అట్లా చాలాసేపు పడి ఉన్నట్టు- అక్కడో మనిషి. నిజంగా అశరీరంగా ఉన్నట్టు తోచింది. గదిలో దేన్నీ ముట్టుకోవాలనిపించలేదు. టేబుల్‌పై 'ఏన్ ఎజెండా ఫర్ సర్వైవల్!' అనే పుస్తకం ఉంది. పుస్తకాన్ని తెరిస్తే, చాలా చోట్ల అండర్‌లైన్ చేసినట్టుగా ఉంది. పుస్తకం మూసి బయటకు వచ్చాను.

"ఎమ్మెస్‌కు ఏం చెప్పమంటారు?" బయటకు వస్తూ అడిగాను.

"మా నాన్న పునరుత్థానంపై నాకు నమ్మకముంది. అంతవరకు పెళ్ళి సాధ్యం కాదని చెప్పండి" అంది. దిమ్మెరపోయాను. ఆమె సీరియస్‌గానే చెబుతోంది.

క్షణంసేపు ఆగి, "లోకేష్ పత్రికను తిరిగి ప్రారంభించాలి. యుద్ధం పూర్తికాలేదు కదా" అని దీర్ఘంగా నిట్టూర్చి, "సెలవు" అంది.

లేచి బయటకు నడిచాను. "గుడ్‌బై" అంటూ సన్నగా నవ్వింది.

ఆ నవ్వునట్లాగే గుప్పెటలో దాచుకొని కిందకు నడిచాను.

గుప్పెట తెరిచి, ఆ నవ్వునట్లాగే చూసుకుంటూ రోడ్డుపైకి వచ్చాను. నల్ల మబ్బు గురించి ఆరాటం మళ్ళీ మొదలైంది.

రోడ్డుపై సైబర్ కేఫ్ అంటూ కనబడి, నల్ల మబ్బు గురించి అధికారిక వివరణ తెలుసుకోవాలనిపించి, వాతావరణ సంస్థవాళ్ళు ఇచ్చిన అడ్రస్ కార్డుతో సహా అందులోకి ప్రవేశించాను.

ఇంటర్‌నెట్ ఎక్స్‌ప్లోరర్ క్లిక్ చేసి, డబ్ల్యుడబ్ల్యు డబ్ల్యు నల్లమబ్బు. కామ్ అనే వెబ్‌సైట్ ఓపెన్ చేశాను.

మానిటర్‌పై నల్లని మబ్బు తునక కనబడి, అది మెల్లమెల్లగా పెరుగుతూ బ్రహ్మాండమైన మబ్బులా మారింది. చూస్తుంటే భయం కలిగేలా ఉంది.

> "మా నాన్న పునరుత్థానంపై నాకు నమ్మకముంది. లోకేష్ పత్రికను తిరిగి ప్రారంభించాలి. యుద్ధం పూర్తికాలేదు కదా- సెలవు."



మొత్తం ప్రపంచాన్నే కబళించబోయేలా ఉందనిపించింది. అది మానిటర్‌లోంచి బయటకు వస్తున్నట్టుగా అనిపించసాగింది. మౌస్ సాయంతో 'ఇన్ఫో' అనే చోట నొక్కాను. ఇన్ఫర్మేషన్, వివరాలు, వివరణలు ఏముంటాయో చూద్దామని.

"చలికాలం, ఒక మేఘం, అంతే" అనే అక్షరాలు స్క్రీన్‌పై మెరవసాగాయి. ■

# ఆయుధం


• చిలుకూరి దేవపుత్ర
• చిత్రాలు: దీపక్


సాయంత్రం ఆరు గంటలవుతోంది. బండ్లపల్లి వీధుల్లో జన సంచారం అంతగా లేదు. అందుకు కారణం- ఊర్లోని దూడ పిల్లోళ్ళూ, నడిప్రాయమోళ్ళు అంతా రాజన్న ఇంటి దగ్గర చేరి ఉండటమే. ఆ ముందు రోజు జరిగిన ఎలక్షనుకు రీపోలింగు ఆరు బూతుల్లో జరుగుతుందన్న వార్త వాళ్ళనందర్నీ అక్కడికి చేర్చింది. రాజన్న ఇంటి ఆవరణలో గుంపులు గుంపులుగా నిలుచునివున్నారంతా.

రీ పోలింగు విషయం తెలిసినప్పటి నించీ మల్లేసు మనసు కుతకుతలాడిపోతూవుంది.

'థూ ఉత్త చాతగాని నాయాండ్లు... రీ పోలింగంట రీ పోలింగు... ఈ సారి అంత న్యాయంగా వోట్లేపిస్తారా ఈ నా కొడుకులు' అనుకున్నాడు వినుగ్గా. వడసాలికట్ట మీద బీడీ తాగుతూ ఉన్నవాడల్లా, చివరి దమ్ము లాగేసి బీడీని బండ మీదే నలిపి పారేశాడు.

మల్లేసుకి కొద్ది దూరంలో రాజన్న సిగరెట్టు తాగుతూ ఈజీ చైర్లో కూచుని ఉన్నాడు. అతని బావమరిది చంద్రప్ప కుర్చీలో దిగులుగా కూచుని ఉన్నాడు. అయితే, రాజన్న ఏమాత్రం దిగులూ, నిరుత్సాహం కనబడనీయడం లేదు. పడసాలికట్ట కింది ప్రాంతమంతా సందులేకుండా జనంతో నిండిపోయి ఉంది. వాళ్ళలో ఎక్కువ భాగం మాల మాదిగలూ, వెనుకబడిన కులాల వాళ్ళు ఉన్నారు. అందరి ముఖాల్లోనూ రాజన్న ఏం నిర్ణయం ప్రకటిస్తాడా, ఏం చేయమని చెబుతాడా అన్న ఉత్కంఠ కనబడుతూవుంది. చిరిగిన బనియనూ, ఖాకీ నిక్కరు వేసుకున్న రాజన్న జీతగాడు అల్యూమినియం బకెట్‌లోవున్న టీని చిన్న స్టీలు గ్లాసులతో అందరికీ అందిస్తున్నాడు. అతని వెనుకే పన్నెండేళ్ళ పిల్లోడు మాసిన నీలం చొక్కా, రంగు వెలిసిన ఎర్ర నిక్కరుతో ప్లాస్టిక్ బకెట్టులో నీళ్ళు పట్టుకుని ఉన్నాడు. తాగిన గ్లాసుల్ని వెంటనే కడిగేసి అందిస్తూవున్నాడు- జీతగానికి.

దేశమంతటా సాధారణ ఎన్నికలు జరిగినట్టే ఆ ఊళ్ళోనూ ఆ ముందు రోజున జరిగాయి. మరో పదిహేను రోజుల్లో ఎన్నికల ఫలితాలు తెలుస్తాయి. రాజన్న ఎం.ఎల్.ఏ అయి తీరుతాడని అందరూ అనుకున్నారు. అయితే, రాజన్న పోటీ చేసిన నియోజకవర్గంలోని పోలింగు బూతుల్లో రిగ్గింగుకు పాల్పడినట్టు భావించి, వాటిని రీ పోలింగుకు ఎన్నికల పరిశీలకులు సిఫార్సు చేశారు. దాంతో ఆ ఊళ్ళోని రెండు పోలింగు బూతుల్లో కూడా రీ పోలింగు జరుగనుంది. ఈ విషయం రాజన్నకీ, అతని అనుయాయులకీ ఏమాత్రం కొరుకుడు పడలేదు. బాగా నిస్పృహకు లోనయ్యారు. అయితే, బండ్లపల్లికి మజరా గ్రామమైన కొత్తకోటలో ఉన్న శివరామప్పకీ, అతని అనుయాయులకీ మాత్రం పట్టరానంత ఆనందంగా ఉంది.

> రాజన్న రాయలసీమ లోని అందర్లాటి ఫ్యాక్షనిస్టు కాడు. కులాల తత్త్వం తెలిసినవాడు. తన కులం వాళ్ళని విశ్వసించడు. దళితుల్ని ఎక్కువగా నమ్ముతాడు.

రాజన్నకీ, శివరామప్పకీ మధ్యనున్న వైరం ఇప్పటిది కాదు, తాతలనాటిది. ఇద్దరి కులం ఒకటే అయినా, రెండు గ్రామాలపై పెత్తనం చలాయించే విషయంలో ఎన్నో హత్యలు జరిగాయి ఇరు వర్గాల మధ్య. రెండు గ్రామాలకీ ఒకే పంచాయితీ కావడంతో అయిదేళ్ళ కిందట సర్పంచి పదవికి రాజన్న తండ్రి నారాయణప్ప, శివరామప్ప అన్నయ్య ఈశ్వరప్పలు పోటీ చేయగా నారాయణప్ప గెలిచాడు. ఓటమిని భరించలేని ఈశ్వరప్ప అనంతపురంలోని కోర్టుకు హాజరవడానికి వెళుతున్న నారాయణప్పనీ, అతని బావమరిది హనుమంతప్పనూ నరికించేశాడు. దానికి ప్రతీకారంగా బళ్ళారి జిల్లాలోని వగరిలో బంధువుల పెళ్ళికి వెళ్ళి తిరిగి వస్తున్న ఈశ్వరప్పను రాజన్న బాంబులు వేసి చంపించాడు. దాంతో ఇరు వర్గాల మధ్య పగలు మరింత రగిలాయి. ఈసారి ఎన్నికల్లో శివరామప్ప, కుమారుడు నాగేశ్వరప్పని రాజన్నకి పోటీగా నిలబెట్టాడు. కానీ, రిగ్గింగ్ చేయడంలో రాజన్నని మించిపోలేకపోయేరు. దానికి కారణం రాజన్న చాలా గ్రామాలలో అధికార పార్టీ సాయంతో పట్టు సంపాదించడమేనని శివరామప్ప వర్గీయుల వాదన. అందుకే రీపోలింగ్ జరగడం వాళ్ళకి మహదానందాన్ని ఇస్తోంది. ఆ సంతోషం తాత్కాలికమేనని తెలుసు. ఎంత రీపోలింగ్ పెట్టినా తాము ఏమాత్రం రిగ్గింగ్ చేసుకోలేమనీ తెలుసు. ఎలానూ పోలీసు బందోబస్తు ఎక్కువగా ఉంటుంది కాబట్టి, రాజన్న మనుషులు ఏం చేయగలరులే అన్న ధీమా ఎక్కడో మినుకుమినుకుమంటోంది వాళ్ళలో.

"ఏం బావా, ఏం మాట్లాడకపోతివే" అన్నాడు చంద్రప్ప సిగరెట్టు వెలిగించుకుని.

రాజన్న అంతదాకా గాల్లోకి చూస్తున్నవాడల్లా చిన్న వంకర నవ్వు నవ్వి, "ఏం మాట్లాడమంటావు చంద్రా! రీపోలింగ్ అంటానే మనమంతా అంత బెంబేలుపడే పనేముందప్పా! ఏందో అంతా మనిగిపోయినట్లు, యాల ఆపసోపాలు పడిపోవల్లప్పా" అన్నాడు.

"నిజమేనన్నా! పోలింగ్ స్టాపు రాత్రికి ఆరు పోలింగ్ బూతుల్నీ చేరుకుంటుంది. ఎట్లో నయానో, భయానో ఏందో ఒకటి చేసి తెల్లవారేలోగా వోటు కాగితాల మింద ముద్రలు గుద్దేసి బ్యాలెట్టు పెట్టెల్ని నింపేస్తాం" అన్నాడు మల్లేసు రాజన్నకి భరోసా ఇస్తున్నట్టు.

"ఒరే ఒరే. మల్లేసూ. బిరిబిరి మాట్లాడద్దురా! ఇంతకు మునుపు మాదిరి మన ఎత్తులు ఏం పారవు. ఇప్పుడే పేటనించి ఫోను వచ్చింది. పోలింగ్ స్టాపు ఈ రాత్రికి ఏ పోలింగు కేంద్రాన్నీ చేరుకోదు. రాత్రంతా మండలాఫీసుల్లో ఉంటారు. తెల్లారుతున్నట్టే పోలింగ్ కేంద్రాల్ని చేరుకుంటారురా. పోలీసోల్లని కూడా పెద్దయెత్తున పంపుతున్నారంట. మనం ఇది కూడా దృష్టిలో పెట్టుకోవల్ల. ఊరికే గుడ్డెద్దు చేలవ చేన్లో పడినట్టు పోకూడదు" అంటూ రాజన్న కాసేపు ఆగి, అందర్నీ ఒకసారి





తేరిపార చూసి మల్లేసు మీద దృష్టి సారించాడు. "ఒరే మల్లేసూ! రీపోలింగ్ అయ్యే పోలింగ్ బూతుల్లో మన ఊరిది మాత్రం నువ్వే చూసుకోరా. తక్కినవి మేం చూసుకుంటాం" అన్నాడు.

మల్లేసు కూచునే బాధ్యతగా తల ఆడించాడు. జిల్లాలోనే పేరుగాంచిన ఫ్యాక్షనిస్టు అయిన రాజన్న తనని అక్కడున్న అందర్లోకి గౌరవించి, అభిమానంతో తనకి బాధ్యత అప్పగిస్తూ ఉన్నాడంటే, తనది గొప్ప అదృష్టంగా అనిపిస్తావుంది. మల్లేసు మనసు సంతోషంతో ఉప్పొంగిపోయింది. కించిత్తు గర్వం కూడా అతని మనసులో చోటు చేసుకోగా, ఒకసారి అందర్నీ కలయజూశాడు.

రాజన్నకి మల్లేసు మనస్తత్వం పూర్తిగా తెలుసు- చూసి రమ్మంటే కాల్చి వచ్చే రకమని. అందుకే కాల్చి రావాల్సిన అవసరమున్న పనులకు కూడా కేవలం చూసిరమ్మనే చెబుతుంటాడు. రాజన్న రాయలసీమ లోని అందర్లాంటి ఫ్యాక్షనిస్టు కాడు. కులాల తత్వం తెలిసినవాడు. అందుకే తన కులంవాళ్ళని ఎన్నడూ విశ్వసించడు. తన కులం అధికారం చలాయించ డానికీ, ఆదేశాలు జారీ చేయడానికి మాత్రమే పనికి వస్తుందని అతని నిశ్చితాభిప్రాయం. కానీ, దళితుల్ని ఎక్కువగా నమ్ముతాడు అతను. వాళ్ళే తనని కాపాడగలరు, తన లక్ష్యాన్ని నెరవేర్చగలరని అతని ప్రగాఢ విశ్వాసం. రాజన్న కాలేజీలో చదువుకునే రోజుల్లోనే తన మిత్రుడితో పాటు కమ్యూనిస్టు పార్టీలో తిరిగేవాడు. అయితే, కమ్యూనిస్టు కాలేక పోయాడు. అది అతని స్వభావానికి విరుద్ధమైందని తెలుసుకున్నాడు. కానీ, కమ్యూనిజం పాలసీని అవగాహన చేసుకున్నాడు. తన తండ్రి నారాయణప్ప శత్రువర్గం చేతిలో హతం అయ్యాక తానే ఫ్యాక్షని స్టుగా పగ్గాలు చేపట్టేందుకు సిద్ధమవుతూనే ముందుగా రాజన్న చేసిన పని దళితుల్ని చేరదీయడమే. దాంతో దళితులకు రాజన్న మీద ప్రేమాభిమానాలు వెల్లివిరిశాయి. 'చిన్న పామునయినా పెద్దకర్రతో కొట్టాలి. ముళ్ళ కంప ఎంత చిన్నదయినా, దాన్ని ఎక్కడ పారేసినా, ఎప్పుడైనా కాలికి గుచ్చుకునే ప్రమాదముంది కాబట్టి, తనకి కంచెగా వేసుకుంటే సరి' అన్నది అతని సిద్ధాంతం.

ఉన్నట్టుండి లేచి నిలుచున్నాడు రాజన్న.

జనంలో గుసగుసలు ఆగిపోయాయి.

"ఇద్దో, అందరికీ చెప్తున్నా. ఈ రీపోలింగ్‌లో ఎలక్షను అధికార్లూ, పోలీసులూ చానా ఎక్కువ మందే వస్తారు. ముఖ్యంగా మన ఊరి పోలింగ్ కేంద్రం మీదే అందరి కన్నూ ఎక్కువగా ఉంటుంది. మనం ఇంతకు ముందు మాదిరిగా ప్రతిదానికీ దుడుకుగా కొట్లాటలు పెట్టుకోకూడదు. నిజానికి మనమున్నా, మన నియోజకవర్గంలోని పోలింగ్ కేంద్రాలన్నా వాళ్ళందరికీ అదురే. ఎవరూ నోరు తెరచి ధైర్యంగా మాట్లాడరు- పోలీసోళ్ళయినా సరే. అట్లని మనమెవరూ వాళ్ళని రెచ్చగొట్టకూడదు. పోలింగ్ స్టాఫుని నొప్పించకుండా, వాళ్ళనేమాత్రం నోరెత్తనీయకుండా రిగ్గింగ్ జరపండి" అంటూ రాజన్న అందర్నీ ఉద్దేశించి మాట్లాడుతూనే, "ఏరా మల్లేసూ, అర్థమైందా? నువ్వు మీవాళ్ళతో వెళ్ళిపో" అన్నాడు. సరేనన్నట్టు తలూపి అక్కడి నించి వెళ్ళిపోయాడు మల్లేసు. మాల యువకులందరూ అతన్ని అనుసరించారు.

> గబగబా లోపలికి వెళ్ళాడు మల్లేసు. "నిన్ని ఈడే పూడ్చి పెడతాం" అంటూ కొట్టడానికి చెయ్యెత్తాడు ఓబన్న పోలింగు క్లర్కు మీద.

## 2

ఉదయమే బండ్లపల్లి హైస్కూల్లో రీపోలింగ్ ప్రారంభమైంది. ఎలక్షను స్టాఫంతా రెవిన్యూ శాఖ వాళ్ళే అవడంతో, ఏ అవాంఛనీయ సంఘటన జరిగినా అవలీలగా ఎదుర్కోగలం అన్న ధీమా అందర్లోనూ కనిపిస్తోంది. అయినా అందరి మనసుల్లోనూ ఏ క్షణంలో ఏం జరుగుతుందోనన్న శంక మాత్రం వేధిస్తోంది. పోలింగ్ కేంద్రానికి తెల్లారి చేరగానే ఎలక్షన్ ఆఫీసర్ స్టాఫు నుద్దేశించి, "ఎవరితోనూ గొడవలు పెట్టుకోవద్దండి. ఇది రాజన్న సొంత ఊరు. మనం ఏ మాత్రం అజాగ్రత్తగా, ఆవేశంగా మాట్లాడినా ఉద్రిక్తత చోటు చేసుకునే అవకాశం ఉంది. కాబట్టి కొంచెం చూసుకుని పోండి" అంటూ కొన్ని సూచనలు ఇచ్చాడు. 'అంటే రిగ్గింగు చేసుకోడానికి అనువుగా ఉండమనా' అన్న సందేహం అందర్లో తలెత్తింది. అయితే, ఎవరూ దాన్ని బయట పెట్టలేదు. సరేనని తలలూపారు.

పోలింగ్ మందకొడిగానే సాగుతోంది. స్త్రీల పోలింగ్ బూత్ కంటే పురుషుల పోలింగ్ బూత్‌లో ఓటర్లు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. ఆ ఓటర్లందరూ ఎవరో కాదు. రాజన్న మీద అభిమాన

ముస్తు చేశావులే. తొమ్మిది గంటలవుతున్నట్టే తన బలగంతో వచ్చాడు మల్లేసు. ఎలక్షనాఫీసరుకీ, పోలీసులకీ వాళ్ళెవరన్నది నమస్తున్నే తీరుని, మాట్లాడే తీరుని బట్టే అర్థమైంది.

మల్లేసు ఎలక్షనాఫీసరు దగ్గరికి నేరుగా వెళ్ళి "సార్ మేం రాజన్న మనుషులం. మరి కాసేపట్లో మీ అందరికీ టిఫెన్లు, టీలూ వస్తాయి. మధ్యాహ్నానికి భోజనాలు కూడా వస్తాయి" అన్నాడు.

ఎలక్షనాఫీసరు ముఖం సంతోషంతో పొద్దు తిరుగుడు పువ్వులా అయింది. "ఓకే ఓకే... వెరీమెనీ థ్యాంక్యూ" అన్నాడతను.

"సార్, ఒక్కమాట. మీరు మంచిగా ఉంటే మట్టసంగా ఓట్లు వేసుకొని పోతాం. మీరు కాదూ, కూడదు అని అన్నారో ఈ ఊళ్ళో నించి మీరు పోరు. మీ శవాలే పొయ్యేది. ఇడ ఎంతమంది పోలీసోళ్ళు ఉండినా మమ్మల్నేమీ జేసుకోలేరు" అన్నాడు.

"అది కాదయ్యా! ఇప్పుడు రిటర్నింగ్ ఆఫీసరుగారూ, కలెక్టరుగారూ, ఎలక్షను అబ్జర్వరు గారూ వీళ్ళంతా వస్తారు" అంటూ ఎలకనాఫీసరు చెబుతూ ఉంటే-

"వస్తే రానియ్యండి సార్! అట్ల పై ఆఫీసర్లు ఎవ్వరయినా వస్తే చెప్పడానికి నేను బయటే ఉంటాను లెండి. రేయ్! కానియ్యండ్రా" అనేసి ఆ గదిలోంచి బయటికి వస్తున్నట్టే-

"మల్లేసూ! మన ఓబిగాడు ఎలక్షను వాళ్ళతో కొట్లాట పెట్టుకుంటాడు" అంటూ స్త్రీల బూతులోంచి వచ్చి చెప్పాడు గోపాల్.

గబగబా లోపలికి వెళ్ళాడు మల్లేసు.

"ఏమనుకుంటావ్ వాయ్! నిన్ని ఈడే పూడ్చి పెడతాం" అంటూ కొట్టడానికి చెయ్యెత్తాడు ఓబన్న పోలింగ్ క్లర్కు మీద. ఎత్తిన చెయ్యిని అట్లానే పట్టేశాడు మల్లేసు. కోపంతో తిరిగి చూశాడు ఓబన్న. మల్లేసుని చూస్తూనే తగ్గి, "చూడు మల్లేసా! ఈయప్ప ఏందో రూల్సు మాట్లాడ్తా ఉండాడు" అంటూ ఫిర్యాదు చేశాడు. అప్పుడు చూశాడు మల్లేసు పోలింగ్ క్లర్కు ఎవరా అని. అతనెవరో కాదు, రమేష్. రమేషన్న!

"రమేషన్నా నువ్వా" అన్నాడు ఆశ్చర్యంగా మల్లేసు.

అందాకా కోపంగా ఉన్న ముఖంలో నవ్వు పులుముకుని, "మల్లేసా! నువ్వా. ఏందిరా ఇదీ? వీళ్ళంతా మీ వాళ్ళేనా? కొంచెం చెప్పురా. ఆ చేసుకునే రిగ్గింగేదో మట్టసంగా చేసుకోమను. ఊరికే గలాటాలు యాల. ఉన్నెట్టుండి మా ఆఫీసర్లు వస్తారా. వాళ్ళ ముందర మా మానాలు పోవా. సాయంత్రం దాకా టైముంది కదా ఏంటికి ఊరికే ఆత్రం" అన్నాడు రమేష్.

రమేష్, మల్లేసుని పలుకరించే తీరు చూసి ఓబన్న ముఖం దించేసుకున్నాడు. ఇంతలో ఎలకను ఆఫీసరు కలుగజేసుకుని, "ఏమయ్యా! బ్యాలెట్టు పేపర్లు దొరికినాయిగదా అని మొత్తం పోలయ్యేదట్ల జేసేరు. యాభయి పర్సెంటు లోపలే పోల్ అయ్యేటట్లు చూడండి. ఇదో రమేషూ కొన్ని బ్యాలెట్ పేపర్ల కట్టలు పక్కన పెట్టి తక్కినవి ఇచ్చెయ్యి. వాళ్ళే జూసుకుంటారు అంతా" అని సలహా ఇచ్చాడు.

"రమేషన్నా! ఇంటికి పోదాం రాన్నా! అప్పట్లో ఇదిగో వస్తా, అదిగో వస్తానంటూ రానేలేదు. ఈ పొద్దు వచ్చినావు మా ఊరికి... రాన్నా పోదామి" అన్నాడు మల్లేసు. అతని మాటల్లో ఎంతో ఆప్యాయత కనిపిస్తా ఉంది.

"నేనిప్పుడు ఎలెక్షన్ డ్యూటీ మింద వచ్చినానురా మల్లేసు!

**పెళ్ళికూతురు ముఖంలో దిగుల్నీ, ఆందోళననీ ఎవరూ గమనించలేదు. అరగంట తరువాత మల్లేసు అడ్డపంచెలో, వేటకొడవలితో వచ్చాడు.**

వీలుగాదులే. మళ్ళా ఎప్పుడన్నా వస్తా" అన్నాడు నవ్వు తెచ్చుకున్న ముఖంతో రమేష్.

మధ్యాహ్నం మూడు గంటల కల్లా పోలింగు పూర్తయింది. పోలింగు స్టాఫంతా భోజనాలు చేసేశారు. అప్పటికి ఇంకా టైము అవలేదు కాబట్టి పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

తనపై పెట్టిన బాధ్యతని దిగ్విజయంగా నిర్వహించినందుకు మల్లేసు మనసు చెప్పలేనంత ఆనందంతో నిండిపోయి ఉంది. రాజన్న ఇంటి నించి ఫోన్లో పేటలో ఉన్న రాజన్నకి ఈ విషయం తెలియజేశాడు. 'నువ్వు సమర్థుడివి కాబట్టే నీకాపని వప్పగించినాను. వెరీ గుడ్' అంటూ రాజన్న అభినందనల్ని అందుకోవడంతో మరింత పొంగిపోయాడు మల్లేసు. తన వెంట ఉన్న వాళ్ళందర్నీ ఇళ్ళకి వెళ్ళిపొమ్మన్నాడు. అందరూ వెళ్ళిపోయాక ఏం తోచడం లేదు మల్లేసుకి. ఆ పల్లెలో ఉన్నది ఒకే మెయిన్ రోడ్డు. దానికి ఇరువైపులా కొన్ని అంగళ్ళు, మూడు టీ హోటళ్ళు. వచ్చిపోయే బస్సులన్నీ అక్కడ ఆగుతుంటాయి. కాబట్టి ఎక్కువగానే జన సంచారం ఉంటుంది. అయితే, ఆ రోజు ఎలకను రీపోలింగు జరుగుతున్నందువల్ల రద్దీ అనలే లేదు. మల్లేసుకి టీ తాగాలనిపించింది. తిమ్మన్న హోటలు చేరుకున్నాడు. అక్కడ టీ తాగడమంటే ఇష్టం మల్లేసుకి. హోటల్లోకి అడుగు పెడుతున్నట్టే ఎదురుగా ఉన్న బెంచి మీద రమేషు కూచుని ఉన్నాడు. మల్లేసుని చూస్తూనే నవ్వుతూ పలకరించాడతను. సాయంత్రం అయిదు వరకూ చేసేపని ఏమీలేక అక్కడికి వచ్చినట్టు చెప్పాడు రమేష్.

ఆ హోటల్లో వాళ్ళిద్దరూ తప్ప ఎవరూ లేరు. "మా యన్న రమేషన్న. తిమ్మన్నా! మంచి టీ పెయ్యి బాగుండల్ల సూడి" అంటూ టీకి ఆర్డరిచ్చాడు. తిమ్మన్న టీ తయారు చేసేందుకు సిద్ధమవుతూ ఉన్నాడు.

రమేషూ, మల్లేసూ పేటలో ఒకే స్కూల్లో చదువుకున్నారు. ఒకే హాస్టల్లో ఒకే గదిలో ఉండేవాళ్ళు. మల్లేసుకంటే ఒక సంవత్సరం రమేష్ సీనియర్. అందుకే రమేష్ని 'అన్నా' అంటాడు మల్లేసు. ప్రతి చిన్న విషయంలోనూ మల్లేసుకి అండదండగా ఉండేవాడు రమేష్. ఓసారి మల్లేసుకి టైఫాయిడ్ వస్తే, ఆ జబ్బు నయమయ్యే వరకూ సపర్యలు చేస్తూనే ఉన్నాడు. పదవతరగతిలో అడుగు పెడుతున్నట్టే తండ్రి చనిపోవడంతో మల్లేసు చదువు ఆపేసి ఊరు చేరుకున్నాడు. ఆ తర్వాత మరెప్పుడూ మల్లేసూ, రమేష్ కలిసింది లేదు.

వాళ్ళిద్దరూ చిన్నప్పటి విషయాలు ముచ్చటించుకుంటుంటే తిమ్మన్న టీ అందించాడు. టీ తాగుతూ రమేష్, రాజన్న గురించి అడిగాడు మల్లేసుని. 'ఎలాంటి వాడు' అని. అతను అడిగిందే తడవుగా టీ తాగుతున్నంతసేపూ రాజన్న గొప్పతనం గురించీ, మంచితనం గురించి చెప్పడం మొదలుపెట్టాడు మల్లేసు. దళితులంటే రాజన్నకి ప్రాణమనీ, తనని సొంత తమ్ముడి కంటే మిన్నగా చూసుకుంటాడని కూడా చెప్పాడు.

రమేష్ అంతా విన్నాక, "మల్లేసా! రాజన్న మంచి తెలివైనవాడు అనిపిస్తోందిరా. నువ్వు చెప్పిన విషయాల్ని బట్టి చూస్తుంటే దళితుల్ని ఎంత బాగా ఆకట్టుకోవాలో అంత బాగా ఆకట్టుకుని మీ మనసుల్ని కొల్లగొట్టేసినాడు. అవునూ, రాజన్న వాళ్ళ నాయనదీ కూడా ఇదే పద్ధతేనా" అన్నాడు.

రమేష్ మాటల్లోని అంతరార్థాన్ని గ్రహించకుండా మల్లేసు, "లేదన్నా! రాజన్న వాళ్ళ నాయన నారాయణప్ప మాలా మాదిగోళ్ళంటే పురుగుల్ని చూసినట్లే! మేము ఎవ్వరూ వాళ్ళ ఇంటి దరిదాపులకు కూడా పోతుండ్లేదు. నీకి ఇంకొక సంగతి జెప్తా. అయిదు ఏండ్ల కిందట ఇట్లే ఎలక్షన్లు వచ్చె. అప్పట్లో రాజన్న వాళ్ళ నాయిన నారాయణప్ప నిలబడిండె- ఎమ్మెల్యే సీటుకి. మన మాలోళ్ళంతా ఆయప్పకి పోటీగా నిలబడిన శివరామప్పకి వోటేసినాం. నేనయితే శివరామప్ప తరుపున పోలింగు బూతులో ఏజంటుగా కూడా కూచోని ఉంటిని. అయినా యాపొద్దేగానీ మాపైన కోపం జేసుకోలా. నారాయణప్ప సచ్చిపోయినాక రాజన్నదే రాజ్యమైపాయె. ఇంగ జూడీ మాలోళ్ళనీ, మాదిగోళ్ళనీ దెగ్గరికి తీసుకోబట్టె... తనని 'గొంచికాడా' అని గౌరవించ వద్దు అనీ, 'అన్నా' అని మాత్రం పిల్చమనె. ఆయప్ప పెండ్లాం వనజమ్మని 'వదినా' అంటానని పిల్చమనె. దాంతో మా ఊర్లో ఎంత మార్పు వచ్చిందో తెలుసాన్నా! ఇప్పుడు ఎంత పెద్ద కులమోళ్ళనన్నాగానీ 'సామీ',

'గొంచికాడా' అని అనేదే లేదు. అందర్నీ 'అన్నా', 'వదినా', 'మామా', 'అత్తా' అంటాననే అనేది. మాకి బ్యాంకిల్లో అప్పు ఇప్పించె, గవుర్నమెంటు నించి మంచి మంచి కాంట్రాక్టు పనులు మాకి వచ్చేదట్ల జేసే. అంతవరకూ మమ్మల్ని ఆ శివరామప్ప ఎంత నీచంగా చూసిందీ అప్పుడు అర్థమాయె" అంటూ మల్లేసు చెప్పుకుపోతూ ఉంటే-

"మల్లేసూ! మీ రాజన్న నూటికి నూరుపాళ్ళా నిజమైన ఫ్యాక్షనిస్టురా! ప్రాణం లేని తుపాకుల్నీ, బాంబుల్నీ నమ్మకుండా... మిమ్మల్నే ఆయుధాలుగా, తనకి రక్షణ కవచాలుగా చేనుకున్నాడురా" అన్నాడు నవ్వుతూ రమేష్.

"అన్నా అన్నా! మెల్లగా మాట్లాడు. తిమ్మన్న వింటే నిన్ని చెడ్డగా అనుకుంటాడు."

"అనుకోనీలేరా! ఉన్న నిజం అంతే. ఒరేయ్ మల్లేసా! నువ్వు ఫ్యాక్షనిజం ఊబిలో కూరుకు పోతున్నావురా! నువ్వు ఇంత సేపు చెప్పిన గొప్పలన్నీ వింటూంటే. నువ్విక్కడ ఉండేది ఎంత మాత్రం మంచిది కాదనిపిస్తావుంది. పేటకి వచ్చెయ్యిరా. ఏ ఆటోనో తోలుకొని బతకొచ్చు" అన్నాడు రమేష్.

ముఖం కానంత చేనుకున్నాడు మల్లేసు.

"నేను చెప్పింది నీ మంచికే అనేది భవిష్యత్తులో తెలుస్తుందిలేరా! ఏందోలే, చాన్నాళ్ళ తర్వాత నిన్ను చూస్తిని, నంతోషంరా" అన్నాడు రమేష్, మల్లేసు చేయినందుకుని.

"అన్నా చెప్పేది మర్చిపోతి. రేపు నెల ఇరవయి అయిదో తేదీ నా పెండ్లి. పత్రిక పంపిస్తా, కచ్చితంగా రావల్ల నూడి" అన్నాడు మల్లేసు.

"యా ఊర్లోరా పెండ్లి?"

"ఈ ఊర్లోనే. మాయక్క బిడ్డనే పెండ్లి చేనుకుంటా ఉండేది."

"తప్పకుండా వస్తారా" అనేసి వెళ్ళిపోయాడు రమేష్.

హోటలు తిమ్మన్న, రమేష్ గురించి అడిగితే చెబుతూ ఉండిపోయాడు మల్లేసు.

* * *

ముప్పయ్ వేల వోట్ల మెజారిటీతో రాజన్న గెలిచాడు. మల్లేసు ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. వీధుల్లో రాజన్నని ఊరేగిస్తూ ఉంటే కల్లు బాగా తాగేసి, 'రాజన్న మాయన్న - నా కత్తికి ఎదురు లేదురా రోయ్' అంటూ కేకలేస్తూ ఉన్నాడు. రాజన్న మల్లేసు ఉత్సాహాన్ని చూసి నవ్వుతూ ఉన్నాడు.

**3**

మల్లేసు పెండ్లికి బంధువులంతా వచ్చారు. ఆ రోజు పదిన్నర గంటలకి ముహూర్తం.

రాముల గుళ్ళో మల్లేసుని పెండ్లి కొడుకుని చేస్తున్నారు. పెండ్లిబట్టలు కట్టుకుంటూనే రాజన్న కోసం ఎదురు చూస్తున్నాడు. తలపాగా కట్టుకుంటూ, బాసికం కట్టుకుంటూ ఎదురు చూశాడు రాజన్న కోనం.

రాజన్న ఊళ్ళో లేడని తెలుసు మల్లేసుకి. అంతకు ముందురోజు ఏదో పని ఉందంటూ బళ్ళారికి వెళ్ళాడు రాజన్న. వెళ్ళేటప్పుడు రాజన్న, మల్లేసుతో 'నేను రాకుండా నీ పెండ్లి ఎట్ల జరుగుతాదిరా మల్లేసా! రేపు ముహూర్తం లోపల నీ పెండ్లి పందిట్లో ఉంటాను' అని హామీ ఇచ్చాడు కూడా. మరి ముహూర్తం దగ్గర పడుతోన్నా రాలేదు. పెండ్లే వాయిదా పెడదామా అని అనిపిస్తోంది మల్లేసుకి. 'ఈ ముహూర్తం కాకుంటే మరొక ముహూర్తం... అన్న లేకుండా ఎట్ల పెండ్లి జేనుకొనేది.'

పది గంటలు దాటుతోన్నా మల్లేసు పెండ్లి పందిట్లోకి రాలేదు. రాజన్న కోనం ఎదురు చూస్తూనే ఉన్నాడు.

"ఏమప్పా! మల్లేసూ నిన్ని వనజమ్మ వదిన రమ్మంటాంది. అన్న బళ్ళారి నించీ నీకు ఫోను జేసినాడంట" అని ఓబన్న వచ్చి చెప్పాడు.

'అంటే రాజన్న రానట్లేనా... నువ్వు వచ్చేవరకూ నేను పెండ్లి జేనుకోనని కచ్చితంగా చెప్పల్ల' అనుకుని, ఉరుకుల పరుగుల మీద రాజన్న ఇల్లు చేరుకున్నాడు మల్లేసు. వనజమ్మ బయటి గదిలోనే



నిలుచుని ఫోనులో మాట్లాడుతూ ఉంది. మల్లేసుని చూస్తూనే "ఏరా మల్లేసూ! మీయన్న ఫోను జేసినాడు. ఇదో మాట్లాడు" అంది ఫోను అందిస్తూ.

ఆత్రంగా ఫోను అందుకుని "అన్నా! నేను మల్లేసుని" అన్నాడు.

"ఒరే మల్లేసూ! ఎంతపనయిందో చూడరా. తీరా మన ఊరికి వెళ్ళబూరే నమయానికి జీపు ట్రబులిచ్చిందిరా. నీ కథ నాకి తెలుసురా నేను అక్కడికి వచ్చేవరకూ నువ్వు తాళి కట్టవని. నీ ప్రేమ నాకి తెలుసు. అయితే ఒరే నా ఒక్కని కోనరం చానా మందిని బాధపెట్టకూడదు. ముఖ్యంగా నీ పెండ్లాం, అదేరా, పెండ్లి కూతురూ... మీ అక్కయ్యా చానా బాధపడతారు. వాళ్ళు నన్ని చెడ్డగా అనుకొనేది నీకి ఇష్టమా?"

"లేదన్నా" అన్నాడు మల్లేసు.

మరి నామీద ఏమాత్రం గౌరవమున్నా ముహూర్తం లోపలే పెండ్లిజేనుకో. జీపు రిపేరీ అయితానే వచ్చేస్తాను. ఒరే రాత్రికి మనింట్లోనే విందు. మర్చిపోవద్దు. మీ వదినకి కూడా చెప్పినా. రాత్రి తొమ్మిది గంటలకల్లా విందు కార్యక్రమం అయిపోగొట్టుకోని హైదరాబాదుకి పోవాల్రా! రేపటి నించీ అసెంబ్లీ నమావేశాలు కదా! ఫోను పెట్టేస్తా".

నిరుత్సాహంగా ఫోను పెట్టేసి, "వదినా! నువ్వన్నా రావా" అన్నాడు.

"ఎందుకు రాను రా! పెండ్లికి రావాలని నేను తయారై చానా సేపయ్యింది. పదా పోదాం. నీ పెండ్లి చూసే అదృష్టం మీ అన్నకి లేదురా" అంది వనజమ్మ.

మల్లేసు కళ్ళలో తడితో వనజమ్మని చూశాడు. ఆమె నముదాయిస్తున్నట్టు కళ్ళతోనే 'పద పోదాం' అంది. ఇద్దరూ బయల్దేరారు.

మల్లేసు పెండ్లి ముహూర్తంలోనే జరిగిపోయింది.

**4**

రాజన్న ఇంట్లోని హాల్లో విందు జరుగుతోంది.

పెండ్లికొడుక్కీ, పెండ్లికూతురికీ ప్రత్యేకంగా పీటలు వేసి కూచోబెట్టారు.

వనజమ్మ కొసరి కొసరి వడ్డిస్తూ ఉంటే ముచ్చటగా ఓ కంట గమనిస్తూ ఉన్నాడు రాజన్న. మల్లేసు అప్పుడప్పుడు రాజన్న ముచ్చట పడుతూ ఉండడం చూస్తూ ఉన్నాడు. అందుకే రాజన్నంటే తనకి అంత ప్రేమాభిమానం అనుకున్నాడు.

అగ్రకులానికి చెందిన మనిషి ఒక మాలవాడిని అంత గౌరవించడం దళితులందరికీ ఆనందంగా ఉంది. తక్కిన కులాల వారికి కొంత కంటగింపుగా ఉంది. మాలమాదిగ నాయాండ్లని ఇట్ల నెత్తికి ఎక్కించుకుంటే రేపు పొద్దున్న మన మాట వింటారా? అని సాటి కులస్థులు రాజన్న విషయంలో మండిపడినా, బయటికి అనలేకపోతున్నారు.

భోజనాలు అయ్యాక "మల్లేసా! ఇద్దోరా! నీకీ, నీ పెండ్లానికీ కొత్త బట్టలు" అని ఇచ్చాడు- పళ్ళెరంలో తాంబూలంలో పెట్టిన కొత్త బట్టల్ని.

"నీకి టెరికాటన్ బట్టలూ, నీ పెండ్లానికి పట్టు చీరా, రవికా" అంది నవ్వుతూ వనజమ్మ.

"మీ వదినే పట్టుపట్టి నీ పెండ్లానికి పట్టుబట్టలు తెచ్చిందిరా" అన్నాడు రాజన్న.

వాళ్ళ ప్రేమానురాగాలకి మల్లేసు కళ్ళు తడి అయ్యాయి. ఆప్యాయంగా "అన్నా" అంటూ రాజన్న వైపు చేతులు సాచాడు మల్లేసు. రాజన్న అతని చేతుల్ని మృదువుగా నొక్కి వదిలాడు. "మీరు బాగుండాలిరా! మీ క్షేమమే నా క్షేమము" అన్నాడు చిరునవ్వుతో.

"ఏమండీ! జీపు డ్రైవరు మాబు వచ్చినాడు" అంది




వనజమ్మ.

"ఆఁ ఫోంచేసి సిద్ధంగా ఉండమను" అనేసి మల్లేసు వైపు చూస్తూ, "ఈ పొద్దు నీ పెండ్లి కార్యక్రమం లేకుండా ఉంటే నాతో పాటే నిన్ని కూడా హైదరాబాదుకు తీసుకుపోయి ఉందునురా" అన్నాడు రాజన్న. 'నువ్వు నా వెంబడి వస్తే బావుంటుంది' అన్న ధ్వని వచ్చినట్టు అనిపించింది మల్లేసుకి.

"ఏమన్నా! ఎందుకట్లా అంటాండావు" అన్నాడు మల్లేసు.

"అబ్బే, ఏం లేదురా! నా బాడీగార్డు తిప్పగాడికి జ్వరం."

"అవునాన్నా! అందుకేనా వాడు పెండ్లికి కూడా రాలేదు."

"అవును. అందుకే..." అంటూ ఆగిపోయినాడు ఏదో చెప్పబోతూ.

"వాడు రాకుంటేనేమన్నా నేను వస్తాను... నిన్ని ఒంటరిగా పోనియ్యను" అన్నాడు మల్లేసు ఆదుర్దాగా.

"నేను ఒంటరేంరా, తిక్కనాయాలా! ఇద్దరు గన్‌మాన్‌లూ, ఇరవైమంది నాతోపాటు సాయుధులై ఉంటే" అన్నాడు నవ్వుతూ రాజన్న.

ఏమో, నాకవన్నీ తెల్దు. నీ చుట్టూ ఎందరున్నా, నేనుగానీ, తిప్పన్నగానీ ఉంటే నీకి కొండంత ధైర్యమని ఎన్నిసార్లో అన్నేవు. అందుకే నేను వస్తా" అన్నాడు మొండిగా మల్లేసు. రాజన్నకి తెలుసు మల్లేసు మనస్తత్వం. అందుకే అలా మాట్లాడాడు.

"నీ ఇష్టంరా" అని ఊరుకున్నాడు రాజన్న.

పెళ్ళికూతురు ముఖంలో దిగుల్నీ, ఆందోళననీ ఎవరూ గమనించలేదు.

* * *

అరగంట తర్వాత మల్లేసు మామూలు చొక్కా, అద్దపంచెతో వచ్చాడు. చేతిలో వేటకొడవలి ఉంది.

రెండు జీపులు సిద్ధంగా ఉన్నాయి. అందులో ప్రయాణించాల్సిన వారంతా రాగానే రాజన్న - "మీరంతా మీ సామగ్రితో జాగ్రత్తగా ఉండండి. ఈ రోజు మనం హైదరాబాదుకు బయల్దేరుతున్నామని అవతలి వాళ్ళు పసిగట్టి ఉంటారు. ఏ క్షణానయినా వాళ్ళు దాడి చేసే ప్రమాదముంది. ఒకవేళ మనం ఏ టీ తాగడానికో దిగినా అందరం చాలా అలర్టుగా ఉండల్ల తెల్సిందా" అన్నాడు.

రాజన్న ప్రయాణించే ప్రతిసారీ ఇలా అందరికీ చెప్పిగాని జీపులో కూచోడు. తొమ్మిదిన్నర గంటలు అవుతున్నట్టే జీపులు రెండూ బయల్దేరాయి. మల్లేసు రాజన్న వెనుక ఉన్న సీటులోనే కూచుని ఉన్నాడు.

**5**

రాత్రి మూడుగంటలవుతోంది. హైదరాబాదు వైపు జీపులు రెండూ దూసుకుపోతున్నాయి.

గన్‌మెన్‌లూ, మల్లేసూ, రాజన్నలు తప్పా తక్కిన ఎస్కార్టుగా వచ్చిన వాళ్ళు నిద్రలో జోగుతున్నారు.

డ్రైవరు మాబూకు నోట్లో అందాకా వేసుకున్న గుట్కా చప్పబడిపోవడంతో మరో పొట్లం కోసం

**రమేష్ టీ తాగుతూ రాజన్న గురించి అడిగాడు మల్లేసుని. అడిగిందే తడవుగా రాజన్న గొప్పతనం గురించి చెప్పసాగాడు మల్లేసు.**

ఎడం చేత్తో జేబుల్ని తడుముకున్నాడు. అయిపోయి నట్లనిపించింది. ఎట్లాగూ మరో పది నిమిషాల్లో జడ్చర్ల చేరుకోవచ్చు. అక్కడ మంచి టీ తాగి, గుట్కా వేసుకుంటే బావుంటుంది అనుకున్నాడు.

"అన్నా! జడ్చర్లలో టీ తాగుదాం" అన్నాడు మాబు రాజన్నతో.

"ఊఁ సరే మాబూ, నాకూ టీ తాగాలనిపిస్తావుంది."

పదినిమిషాలలో జడ్చర్లలో ఉన్న టీ హోటలు ముందు ఆగాయి రెండు జీపులూ. టీ హోటలు ట్యూబ్‌లైట్లతో వెలిగిపోతూ ఉంది. వెన్నెట్లో తిరుగుతున్నట్టు అనిపిస్తోంది అక్కడ తిరుగుతున్న జనానికి.

"టీ తాగే వాళ్ళంతా రాండప్పా" అన్నాడు గట్టిగా మల్లేసు రెండు జీపుల్లోని వాళ్ళనుద్దేశించి. అందరూ దిగారు. రాత్రి ప్రయాణికులకోసం బయటివైపే టీ కొట్టు ఉండేలా అమర్చారు హోటలు వాళ్ళు. రోడ్డు మీద అటూ, ఇటూ బస్సులూ, లారీలు ఆగి ఉన్నాయి. లారీడ్రైవర్లూ, క్లీనర్లూ సమోసాలూ, చపాతీలు చాలా ఇష్టంగా తింటున్నారు. హోటలుకు ఎడమ వైపున్న ఒక కుర్చీలో రాజన్న కూచున్నాడు. రెండు జీపుల్లోని వాళ్ళూ ఆయన చుట్టూరా కూచున్నారు. గన్‌మెన్‌లు మాత్రం నిలుచునే ఉన్నారు. టీ చేయడానికి మరో అయిదు నిమిషాలు అవుతుందని మల్లేసు కనుక్కుని వచ్చాడు. ఆమాట రాజన్నతో చెప్పేసి, బీడీ తాగుతూ నిలుచున్నాడు.

"మల్లేసా! ఒరే మల్లేసా" అని పిలుపు వినిపిస్తే తిరిగి చూశాడు. అప్పుడే ఆగిన ప్రైవేటు బస్సులోంచి వచ్చిందా పిలుపు. అంతగా తనని పిలిచింది ఎవరా అని తేరిపార జూశాడు మల్లేసు. కిటికీలో నవ్వుతున్న మనిషి కనిపించాడు. లైటు వెలుతుర్లో అతనెవరో పోల్చుకోలేకపోతూ మెల్లగా బస్సు వైపు కదిలాడు.

"నేనురా! రమేష్‌ని" అంటూ బస్సు దిగి వచ్చేశాడు.

"అరెరె నువ్వాన్నా! కనుక్కోలేకపోతినే. పెండ్లి పత్రిక అందిందాన్నా!" అడిగాడు మల్లేసు.

అందిందన్నట్టు తలూపుతూ, "హైదరాబాద్‌లో పని ఉండి పోయాన్రా. అవునూ నిన్ననే కదా నీ పెళ్ళి మరి అప్పుడే ఇక్కడ... శోభనం... అదీ..." అంటూ మల్లేసు చేతిని అప్రయత్నంగానే అందుకుని ఊపాడు. తాను ఎందుకు హైదరాబాద్ వెళుతున్నదీ చెప్పాడు మల్లేసు.

"నీకి స్వామి భక్తి ఎక్కువైందిరా! కొత్త పెండ్లాం మొగమన్నా చూడకుండా రాజన్న వెంటబడి వచ్చినావు. ఏం పనిరా ఇది! నువ్వు మనిషివి కావురా, ప్రాణమున్న ఏ.కే. 47వి" అన్నాడు రమేష్ చిరుకోపంతో.

వాళ్ళిద్దరూ నిలుచున్న చోటికే మాబూ టీలు ఇచ్చి వెళ్ళాడు.

"మల్లేసా ఇప్పటికయినా మించిపోలేదురా! పేటకి రారా. ఏ బ్యాంకులోనన్నా ఇంత అప్పు ఇప్పిస్తాను. ఏ బీడీ బంకో పెట్టుకో. లేదంటే ఏ ఆటోరిక్షానో నడుపుకో. ఈ గబ్బు రాజకీయాలలో, ఈ ఫ్యాక్షన్‌ల నడుమ ఏమయిపోతావో కదరా! ఏక్షణంలో నీ ప్రాణానికి హాని జరుగుతుందో తెలీదు." ఆవేదనతో అన్నాడు రమేష్.

"నువ్వు చెప్పేది కూడా నిజమేనన్నా! మా రాజన్న మొగం జూస్తే ఆయప్పతోనే నా చావయినా, బతుకయినా అనిపిస్తాది."

"ఇంత నమ్మినబంటు ఏ ఫ్యాక్షనిస్టుకీ దొరకడురా! నీ ఇష్టం." నిస్పృహతో అన్నాడు రమేష్.

తాగిన టీ గ్లాసుల్ని ఇచ్చేసి రావడానికి వెనుతిరిగాడు మల్లేసు. అప్పటికే రాజన్న వాళ్ళందరూ టీ తాగేసి వెళ్ళిపోయారు. గబగబా గ్లాసుల్ని హోటలు వాళ్ళకి ఇచ్చేసి, డబ్బు చెల్లిస్తూ ఉన్నాడు మల్లేసు.

రమేష్ మల్లేసునే చూస్తూ ఉన్నాడు. అతనికి మల్లేసు జీవితం గురించే ఆలోచన పట్టుకుంది.

ఉన్నట్టుండి ఏవో పేలిపోయినట్టు భయంకరమైన శబ్దాలు వచ్చాయి. తలతిప్పి చూశాడు మల్లేసు. రెండు జీపులూ పేలిపోయి మంటలు అలుముకున్నాయి. ఎస్కార్టుగా వచ్చిన వాళ్ళని ఎవరో తరిమి తరిమి నరికేస్తూ ఉన్నారు. అప్పటికే గన్‌మెన్‌లు నేలకొరిగారు. రాజన్న ఎక్కడ ఉన్నాడో!

ఊహించని పరిణామం... మల్లేసు ఒక్క క్షణంలో తేరుకున్నాడు. ఈలోగా 'ఒరే మల్లేసూ' అంటూ ప్రాణభయంతో నిండిన రాజన్న కేక వినబడింది.

వెంటనే కేక వచ్చిన వైపు పరుగులు తీస్తూ 'ఎవ్రారేయ్, మీయమ్మ' అంటూ బూతులు తిడుతున్నాడు. తానిప్పుడు నిరాయుధుడు. తన వేట కొడవలి జీపులోనే ఉండిపోయింది. అయినా రాజన్నని ఎట్లయినా రక్షించుకోవాలి. టీ హోటలు చుట్టుపక్కల ఉన్నవాళ్ళు భయవిహ్వలులై దూరంగా జరుగుతూ ఉన్నారు. ఎటు వెళ్ళాలన్నా అదురు!

రాజన్న పరిగెత్తుతూ మల్లేసు వైపు వచ్చాడు. మల్లేసు ఆ వెంటాడుతున్న వాడిని వట్టి చేతులతోనే ఎదుర్కొన్నాడు. అంతే వేటకొడవలి వేటు మల్లేసు మెడమీద పడింది. వెంటనే రక్తం చిమ్ముసాగింది. మళ్ళీ వేట కొడవలి పైకి లేచేటప్పటికి అతన్ని గట్టిగా వడేసి పట్టుకున్నాడు మల్లేసు. రాజన్న ఈలోగా తప్పించుకుని చీకట్లో కలసిపోయాడు. తన లక్ష్యానికి అడ్డు వచ్చిన మల్లేసుని మరింత కసిగా తలపైన నరికి, రాజన్న కోసం అటూ ఇటూ చూసి వెనుతిరిగాడతను.

రమేష్ కళ్ళముందే మారణకాండ జరుగుతూ ఉంటే స్థాణువు అయిపోయాడు. అలా ఎంతసేపు ఉన్నాడో తెలీదు. యాంత్రికంగా అడుగులు వేస్తూ ముందుకు కదిలాడు రమేష్. కళ్ళు తెరుచుకునే ఉన్నాయి. రక్తపు మడుగులో ఉన్న మల్లేసులో కదలికలు లేవు. ■

● మధురాంతకం నరేంద్ర
● చిత్రాలు: వి.ఆర్. పాణాల

# ముక్కుపుల్ల

మా యింటిని చేపల బజారుగా మార్చిపారేశారు కదా మీరు! రోజూ గొడవే! రోజూ పోట్లాటే! యిరుగు పొరుగు వాళ్ళంతా పెద్ద న్యూసెన్సయిపోయిందని గోలపెడుతున్నారు. వీధిలో తలెత్తుకుని తిరగలేకపోతున్నాము. వున్న పాళాన మా షెడ్డును ఖాళీ చేసి బయటికి నడవండి" అంటూ అరిచాను కోపంగా.

"నువ్వు గూడా పొమ్మంటే యెక్కడికి పోతామమ్మా" అంది నీలమ్మ వెనుదిరిగయినా చూడకుండా. ఆ స్వరంలో వేడికోలు లేదు. పోకపోతే నువ్వేం చేస్తావన్న ధీమా మాత్రమే తొంగి చూస్తోంది.

నీరసంగా నులక మంచం పైన చేరగిలబడ్డాను.

కాంపౌండు గోడకవతలి రోడ్డుపై నుంచీ వాహనాల రాకపోకల సవ్వడి పెద్దగా వినబడుతోంది. పెరట్లో క్రోటను మొక్కలు కళకళలాడుతున్నాయి. మునగచెట్టు తెల్లటి పూతతో పెళ్ళి కూతురిలా ముస్తాబై వుంది. కరివేపాకు చెట్టు పేరంటాలిలా నిండుగా వుంది. కాంపౌండు కవతలున్న దిరిసెన చెట్టు- నా చేతులతో నేను నాటిన మొక్క - చాపిన కొమ్మల కింద, ఆస్‌బెస్టాస్ షీట్లతో కట్టిన షెడ్డు పక్కన, రాళ్ళతో ముక్కోణంలా తయారు చేసిన పొయ్యి ముందు, వీపు నాకేసి తిప్పుకుని కూర్చుని, బియ్యం గాలిస్తోంది నీలమ్మ. షెడ్డు ముందున్న కొబ్బరి కీతుల పందిరి వాసానికి బిడ్డ నిద్రిస్తున్న వుయ్యాలొకటి వేలాడుతోంది. నీలమ్మ కటువైపున కూర్చున్న నాలుగేళ్ళ పిల్ల సత్తు కంచం లోంచీ సద్దన్నం తింటోంది.

బాగా విశాలమైన పెరడు. యెప్పుడో పాతికేళ్ళకు ముందు, వూరింతగా పెరగక పూర్వం, యెకరాల లెక్కలో మావారు కొన్న భూమి యిది. అప్పట్లో బాగా చౌక. యిప్పుడది వూళ్ళోని ధనవంతులు మాత్రమే నివసించడానికి వీలయ్యే పోష్ లొకాలిటీ. రేటు పెరుగుతోందికదా అని యెప్పటికప్పుడు దీని అమ్మకాన్ని ఆయన వాయిదా వేస్తూ వస్తున్నారు. ఖాళీ స్థలంలో టేకు మొక్కలూ, కొబ్బరి, నిమ్మ, జామ చెట్లూ పెట్టాం. పెద్ద తోటలా తయారయింది. దాదాపు రెండెకరాల సైటు మాది. రెండువైపులా సరిహద్దులా రెండు వీధులున్నాయి. మా యిల్లు అటువైపు వీధికి దగ్గరగా వుంటుంది. పెరటివైపు ప్రహరీ గోడ దగ్గరున్న చిన్న గేటుకు దగ్గరగా, యిల్లు కడుతున్న సమయంలో వాచ్‌మెన్ కోసమని యీ షెడ్డును కట్టించాము.

కడిగిన బియ్యాన్ని తాపీగా పొయ్యి పైని డేగిశాలోకి పోశాక, నెమ్మదిగా తిరిగొచ్చి నా ముందు నేలపైన గొంతుక్కూచుంది నీలమ్మ. వోసారి పెద్దగా ముక్కు చీదుకున్నాక, "నీ మనవరాల్నీ, మనవడ్నీ దినమ్మూ రిక్షాలో యిస్కూలుకి తీసుకొని పోతానని వప్పందం చేసుకున్న పెద్దమనిషి! మాటిచ్చినాక దానికి కట్టుబడి వుండాల్నా, వద్దా? మాట నిలకడ లేని మనిషితో కాపరం జేసే శక్తి నాకు లేదు తల్లా! నిన్నటి దినంతో వానికీ, నాకూ తెగతెంపులయిపోయినాయి. యింక యీ పక్కకు తిరిగి చూడనని మొరాయించుకోని పోయినాడు..." అంటూ నింపాదిగా, నిబ్బరంగా చెప్పుకుపోతోంది ఆమె. "నాకుండేది ముగ్గురు బిడ్డలు. పెద్ద బిడ్డను మా అమ్మానాయినా సాకేస్తా వుండారు. మిగిలుండేది యీ రెండు పసికందులు. యింకొకరి కష్టంలో పొయ్యే మనిషిగాదు నేను. యేదయినా రెండిండ్లు చూపించి పుణ్యం గట్టుకో! ఆ పనీ యీ పనీ జేసుకొని నా బతుకు నేను బతుకుతాను..."

నీలమ్మ జీరబోయిన గొంతుతో వేడుకోవడంతో నాకు జాలేసింది. అంతలో ఆవిడ తెలివిగా పన్నుతున్న వలలో తగులుకుపోతున్నానన్న విషయం స్ఫురించింది. "వాడు పిల్లల్ని రిక్షాలో తీసుకెళ్ళినంత కాలం మా షెడ్‌లో వుండనిస్తానని గదా వప్పందం! వాడే లేకపోయిన తర్వాత యీ నంతంతా యిక్కడెందుకు? అందరూ దయచెయ్యండి బయటికి" అన్నాను వెక్కసంగా.

"దానికోసం దిగులు పెట్టుకోవద్దమ్మా! రిక్షా యీడనే వుండాదిలే" అంటూ తన అభయ హస్తాన్ని ప్రహరీగోడ పక్కనున్న రిక్షాకేసి చూపింది నీలమ్మ.

"రిక్షా కనిపిస్తోందిలే! తొక్కేదెవరు? నువ్వే తొక్కుతావా కొంపదీసి..." అన్నాను మండిపడుతూనే.

"అదేమైనా బ్రమ్మ విద్యా! అయినా, నేను తొక్కన్లే! సుబ్రమణి వుండాడు..." మళ్ళీ తన వంటపని కొనసాగిస్తూ నీలమ్మ సమాధానం చెప్పింది.

"సుబ్రమణా? వాడెవుడు?"

"వెంకటాపురం నుంచీ వచ్చినాడులే! నాలుగు దినాలుగా యీడనే వుండాడు..."

"మిమ్మల్నిద్దర్నీ వుండమన్నాను గానీ, యిలా గుంపు గుంపునంతా వచ్చి చేరిపొమ్మని చెప్పలేదు నేను." యెంత ఆపుకుందామనుకున్నా కోపం ఆగడం లేదు నాకు. వూగిపోతూ అరవసాగాను. "పోయిన నెలలో వచ్చినప్పుడు వాళ్ళెవరో యిద్దరున్నారిక్కడ. అడిగితే నీ మొగుడు పిన్నమ్మా, చిన్నాయనా అన్నాడు. పోయిన వారం వచ్చినప్పుడు యింకో జత కనిపించారు. అత్తామామా అన్నాడు. యిప్పుడీ సుబ్రమణి. తండాకు తండానే దిగబడి, తాగి తందనాలాడి, రోజుకో జాతర తయారుచేసి, మమ్మల్ని వీధిలోకి లాగడమేనా మీ పని!"

"అంతా ఆ మహన్నబావుడి బందువర్గమే తల్లా! నా సుట్టమెవరూ రాగూడదు. వస్తే కండ్లల్లో నిప్పులు బోసుకుంటాడు. నా యెదాన పడినోళ్ళను పొమ్మన్నాననే గదా నిన్నంత రగడ జరిగింది." తాటాకు బొమ్మలా చేతులు తిప్పుతూ నీలమ్మ రవాయించింది.

"నిజమే! తప్పు నీదిగాదు. నీ మొగుడిదీ గాదు. షెడ్డు ఖాళీగా వుంది గదా అని, మా ఆయనతో చెప్పి వప్పించి మిమ్మల్ని లోపలకి రానిచ్చింది నేనే. తప్పంతా నాదేలే" చివరకు పరాజయాన్ని వొప్పుకుంటున్నట్టుగా చేతులు పైకెత్తేశాను.

నీలమ్మ మరో రెండడుగులు ముందుకొచ్చి నిలబడి రెండు చేతులూ జోడించుతూ, "పెట్టే తల్లినే అడగమన్నారు గదమ్మా పెద్దోళ్ళు. నువ్వు గాకపోతే నాకు అయ్యోయమనే వాళ్ళు యెవరుండారు" అంటూ ప్లేటు ఫిరాయించేసింది. "చెప్పిన మాట వినకుండా యీ మగోడ్ని పెండ్లాడినానని మా నాయిన నా ముఖం చూసేది లేదు. వీడేమో వాని కడుపే కైలాసమంటాడు. పగుల్లో రిక్షా తొక్కి సంపాదించిందంతా సాయింత్రానికి హోటలోళ్ళ పరం జేసేస్తాడు. మిగిలిందాంతో సారాయి తాగేసి, పెండ్లాం బిడ్డల కడుపు కాలేటట్టుగా గురకలు దీస్తాడు. నా కష్టమూ నష్టమూ చెప్పుకునేదానికి నువ్వు తప్ప నాకు దిక్కెవరుండారు తల్లా!"

కాస్సేపు ఆమె ముఖంలోకే చూస్తూ వుండిపోయిన తర్వాత, మంచం కోడుకు ఆనుకుని కూర్చుంటూ, "యెంతకయినా తగిన దానివేలే నువ్వు" అన్నాను మెల్లగా. "నిన్న మొన్నటిదాకా నీ మొగుడికి తాగుడు అలవాటే లేదన్నావు. చుట్టుపక్కల వాళ్ళు చెప్పిన మాటలన్నీ తప్పులని ప్రమాణాలు చేశావు. యిప్పుడు మాత్రం నువ్వు చెబుతున్న మాటలు నిజాలేనన్న గ్యారెంటీ యేముంది? నిన్నెలా నమ్మడం?"

నీలమ్మ పందిరి కూసం పైన వాలిపోతూ, "యింటిగుట్టును బయట పెట్టుకునేది మంచిది గాదు గదా అమ్మా" అంది. "అయినా, యెంతకాలమని మూసి పెట్టుకునేదానికి కుదరతాది? ఆ మనిషిని పెండ్లాడిన దినం నుంచీ ఎన్ని అగచాట్లు పడినానో నాకు దెలును, ఆ దేవుడికి తెలును. అయినోళ్ళనందరినీ కాదని వచ్చినాను గదా! ఆ మాటయినా



గెపనముండాదా వానికి? నంకలో బిడ్డ లేకుంటే నేను గూడా కూలీనాలీ చేనుకోని రెండు రూకలు నంపాదించుకోని గుట్టుగానే నంసారం జేనుకో నుందును. యింట్లో వుండే పెండ్లాం బిడ్డలకు పిడికెడు నూకలైనా తేవాలని ఆ మనిషి అనుకోడు. చాలనిదానికి యీ గుంపునంతా తెచ్చి నా నెత్తిపైన దిగేస్తాడు. నాకే లేదు. వీళ్ళకు వండివార్చలేదని రోదన. యీ కస్మాలం బతుకు నేను బతకలేను."

"గుంపు గుంపని నోటికొచ్చినట్టుగా కూస్తా వుండావు. నీ రెక్కల కష్టమేమన్నా వూరికే తింటా వుండామా మేము! యీ జోబిడిలో వుండే దానికని నెలకు యాభైరూపాయల బాడిగ తీనుకుంటా వుండావా లేదా నువ్వు! కొంచెం కండ్లు నేలమీద పెట్టుకోని చూడు..."

కొత్త కంఠం వినిపించేనరికి వులిక్కిపడి తిరిగి చూశాను. షెడ్డు వాకిలి దగ్గర పొట్టిగా, గుండ్రంగా, చీరకట్టిన రుబ్బురోలులా కనిపించిందొక వ్యక్తి. నెరిసిన వెంట్రుకల తల చిందరవందరగా రేగి వుంది. వుబ్బిన బుగ్గల కింద తమలపాకులు నలుగుతున్నాయి.

"అమ్మా తల్లా! నీ నోటికొచ్చే బిడువు నాకు లేదు. నిన్నెవురూ వక్కాకు పెట్టి పిలవలేదు." ఆవిడ వైపుకు తలతిప్పయినా చూడకుండా నీలమ్మ చేతులు పైకెత్తి నమస్కారం చేస్తోంది.

"ఈవిడేనా నీ మొగుడికి మేనత్త" అని అడిగాను జ్ఞాపకాల తెరలు తిప్పుతూ.

"కాదమ్మా! దొరసామి నాకు కొడుకు వరనవతాడు. అత్త అయితిందని గూడా జూడకుండా యెంతలేని మాటలు మాట్లాడతా వుండాదో చూడు. నంసారులెవురైనా యీ పాటు పడతారా" అంటూ ఆవిడ నన్నే మధ్యస్తానికి ఆహ్వానించింది.

ఈ పుణ్యాత్ములు రాక ముందు ఆ మనిషి గూడా బాగనే వున్నాడమ్మా! యీామె మొగుడు దినమ్మూ దీపాలు పెట్టే టయానికి గుర్రమెక్కేస్తాడు. చాలనిదానికి యీ మనిషిని గూడా దోవ దప్పించేసినాడు." నీలమ్మ గూడా తన వాదంతో సన్నద్ధురాలైపోయింది.

"అప్పటికి నీ మొగుడు నోట్లో యేలు బెట్టినా కొరకలేడు. నా మొగుడికి యింకోపని లేదు. దోవన బోయ్యే వాళ్ళందరికీ మందు తాగేది నేర్పించేదే సేద్యం" అంది ఆవిడ వెటకారంగా.

"ముందు నువ్వు మర్యాదగా బయటికి నడువు. మిమ్మల్నంతా యిక్కడికెవరు రమ్మన్నారు" అంటూ ఆవిడను మందలించాను.

"మేమేమీ గతి లేక యిక్కడికి రాలేదమ్మా! మాకా గంగమ్మ గుడికాడ యిల్లుండాది" అంది ఆమె.

"అయితే, యిక్కడికెందుకొచ్చినావు? అక్కడికే పో..." అంది నీలమ్మ పుల్ల విరిచినట్టుగా.

"పోతాం లే! ముందు నా నూరు రూపాయలు నా చేతిలో పెట్టు."

"దుడ్డు నాకిచ్చినావా నువ్వు?"

"నీ మొగుడి కిస్తే నీకిచ్చినట్టు గాదా?"

"వానికీ, నాకూ యిప్పుడు నంబంధమేమీ లేదు."

అక్కడ నేను కూర్చుని వున్నానన్న నంగతిని గూడా మరిచిపోయి, వాగ్వివాదంలోకి దిగేశారు వాళ్ళిద్దరూ. నాకు చిర్రెత్తుకొచ్చింది. "మా యింటిని ప్లాట్‌ఫారంగా తయారు చేసేశారు మీరంతా! ముందు అందరూ ఖాళీ చేసి వెళ్తారా? లేకపోతే పోలీసుల్ని పిలవమంటారా" అని కసిరాను.

ఆ నడివయసు స్త్రీ కాస్సేపు నాకేసి అదోలా చూస్తూ నిలబడిపోయింది. ఆ తరువాత నీలమ్మ కేసి తిరిగి "సాయంత్రం నా మొగుడు రానీ! అప్పుడు చెప్తాను నీ పని" అంటూ బయటికి వెళ్ళిపోయింది.

నీలమ్మ పొయ్యిలోకి మరో రెండు కట్టెల్ని దూరుస్తూ, "మంచి పని చేశావమ్మా! పోలీసులంటే ఆ నా సవితికి భలే బయిం" అంది పెద్దగా నవ్వేస్తూ.



> "మిమ్మల్నిద్దర్నీ వుండమన్నానుగానీ, యిలా గుంపు గుంపునంతా వచ్చి చేరిపొమ్మని చెప్పలేదు నేను." యెంత అవుకుందామనుకున్నా కోపం ఆగడం లేదు నాకు. వూగిపోతూ అరవసాగాను.

ఆమె వ్యవహారమేమిటో నాకెంతకూ అంతుబట్టడం లేదు. యిక్కడ తానేం చేసినా చెల్లుబాటయిపోతుందని అనుకుంటోంది కాబోలు.

నా ధోరణిని గమనించనట్టుగా నీలమ్మ వయ్యారంగా నడుముపైన చేయివేసుకుని నిల్చుంటూ, "అసలీ ఆడముండవల్లే గదమ్మా రోజూ రోదన" అంటూ తన వాదాన్ని నిగుడించింది. "ఆ మొగుడనే మనిషి ప్రతి సాయింత్రమూ పూటుగా తాగేసి వస్తాడు. యిది వాని నోటికి హితవుగా వంట జేసి పెట్టదు. చాలనిదానికి వాడొక్కడే తాగేసి వచ్చినందుకు తనకలాడిపోతింది. దానికోనరమని వొకమందు పొట్లమైనా తేలేదేమని పోరు బెడ్తింది. వాడు పేట్రేగిపోతాడు. వాని చెయ్యాడనూ, దీని నోరాడనూ. యిదే గదా దినమ్మూ జరిగే భాగోతం..."

"ఇది గూడా సారాయి తాగితిందా?" ఆశ్చర్యపడిపోయాను.

"మెల్లింగా అడగతావా ఆ మాట! దానిది కడుపుగాదు కల్లూరు తూము. దీని బాధ భరాయించలేకనే తొలీ మొగుడు గుండె పోటొచ్చి పోయినాడు.." అదేదో ఘనకార్యమయినట్టుగా కళ్ళెగరేసి, వంకర నవ్వు నవ్వుతోంది నీలమ్మ.

"వీడు రెండో మొగుడా దీనికి?" యింకా అదే ఆశ్చర్యాన్ని పొడిగించాను.

"అయ్యో రామా! యీ మనిషికీ పెండ్లాముండాది. బిడ్డలుండారు. అందరికీ పెండ్లిడ్లయిపోయినాయి. యీ సావిత్రమ్మ మా మొగోనికి సాయానా చిన్నాయిన పెండ్లాం. దీనికీ మనవళ్ళూ మనవరాళ్ళూ వుండారు. మొగుడు పోయిన మూడో నాటికంతా యీ మనిషిని తగులుకునింది యిది. బలవంతంగా వాణ్ణి తొడుక్కొనొచ్చి మా అంచన చేరింది. నెలకో రెండు రూకలు వస్తాయిగదా అని, చన్నీళ్ళకు యేన్నీళ్ళుగా వుంటాది గదా అని యింట్లోకి రానిచ్చినాను. చూసేదానికి ముసిలిది మాదిరిగా వుండాదని అనుకునేవు. దీనికెప్పుడూ అదే యావ! ఆ మొగోని మింద భలే

అనమానం. సందు దొరికిందంటే ఆ మనిషిని నస పెట్టి చంపేస్తుంది. రాత్రుల్లో ఆ పక్కన పండుకుంటారు గదా యిద్దరూ! యీ పక్కన మేముండాముగదా అని గూడా అనుకోరు. దాని గోకుడుకూ, వీని నసుగుడుకూ - మేము నవ్వలేక నస్తామనుకో..." నీలమ్మ సిగ్గు పడడంలేదు, పరవశంగా నవ్వుతోంది.

"ఇలాంటి మనిషిని మా యింటిలోకి రానిచ్చావా? చీమకు పెత్తన మిచ్చినట్టయిందే నా కథ!" కోపంతోనూ, అసహ్యంతోనూ నా గొంతు వణకసాగింది. "యెంత వొళ్ళు కొవ్వెక్కితే మాత్రం యీ వయసులో కన్నబిడ్డల్ని వదిలిపెట్టి బరితెగించి తిరుగుతారా యెవరైనా? యిది మనిషిగాదు. పశువు. పశువులు కూడా యిలా తిరగవు."

"ఏ మాట కామాటే చెప్పాలమ్మా! యీ మనిషికి బిడ్డలంటే బలేబ్రమ. నెలకో, రెండు నెలలకో వొకతూరి వాళ్ళ వూరికి పోయొస్తుంది. కలిగిందేదో వాళ్ళకిచ్చేసి వస్తుంది" అంది నీలమ్మ నవ్వుతూనే.

"ఇది తీసుకుపోతే మాత్రం వాళ్ళెలా తీసుకుంటారు? అసలు వాళ్ళు దీన్ని దగ్గరికి రానిస్తారా యింకా గూడా?" నాకెందుకో సావిత్రమ్మ పైన చెప్పలేనంత అక్కసుగా వుంది.

"యెందుకు రానియ్యరమ్మా! దుడ్డంటే వాళ్ళకేమైనా చేదా? ఆ వూర్నించి వచ్చినప్పుడు చూడాల దాని నంబరం. ఆ కొడుకుల గురించి, కోడళ్ళ గురించీ చెప్పిచెప్పి మమ్మల్ని వూదరగొట్టేస్తింది."

చీడ తగిలిన చెట్టులా నా మనసెందుకో విలవిలలాడిపోతోంది. యెవరో బలవంతంగా నాలోని శక్తినంతా లాగేసినట్టుగా తోస్తోంది.

బయట యెండ మండిపోతోంది. కొబ్బరి చెట్ల పైన కోతుల మూక గెంతుతోంది. జామచెట్టు మొదట్లో వుడతలు రెండు వొకదాన్నొకటి తరుముకుంటున్నాయి. షెడ్డు ముందున్న కోడిపిల్లలు యెందుకో కంగారు పడుతూ గోల చేస్తున్నాయి. వుయ్యాలలోని పాపాయి కెవ్వుమంటూ యేడుపు మొదలుపెట్టింది. నీలమ్మ పోలికలే వున్న పడుచు పిల్ల షెడ్డు లోంచీ బయటికి వచ్చి వుయ్యాల నూపసాగింది.

"మా చెల్లి... మాతమ్మ. వుండేదానికి కొంపనిండా జనమే! కానీ, యెవరుంటారో, యెవరూడతారో తెలియదు. రాత్రుల్లో వొంటిగా అగోరించాల. అందుకని తోడుగా వుండేదానికి రమ్మన్నాను. యిద్దురు బిడ్డలతో యేగలేకపోతా వుండాను. బిడ్డనెత్తుకునేదానికి మనిషైనా కావాలి గదా" అంది నీలమ్మ.

దట్టంగా పసుపు రాసుకున్న నల్లటి మాతమ్మ ముఖం చిత్రంగా మెరుస్తోంది. మెడలో నల్లపూసల దండ వేలాడుతోంది. చేతుల నిండా గాజుల దొంతర గలగల లాడుతోంది.

"నీ చెల్లి... దానికి తోడుగా దాని మొగుడూ... యిలా యెందర్ని రప్పించావు" అని అడిగాను యెగతాళిగా.

"దానికి మొగుడు లేడు లేమ్మా" అంటూ నీలమ్మ చెల్లెలి చేతిలోంచీ బిడ్డను తీసుకుని పాలివ్వసాగింది.

"నీ కళ్ళకు నేనంత పిచ్చి దానిలా కనిపిస్తున్నానా? దాని మెడలో తాడూ, కాళ్ళకు మెట్టెలూ కనిపిస్తూనే వున్నాయి..."

"దానికి మొగుడు లేడు. కానీ, రెండేండ్లకు ముందే దానికి పెండ్లయిపోయింది. అది మనువాడింది మాతమ్మని..." రెండు నిమిషాలు ఆగి, ఆ తరువాత తన సమాధానానికి మరికొంత వివరణను సరఫరా చేసింది నీలమ్మ. "మాతమ్మ మా కుల దేవతమ్మా! యిది ఆ వరాన్నే పుట్టింది. చిన్నప్పుడు జరం వచ్చి యిదింక మాకు లేదనుకునేస్తిమి. అప్పుడు మా నాయిన మాతమ్మకిచ్చి పెండ్లి చేస్తానని మొక్కుకున్నాడు. అన్నప్రకారంగా దీనికి ఆ దేవతతోనే పెండ్లి జేసినాడు."

"అయితే, దీనికింక మరి పెళ్ళి చేయరా" అంటూ విస్తుపోయాను.

ఒకతూరి మాతమ్మతో పెండ్లయిపోయినంక మళ్ళా పెండ్లా? కండ్లు పోతాయి. దానిష్టం వచ్చినట్టు అది బతకచ్చు. దానికెవురూ ఆంక్షలు పెట్టగూడదు. దానికెవుడిష్టం వుంటే వానితో వుండవచ్చు. యిష్టముంటే బిడ్డల్ని గూడా కనచ్చు. లేకుంటే లేదు. పోయిన వుగాదప్పుడు గవర్మెంటోళ్ళు యీ మాదిరి మాతమ్మలయినోళ్ళకంతా యెకరా భూమీ, యిళ్ళూ యిచ్చినారు. యిప్పుడు దీనికి గూడా సొంతంగా యిల్లుండాది. చూసినావా, దీని బతుకే బాగుండాది నాకంటే!" యీసారి గూడా నీలమ్మ ఆనందంగానే నవ్వుతోంది. మాతమ్మ బిడ్డను చంకనేసుకుని షెడ్డులోపలికెళ్ళిపోయింది.

నేరకపోయి వీళ్ళను యింటిలోకి రానిచ్చిన నేరానికి, యెలాంటి మనుషుల్ని చూడాల్సి వచ్చింది నాకు! వీళ్ళసలు మనుషులేనా? యేరాతి యుగంలో

> బయట యెండ మండిపోతోంది. కొబ్బరిచెట్ల పైన కోతుల మూక గెంతుతోంది. జామచెట్టు మొదట్లో వుడతలు వొకదాన్నొకటి తరుముకుంటున్నాయి. షెడ్డు ముందున్న కోడిపిల్లలు గోలచేస్తున్నాయి.

బతుకుతున్నారు వీళ్ళు? వీళ్ళ వ్యవహారం వినడానికీ, చూడ్డానికీ నాకే సిగ్గుగా వుంది కదా! యిలా బతుకుతున్నందుకు సిగ్గూ, శరమూ లేదా వీళ్ళకు? తలంతా మొద్దుబారినట్టుగా వుంది నాకు. కళ్ళు తిరుగుతున్నట్టుగా అనిపిస్తోంది.

ప్రహరీ గోడ దగ్గరికి రెండు ఆకారాలొచ్చి నిల్చున్నాయి.

"అదో! సుబ్రమణి గూడా వచ్చేసినాడు" అంది నీలమ్మ సంబరంగా.

కళ్ళు చికిలించుకుని చూశాను. సన్నగా, బలహీనంగా, క్షయరోగిలా కనిపిస్తున్న నల్లటి యువకుడొకడు కనిపించాడు. అతడి పక్కనే పొట్టిగా, దిట్టంగా వున్న కుర్రాడొకడున్నాడు. అక్కడ నేనున్నానన్న సంగతిని గూడా పట్టించుకోకుండా వాళ్ళిద్దరూ వికవికలూ పకపకలూ రువ్వుకుంటూ షెడ్డు ముందుకొచ్చి నిల్చున్నారు. వాళ్ళ రాకకోసమే యెదురు చూస్తున్నట్టుగా షెడ్డులోంచి వో ఆడ శరీరం గడప దగ్గరికొచ్చి నిల్చుంది. ఆవిడ వయసు యాభై అయిదుకు తగ్గదు. సన్నగా, నొక్కులు పడ్డ వూదు బుర్ర లాంటి శరీరం. బాగా చినిగిన చీర. చేతికి గాజులు లేవు. మెడలోగానీ, చెవిలోగానీ ఆభరణమన్న ప్రశ్నే లేదు. రెండు మోచేతులకూ వెనక పసుపు రంగు పట్టేయించుకుని వుంది. ఆగంతుకులిద్దరూ తన ముందుకు వచ్చాక ఆవిడ చేతులు తిప్పుతూ మూకాభినయం చేయసాగింది. ఆ తరువాత వాళ్ళిద్దరితో కలిసి షెడ్డుకు నూరు గజాల దూరంలో ఉన్న మావడి చెట్టు కిందికి వెళ్ళి, నేలపైన కూర్చుంది. యీలోగా గేటు దగ్గర బలంగా, పొడుగ్గా వున్న యువతి చంకలో బిడ్డతో సహా ప్రత్యక్షమయింది. నేరుగా వాళ్ళదగ్గరికెళ్ళి కూర్చుని ఆ సమావేశంలో తానూ పాలుపంచుకోసాగింది.

నీలమ్మ నాకేసి తిరిగి కిసుక్కుమని నవ్వేసింది.

"ఈ గుంపంతా యెవరు" అని విసుక్కున్నాను.

"ఆ నల్ల పొంటేసుకోనుండేదే సుబ్రమణి. ఆ మల్లమ్మ నా మొగుడికి అత్తయితింది. ఆ పక్కనుండే పిలగాడు భూపాలు. మల్లమ్మ కొడుకు. ఆ చెంచమ్మ వాని పెండ్లాం" అంటూ వరసగా అందరినీ పరిచయం చేశాక, నా ముఖంలో చిడిముడిపాటు కనిపించగానే, "సుబ్రమణికి చెప్పి దినమ్మూ మీ పిల్లోళ్ళను రిక్షాలో అంపించే పూచీ నాది" అని నరాయించింది నీలమ్మ.

"అయితే, వాణ్ణి మాత్రం



యిక్కడుండమను. మిగిలినవాళ్ళనంతా తరమగొట్టు" అన్నాను.

"అదెట్ల కుదిరితిందమ్మా! సుబ్రమణి వుండాలంటే మల్లమ్మ గూడా వుండాల్సిందే!" నేను తెల్ల ముఖం పెట్టడంతో నీలమ్మ మరికొంతగా విపులీకరించింది. "ఆ మల్లమ్మ నాకు వరసకు పిన్నమ్మ గదా! అది పిన్నమ్మయితే ఆ సుబ్రమణే చిన్నాయిన. వానిది మా కులం గాదు. కాపోళ్ళు. మల్లమ్మకు మొగుడు చచ్చిపోయి పదేండ్లయిపోయింది. నాలుగేండ్లుగా యీ సుబ్రమణే మొగుడు. యిద్దరూ బేల్దారీ పనికి పోతారు. యిక్కడ వంట జేసుకుంటారు."

"వాడు చూస్తే పాతికేళ్ళవాడిలాగున్నాడు. అదేమో అరవయ్యేళ్ళ మనిషిలా తెలిసిపోతోంది. వాళ్ళకిదేం పొయ్యేకాలం" అంటూ ఆక్రోశించాను.

"మొదట్లో మేము గూడా యిది బతికి బట్టగట్టే యవ్వారం గాదనుకుంటిమిలే తల్లా!" నా పరిస్థితిని పట్టించుకోకుండా చెప్పుకుపోసాగింది నీలమ్మ "కానీ, వాళ్ళు వొకరినొదిలిపెట్టి యింకొకరుండరు. సుబ్రమణికి వెంకటాపురం దగ్గిర భూములు గూడా వుండాయంట! వాళ్ళ పెద్దోళ్ళు పెండ్లి చేయాలని సంబంధాలు గూడా చూస్తావుండారంట! కానీ, యీ మల్లమ్మ కానీయడం లేదు. సుబ్రమణిని వాళ్ళ వూరికి గూడా పోనీయదు. నిన్న రాత్రి వాళ్ళిద్దరికీ పెద్ద రగడ జరిగింది. వాళ్ళ వూరికి పొయ్యొసొచ్చేదానికి దుడ్డియ్యమని ఆమెనడిగాడు సుబ్రమణి. అది లేదనేంది. వాడు వంగలకొట్టెతో దాని నడుగులించేసినాడు. రాత్రి దాని చావు చదరమైపోయిందనే అనుకుంటిమి. సరిగ్గా అప్పుడనంగా నా మొగుడు తాగేసి యింటికొచ్చినాడు. నేను వాని నెత్తిపైన్నుండే మూదేవి దిగేటట్టుగా జగడమేసుకోని, యింట్లోంచి తరమగొట్టినాను. సందుజూసుకోని సుబ్రమణి గూడా వుడాయించేసినాడు. రాత్రంతా యింటికే రాలేదు. తెల్లారీ తెల్లారక ముందే మల్లమ్మ కొడుకును రాయభారం అంపించింది. చూసేదానికి యామాళం మాదిరుంటాడు గానీ, భూపాలు భలే పనోడు. వలేసి పట్టుకోని తోడుకొచ్చేసినాడు చూడు..."

మామిడి చెట్టుకింద కూర్చున్న మగాళ్ళిద్దరూ బీడీలు కాల్చుకుంటున్నారు. మల్లమ్మ కోడలి తలలో పేన్లు కుక్కుతోంది. చెంచమ్మ బిడ్డకు పాలిస్తోంది. అంతర్జాతీయ రాజకీయాలు చర్చిస్తున్నట్టుగా చుట్టూ వున్న ప్రపంచాన్ని మరచిపోయి వాళ్ళు మాట్లాడుకుంటున్నారు.

"ఆ పిల్ల కావలిస్తే ఆ మొగుడనే కుర్రాడ్ని చంకనేసుకుని పోయేటంత పెద్దదిగా కనిపిస్తోంది. అదీ యీ బాపత్తు సంబంధమేనా" అని అడిగాను వెటకారంగా.

"అదేం కాదమ్మా! పెద్దోళ్ళు చేసిన పెండ్లే! నెరబైలు దగ్గిర చేన్లలో పనీ చేస్తావుండేటప్పుడు చెంచమ్మ కన్ను భూపాల్‌పైన పడింది. చూసేదానికి పిలకాయ మాదిరుండాడుగానీ వాడు భలే పలాతనమైన మనిషి. పనిలోకి వంగినాడంటే యింక తిరగులేదు. దినానికి నూర్రూపాయల వరుమానం లేకుండా యింటికి రాడు. పిల్ల తెలివి మరులుగమ్మించేసింది. యిప్పుడు గూడా నిమిషం యేమారదు. యెక్కడి పోయినా యెనకాల్నే తయారయితింది. అదాకతే పదిమంది పెట్టు. వాని చెయ్యి పట్టుకోని యెట్లా లాక్కోనొస్తావుండాదో చూడు..."

నేను తల తిప్పి చూసేసరికి చెంచమ్మ భూపాల్‌తో బాటూ పందిరి దగ్గరికొచ్చేసివుంది.

"రిక్షా సుబ్రమణికిస్తానంటీవా అక్కా" అని అడుగుతున్నాడు భూపాల్.

వంచిన అన్నం డేగిశాను మళ్ళీ పొయ్యి పైన వుంచుతూ, "అవున్రా! నేను మాట తప్పే మనిషి గాదు" అంది నీలమ్మ. "నమ్మి పనిలోకి పెట్టిన పెద్దమనిషికి జబాబు చెప్పాల్నా, వస్లేదా? ఆ



దొంగముండా కొడుకు మాదిరిగా నట్టేట్లో ముంచేసేదాన్ని గాదు నేను. వాడు లేకపోతే నా కోడికి తెల్లారదా? అందుకే ఆ పని సుబ్రమణికి అప్పజెప్పినాను."

"అదెట్ల కుదిరితింది? మామ నాకు నూట ముప్పయి దాకా యియ్యాల. ఆ దుడ్డిచ్చేదాంకా రిక్షా నాదే." నేరుగా రిక్షా దగ్గరికి వెళ్ళి హేండిలు పట్టుకుంటూ చెప్పాడు భూపాల్.

సుబ్రమణి పరుగుపరుగునా రిక్షా దగ్గరకెళ్ళి "తాకినావంటే తోలు వలిచేస్తాను. బండి నాదీ" అంటూ హుంకరించాడు.

"నువ్వు తాకు బావా. యేం చేస్తాడో చూస్తాను. మొగాన మీసాలుంటే నీ వొళ్ళు పైన దెబ్బ పడనీ చెప్తాను." చంకలోని బిడ్డ కెవ్వుమని క్రేంకారం చేస్తున్నా వినిపించుకోకుండా ముందుకు వురుకుతోంది చెంచమ్మ.

"ముందు మా దుడ్డు అక్కడ పెట్టేసి మాట్లాడే నీలమ్మా! పెద్ద పులావరు మాదిరిగా రిక్షాను యెవురికంటే వాళ్ళకు యిచ్చేదానికి నీకు పురసత్తు లేదు. మా సుబ్రమణికియ్యకపోయినావంటే నీకు తగలబోయేది ధూమే!" తన వయసును గూడా మరచిపోయి నిన్న రాత్రి పట్టేయించుకున్న చేతుల్ని ముందుకు చాపుతూ లేడిలా ముందుకు వురుకుతోంది మల్లమ్మ.

భూమ్యాకాశాలు తలకిందులైపోయినట్టుగా విభ్రమ కలిగింది నాకు. కళ్ళు బైర్లు కమ్ముతున్నట్టుగా వుంది. లోకమంతా అలుక్కుపోయినట్టుగా కనిపిస్తోంది. వణుకుతూనే లేచి నిల్చున్నాను. శక్తినంతా కూడగట్టుకుని, "నోళ్ళు మూయండి అందరూ" అంటూ పెద్దగా ఆక్రోశించాను. "యిది యిల్లనుకుంటున్నారా, లేకపోతే అడివనుకుంటున్నారా? మీ బతుకులకు మానాభిమానాలేమీ లేవా? కడుపుకు యేం తింటున్నారు? ముందు మా షెడ్డు ఖాళీ చేసి బయటికి చావండి. సాయంకాలానికి క్కడెవరైనా కనిపిస్తే పోలీసుల్ని పిలిపించి జైల్లోకి తోయిస్తాను..."

## 2

ముక్కుపుడక.

తెల్లరాయి ముక్కుపుడక.

నా అరచేతిలో నక్షత్రంలా మిణమిణా మెరుస్తోంది.

దీన్ని కేవలం వొక బంగారు వస్తువులా అనుకోవడానికి మనసొప్పడం లేదు. తలలా తెల్లరాయీ, శరీరంలా బంగారుగొట్టమూ, పాదాల్లా వెనకున్న మూత- మొత్తంగా జీవమున్న ప్రాణిలాగే కనిపిస్తోంది.

నేనెన్నో దినాలుగా కోరుకుంటున్న అమూల్యమైన వస్తువు యిది. యిన్నాళ్ళ తర్వాత, యిన్నేళ్ళ తర్వాత నా చేతికొచ్చింది. వుత్కంఠ వల్ల కాబోలు, నా అరిచేయి కూడా వణుకుతోంది. అద్దంలో చూసుకుంటూ ముక్కుపైన తొడుక్కున్నాను. కనురెప్పలూ, పెదవులూ తత్తరపాటుతో వణుకుతున్నాయి. ముక్కుపుడక తెల్లటి కాంతుల్ని విరజిమ్ముతోంది. కన్యాకుమారి విగ్రహం జ్ఞాపకం వచ్చింది మళ్ళీ చీకట్లో గూడా మెరుస్తుందట కన్యాకుమారి ముక్కుపుడక. రెండడుగులు వెనక్కు వేశాను. ముక్కుపుడక వెలుగుల్లో అద్దంలోని నా ప్రతిబింబం

సంబరంగా నవ్వుతోంది. కొంచెం కుడివైపుకు వాలుతూ కాస్సేపూ, యెడమవైపుకు తూలుతూ కాస్సేపూ అద్దంలో సుద్దులు చూశాను. లైట్ స్విచ్ వేసి విద్యుద్దీపం వెలుతుర్లో ముక్కుపుడక అందాన్ని మోజు తీరా చూడసాగాను.

మెట్ల దగ్గర చెప్పుల శబ్దం వినిపించింది. ఆయన వస్తున్నారు. అయ్యో! టయిమెంతయింది? గోడ గడియారం పదకొండు దాటినట్టుగా చెబుతోంది. వంట గదిలోని కుక్కర్ విజిలేస్తోంది. బాత్రూంలో పనిమనిషి బట్టలుతుకుతున్నట్టుంది. గడపకివతలకి చెప్పులొచ్చినట్టున్నాయి. బహుశా ఆయన సోఫాలో కూర్చొని వుంటారు. ఫానైనా వేసుకున్నారో లేదో. యెండన బడి వచ్చారు కదా, చెమట పట్టే వుంటుంది. వెళ్ళి ఫానయినా వేస్తాను. హడావిడిగా బయటికి రాబోతుంటే ముక్కుపుడక జ్ఞాపకం వచ్చింది. యెంతలో యెంతపని జరిగిపోయింది. కంగారుపడుతూ అద్దం దగ్గరికి వెళ్ళి గబగబా ముక్కుపుడక వూడదీశాను. తొందరలో గొట్టం జారి కింద పడిపోయింది. ఆదుర్దాతో వంగి చూశాను. నా అదృష్టం బాగానే వుంది. స్టూలు దగ్గరే పడివుంది. ముక్కుపుడకను కొంగుముడిలో భద్రపరుచుకున్నాక డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాను.

అనుకున్నట్టే సోఫాలో చెమటలు కక్కుకుంటూ కూర్చుని వున్నారాయన. ఫాన్‌వేసి మంచినీళ్ళు తెచ్చిపెట్టడం కోసం వంటగదిలోకి వెళ్ళాను. ఆయన చేతికి నీళ్ళగ్లాను నందిస్తూవుండగా ముఖాన ముక్కుపుడక లేని విషయం గుర్తుకొచ్చింది. ఆయన చూస్తారేమో! యెర్రరాయి ముక్కుపుడక లేకపోతే ఆయనకు కోపం వస్తుందేమో! భయంభయంగా చూశాను. ఫర్వాలేదు. ఆయన ధ్యాస నాపైన లేదు. బతికిపోయాను.

ఖాళీ గ్లాసును నాకు తిరిగిస్తూ, "ఆ పరంధాం యేం చేశాడో చూశావా" అన్నారాయన.

"ఏం చేశాడండీ" అని అడిగాను ఆదుర్దాగా.

"యెల్డర్స్ ఫోరం ఆనివర్సరీ గ్రాండ్‌గా చేద్దామనుకున్నాంగదా! అసలు ఆనివర్సరీనే వద్దంటాడు. ఆ డబ్బుతో కాలనీ రోడ్లలో చెట్లు నాటిస్తాడట..." పళ్ళు పటపట కొరుకుతూ తల పైకెత్తారాయన.

ముఖంలో ముక్కుపుడక లేనట్టుగా ఆయన చూసేస్తారేమో! కొద్దిగా పక్కకు తిరుగుతూ, "యెందుకని" అని ప్రశ్నించాను.

"ఈ కాలనీపైన వున్నట్టుండి వాడికేమీ ప్రేమ ముంచుకు రాలేదు. యానివర్సరీ బాగా జరిగితే నాకెక్కడ మంచి పేరు వచ్చేస్తుందోనని వాడి భయం. వాడికి మెంబర్లంతా వంత పాడుతున్నారు."

"పోతే పోనీలెండి. దాన్ని బాగుపరచాలని మీరొక్కరూ అనుకుంటే సరిపోతుందా? అందరికీ అక్కరుండాలిగదా! మీరు స్థాపించిన సంస్థ అనయినా వాళ్ళకు గౌరవం ఉండాలిగదా! మీరెందుకలా బాధపడతారు? దానికోసమని నానా యాతనా పడి ఆరోగ్యం గూడా పాడుచేసుకుంటున్నారు. కాస్సేపు రెస్టు తీసుకోండి. మీకు జ్యూస్ తీసుకొస్తాను" నా చేతనయిన రీతిలో ఆయనని వోదార్చాక వంటింటిలోకి కదిలాను.

ఆయనెప్పుడూ యింతే! ఆయన మాటల్లోనే చెప్పాలంటే ఆయనొక వర్కొహాలిక్ లైవ్ వయర్. యేదోవొక వ్యాసంగం లేకపోతే యీయనకు కుదరదు. వుద్యోగం చేస్తున్నన్ని రోజులూ ప్రమోషన్లూ, పార్టీలూ అంటూ క్షణం తీరిక లేకుండా తిరిగారు. రిటయరయ్యాక కాలనీలో యెల్డర్స్ ఫోరం ప్రారంభించారు. పొద్దస్తమానమూ ఆపనులతోనే తిరుగుతారు. యింటికొచ్చాక గూడా ఆ ఆలోచనలతోనే సతమతమవుతారు. యింటిపనులను పట్టించుకునే వీలుండదెప్పుడూ. పిల్లల పనులూ, యింటి పనులూ నాకే అప్పగించేశారు. నీది హోమ్ డిపార్ట్‌మెంటని నవ్వేస్తుంటారు. 'తీరిక లేని పనులు. బయటికెలాగూ రాలేవు. కనీసం విశేషాలైనా విను' అంటూ తన గొడవలన్నీ వివరంగా చెబుతూ వుంటారు. వినకపోతే మండిపడతారు. సంతోషమొచ్చినా, కోపమొచ్చినా పట్టలేం! యింటికి యెవరొచ్చినా 'యీవిడేనండీ నా విజయాల వెనకుండే వ్యక్తి' అంటూ ఆనందంగా పరిచయం చేస్తారు.

ఈ కుక్కర్ పాతదైపోయింది. నీళ్ళు పొంగిపొర్లుతున్నాయి. స్టౌ ఆరిపోయివుంది. గాస్ వాసన వెగటుగా వస్తోంది. స్టౌ ఆపిన తర్వాత నిమ్మకాయల కోసం వెతికాను. ఫ్రిజ్‌లో రెండున్నాయి. కానీ, ఫ్రిజ్‌లో వుంచిన నిమ్మకాయలు ఆయనకు పడవు. ఆయనకి ఆస్మా. అదృష్టవశాత్తూ కప్‌బోర్డులో వో కాయ దొరికింది. ఆయనకన్నీ పద్ధతి ప్రకారం జరగాలి. లేకుంటే మనిషి అగ్గిరాముడైపోతారు. తెల్లరాయి ముక్కుపుడక నా తెల్లటి ముఖానికి నప్పదంటారు. యెరుపు రాయిదయితేనే బావుంటుందంటారు. అయినా, నా ప్రారబ్ధం గాకపోతే, నాకేదైతే యిష్టమో, అదే ఆయనకు అయిష్టంగావాలా చెప్పండి. బహుశా నా పదహారో యేట నేను ముక్కుకుట్టుకున్నాననుకుంటాను. అప్పుడు వట్టి బంగారపు ముక్కుపుడక తయారు చేయించింది మా అమ్మ. నేను నడిగితే 'పెళ్ళయ్యాక నీ మొగుడికి చెప్పి నీ యిష్టం వచ్చిన ఆభరణం చేయించుకో' అంటూ నవ్వేసింది. తీరా పెళ్ళయ్యాక యీయనగారేమో యిలా సెలవిచ్చారు. యింతకూ నాకూ, యీ తెల్లరాయి ముక్కుపుడకకూ ఋణముందో లేదో! నిట్టూరుస్తూ కొంగుముడినోసారి తడిమి చూసుకున్నాక పళ్ళరసంతో బాటూ హాల్లోకి వచ్చాను.

"ఈ పరంధామ్‌ను సెకరట్రీని చేసింది నేనే గదా! యిప్పుడు నాకే యెసరుపెడుతున్నాడు. యూజ్‌లెస్ ఫెలో. అంతా సెల్ఫిష్‌నెస్..." చీకాకు పడుతూనే జ్యూస్ తాగేసి లేచి నిలబడి, "వెళ్ళి మిగిలిన మెంబర్లందరినీ కలిసొస్తాను. వచ్చే జనరల్‌బాడీ మీటింగులో వాడికి వుద్వాసన చెప్పాలి" అన్నారాయన.

"ఆ పరందామ్ యీనరికే వాళ్ళను కలిశాడేమో! మీరు వాళ్ళతో జాగ్రత్తగా వ్యవహరించండి" అన్నాను.



చెప్పులు తొడుక్కోబోతున్నవారల్లా అలాగే ఆగిపోయి, "నిజమే! అయినా, నువ్వెప్పుడూ ఆ పరంధామ్‌ను చూడనైనా లేదు. యింత సరిగ్గా యెలా వూహించావు" అని అడిగారాయన ఆశ్చర్యపడుతూ.

"భలేవారే! మీ మాటలు వింటే చాలదూ! మళ్ళీ అతణ్ణి ప్రత్యేకంగా చూడాలా యేమిటి" అనేశాను నవ్వుతూ.

ఆయన తల పంకిస్తూ బయటికెళ్ళిపోయారు.

అమ్మయ్య! మళ్ళీ నాకు కాస్త సమయం దొరికింది. బెడ్‌రూమ్‌లోకెళ్ళి, తలుపులు వేసుకుని మరో సారి తెల్లరాయి ముక్కుపుడకను తగిలించుకుంటూ, అద్దం ముందు కూర్చున్నాను. కొమ్మపైన ముడుచుకుని కూర్చున్న పావురాయిలా ముక్కు బుడిపె పక్కన తెల్లగా, ముద్దుగా వొదుగుతున్నపోతోంది ముక్కు పుడక. యెన్నిరోజుల యెదురుచూపు తర్వాత నాకు దొరికింది! మరీ పెద్ద ఖరీదేమీ గాకపోవచ్చు. కానీ, ఆ డబ్బును రహస్యంగా సేకరించుకోడానికి నేను పడ్డ పాట్లు తలచుకుంటే నాకే నవ్వొస్తుంది. పెళ్ళయినప్పటి నుంచీ ప్రతి నెలా యింటి ఖర్చుల కోసం ఆయన డబ్బులు నా చేతికే యిస్తూ వస్తున్నారు. యెప్పుడూ ఆయనిచ్చిన డబ్బులు వందలువందలుగా బీరువాలో పడివుంటాయి. కానీ, దాన్ని నా సొంతానికి వాడుకోవచ్చా? తప్పుగాదూ? ఆయనెప్పుడూ జమాఖర్చులు చూపెట్టమని నన్నడగలేదనుకోండి. అంత నమ్మకం నేనంటే! అందుకే ఆయనకు తెలియకుండా యే పనీ చేసేదాన్నిగాదు. అదే అలవాటైపోయింది. చెబితే నమ్మరుగానీ, నిజానికి కాస్త డబ్బు కూడబెట్టడానికి నాకు యేడాది కంటే యెక్కువ సమయమే పట్టింది. పాల లెక్కలో కొంత, చాకలి పద్దులో కొంత, కిరాణా ఖాతాలో కొంత, యిలా చీమలు కూడబెట్టినట్టుగా పొదుపుచేసి, చివరికి మొత్తాన్ని కూడబెట్టాను. అక్కడికి డబ్బులు సమకూర్చు కోవడమే సులువైన పని. యెప్పుడూ ఆయన తోడు లేకుండా బజారుకు వొంటరిగా వెళ్ళినదాన్నిగాదు. ఆ బంగారు కొట్టువాడు పరిచయమున్నవాడే! కానీ, నేను ముక్కుపుడక కొన్నానని ఆయనకు చెప్పేస్తే యేం చేయను? కొత్త షాపుకెళ్ళాలంటే బెరుకు. పక్కింటావిడతో కలిసి గుడికెళ్తున్నానని అబద్ధం చెప్పాల్సివచ్చినప్పుడు గుండెలెంతగా కొట్టు కున్నాయో! షాపులో కూర్చున్నప్పుడు యెవరైనా నన్ను వెంటాడుతున్నారేమోననీ, గమనిస్తున్నా రేమోననీ భయమే! కొట్టువాడితో మాట్లాడడానికి కూడా నోరు పెగల్లేదు. మొదటిసారిగా తప్పు చేస్తున్నానన్న కంగారొకవైపు. యింటికి తిరిగిరాగానే గబగబా బీరువాలో ముక్కుపుడకను దాచేశాను. రెండు మూడు రోజుల పాటు ఆ బీరువా దగ్గరికెళ్ళాలంటేనే భయం. యీలోగా యెవరైనా బీరువా తెరిచి దాన్ని చూసేస్తారేమోనన్న అనుమానం. చివరికి యివ్వాళ యెవరూ లేని సమయం చూసి బయటికి తీశాను.

అద్దంలో చూసుకుంటూ అలా యెంతసేపు కూర్చున్నానో తెలియదు. గడియారం మోగినప్పుడు వులిక్కిపడ్డాను. ఆయన భోజనానికొచ్చే సమయ మయింది. అప్పడాలు వేయించాలి. ఆ పనిపిల్ల బట్టలు సరిగా ఆరేసిందో, లేదో! యీ ముక్కు పుడకతో దాని కంట పడినా ప్రమాదమే! యీ ముసలావిడకీవయసులో షోకులెందుకనుకుంటుం దేమో! యెందుకైనా మంచిదని ముక్కుపుడకను మళ్ళీ కొంగు ముడిలో దాచుకున్నాను.

వంటగదిలో గిన్నెలు తెరిచి చూస్తోంటే పక్కనే యెరుపు రంగు కారియర్ కనిపించింది. మా అబ్బాయి రోజూ ఆఫీసుకు తీసుకెళ్ళే హాట్‌బాక్స్ అది. మరైతే యీరోజు వాడు కారియరెందుకు తీసుకెళ్ళలేదు? కొంపదీసి మరచిపోయాడా? వుదయం ఆఫీసుకు బయలుదేరుతుండగా అబ్బాయీ, కోడలూ గొడవపడ్డం జ్ఞాపకమొచ్చింది. ఆవిడగారి పేరుతో లోను తీసుకుని కారు కొన్నాడు మా వాడు. తన జీతమంతా యిన్‌స్టాలుమెంటుకే సరిపోతోందనీ, ఖర్చులకు తనకు డబ్బులేవీ మిగలడం లేదని దాని పోరు. తనకు తెలియని ఖర్చులేమున్నాయంటూ వాడికి కోపం వచ్చింది. పిల్లల తగవుల్లో తలదూర్చవద్దని ఆయన నాకెప్పుడో వార్నింగిచ్చారు. కాబట్టి నేను మౌనంగా వింటూవుండిపోయాను. ఆవిడగారు అలిగి, వాణ్ణి లంచ్‌బాక్స్ లేకుండా ఆఫీసుకు సాగనంపిందన్నమాట!

పెళ్ళయి యిన్నేళ్ళవుతోంది. వాడికి హోటలుకెళ్ళే అలవాటు లేదని తెలియదూ దీనికి! తెలిసీ యింత నిబ్బరంగా యెలా వుండగలుగుతోంది? ఆవిడతో వాగ్వివాదానికి దిగడం వల్ల లాభం వుండదని నాకెప్పుడో తెలిసిపోయింది. కనీసం వాడైనా ఫ్యూన్ను యింటికి పంపగూడదూ? యెప్పుడూ వాడి ఆఫీసుకు ఫోన్ చేసినదాన్ని గాదు. నెంబరు తెలియదు. డైరక్టరీ ఫోను పక్కనే వుంది. యీ పుస్తకంలో నెంబరు వెతకడమంత కష్టమైన పని మరొకటుండదు. చివరికి నెంబరు వెదికిపట్టడానికి అరగంటయినా పట్టి వుంటుంది. ఫోన్ యెంగేజ్




వస్తోంది. యెంతసేపయినా అదే శబ్దం. ఆ ఫోన్ పాడైందేమో! మరేం చేయాలి? గంట రెండు దాటుతోంది. ఆయనగారెక్కడ తిరుగుతున్నారో? ఆకలైనా కాలేదా? విసుగ్గా, కోపంగా, టెన్షన్‌గా వుంది నాకు. పెరటి షెడ్లో ఆ సుబ్రమణో, భూపాలో, యెవడో వొకడు కనిపిస్తే వాడినైనా అబ్బాయి ఆఫీసుకు పంపవచ్చు. గబగబా పెరట్లోకి నడచాను. షెడ్‌లో నీలమ్మ మాత్రమే వుంది. మిగిలిన జనా లంతా యెక్కడికేగారో? వీళ్ళవల్ల ప్రయోజనమేమీ లేదు. కాళ్ళీడ్చుకుంటూ యింటికి తిరిగొచ్చాను.

చెప్పులు టపటపలాడించుకుంటూ ఆయన గూడా అప్పుడే లోపలికొచ్చారు. కోడలు పిల్ల నిర్వాకమేమిటో పిర్యాదు చేయబోయినదాని నల్లా అలాగే ఆగిపోయాను. ఆయన పెద్దగా ఉచ్వాసనిశ్వాసాలు చేస్తూ రొప్పుతున్నారు. వొళ్ళంతా చెమటలు పోసివున్నాయి. తోటకూర కాడలా తూలిపోతూ సోఫాలో సోలిపోయారు.

బీపీ, షుగరూ వున్న మనిషి. వేళకు భోంచేయకుండా తిరిగితే యెలా? కంగారు పడుతూ గబగబా వో గ్లాను గ్లూకోజు కలిపి తెచ్చాను. వొంట్లోకి కాస్త శక్తి రాగానే ఆయన, "యీ కాలనీవాళ్ళు బాగుపడరు. ఆ మెంబర్లందరూ పరంధామ్‌కే వంతపాడుతున్నారు" అంటూ నిట్టూర్చారు.

"వూళ్ళోవాళ్ళు యెలాపోతే మనకెందుకు? వాళ్ళ కోసం మీ ఆరోగ్యాన్ని పాడుచేసుకోవచ్చా చెప్పండి? వాడేమో అలా! మీరేమో యిలా! పైకి లేవండి! వడ్డిస్తాను" అని కోప్పడుతూ వంటగదిలోకి వెళ్ళాను.

"కలెక్టరును చీఫ్ గెస్టుగా పిలిచాం. కంట్రాక్టరు రెడ్డిగారు స్పాన్సర్‌షిప్‌కు వప్పుకున్నారు. ఆరేడు నెలలుగా యేర్పాట్లు చేస్తున్నాను. తీరా యిప్పుడు..." తినడం తక్కువగానూ, మాట్లాడడం యెక్కువగానూ ఆయన భోజన కార్యక్రమం సాగుతోంది. లేని ఆసక్తిని తెచ్చిపెట్టుకుంటూ విన్నట్టుగా నటిస్తున్నాను. నా ధ్యాసంతా లంచ్ బాక్స్ మరచిపోయిన అబ్బాయి పైన్నే వుంది. మధ్యలో యెలాగోలా సమయం చేజిక్కించుకుని, "వాడు లంచ్ తీసుకెళ్ళలేదండీ" అని వాపోయాను.

"హోటలుకు వెళ్ళుంటాడు లెద్దూ" అని తేల్చి పారేశాక, "ఆ కేశవమూర్తి యేమంటాడో వెళ్ళి తెలును కోవాలి. యీ సంగతి అటో యిటో యివ్వాళే తేలిపోవాలి..." అంటూ ప్రసంగాన్నే కొనసాగించారు. మాట్లాడుతూనే చేతులు కడుక్కున్నారు. చెప్పులు తొడుక్కుని మళ్ళీ బయటికెళ్ళిపోయారు.

కడుపులో పేగులు అరుస్తోండగా నేనింకా అన్నం తినలేదన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆయన అన్నట్టుగా వాడెక్కడైనా భోంచేసేస్తే బావుండును. పెళ్ళయ్యాక వాడూ, ఆ మహారాణీ హోటళ్ళకు బాగానే వెళ్తున్నట్టు పింకీ చెబుతుంటుంది. ఆకలిగానే వున్నా అన్నం దిగలేదు నాకు. తిన్న శాస్త్రం ముగించి లేచాను. గదిలోకెళ్తుండగా నా ప్రతిబింబం కనిపించింది.

చెట్లు కొట్టేసిన పొలంలా ముక్కుపుడక లేని ముఖం బీడుబారివుంది. యివ్వాళ మరొకసారి ప్రమాదం తప్పిందన్న విషయం స్ఫురించింది. తన గొడవల్లో సొంతం మునిగిపోయి వుండటంచేత ఆయన నాకేసి తేరిపార జూడలేదు. పెళ్ళయిన కొత్తలోనయితే యిలా జరిగేది గాదు. ఆ రోజుల్లో ఆయన ధ్యాసెప్పుడూ నా ముఖం పైనే వుండేది. రోజులు గడవను గడవనూ, పాపం ఆయన తీరిక లేకుండా తయారయ్యారు.

ముక్కుపుడక కోసం కొంగు తడిమి చూశాను. కొంగుముడి వీడిపోయివుంది. కంగారుపడుతూ మళ్ళీ చూశాను. లాభం లేదు. డ్రస్సింగ్ టేబులు చుట్టూ ప్రదక్షిణలు చేశాను. యేదీ నా తెల్లరాయి ముక్కుపుడక? గత నలభై అయిదేళ్ళుగా నన్ను వూరించిన ఆభరణం? యీ జంజాటాల్లో పడి అది నా కొంగులోనే వుందన్న విషయాన్ని రెండుమూడు గంటల సేపు మరచిపోవడమేనా నేను చేసిన పొరబాటు? యింతలో యెక్కడ జారిపోయిందది? యిందాకా యెక్కడెక్కడ తిరిగాను? డ్రాయింగ్ రూం... వంటిల్లు... పడకగది... అవునవును పెరట్లోకి వెళ్ళాను గదా! యింటి చుట్టూ తిరిగాక షెడ్ దగ్గరికి నడచాను. బాగా వంగి కళ్ళు పెద్దవి చేసుకుని నేలంతా గాలించాను. యీ అలగా జనం దొరికినా తిరిగిస్తారన్న నమ్మకమేముంది?

పొరబాటున ఆ ముక్కుపుల్ల ఆయన చేతికే దొరికిందేమో!

అందుకేనా ఆయనలా కోపంతో మండిపడు తున్నది? తనకిష్టం లేని పని చేశానని కోపమా?

మనసు పరిపరివిధాలుగా పోతోంది. షెడ్‌లో యెవ్వరూ లేరు. షెడ్ తలుపుకు తాళం వేలాడుతోంది.

యెక్కడికెళ్ళారో యీ తండా! కాలుగాలిన పిల్లిలా చెడ తిరగసాగాను.

"యేమిటి నాన్నమ్మా వెతుకుతున్నావు" అంటూ పింకీ గొంతు వినిపించేసరికి వులిక్కిపడి తల పైకెత్తాను.

"అప్పుడే స్కూలు వదిలేశారా? టయిమెంత యింది" అని అడిగాను తడబడుతూ.

"నాలుగున్నర దాటింది.. యేం వెతుకున్నావో చెప్పు. నేనూ సాయం చేస్తాను" అంది పింకీ.

"తెల్లరాయి ముక్కుపుడక..." నోరు జారిపోయి నిజం చెప్పేశాను.

"కొత్తది చేయించుకున్నావా" అని ప్రశ్నించిందా పిల్ల తానూ నేలపైన వెదకుతూ.

"నీ కోసమని..." సమయానికెలాగో వో అబద్ధం స్ఫురించింది.

ఆ పిల్ల తల పైకెత్తి నా కేసి చూడనయినా చూడకుండా, "నా కోసమా? ఛీ... ముక్కుపుడక నాకెందుకు? నేను ముక్కే కుట్టుకోను" అనేసింది.

యే ముక్కుపుడక కోసం నేను యేళ్ళ తరబడీ కలవరించానో, దాన్ని యీ పిల్ల యెంత తేలికగా తీసిపారేస్తోంది.

"ఆ ముక్కుపుడక దొరికిన తర్వాత దాన్ని అమ్మి పారేయ్. ఆ డబ్బుల్తో నేను జీన్సు పాంటూ, షర్టూ కొనుక్కుంటాను" అంది చాలనిదానికి.

"అసలు నీకు యేమీ యివ్వను. యింకా చిన్నపిల్లననుకుంటున్నావా నువ్వు? మగపిల్లాడిలా పాంటూ, షర్టూ వేసుకుని మానం తీయాలా" అని కసురుకున్నాను.

ఆ పిల్ల ముఖం ముడుచుకుని, "అయితే, నీ ముక్కుపుడక నువ్వే వెతుక్కో" అంటూ తన గదిలోకి తుర్రుమంది.

యేం పర్వాలేదు. ఆ మాత్రం వెతుక్కోలేనా నేను! యిన్నాళ్ళ తర్వాత నా చేతికొచ్చి యింతలోనే యెలా మాయమయిందది? అయినా, దీనికీ, నాకూ రాసి పెట్టినట్టు లేదు. ఆయనకిష్టం లేని పని చేస్తే దేవుడికి మాత్రం కోపం రాదా?

నాకు సరిగ్గా బుద్ధి చెప్పడం కోసమే అది దాంకపోయివుంటుంది. దీనికంతా నా పెడ బుద్ధే కారణం! అంతే! యీ వయసులో యీ వెర్రిమొర్రి కోరికలెందుకు నాకు? బీరువాకింద, టీవీ ముందు, డైనింగ్ టేబులు పక్కన, స్టౌ వెనక... యెక్కడెక్కడని వెదకను దాని కోసం? యేదీ? యెక్కడుందది? యెవరైనా కాజేశారా కొంపదీసి?

చీకాకు పడుతూ అలా యెంతసేపు వెతుకుతూ వుండిపోయానో నాకే తెలియదు.

"నాన్నమ్మా! పరంధామ్ ఫోన్ చేశారు. తాతయ్యకు గుండెనొప్పి వచ్చిందట! హాస్పిటల్‌కు తీసుకెళ్ళారట!" బిగ్గరగా అరుస్తూ పింకీ నా దగ్గరికి పరిగెట్టుకొచ్చింది.

నేనలాగే డ్రెస్సింగ్ టేబుల్ ముందు కుప్పకూలి పోయాను. ఒలంతా మొద్దుబారినట్టయిపోయింది. నరాలు మెలి తిప్పినట్టవుతోంది. వొళ్ళంతా స్తాణువైపోయింది.

"నాన్నమ్మా! నాన్నమ్మా!" పింకీ వెంటేలు పడుతూ నా భుజం పట్టుకుని కుదుపుతోంది.

కాలచక్రం తిరగడం మానేసినట్టుంది. నా ముందు జరుగుతున్న తతంగానికీ, నాకూ సంబంధమేమీ వున్నట్టు లేదు.

విలవిలమంటూ గుండాకటి ఆయన శరీరాన్ని యింటి లోపలికి తీసుకొచ్చింది. అబ్బాయీ, కోడలూ అక్కడే వున్నారు. యిద్దరూ బిగ్గరగా యేడుస్తున్నారు.

నేను యేడవకపోవడంతో అందరూ కంగారు పడుతున్నారు. పింకీ పెద్దగా కుదుపుతోంది నన్ను.

యెంత పని జరిగిపోయింది! [illegible]

[illegible]

దుఃఖం ముంచుకొచ్చింది. కొండపేటు దగ్గర దుమికే జలపాతంలా యేడుపు నా గొంతులోంచి విరుచుకు పడింది. అంత బాధలోనూ నాకెందుకో పింకీ జీన్సు పాంటూ, షర్టూ గుర్తుకొచ్చాయి. మరింత పెద్దగా యేడవసాగాను.

## 3

"షెడ్డు ఖాళీ చేస్తాంలేమ్మా! రెండు రోజులు వోపిక పట్టు. వున్న పాళాన పొమ్మంటే యెక్కడికి పోతాము" అంది నీలమ్మ నిర్వేదంగా.

"ఆరు నెలలుగా ఆ మాటే చెబుతున్నావు. ఖాళీ మాత్రం చేయడం లేదు. దాదాపు రెండు గంటలుగా సాగుతోంది పెరట్లో మీ కాకిగోల. వారానికి కనీసం రెండుమూడుసార్లయినా మీరలా పిచ్చిగుంట్లవాళ్ళలా తగవులాడుకోవడం, యిరుగు పొరుగువాళ్ళు మమ్మల్ని విసుక్కోవడం, గొడవ జరిగిన ప్రతిసారీ నేనిలా వచ్చి షెడ్డు ఖాళీ చేయమని గోలచేయడం అన్నీ అలవాటైన పనులైపోయాయి. యివ్వాళ అమీ తుమీ తేలిపోవాలి" అన్నాను నేను యింకా గస పోస్తూనే.

అంతవరకూ మెగాఫోన్లలా గొంతు చించుకుంటున్నవాళ్ళు నా రాకను గమనించగానే నోటి బీగాలు తగిలించేసుకున్నారు. అందరూ మూగెద్దుల్లా మారిపోయారు. షెడ్డు ముందు పందిరి వాసానికి వేలాడుతున్న వుయ్యాలలోని పాపాయి యింత గొడవ జరుగుతున్నా యెలా నిద్రపోతోందో నాకర్థం గావడం లేదు.

నాలుగేళ్ళ ఆడపిల్ల గూడా తదేక దీక్షతో మసిబారిన గిన్నెల్ని తోముతోంది. కాంపౌండు గోడ పక్కనున్న జానెడు నీడలో వొదుగుళ్ళుపోతూ కూర్చునివున్నాడు భూపాల్. పక్కనే వాడి పెళ్ళాం దీక్షతో సహా యుద్ధానికి బయల్దేరిన వీర వనితలా హుంకరిస్తూ నిలబడివుంది. మధ్యాహ్నం కడుపునిండా తిన్న తర్వాత, నోరు యెర్రబడేలా తాంబూలం గూడా సేవించి, తీరికగా పోట్లాటకు కూర్చున్నట్టుంది నీలమ్మ.

చెట్ల కొమ్మల్లోంచీ యెండ మిలమిలా మెరుస్తోంది. గాలి వీచినప్పుడల్లా నేలపైన తివాచీలా రాలిన యెండుటాకులు పరపరా శబ్దం చేస్తున్నాయి.

"మా అబ్బాయి పిల్లలిద్దర్నీ స్కూలుకు కారులోనే దిగబెడుతున్నాడు. రిక్షాతో మాకిక పనిలేదు. మీరంతా యిక్కడెందుకు? రెండు రోజుల్లో ఖాళీ చేయకపోతే పోలీసులకు ఫోన్ చేస్తానంటున్నాడు మా అబ్బాయి. పోనీ పాపమని నేనే [illegible] త్వరగా ఖాళీ చేసి వెళ్ళిపొండి." అలసట తీర్చుకోవడం కోసం పక్కనున్న నులక మంచం పైన కూర్చుంటూ మరోసారి హెచ్చరించాను.

"మాలాంటోళ్ళకు రిక్షా వుండినా వొకటే, లేకపోయినా వొకటేలేమ్మా! బాడిగకు తోలి రెండు [illegible] సంపాయించుకొనే తెంపు గూడా మా మగోళ్ళకు లేదు" అంటూ నిట్టూర్చింది నీలమ్మ.

[illegible]

[illegible]

[illegible]

నీలమ్మ పైకి లేచి నులకమంచం [illegible]

నిల్చుని, "పోయిన నెలలోనే నా రిక్షా సుబ్రమణి దగ్గిర పదైద్దినాలునింది. అప్పుడు రాని రిపేరు యిప్పుడెట్ల వచ్చింది" అంటూ నన్నే చెంచమ్మగా వూహించుకుని, చూసేవాళ్ళు పొరబాటు నావల్లే జరిగిందని అనుకునేలా వో ప్రశ్నను నాపైకి విసిరింది.

చెంచమ్మ సైతం నులకమంచపు మరో చివరకొచ్చి, నేలపైన చతికిలబడుతూ "పదైదు దినాలుగా వోవరాయిలింగు చెయ్యించకుండా తొక్కితొక్కి దాని ప్రాణం తీసేసిందేమో వాడు! నిందేమో మాపైన! యిదేమైనా న్యాయంగా వుండాదా నువ్వే చెప్పమ్మా" అంటూ నాకే సమాధానం చెప్పింది.

నా మౌనాన్ని సైతం ప్రోత్సాహంగానే భావిస్తూ, "బండిని ఆఙవరించుకునే శక్తి లేకపోయినప్పుడు తప్పును బండి పైనైనా తోస్తారు, లేకపోతే యింకో మనిషి పైనైనా తోస్తారు. అంతేలే" అంది నీలమ్మ తన వాదనను కొనసాగిస్తూ.

"పుట్టి భూమ్మీద పడినాంక మేము యింకో రిక్షాను కండ్ల జూసుంటే గదా!" చెంచమ్మ వెటకారం చేసింది.

"కష్టపడి సంపాయించిన దుడ్డయితే యెవురికైనా భయమూ, భక్తీ వుంటాది. వూరికే వచ్చిందిగదా అని నా రిక్షాను యే సిన్మా కొటాయి కాడనో దొంగల్లోలేసి పొయ్యుంటావు. నీ పెండ్లానికి సిన్మాలంటే యెంత పిచ్చో నాకు తెలియదా?" నీలమ్మ యీసారి భూపాల్‌తో నేరుగా ఢీకొంది.

"సినిమా కొటాయిలకాడ మూడు రూపాయలు బాడిగ కట్టి రిక్షాను షెడ్డులో పెట్టినాంకే సినిమాకు



పోవాల. దానికీ దీనికీ సంబంధమేముందాది? అయినా యిప్పుడది ముందు మాదిరిగాదు. సినిమాలు చానా తగ్గించేసిందిలే" అన్నాడు భూపాల్ భార్యకు వత్తాసు పలుకుతూ.

"సినిమావుంటే చాలు. తిండిగూడా వద్దేదు దానికి! నువ్వు కాయిలాబడి ఆస్పత్రి బెడ్డులో వున్నప్పుడు గూడా సినిమాలు వదల్లేదది. ఆ సంగతి నాకు తెలియదా?" నీలమ్మ గొంతులో హేళన స్పష్టంగా ధ్వనించింది.

"చూడు మేడం! నీ రిక్షా మాకు బాడిగకిచ్చినావు. బాడిగ తీసికో. అదీ నీ పని. యెవురు యెక్కడుండాల్నో అణ్ణే వుండాల. నా సొత్తు సినిమాలకైనా పోతాను. యేమైనా చేస్తాను. మొగుడికి జరమొచ్చిందని నాకు ఆకలిగాదా? తిండి తిననా? సినిమాగూడా అంతే. నన్ను కాదనేదానికి నా మొగుడికే గుండెల్లేవు. నడిమధ్యలో నువ్వెవురు నన్నడిగే దానికి?" పదునైన కత్తుల్లాంటి మాటల్ని రువ్వుతున్న చెంచమ్మ స్విచ్ ఆఫ్ చేసిన బొమ్మలా హఠాత్తుగా నోరు మూసేసింది.

అంతవరకూ భార్య మాటలకు వంత పలుకుతున్నట్టుగా తలవూపుతున్న భూపాల్ గూడా తల తిప్పి పెరటి గేటు వైపుకు చూడసాగాడు.

నీలమ్మ మంచం దగ్గరగా వచ్చి నాకేసి వంగి నిల్చుని, "అది మా రిక్షా బెల్లే! అది చెవినబడగానే వీళ్ళిద్దరికీ యెట్ల నోళ్ళుబడి పోయినాయో చూసినావామ్మా! రిక్షా కావాలని సుబ్రమణితో పంచాదికి దిగినప్పుడుండే తెంపు, దాన్ని అణవరించేటప్పుడు లేదుగదా యీ భూపాలుకు. తలదాచుకునేదానికి రవంత జాగాయిచ్చినా ననే మర్యాద గూడా లేకపోయింది వీళ్ళకు. వాళ్ళిద్దరికీ, వీళ్ళిద్దరికీ రగడంటే రగడ గాదు. రెండుమూడు దినాలుగా మాటలు గూడా లేవు" అంది నాతో రహస్యం చెబుతున్నట్టుగా తగ్గించిన స్వరంతో.

రిక్షాను వాకిలికివతల నిలిపిన తర్వాత, తుండుగుడ్డతో చెమట తుడుచుకుంటూ వంటిరి కిందికి వచ్చాడు సుబ్రమణి.

రిక్షా సీటుపైన కూర్చున్న మల్లమ్మ గూడా ప్రహరీ గోడ దగ్గర నిల్చున్న కొడుకునూ, కోడలినీ గమనించనట్టుగా నేరుగా నీలమ్మ దగ్గరికే వచ్చి నిల్చుని, "కృష్ణాపురం రాణా దగ్గర నీ మొగుడు మమ్మల్నిద్దరినీ నిలేసినాడు" అంటూ వర్తమానాన్ని

> యేదీ నా తెల్లరాయి ముక్కు
> పుడక? గత నలభై అయిదే
> ళ్ళుగా నన్ను పూరించిన
> ఆభరణం! ...యింతలో
> యెక్కడ జారిపోయిందది?
> యిందాకా యెక్కడెక్కడ
> తిరిగా? ...వంటిల్లు ...పడకగది...

అందజేసింది.

యెంతకూ నీలమ్మ ఆ వార్తపైన ఆసక్తిని చూపకపోయేసరికి, "రిక్షాను బలవంతంగా లాక్కోబోయినాడు. వానిదగ్గిర్నుంచి తప్పించుకోనొచ్చే దానికి బ్రమ్మప్రళయమైపోయింది" అని మరికాస్త వివరణను జోడించింది.

"అది నా రెక్కల కష్టంతో సంపాదించిన రిక్షా. దాని మింద వాని అధికారమేముందాది?" తనకు సంబంధించిన విషయం కాదన్నట్టుగా యధాలాపంగా నీలమ్మ వాకబు చేసింది.

"దాంట్లో వాని దుడ్డు యేడునూర్ల దాంకా వుందంటగదా" అంది మల్లమ్మ.

"నా దుడ్డు వెయ్యిన్నీ అయిదు నూర్లదాంకా వుండాది. దాని సంగతేమని అడగలేకపోతివా?" గోడకు విసిరిన బంతి వెంటనే వెనక్కు తిరిగొచ్చినట్టుగా నీలమ్మ ప్రశ్న వెంటనే దూసుకొచ్చింది.

"వస్తాడంట. నేరుగా వచ్చి నీ దగ్గిర్నుంచే రిక్షా తీసుకోనిపోతాడంట. దొంగతనం జేసినానా జంకే దానికి అని దబాయించినాడు. యీ భూప్రపంచంలో యింకో మనిషికి భయపడాల్సిన కర్మ పట్టలేదని మొరాయించినాడు." చెబుతూనే మల్లమ్మ షెడ్డులోకి వెళ్ళిపోయింది.

"రిక్షా రిపేరుకు నూట ముప్పయి మూడు అయింది. నీకియ్యాల్సిన యిన్నూరులో మిగిలింది అరవయ్యేడు. లెక్కజూసుకో" అంటూ చిల్లర డబ్బుల్ని నీలమ్మ గుప్పిటినిండా పోశాక సుబ్రమణి గూడా షెడ్డు లోపలికి వెళ్ళిపోయాడు.

భూపాల్ దంపతులకేసి చూశాను.

వాళ్ళిద్దరూ షెడ్డు లోపలికి కోపంగా చూస్తున్నారు.

నేను నవ్వుతూ, "నీ మొగుడెప్పుడు తిరిగొచ్చాడు" అని నీలమ్మను అడిగాను.

డబ్బుల్ని తన వక్కాకు సంచిలో భద్రపరచుకుంటూ, "వూళ్ళోకి వచ్చి నెల రోజులైపోయింది లేమ్మా! అయినా వానికి నా ముఖం చూసే ధయిర్నం లేదు. సావిత్రమ్మ- అదే వాళ్ళ పిన్నమ్మా వాళ్ళు చెన్నారెడ్డి కాలనీలో బాడిగ యిల్లు తీసుకోనుండారు. అక్కణ్ణే వుండారు వాళ్ళిద్దరూ" అంది నీలమ్మ.

షెడ్డులోకి వెళ్ళాలో, బయటికెళ్ళాలో తోచక పోవడంతో భూపాల్ దంపతులిద్దరూ బెంబేలు పడుతున్నట్టుగా కనిపిస్తున్నారు.

షెడ్డు లోపలి నుంచి శబ్దమేమీ వినరావడం లేదు. వుయ్యాల్లోని పాపాయి చీమ కుట్టినట్టుగా కెవ్వున యేడవసాగింది.

నీలమ్మ వుయ్యాలనూపసాగింది. సామాన్లు కడగడం పూర్తి చేసిన నీలమ్మ కూతురు జామ చెట్టు చుట్టూ రాలిన పళ్ళకోసం వెతుకుతోంది.

"వాళ్ళిద్దరూ అంటే?" కుతూహలంతో ప్రశ్నించాను.

"యిప్పుడు వాడు మాతమ్మతో వుండాడులేమ్మా!" నీలమ్మ అదేమంత పెద్ద విషయం కాదన్నట్టుగా సమాధానం చెప్పింది.

"మాతమ్మ అంటే మీ చెల్లెలే కదా?" నివ్వెరపోయాను.

"దాంట్లో దాని తప్పేమీ లేదులేమ్మా. యెవుడు దుడ్డిస్తే వానితో బతకాలని దానికి రాత రాసుండాది. అదేం చేస్తుంది? వీనిదే నిలకడ లేని బుద్ధి. అదిగాకపోయుంటే యింకొకదాన్ని చూసుకోనుంటాడు. రెండో పెండ్లాన్ని నమ్మగూడదని మా అమ్మ సకల విధాలుగా చెప్పింది. నేనే వినలేదు. అనుభోగిస్తా వుండాను." నీలమ్మ ముక్కు చీదుకుంది. మరి కాసేపు గడిచాక స్వగతంలా, "ఆ మొదుటి పెండ్లాం బుద్ధి మంచిది గాదని వూరు వూరంతా చెప్పింది. వీని తప్పులేదు గదా అని అడుసు తొక్కినాను. కాళ్ళకు బురదయిందని కాళ్ళు నరుక్కుంటామా? కడుక్కుంటే అదే పోతింది"



# రన్నింగ్ ఎపిసోడ్

● కొండేపూడి నిర్మల ● చిత్రం: లక్ష్మణ్

సింకింగ్... సింకింగ్.. సింకింగ్
డబ్బింగ్ స్టూడియోలో అదేపనిగా
వినిపించే ఈ మాట
ఐరనీ కాదు.
అంతా అత్యుత్సాహమే.

తెప్పరిల్లడం చాతకాని మనసు
చిత్రంగా వొణుకుతుంది
తెరమీద మరుగుజ్జు బొమ్మ నోట్లో
కళా పరిషత్తు నటుడు చిన్న
మూలుగులా యిమిడిపోతాడు.

పలు భాషా సీరియళ్ళను దూదేకుతూ
రచయిత తెలుగు బొంతలు
కుట్టడంలో
అస్తమిస్తాడు.

కథాకళి ఆహార్యం కక్కను దొడ్డిని
కడిగించే కుంచెల్ని
అమ్మి పెడుతుంది.
ప్రజాకవి పళ్ళపొడి డబ్బా మీద
ప్రకటన రాయడానికి
పరిగెత్తుకొస్తాడు.

ఎపిసోడ్ పూర్తయినప్పుడల్లా
శవం లేచినంత చిల్లర
కళాత్మక గుగ్గిళ్ళు గుటకేస్తూ
తర్ఫీదయిన ఏడుపుల్నీ, నవ్వుల్నీ, మాటల్నీ
భుజాన వేసుకుని
మాటకారులు
స్టూడియో నిండా కిటకిటలాడతారు.

"లాభం లేదు మీ లిప్స్ కలవడమే లేదు
బిజినెస్ బాగా చెయ్యాలి"
డైరక్టరు గద్దించినప్పుడల్లా
రోజు కూలి స్వరచాకిరి నేలజారిన భీతి
నూరుకున్న డైలాగుల వెనక
గుబులు గుబులుగా జీరాడుతుంది.

'సింకింగ్‌లో సర్టిఫికెట్ వుంది సార్'
రాజ్యాలు కూలిపోయిన రంగస్థల నటి
నవ్విళ్ళనీ, టీ పాట్లాన్నీ అభినయించడం కోసం
యాడ్ ఏజెన్సీల ముందు చేతులు నులుముకుంటుంటే
అందులో ఐరనీ ఎవరికీ అందదు
అంతా అత్యుత్సాహమే.

సినీ తెర మీద కొట్టుకుపోయిన క్రూర నటి శవాలు
కేబుల్ నెట్ మీద అరకొరగా తేలుతాయి
తిప్పికొట్టిన స్క్రీన్ ప్లే కథల జిరాక్సుల్తో
ప్రముఖ చానళ్ళు పళ్ళికిలిస్తుంటే
బాంబు పేలుడులో తెగి పడ్డ అవయవాల్లా
ముక్కలు ముక్కలు కనిపించడానికలవాటుపడ్డ
కళాత్మక గుమస్తాలు
మొహాన్నొకచోట, గొంతొకచోట, చేతులొకచోట
పీస్‌వర్క్ కుదిరినందుకు తబ్బిబ్బవుతారు.



కిలో తోళ్ళలోనూ గుజ్జున్న మెదళ్ళలోనూ
ప్రారంభమైన మానవ కబేళాలు
గల్లీకొకటి లెక్క కంపెనీ బోర్డులు తగిలించుకుంటాయి
సాహిత్య వెట్టి ఊరేగినప్పుడల్లా
ప్రేక్షక వెట్టి ఉద్రూతలూగి మరీ చప్పట్లు కొడుతుంది
కళాత్మక విలువల మీద పక్కా వ్యాపారులు క్లాసులు తీస్తారు.

నా ప్రతిభ నన్ను నిలబెట్టడానికి కాక
పోగొట్టుకోడానికే ఎక్కువ
పనికొస్తుంది
కంటికి తెలీకుండా కన్నీళ్ళనీ
కాళ్ళకు తెలీకుండా నడకనీ
కాజేసుకుపోతున్న మెదడు శూన్యవ్యాధి
ప్రాథమిక సమస్యగా మారింది.

అందరూ ఉత్సాహంగా నడుస్తూనే
ఉంటారు
ఐరనీ ఎవరూ పసిగట్టలేరు.

కళ కళ కోసం కాదు
కళ ప్రజల కోసం కాదు
కళ వ్యాపారం కోసమైనా కాదు
కళ పరాయీకరణగా బతుకుతోంది
గాయపడినందుకు చిహ్నంగా
పెల్లుబికే కోపాన్ని కూడా
మర్చిపోడంలో వున్న
ఐరనీ ఎవరూ గుర్తించడం లేదు
అంతా అత్యుత్సాహమే.
ఇప్పుడిక
మొలకి చుట్టిన గోచీ మన సిగ్గుకి
చిహ్నం కాదు
ఫలానా బ్రాండు వస్త్ర విశేషానికి
ఎగ్జిబిషన్
కమ్ సేల్ మాత్రమే. ■

# పురుగు ముట్టింది

● పాటిబండ్ల రజని ● చిత్రం: చంద్ర

ఎండిన మోట బాయొడ్డున
గరికేళ్ళు కొరికే ఎలపట దాప టెడ్లు.
చిల్లుబడ్డ సత్తుగిన్నెను చిల్ల పెంకుతో గీరుకునే
ఎడబిడ్డా కడబిడ్డలు.
ఇత్తనాలన్నీ నెర్రెల్లో జార్చేసుకున్న
జడ్డిగం బోలుతనంతో గుల్లబారి,
రోజులెల్ల బారేందుకు-
రేగ్గాయలో, పరిక్కాయలో, కలేక్కాయలో,
ఏరుకు తింటే-
పళ్ళు తింటున్నామా, ముళ్ళు తింటున్నామా?
తాటరేగిన నాలిక తడబడకుండా సెప్పనేదు!

అరువు కెళ్ళిన అయ్యగార్లింట,
ఇనగూడని మాట, పడగూడని మాట,
తరతరాలుగా పోషించుకుంటున్న ఆనోటి తీటా,
మానెడు గింజలతో పాటు కార్చిన మదపు చొంగా,
చెంగు పట్టి తెచ్చి పొయిరాజేస్తే
కూడెందుకట్టా కుతకుతా ఉడికిందో,
పెట్లిపోయే ఎండకు ఒట్టిబోయిన సెలమలుదాటి,

కడవెత్తుకెళ్ళిన చోట మరబాయి కన్నుగీటితే,
ఇంటికొచ్చేసరికి ఎనరెట్టా కాగిందో,
ఒద్దొద్దంటూనే ఆ ఒక్క ముద్దా కతికితే
అతకని ఆ తిండికి అతిసారమెట్టా పుట్టిందో-
ఏ రత్త పరిచ్చకూ అందదు!

పూట ఆకలికి ఎయ్యి తూట్లు బడ్డ
గుండె బొమ్మ నూడాలంటే,
పచ్చ పురుగు పడ్డ శనగ చేను జూడు,
తెల్లదోమ పడ్డ ఉల్లి పైరు జూడు,
పేనుబంక బడ్డ పెనర పంట జూడు!

పురుగులు జూసేందుకు సేనిదాకా ఎందుకులే
మొలవని ఇత్తనాలమ్మే ఏరువురుగులు,
రసంబీల్చే షావుకారు పురుగులు,
లత్తుకోరు మందులమ్మే లద్దె పురుగులూ,
అమ్మకం బజార్లలో లుకలుకలాడే ఇన్ని పురుగులూగాక,
సెమటోడ్చిన సేద్దెంలో దక్కని బతుకు తీపిని
బెల్లం ఊట సారాలో ఎతుక్కునేందుకు
కుండా తెపాలాలమ్ముకునే ఇంటింటి ఇనప్పురుగు!

ఇన్ని పురుగులు తొలిచి తొలిచీ తొడుగులే మిగిలాక,
చేలల్లో మంచెలన్నీ ఇళ్ళ ముందు పాడెలై వాలాక,
నల్లగుండే నీమ సొర బుర్రలో నీళ్ళా,
ఏడిగుండే తెల్లదాకలో కూళ్ళా ఎంటరాగా,
కరువు అంచనాకొచ్చిన మీకు-
కడుపు మంట సెగెట్టా కొలత కొత్తాదో తెలిచ్చావదు!



లేనోడింట ఉట్టి
చటెతే,
ఉన్నోడింటనే పుట్లు
పుట్లు లాగా,
ఇక్కడేమో
సినుకురాలని
తెకతెకలైతే,
వక్కనేమో
ఉప్పెనొచ్చిన
ఉపద్రావాలంట!
మడునుల్ని జూసే
కాలమూ నేరిసిందేమో!

నీరందని పొలాలు
నిలువునా ఎండిపోతంటే,
పొయ్యా పెట్టని
నారుమడికి
తూముల్దీసినట్టు,
కరువు సాయానికొచ్చిన
సొమ్ముని కూడా,
కనని మనవల్దాకా
కూడబెడుతున్నారని ఇన్నాక-
తాళిబొట్టు తెంచుకెళ్ళి తాగుతున్న మొగుణ్ణి
జూని
పెళ్ళి నుక్క పెట్టించుకున్నందుకు
సిగ్గుతో భగ్గుమంటున్న బుగ్గతో పాటు-
బూవి శిస్తులు ఒల్లుకుని, బూలోకాన్నే మింగేత్తన్న మారాజుల్ని జూసి,
వోటు నుక్క పెట్టించుకున్న నూవుడేలు
పురుగు ముట్టినట్టు ఎగిరెగిరి పడుతుంది!

పానం నిలవాలంటే -
ఏలు నరక్క తప్పదని నాటు వైద్యం గోసిత్తంది! ■

# యుద్ధ భేరి నా సంగీతం


• కత్తి పద్మారావు • చిత్రం: చంద్ర




మనసు ఒక కథల సముద్రం
మేధను ఒక వాస్తవ దృశ్యం
జీవితం ఒక అనంతయానం
అవునూ, ఏదో పాట విన్నట్టు
కనులు విప్పారినప్పుడు
తెలిసింది
కనులు చూసేది తక్కువ
వినేది ఎక్కువని
సముద్ర తరంగ రుతిని
ఆలకించిన కనుల్లో
మోడువారిన లోకాన్ని
ఆకు రాలుతున్న శ్రుతిని
వినలేని అచలన స్థితిని
నేను చూశాను

అవును!
ఒక నదీమతల్లి ఎదలో
నిదురించిన తెరచాప
ఏదో ఏలపాటకు పతాకగా
ఎగరడం నేను చూశాను

అవును గాత్రం రాసిన
సవ్వడి కలిగినపుడు
తెడ్డు విరిగిన పడవలాగ
నీళ్ళ సుడిగుండంలో
మునకలేయడమూ చూశాను

మనుషులంతా గుంపులు గుంపులుగా
గుండెల మీద నడుస్తున్నా
ఒక నీపశాఖలాగా
తొణుకు లేని నిబ్బరం
నేను చూశాను

తల్లి పొత్తిళ్ళలో కునుకు తీసిన బిడ్డ
తల్లి ఉగ్గు కోసం లేచినపుడు
ఆ కళ్ళలోని మూలుగు నేను చూశాను
ఆ కనురెప్పలు అప్పుడే విచ్చుకోవటానికి
ఆ నాలుక కొనకు అందించిన
ఆ పాలకడలిలో అనంతరాగాలు
వింటూ వూగొడుతున్న ఆ శిశు శ్రుతిలోని
రాగసుద్ధిని కూడా విన్నాను
గుండె అంచుపై ఆన్చిన ఆ అరచేతిని
ఏ ఆయుధ విద్య కోసమో పదును పెడుతున్న
ఆకురాయి లోని కరకు నుండి
నునుపు దేలి పదునారుతున్న
ఖడ్గ ప్రసవాన్ని నేను చూశాను

అవును!
బిడ్డ పాలను కళ్ళతో తాగడం
నా కళ్ళార చూశాను
మాతృత్వం ఎండిన బీడులా
నాగరికతలో
పులిసిన కల్లులా
నురగలు కడుతున్న ఈనాడు కూడా
ఆ గుడిసె మూలల్లో

ఒక ఏకలవ్యుడికి
గుటకలు వేయించి
మళ్ళీ వేళ్ళు మొలిపిస్తున్న
తల్లి గాంభీర్యాన్ని నేను చూశాను

చరిత్ర ఒక పాట లాగా
వింధ్య నుండి కళింగ దాటి
అజంతా గుహల అంచుకు తగులుతున్న
నీటిబుగ్గల వూయలలో
తుపాను పెనుభూతం నుండి బయటపడ్డ
ఒక్క చేపపిల్ల-
అలల నవ్వడులతో పాటు తనూ సజీవమేనని
నిర్జీవ శిలాప్రతిమలకు బోధిస్తున్న అమరగీతాన్ని
నేను వింటూనే వున్నాను.

మీరన్న మాట నిజమే
ఆ రాత్రి నేను చప్పుడు చేయకుండా
సమాధుల వీధుల్లో గుండా నడిచిపోయి
పలుగు పారలతో ఆరడుగులు
తీసి పాతిన ఒక వృరెను
చేతులతో దేవి పైకి తీసినపుడు-
మనిషి గుండెల్లో కట్టిన రాతి కట్టడాలను
కూల్చే తత్వజ్ఞానాన్ని ఆ వృరె
నాకు బోధించిన మాట నిజమే.

అవును!
నేను పాటలు వింటానికి
మీ కోట బురుజులు మీద పరుగెడుతున్నానని
నన్ను బంధించి మీరు లాక్కెళుతున్నపుడు
ఆ అమ్మ వేసిన పొలికేక లోని
ఆయుధ సంగీతాన్ని నేను విన్నాను

నా కళ్ళకే కాదు
నా శరీరం లోని నరాలన్నింటికి
పాట వింటం మమ్మ నేర్పిన
సంగతి మీకు తెలియక
నేను కుప్పకూలినపుడు మీరు
మరణమృదంగం వాయించిన సంగతీ
నాకు తెలును-

అవును, నేను మళ్ళీ
ఒక తల్లి కళ్ళ నుండే పుట్టాను
మమ్మ నన్ను అలానే కందని
నేను జన సంద్రానికి జోల పాడినపుడు
మీరు అన్నమాట మర్చిపోయారా!

అవును.
మా కంచికచర్ల కోటేను
మంటల్లో తగులబడుతూ
'అమ్మా' అని అరచినపుడు
వాళ్ళ అమ్మ ఆ వీధులంట
'నా కొడుకేడి' అని అరుస్తూ తిరిగినపుడు
మహాకవులంతా కళ్ళు మూసుకున్నా
రెందుకు?
జ్ఞానపీఠులంతా
రాజా వారి గుట్కాల మత్తులో
పాద సేవనలో
అటు చూడనైనా లేదే!
ఆ చర్చి అరుగుమీద పడి
ఆ అమ్మ దొర్లినపుడు
ఆమె ఎద్రొమ్ముకు రాతిముక్కలు
గుచ్చుకున్నపుడు

నేను -
ఇక శిశువుగా కాదు
'మంటగా'
'మంటల పాటగా' పుట్టక తప్పదన్నప్పుడు
మీరు నిప్పుకు నిప్పెట్టబోయేగా
చేతులు కాల్చుకున్నారు

అవును-
మేము దిగంబరులమే
నగ్నంగా మీరు వూరేగించిన
బనివి మొలకట్టిన వేపమండల్లో నద్దు విని
మీ వూరి వీధుల్లో నేను పరుగులు పెడుతున్నపుడు
చెరువు వొడ్డున బిందె లేపిన
'సువార్త'
కారంచేడులో చీల్చిన ఎర్ర సముద్రం నుండి
నేను పుట్టింది నగ్నంగానే
నాది దిగంతాలు ఛేదించిన నగ్నం
అవునమ్మా! నిజమే
నేను నీ కనుల్లో నుండి జారిన
కన్నీటిలో పుట్టాను
ఆ కన్నీటిలో దాగున్న మంటల్లో పుట్టాను
ఆ కన్నీటి సముద్రం చీలిన
ఘర్షణలో పుట్టాను
అవును, నేను పుట్టినపుడల్లా
ఏదో కోటగోడ కూలిన శబ్దం నాకినిపిస్తుంది
అప్పుడు తెలిసింది
"యుద్ధభేరి నా సంగీత"మని ■

# ప్రాణమా విసుక్కోకు

● డాక్టర్ సి. నారాయణరెడ్డి ● చిత్రం: చంద్ర



ప్రాణానికి వర్ణం లేదు.
బలవంతంగా పులిమిన రకరకాల
రంగుల్ని ప్రదర్శిస్తూ
వెర్రిమూకల మధ్య ఊరేగలేక
అది గిలగిలలాడుతుంటుంది.

పొగజుట్టు ఒళ్ళంతా పిచ్చిగా
వేలాడుతుంటే
దులపరించుకోలేక
నిట్టూర్పే నిప్పులా అనిపిస్తుంటుంది.
ఎన్నిటినో ఒదిలించుకోవాలని చూస్తాం.
అంత సులభం కాదు.

ఆ ముద్రల మూలాలు రక్తం దాకా
దిగిపోయాయి.
చెరిపేస్తే ఊడిపోయేది చర్మమే.
మన గోళ్ళ మీదే మనకు అదుపులేదు.
కత్తిరించడం మానేస్తే బాకుల్లా
పొడుచుకొస్తాయి.
తల నిమురుకోవాలనుకుంటే గాట్లు
వేసి తిరిగొస్తాయి.

భద్రతకు ఊపిరి ఇంకిపోతున్న
ప్రమాదాల పొలిమేరల్లో బతుకుతున్నాం.
అనివార్య మృత్యువును
అంచెలంచెలుగా పీల్చుకుంటున్నాం.
ఎవరు సుఖంగా ఉన్నారని?
భూమికే దిగులు పట్టుకుంది
చిల్లర గ్రహాలన్నీ ఒక్కుమ్మడిగా వంజా

విప్పి
తన పీక నొక్కేస్తాయేమో అని.

దగ్గరవుతున్న సూర్యాగ్ని కుండంలో
ఏ క్షణంలో మిడతలా రాలిపడతానో అని.
ఎగరేసిన ఆదర్శాల గాలిపటాలు
ఎక్కడున్నాయో కనపడవు
చేతుల్లో బిగబట్టుకున్న ఆశల దారాలు తప్ప
ప్రయాణానికేం సాగుతూనే వుంటుంది
స్టేజీమీది మైమ్ కళాకారుల అడుగుల్లా.
విపరీత మతుల చప్పట్లు రాలితే
చేరవలసిన గమ్యం ఒడిలో వాలుతుందా.

కుంగిపోయిన భుజాలకు రెక్కలు మొలిపించే శక్తి
ఒక్క తృప్తికే వుంది.
ఐతే ఆ రెక్కలు ఎగిరేవి కావు
అలికిడికి కంటి రెప్పల్లా కొట్టుకునేవి మాత్రమే.

పాపాల బస్తాల్లా ఉబ్బిపోతున్న శరీరాలను
మోనుకు తిరిగే ప్రాణ సూత్రమా వినుక్కోకు.
నువ్వాగితే ప్రగతి నాడి ఆడదు
సృష్టి గొంతు పాడదు. ■

# నది దాచుకున్న పడవ

● అఫ్సర్ ● చిత్రం: లక్ష్మణ్

ఈ నదికి ఏ సముద్రమూ తెలీదు
ఎక్కడికక్కడ తెగిపోయి కన్నీరవుతుంది.
ఎక్కడో అక్కడ నిలిచిపోయి నిలవనీరవుతుంది
అసలే మొదలంటూ తెలీక
ఏ చివరకీ అందక వుక్కిరిబిక్కిరవుతుంది
దీని వొంటి మీద
పొద్దుటి లేత ఎండ రెక్కలల్లార్పుతుంది
మధ్యాహ్నపు చెట్ల నీడల్లో
ప్రతిబింబమూ తనే అనుకుంటుంది
సాయంకాలపు సిందూరంలో
చెదిరిపోయిన కుంకుమ పూరేకులా వుంటుంది
ఎవరో విసిరిన రాయి చుట్టూ
వలయవలయాలై మళ్ళీ శబ్దసముద్రమవుతుంది

చిన్నప్పుడే బాగుంది
కాయితప్పడవల్ని దీని దేహంలో గుచ్చితే
ఆకాశ వీధులన్నీ సంచరించేది
చిగురుపాదాల తొక్కిసలాటలో
ప్రతి అణువూ చెదిరి చెట్లనీ చేలనీ స్నానించేది
చీకటి రహస్యంగా చెవి మీదికి వాల్తున్నప్పుడు
కార్తీక పూలపడవై జలదరించేది
నడుమ్మీద వొదిలిన కోరికల దీపం చుట్టూ
వెల్తురయి వొళ్ళంతా తళుక్కుమనేది

ఇప్పుడే సముద్రమూ పాదానికంటక
ప్రతి చినుకూ కంటకమైంది
ఆపాదమస్తకం వొణికిపోతూ
భయాన్ని కప్పుకుంటోంది
అసలే స్పర్శ వినని శరీరానికి
తగలని బాణాలు విసిరి
ప్రతి రాత్రీ గురి తప్పుతుంది
కలవరింతల మీద తన కన్నే నిఘా వేసి
కలల్ని శిలువల్లా ధరిస్తోంది
పగటిని రాత్రిగా భ్రమించి
సూర్యతప్త సరస్సు కోసం వెతుక్కుంటుంది
రాత్రిని పగలుగా భరించి



తెల్లారుతున్న ఉదయ శిఖరమ్మీద బొట్టు పెట్టుకుంటుంది

లోపలంతా వొక నిర్జీవ నది
తడి ఆరిపోయిన పగుళ్ళు
కొనవేలితో తాకితే
అణువణువూ చిట్లిపోయే సముద్రమే.
ఏ కోరిక ఏ మూల నుంచి అల్లుకుపోయినా
అది ఆదీఅంతమూ తెలీని చేదు జ్ఞాపకం
ఏముందిలే అనుకుంటాం గానీ
దాచిన కొద్దీ దాగని నిప్పు దేహం
తప్పులూ వొప్పులూ తప్పనివే అయినా
ఆగిన కొద్దీ పరుగెత్తించే ప్రవాహం మోహం

చెంప మీద రాలే కన్నీరు
వొక చేతిని అడ్డం పెట్టుకుని
ఎన్ని సముద్రాలు మధిస్తుందో?
వెన్ను మీద వాలే వొక చెయ్యి
అది పుల్లింగమో స్త్రీలింగమో తెలీకుండానే
లోపల ఎన్ని పచ్చికబయళ్ళని నిద్ర లేపుతుందో!

ఏముందిలే అనుకుంటాం గానీ
ఎడారి వొంట్లో వొయాసిస్ వయొలిన్ పలికినప్పుడు
తక్షణం అక్కడో తడి కల మేల్కోవచ్చు.

నదులన్నీ ఎక్కడ అంతమవుతాయి,
సముద్రాల్లేని చోట-

కాయితప్పడవలన్నీ ఎక్కడ దాక్కుంటాయి,
నదుల్లేని చోట-

అసలే నదులూ సముద్రాలూ
కాయితప్పడవలూ లేని చోట
ఏ మొదలుకీ చివర వుండదు
ఏ చివరా మళ్ళీ మొదటికి చేరదు.

మళ్ళీ మళ్ళీ మొదటికొస్తే తప్ప
దాచుకున్న పడవల కింద నీరు కదిలి
గాలీ నేలా నిద్రలేచి తెల్లారదు.
ఎప్పటికీ తెల్లారని ఆ భూమ్మీదికి
నన్నెప్పటికీ పంపకు... ■

# నిమ్న లిపి

● ఎండ్లూరి సుధాకర్ ● చిత్రం: సర్బిం

క్రీస్తు మరోసారి మంటల్లో మరణించాడు
పువ్వును తాకినంత సుకుమారంగా
కుష్ఠురోగిని ఇష్టంగా ముట్టుకోగలవా?
రాతికాళ్ళ ముందు పాచిన నైవేద్యమవుతావు
ఆకలిగొన్న అనాధను మదర్‌లా హత్తుకోగలవా?
బొమ్మ నోటికి పాలు తాపేందుకు పరుగులు తీస్తావు
చెత్త కుండీలోని పసికందుకు ప్రాణం పోయగలవా?
నీ నారింజ రంగు వేషంలోనే ద్వేషజాలముంది
నువ్వు మానవుణ్ణీ సేవించనూ లేవు
మాధవుణ్ణీ పూజించనూ లేవు
నువ్వు హిందూ మహాసముద్రమంత హింసవి



2

ఎక్కడివాడో పాపం
ఏసు మా పేటలోకి వచ్చాడు
ఉమ్మి ముంతకు బదులు
నా మెడకు సిలువ గౌరవమిచ్చాడు
ఇక్కడివాడే బుద్ధుడు
నగం తెగిన నా నాలుక మీద
తిరుగులేని త్రిపిటకాలని పలికించాడు
రాజ్యాంగపిత విగ్రహాన్ని
దళిత వీధుల్లో కాదు
పురజనుల గుమ్మాల ముందు నిలబెట్టండి
పూలదండలే పడతాయో
చెప్పుల దండలే వేలాడతాయో
కాలం నిరూపిస్తుంది

3

మధ్య రాత్రులు ఒలీవ కొమ్మల వక్షులై
ఉపవాస ప్రార్థనలు చేస్తున్నారు బిలీవర్లు
భయంకర నినాదాల ఋసలతో
వర్ణశత్రువుల మూక విరుచుకపడింది
ప్రభు రాత్రి భోజనం కుంకుమపాలయ్యింది
సిస్టర్లు మానభంగాల శిలువలయ్యారు
కన్నె మరియమ్మ కంట్లో రాలుతున్న రక్తాశ్రువులు
కూలిన చర్చీ గోడల మధ్య
నెత్తుటి కొవ్వొత్తిలా మెరుస్తూ ఒక బంగారు వాక్యం
'నిన్ను వలె నీ పొరుగువానిని ప్రేమించుము'

4

ఆదివత్యానికి అంతిమ సమాధి
ఆత్మగౌరవం నా జాతి పునాది
నాది చిందు నాగరికత
నేను ప్రతిభకు పర్యాయపదాన్ని
నా వనితనం పంచభూతాలకు తెలుసు
నీలి మిలీనియం మీద నీలి సంతకం నాదే
ఇకనుంచి యుగకర్తలంతా వాడ వైతాళికులే
ఛీ కొట్టడానికి అక్షరం అంటరాని పిల్ల కాదు
కవిత్వం కడుపు పండించడం తరతరాల మా వెలి విద్య
ఇప్పుడు సరస్వతి
శాశ్వతంగా మా వాడ కోడలయ్యింది

5

వాడు నా రక్షకుడు కాదు, హంతకుడు...
గుండె కాలిన గొంతు
సుప్రభాత శ్లోకంలా ఉండదు
నా మట్టిమీద ఆర్యపాదం మోపినప్పుడే
మోనపోయిన మూలవాసిని
నా నమస్తాన్నీ కోల్పోయాను.
చరిత్ర కోరలు నా రక్తంతో ఎరుపెక్కాయి
నా కాలు సోకని గర్భాలయాలు గొడ్రాళ్ళయ్యాయి
నేనొక చండాల దేశంగా మారకముందే
వెలివాడల్ని విముక్త ప్రాంతాలుగా ప్రకటించండి
అందులోంచి విశ్వమానవులు బయటికొస్తారు. ■

# సుఖదుఃఖ తరంగం

● సౌభాగ్య ● చిత్రం: సర్బిం

నేను మౌనంగా ఉండలేను
కానీ నవ్వలేను, ఏడవలేను
ఒక సమ్మిశ్రిత సుఖదుఃఖ తరంగం
నన్ను ఆకాశానికీ ఎగరనివ్వదు, భూమిపైనా పడనివ్వదు.

అంతలో వాన, ఇంతలో ఎండ
వాన నన్ను తడిచేస్తే ఎండ నన్ను పొడిచేస్తోంది
నేను మొదలుపెట్టిన పాటని ఎవరో సగానికి నరుక్కుపోయారు.
ఆత్మహత్య చేసుకుందామని అంత ఎత్తు నుంచీ దూకితే
గాయాలే నాకు ప్రతిఫలంగా మిగిలాయి.

నేను కాంతికోసం అన్వేషిస్తూ బయల్దేరితే
చీకటి నాకు తోడుగా ఉంటానని నడిచింది.
నేను చీకటి గర్భంలోకి పోతూవుంటే
కాంతి నాతో కరస్పర్శ చేసింది.

దొంగ ఎవరో దోబూచులాడుతున్నట్లుంది



కన్నీళ్ళలో ఆనందభాష్పాలు కలిపి
నరికొత్త కషాయం చేసిన అదృశ్య ఇంద్రజాలికుడెవరో!

వంతెన కూలి పడవలో పడతాను
పడవ మాత్రం తుపానులో ఉంటుంది
నేను నవ్వలేను, ఏడవలేను
సుఖదుఃఖాధిక నిరామయంలో నిల్వలేను.

గానుగలో చెరకులా నలుగుతాను
తియ్యని చెరకు రసంలా తీపులుపోతాను
ఎదకు హత్తుకున్నప్పుడు కేరింతలాడుతాను
ఎత్తి కుదేసినప్పుడు ఎలుగెత్తి ఏడుస్తాను! ■

# ఊర్వశీ

● డాక్టర్ సుమనశ్రీ ● చిత్రం: చంద్ర

నలుడి మీదో నలకూబరుడి మీదోనేగా నీ మనస్సు
ఎంతకని మందగల్ను, నన్నొదిలెయ్
ఎంతకని గాలెక్కించగల్ను ఈ రబ్బరు బుడగకనలే
వాత్స్యాయనుడు కూడా వానపాములాంటి వాణ్ణి
నెపాలన్నీ ఊరికే నామీదే మోపాడు
వొకేవొక్కసారి చెబుతున్నా నాకే రీ ప్లే మీదేం నమ్మకం లేదు
నీకు తెలీదేమో రిగ్యులర్ ప్లే మీదా మనస్సు లేదు ముందు నించీ
నమన్య ఇదేనేమో చివర్నించి ముందు ఊపిరి దాకా
అంతెందుకు నరాల తీపుకోరికే సిల్లీ అనేగా
నా అసలు అభియోగం.

దేముడికూడా వికృత పక్షపాతమే వాళ్ళంతా
లేకుంటే నీలాకాశమంత ఆనందాన్ని నీకు రానిచ్చి
రెక్కలెత్తిగిన రక్తం కుప్పల మధ్య గ్రాన్కటింగ్ లా
నాకెందుకు శపించాడో ఈ అర్ధాంతర సంస్కలనం
వొరేయ్! ఇక ఈ ఉబుకుతున్న ఊహాలోయల
ఎనటామికల్ బరువుని తన్నొక్కసారి!
ఇదొక్క టే వొకానొక మెగా పిన్ ప్రిక్
ఎక్కదనలే ఎక్కినా వొంగదు ఎక్కడా నొక్కదు
ఎప్పటికీ సుఖంగా మూల్గదు

లేవడానిక్కూడా లేకుండా వాళ్ళంతా బ్లడీ బ్లడ్ హోల్స్
సింపుల్‌గా సికెనింగ్ ఫైల్స్ లా.

హవాయీ జహాజ్‌లోలాగా లవ్లీగా నువ్వొక్కత్తివే
విహరిస్తుంటే నా వొక్కడికే ఇక్కడ వొకటేగా జలసీ
మంచంలో బిగుసుకుంటున్న నల్లని వో శిలా!
ఇక చాలు ఈ అమూల్య ముందాట
చిరు పెదవుల గంధర్వుల కోసం ఎంత కాలం నా ఈ నిరీక్షణ
నీలం మూవీలో చూపించే క్షణక్షణ విచక్షణకి
వొకటేగా ఇక మందు
ఇక ముందెప్పుడూ ఇలా నీ ముందు విలవిల్లాడి చనిపోను
చనిపోయినా మరీ ఇంతలా మండిపోయి ఎండిపోను
మండిపోయినా ఇలా భగ్గున భస్మమవ్వను.

తెలిసిందికదా ఇక చెయ్ నొక్కకు నన్నింకెప్పుడిలా
నువ్వెక వో కొంచెం వోపికపడ్తే
మిస్సింగ్ ఫైళ్ళలో కల్సిపోతా నిస్సిగ్గుగా
డోంట్ యూ వర్రీ సిల్లీ మిస్ మైడియర్ ఊర్వశీ!
ముంబయ్ సముద్ర స్వర్గంలో ఉప్పును దిగమింగుకుంటూ
కల్సుకుందాం క్రితం జన్మలో. ■



# ప్రత్యామ్నాయాలు

● 'మో' ● చిత్రం: చంద్ర




ఓ పెద్ద విశ్వపు అద్దంలో
మనందరం ఇరుక్కొని
ముడుచుకు కూచున్నాం
ఎవరి పేరెవరికీ తెలీక

అందుచేత నాయందు ఉన్న ఓ నాయనా
అలనట యనుకొనక నాయందు దయయుంచి
మిక్కిలి నిదానముగా నవధరింపుము
నేనిదే నమస్తుతులు చేయుచున్నాడను

కాంక్షని తుంచితే కామపు పువ్వు
మబ్బుల్లోంచి దిండుకు దిగిన స్వప్నం
దేహంలోని దాహం ఉష్కాకి
తుంపుకున్న కోర్కెలు పారిపోతయ్

ఆది జ్ఞానమునందు నాకు దుఃఖము లేదు
దుఃఖ సింహాసనమున కంటక కిరీటధారీ
నీ కనుకొలకుల అశ్రుబిందువుల చూచి
అగరొత్తుల కీర్తనల నెత్తుకొనుచున్నాడను

ఇది దారి కాదు గురూ సర్లే శిష్యా
ఎటన్నా పోదాం ఈ అక్షరత్వంలోంచి
దుఃఖ బీజాక్షరంలోకి
బీతోవెన్ చెవులు కుట్టించుకొంటున్నాడు

ఆరంభమున నీవు పల్కిన వాక్యము
కావ్యమైనది విద్యున్మాలిక వలె
ఫలప్రదమైన నిషిద్ధ సౌఖ్యమున్నూ
నీ ప్రథమ ప్రేమ పారమే

పాదచారుల చిర్నామాల్లేవు
శిలాలోలితలైన కవ్వుల బెకబెక
ఛీ లాగు లాగమాకు
నిర్దయంలో నిర్లక్ష్య క్షణం

ఇనుమంత శిశువునైనా చంపలేకపోయిరి
ప్రసవ సమయమున సత్యము ప్రకాశించును
నీ శుభవచనముతో నిత్య గర్భవతి యయిన
ఈ అనంత విశ్వమును దీవించుము

బ్రతుకు వెదుకుబాటలో
వసువూ పారాణీ లేవి
చివ్వుతున్న చిర్నగవులో
వగిలిపోయిన గాజులెన్ని

మిక్కిలి భయము ఎక్కువ ఆవేగములో
సమాధానము లభించునా నాకు
తొలి చూలు తనయుడా సెలవుగీతము
పల్కునపుడు నాకు వాక్యమునిమ్ము

వండు తింటే ఒళ్ళంతా
వచ్చి వుండు వేడి
నిట్టూర్పుల మధ్య ఎవడో
మూడోవాడు శ్వానిస్తో

విలపించుట యను విషయమునందు
దుఃఖమునకు అతీతుడను చేయుము
నను చదును పరచుము నా బాటయందలి
కొండలను కూల్చి నను తిన్నన చేయుము

వినూలిస్ నుసిలోంచే
అగ్నికిరణం లేస్తుంది
స్వప్నం నిల్వేత్తునా కాల్చినా
మహా అయితే ఓ బూడిద ■

# మిలీనియం పిల్లలు

● వై. ముకుంద రామారావు ● చిత్రం: చంద్ర



"అమ్మమ్మా!
కష్టాలు లేని కథ చెప్పవా?"

"తాతయ్యా!
కన్నీళ్ళు రాని పాట
పాడవా?"

ఇద్దరం ప్రయత్నం చేస్తాం

ఎప్పట్లానే
మధ్యలోనే ఆపేస్తుంది

కదిలిస్తే కందిరీగలంటూ...

2

ఎదిగిన పిల్లలు

ఆకతాయిగానో
అమాయకంగానో
అడుగుతారు

నాన్న ఎలా నచ్చాడనో
అమ్మ ఎలా నచ్చిందనో

అన్నేళ్ళ అనుబంధం
అనేక జవాబులై
ఒక చిరునవ్వో
నిట్టూర్పో
రెండూనో

అంతలోనే
ఆ ప్రశ్న వెనక
అనంతృష్ణేదో
ఆలోచనై కెలుకుతుంది
ఇద్దర్నీ... ■

# నిప్పు

● శిలాలోలిత ● చిత్రం: చంద్ర

దుఃఖమెపుడూ ముద్దలు ముద్దలుగా వుంటుంది.
గొంతులో మంచుగడ్డలుగా కదుస్తూనే వుంటుంది.
పలకరింపుల చినుకుకో
సానుభూతుల చూపులకో
ఆత్మీయుల రాకకో
ప్రేమపూర్వక స్పర్శకో
నిస్సహాయపు దారిలో
గుండె ఇనుపనాడాగా మారి
విషాదమై కంటి నుండి రాలిపడ్తుంది.

శరీరపు పొరల్ని
తాత్వికులు, వేదాంతులు, విజ్ఞానవేత్తలు
ఎన్నిసార్లు విప్పి చూపినా -
మాయనంచిని భుజానేసుకుని తిరిగే మనషులు
మరణమొచ్చి ఇంటి తలుపు కొట్టేవరకూ -
వాదిస్తూనే వుంటారు.
రూపం, ఆకారంలేని మనసుతో సరిపెట్టుకుంటూనే వుంటారు.
క్షణం క్రితం వరకూ నవ్విన, నడచిన, మాట్లాడిన శరీరం -
శవమైపోవడం -
కంటి ముందున్న కటిక నిజం.

ఎవడింట్లో పీనుగెళ్ళినా ఏడుపొక్కటే -
ఎవడి మనిషి మట్టిలోకి జారిపోయినా
వెళ్లి ఒక్కటే -
కానీ, కులపు హోదాలు
స్థిరచరాస్తులు, సామాజిక స్థితిగతుల వైనాలు తెలీని
'అనుంట' జరిపిన వాడింటి మరణం
గుండెలో దిగిన ఈతముల్లే.
ఏడుస్తూ కూచుంటే ఇంటిల్లిపాదీ పస్తే.
ఏడవటానికూడా నోచుకోని బతుకులు
వాడు 'చచ్చి' బతికిపోయాడన్న ఓదార్పులు.

దుఃఖాన్ని సమాధి చేస్తేగాని
వాడి బతుకులో 'రోజు' మొలకెత్తదు.
అందుకే -
పెళ్ళికి డబ్బుల్లేకే
బతుకంతా వాయిదా వేసుకున్న వాడు కూడా
చావు మేళంతో ఊరేగుతాడు.
వాడు లేని ఖాళీని పూరించడానికై
వంటలు, భోజనాలు, అరుపులు, కేకలు.

"అమ్మా! మనింట్ల చావెన్నడొస్తదే?"
బువ్వ తినొచ్చనే పసిగుడ్డు ప్రశ్నకు
ఏ తల్లి జవాబివ్వగలదు?
చివరి ప్రయాణం వరకూ ఆవేదనే తప్ప
ఏమీ మిగలని అనుంట జరిపిన వాడికి




చావు కూడొక్కటే మిగిలింది.
తల్పుకుంటే మెతుకులు జారి కింద పడ్తాయి.
పంటి కింద మెతుకు మెదగకుండా
రేపు - ఈ శరీరపు దిమ్మె కదలదు.
కష్టాలు, కన్నీళ్ళు, ఏడ్పులు ఈ దారే కదా
వాడి బతుకుంతా పరుచుకున్న ఆనవాళ్ళు
అవసరాలు అనుబంధాల్ని చిక్కబడేట్లు చేస్తాయి.
రంగురంగుల జెండాలల్లో
రంగెలిసిన బతుకు పటాలు.
నిప్పుల గుండం తొక్కటం భౌతిక చర్య!
నిప్పుల గుండంలో నిప్పైన వాడికి
నిప్పు ఎందుకు కాల్తుంది?
నిలువునా తగలబడ్తూ, రగులుతూ
తిరగబడ్తున్నవాడు -
వాడొక సజీవ నిప్పుల గుండం. ■

# లాండ్రి

● ఇస్మాయిల్ ● చిత్రం: లక్ష్మణ్

చల్లటి బల్బు కాంతిలో
తెల్లటి దుప్పట్లు పరిచిన
ఇస్త్రీ బల్లతో
మా వీధి చివర లాండ్రి
మాటిమాటికీ నన్ను
ఆహ్వానిస్తోంది.

పాలతరకల దుప్పటితో
పలకరించే ఇస్త్రీ బల్ల పై
పరిగెత్తుకు పోయి
పవ్వళించాలనుంటుంది.

అప్పుడు లాండ్రీ అతను
చప్పున నను సరిదిద్ది
నడతలో నా వంకర్లనీ
ముడతలు పడ్డ ఆలోచనల్నీ
ఇస్త్రీ పెట్టెతో రుద్ది
శాస్త్రీయంగా సాపు చేసి,
నీటుగా నన్ను మడత పెట్టి
దీటుగా హేంగరుకు తగిలించి
మోసుకుపోయి నన్ను
మా ఆవిడ కప్పగించి,
'ఇదుగోనమ్మా తీసుకో
ఇస్త్రీ చేసిన నీ భర్తనంటే
ఎంత సంతోషిస్తుందో ఆమె,
ఇంతింతని చెప్పలేం! ■



# వాక ప్రేమ గీతం

● కె.యెస్. రమణ ● చిత్రం: వి.ఆర్. పాకాల

ఈ వాక్యసారి మాత్రం
నేను ప్రేమ గురించి మాట్లాడుతాను

నా అక్షరాల కన్రెప్పల పై
నీ అమృతాధరాలతో
ప్రాణంగా చుంబించినప్పుడే
నా చూపు మారిపోయింది

దుఃఖానికీ దుఃఖానికీ మధ్య విరామం ఆనందమే కాదు
అబద్ధాన్ని నిజం నుంచి వేరు చేయటం యెవరితరమూ కాదు
యెవరి స్వప్నాలమీద వారికి శిలువ ఖాయం ఖాయం
బతుకు అతివేదనా వ్రణం రణం మారణం

యింత కాలమూ నేను అపనమ్మకం గురించే మాట్లాడాను
యీ వాక్యసారి మాత్రం
నేను ప్రేమ గురించి మాట్లాడుతాను
నీ నులి వెచ్చని కౌగిలిలో
రసాత్మకంగా బంధించినప్పుడే
నా ప్రపంచం వేరైపోయింది

తుపాకీ మాపులో నడయాడే శవాల స్వేచ్ఛ
శ్మశానంలో కూడా కళ్ళు తెరవని సమానత్వం
పురి కొయ్యల పై యెగిరే జెండాల స్వాతంత్ర్యం
హాకరి వెన్నెముకని విరిచి వేలాడరి పూత దగ్గరగా మలిచే సౌభ్రాతృత్వం

యింతకాలమూ నేను అమానవ శైతల్యం గురించే మాట్లాడాను
యీ వాక్యసారి మాత్రం
నేను ప్రేమ గురించి మాట్లాడుతాను
నువ్వు నా పొంటి పై
పరిమళంగా హత్తుకుపోయినప్పుడే
నా దేహం అనుస్పందించింది

బిల్లులు పడిన పూపిరితిత్తులతో రోజుతోన్న ఆకాశం
దాపులోనూ జీవించే పిడికెడు భూమి ధైర్యం
యాంత్రిక జీవన డాలీ జన సందోహం
మనిషి కావటమే నేరమైన భావి సందర్భం

యింతకాలమూ నేను ఓటమి గురించే మాట్లాడాను
యీ వాక్యసారి మాత్రం
నేను ప్రేమ గురించి మాట్లాడుతాను
నువ్వు నా దేహాత్మల రేఖను
అలవోకగా చెరిపేసినప్పుడే
నా హృదయం ప్రశాంతించింది

యింతకాలమూ నేను చెల్లాచెదరవుతున్న
మానవహారం గురించే మాట్లాడాను
యీ వాక్యసారి మాత్రం
నేను ప్రేమ గురించి మాట్లాడుతాను
అవును
యీ వాక్యసారి మాత్రమే
వాక్యసారి మాత్రమే ■



# పోయెం 2000

● వనమూరు శ్రీధర్‌బాబు ● చిత్రం: లక్ష్మణ్




జీవితానందాన్ని బైట్‌లలో కొలుస్తున్నాను
నమస్త ఆలోచనల్ని చిటికెన వేలంత చిప్‌లో బంధించి
అద్దంలోకి చూస్తున్నాను-
మానిటర్‌లో మోహనరాగం తీగలుగా సాగి
ప్రతిబింబాన్ని చుట్టేస్తోంది
ఎం.పి త్రీలో మాటలు కంప్రెస్ అయి పిడచకారిపోయాయి

ఒక లోతట్టు సెన్సేషన్ భూగర్భ జల ప్రవాహంలా
గంగా యమునల మధ్య కనిపించని కావేరి నా యాతన
త్రీడీ మాక్స్ కవళికలో ట్రివులెక్స్ క్వేక్ నవ్వుల పాలబడి
పిక్సెల్స్‌లో చిక్కుకుపోయాను
దేహంలో ఎక్కడ తడిమినా ఒక మీట నొక్కినట్టే వుంటుంది
వెనకాల నడుం కింద ఓ మౌజ్ పెరుగుతూపోతోంది డార్విన్‌ని
వెతుక్కుంటూ

సాలెగూళ్ళ భూగోళం
నేనొక యూనివర్సల్ క్రీచర్
లాజిక్కుల మ్యాజిక్కుల్లో కిక్కుల్లో చిక్కుల్లో
నెగ్గుకు రావాలిక-

ఎవరైనా కదిలిస్తే కలిలిస్తే కవితిస్తే
సీక్వెన్స్ దెబ్బతింటుంది-
యాంటీ వైరస్పొకటి ఎప్పటికప్పుడు డెవ్‌లప్ చేసుకోవాలి కొత్త కొత్తగా
కళ్ళనీ చెవుల్నీ శ్వాసల్నీ చర్మాన్నీ చీల్చుకుని లోపలికొస్తాయి
ఐంపెన్ ప్రాలి కేరియట్ గాలులు
అలవాటైన ప్రాణం కదా అలమటించే ప్రమాదం వుంది

హార్డ్ డిస్క్ మీద వాన పడినా ఎండ పడినా
ఆఖరికి ప్రియురాలి చూపు పడినా మెమరీ స్మాష్!
ఇనుప డబ్బాలో సెంట్రల్ ప్రాసెసింగ్ యూనిట్‌నై
స్క్రూలు బిగించుకుని కూర్చున్నా
నరనరాన బైనరీ కోడ్లను కోట్లకు కోట్లు ప్రస్తారం చేస్తూ-

కళ్ళల్లో కన్నీరుబికితే టెక్నికల్ ప్రాబ్లమ్

లోలోన జ్ఞాపకాలు వానపాముల్లా మెల్లలు మెల్లగాపోతే
తెగిన గాలిపటాలు
తెమలని సందేహాలు ఆరు వందలలో చిక్కుకుపోతే
చిక్కులోపడి ఎప్పుడు ఫార్మాట్ చేసుకుంటాను
నన్ను నేను రీబూట్ చేసుకుంటాను.. తీ స్వర్గపురాను- ■

# ఎన్ని యుగాలైనా!

● నిఖిలేశ్వర్ ● చిత్రం: లక్ష్మణ్



అంత్యాల్లో దాగి వెతుకుతున్న
వర్తమానం అంచుల పై
బలిదానాల ఎరువు పై
కలలుగంటున్న భవిష్యత్తు
వరాన్న భక్షణలు
పరాధీన చింతనలో
నేలను తిరస్కరించగానే
సంపదకు లోనైన భూమిపుత్రులు!

కాంక్రీట్ మేడల ఏ.సి గదుల్లో
గులకరాళ్ళ తొట్టెల్లో నమూనే పొందిన
ప్లాస్టిక్ మనీ ప్లాంట్ల వంటివి
కంప్యూటర్ క్యాబిన్‌లలో
భూగోళాన్ని శాసించాలనే మరాళి!

'అర్బన్ లెజెండ్స్' రచించాలనే
విశ్వామిత్ర సృష్టిలోనే
దాగివున్న విశ్వశత్రువులు..

ఈ నగరేతిహాసంలో
హై టెక్ జంగిల్ వేటలో
నీతి వాక్యాలను అన్వేషించే
టార్జాన్‌లకు చోటు లేదు.
మరుగుజ్జు పాలనా వ్యవస్థలో
ఇప్పుడు వైరస్‌కాయలదే-
నీతిమాలినరాజ్యం!

అపర మేధావులు
'సినికల్' కవులు
మత్తుమందు స్వప్నలోకాల్లో
దిక్కులు చూస్తూ కలువ మొక్కల్లా.
పక్కనే కాలి బూడిదైన చెట్టుకింద
చిరుచేతులాడిస్తూ
ఆకాశాన్ని ఆహ్వానిస్తున్న
నునులేత రెమ్మలు!

యుగయుగాలుగా
నిర్మించుకున్న మానవ వారధుల పై
వెంటాడే ద్వేషాగ్ని జ్వాలల్ని
చల్లార్చే స్నేహ జీవనం
అడుగడుగునా నిలిచేనే
అవాంతరాలను ముంచెత్తే
స్వేచ్ఛాభావాలకు-
మాటలున్నంతకాలం
ఎన్ని మరణాలైనా
ఎన్ని యుగాలైనా
ప్రతిక్షణం-
ఒక శ్వాసకు యావత్కల్పం!! ■



# ట్రాఫిక్

● శివారెడ్డి ● చిత్రం: నర్సిం

ట్రాఫిక్ కదల్లేక కదులుతోంది
అప్పడప్పుడు కుబుసం విడుస్తోంది
కాసేపు మోకాళ్ళ నందున తల పెట్టి
చింతాక్రాంత మౌతోంది.
కాసేపు బతికిందో, చచ్చిందో తెలియదు
ముందుకు నడుస్తుందో వెనక్కి పోతుందో తెలియదు
ఎవరో చేతులు కాళ్ళూ విరిచేసిన మొండెంలా
అలా తన్నుకుంటుంది.
పోలీసోడి బండయినా గాలానికి చిక్కిన చేపలా
తన్నుకు చావాల్సిందే

ఎవరో ముడ్డిమీద తంతూవుంటారు
వెనక్కి పోలేక, ముందుకు కదల్లేక
హీనాతి హీనంగా మూర్ఖవాడిలా గిలగిలా తన్నుకుంటుంది.

కరెంటు తీగమీద కూర్చున్న రెండు కాకులు
ట్రాఫిక్ నెత్తిమీద నిర్భయంగా రెట్ట వేస్తాయి.
సుల్తాన్ బజార్లో బొక్కబోర్లా దొరుకుతున్న
అవిటాడిలా ట్రాఫిక్

నేనిక్కడ ఇరానీ హోటల్ నుంచి
కదలని నీటిమట్టం ట్రాఫిక్ మీద
చచ్చిన పాముమీద రాళ్ళు విసిరే పిల్లాడిలా
చూపుల ముక్కల్ని విసురుతుంటాను.

కదల్లేని నదికి కాన్పువదు
చూచేవాళ్ళ యాతన దుర్భరం
గొడుగు మూసినట్టు ఈ ట్రాఫిక్‌ని
మూసి చంకలో పెట్టుకుంటే బాగుండు

ఒకటే నస, తెగదు
విషం శిరసుకొన ఎక్కదు
వినుగు, అవిరామ అనహానం

గట్టు తెగ్గొట్టి అవతలకి దూకేస్తా
ప్రాణులకీ, అప్రాణులకీ అట్టే తేడా లేనితనం,
యంత్రం మనిషిని నియంత్రిస్తుంటే
విస్తుపోతున్న ప్రపంచం,

నోట్లో వేలు పెట్టుకుని ఒక చిన్నపిల్ల ఒడ్డున నుంచుని
చిన్ని కృష్ణునికి యమున దోవిచ్చినట్టు
ట్రాఫిక్ దయతో దోవిస్తుందని
విస్మయాదుర్దాలతో-
నిర్భయమతి, నిర్దయమతి ఈ ట్రాఫిక్- ■

# ప్రకృతి ఒడిలో



● చినవీరభద్రుడు ● ఫోటోలు: కె.ఆర్. వినయన్

ఫాలుణ మాసపు తొలి జాముల ఎండ. కారు మహబూబ్ నగర్ జిల్లా గ్రామాల మధ్య నుంచి అక్కడక్కడ సేద్యం చేసి విస్తారంగా బీడుగా వదిలిపెట్టిన పొలాల మధ్య నుంచి ప్రయాణిస్తోంది. అప్పుడప్పుడు గాల్లోంచి వేపపూల నవజాత పరిమళాలు అల్లుకొనిపోతున్నాయి.

"ఇప్పుడు మనం మొదట ఎక్కడికి వెడుతున్నాం" అని అడిగింది సుచరిత మృదువైన అమెరికన్ యాసతో.

"మన శ్రీశైల యాత్ర చరిత్రాత్మకమైన ఉత్తర ద్వారం గుండా చెయ్యాలి కదా. ముందు మనం ఉమామహేశ్వరం వెళుతున్నాం" అన్నాను.

సుచరిత నా మేనకోడలు. పుట్టింది అమెరికాలోని అత్యంత పురాతన సాంస్కృతిక నగరాల్లో ఒకటయిన ఫిలడెల్ఫియాలో. నా సోదరి సులక్షణ, ఆమె భర్త డాక్టర్ సుధీర్ పాతికేళ్ళ కిందటే అక్కడ స్థిరపడ్డారు. యూనివర్సిటీ ఆఫ్ పెన్సిల్వేనియాలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ ఈ మధ్యనే పూర్తి చేసుకొని, కొన్నాళ్ళు మా మధ్యన మన దేశంలో గడపడానికి వచ్చిందీ అమ్మాయి. తిరిగి వెళ్ళిపోబోయే ముందు దగ్గరలో ఉండేదేదయినా స్థలాన్ని చూపించమంది. తాను చూడబోయే ప్రాంతం ఇండియన్ ఎక్స్‌పీరియన్స్‌కి ఒక ప్రతీకగా ఉండాలంది. అక్కడ పాత, కొత్త మేలుకలయికగా ఉండాలనీ, అజేయమైన, అప్రతిహతమైన మానవ జీవితేచ్ఛ జలంగా స్ఫురించాలనీ ఆమె మాటల్లో చెప్పలేదు గానీ, ఇండియన్ ఎక్స్‌పీరియన్స్ సారాంశమదే కదా అనుకున్నాను. హైదరాబాద్ నగరం నుంచి నాలుగు గంటల ప్రయాణంలో, ఒకటి రెండు రోజులు గడిపి తిరిగి రావడానికి అనువుగా ఉండేది నల్లమల అడవులు, శ్రీశైలమే కనుక ఆ యాత్రే చేద్దామన్నాను. సుచరితకి ఇది మొదటిసారి. కానీ, నాకు గత పదేళ్ళుగా ఎన్ని విధాలుగా ఆ అడవులూ, లోయలూ, ఆ మనుషులూ ఎట్లా సన్నిహితులైనారని. నువ్వు నీ స్వగృహాన్ని వదిలిపెట్టిన ప్రతిసారీ యాత్రికుడవు అయినట్టే. నీ మిత్రుడి ఇంటికో, చిరపరిచితుడే కావచ్చు

# ప్రగతి పరవళ్ళు

శ్రీశైలం: ఇక్కడ పాతాళ గంగ (దిగువ)లో పుణ్యస్నానం శివసాయుజ్యప్రదమని భక్తుల విశ్వాసం. ఇక నల్లమల కొండలలో ప్రకృతి శోభ పర్యాటకులను పరవశింపజేస్తుంది. ఆధ్యాత్మికతకూ, ఆధునికతకూ ఆటపట్టుగా వర్ధిల్లుతున్న శ్రీశైల క్షేత్రం సత్యం, శివం, సుందరం అనే ఆర్యోక్తికి శాశ్వత ప్రతీకగా భాసిల్లుతోంది.

గార, నీ బంధువు ఇంటికో, ఒక పచ్చిక బయలుకో, ఒక మామిడి తోటకో, ఒక సెలవు దినాన పోయిరాగానే నీలో ఎంత కొత్త రక్తం పొంగుతుందని. 'నేను మానవ కంఠస్వరాల్లో స్నానం చేస్తాను' అన్నాడు ఒక కవి తానొక మహానగరాన్ని చూసినప్పుడు. నువ్వు నీ ఇంటిని వదిలి పెట్టిన వెంటనే ప్రపంచం వెయ్యి చేతుల్తో నిన్ను దగ్గరకు తీసుకోవడం ఎంత ధైర్యాన్నిస్తుందని. అప్పుడు నువ్వు మళ్ళా గృహోన్ముఖుడవయి సపుడు వట్టి మనిషిగా కాక మహామానవుడిగా తిరిగి వస్తావు.

"శ్రీశైలమంటే టెంపులే కదా మామయ్యా. అక్కడేముంది రెండు రోజులు గడపడానికి" అంది సుచి నా యాత్ర ప్రతిపాదన వినగానే. "టెంపుల్ అంటే నువ్వేమనుకుంటున్నావోగానీ, ఆ మాటకి చాలా విశాలార్థముంది. అసలు నల్లమల అడవి మొత్తమే ఒక దేవాలయం" అన్నాను. నిండుగా చిగురించిన మద్దిచెట్లు అడవిని తలదాల్చిన శ్రీ పర్వతమంతా ఒక శివ మహిమ్న స్తోత్రంలాగా కళ్ళ ముందు కనబడుతుంది నాకు. అట్లాంటిక్ సముద్రం పైన నూతన దేశార్థులై యూరపియన్లు అమెరికా తూర్పు తీరంపైన కాలు మోపినప్పుడు పెన్సిల్వేనియా కూడా బహుశా ఒక శ్రీ పర్వత కాననం వలే ఉండి ఉండవచ్చు. కానీ, ఆధునిక మానవుడు అక్కడి స్వదేశీయుల్ని ఎంత దారుణంగా వేటాడాడని!

కారు అచ్చంపేట వీధుల్లోంచి ముందుకు సాగింది. ఇంకా నిన్న రోజుల్ని తలపించే స్థూలవాస్తు, రోడ్ల పక్కన పండ్లు, కూరగాయల దుకాణాలు, ఏ వాహనం వచ్చిపోతున్నా పైకి ఎగిసి ఆవరించే దుమ్ము. అచ్చంపేట దాటి రంగాపూరు చేరగానే కారు కుడివైపు తిప్పాను. అక్కడనే రోడ్డుపైన ఆలయ ముఖద్వారం. ముఖద్వారం వెంబడే కొండలోకి సన్నని బాట. దూరంగా కొండల వరుస మధ్య ఏటవాలు అంచులో సేద దీర్చుకుంటున్న ఏడ్ల గుంపులా ఆలయ శిఖరాలు. ఆ సన్నని బాట పైకి కారు తిరగగానే సుచిలో కొత్త ఉత్సాహం కదలాడింది. మలుపు వెనుక మలుపు తిరుగుతూ కొద్దిసేపట్లోనే ఘాట్ మీదుగా కొండపైకి చేరాం. "అబ్బ, ఎంత చల్లగా ఉంది ఇక్కడ" అంది సుచి కారు లోంచి కిందకి గెంతుతూనే. "అయితే శివ స్వరూపం నీకు అప్పుడే అనుభవమయిందన్నమాట" అన్నాను. ఆమె ముందుకి అడుగు వెయ్యబోతూంటే "ఒక్కసారి ఆగి, ఇటు మనం వచ్చిన దారివైపు చూడు" అన్నాను.



ఆమె వెనక్కి తిరిగి కొద్దిసేపు కన్నార్పకుండా చూస్తుండిపోయింది. మేం వచ్చిన దారి పొడవునా పరుచుకున్న ఆకుపచ్చ లోయ విస్తరించి విస్తరించి ముదురాకు పచ్చ సస్యక్షేత్రాలుగా, ఆపైని పృథ్వి అంతా ఆవరించిందేమో అనిపించే దక్కన్ పీఠభూమి ఒక నీలి అలగా, ఆపైని ఆకాశం మబ్బు కూడా లేని ఒక తెల్ల తామర పువ్వులా కనిపించే దృశ్యమంతా నేత్రానందాన్ని ఒలకబోస్తున్న ఒక పంచుటాకుల దోనిలిగా కనిపించింది.

"ఈ దేవాలయం శ్రీశైలానికి ఉత్తరప్రాకారం అంటారు. ఇది కాకతీయుల కాలం నుంచీ బాగా ప్రాచుర్యానికి వచ్చింది. రేచెర్ల మాదవ నాయకుడనేవాడు ఈ కొండకి మెట్లు కట్టించేడు. పద మూడో శతాబ్దిలోనే రసరత్నాకరం అనే గ్రంథం ఈ క్షేత్రాన్ని ప్రశంసించింది. ఆలయ నిర్మాణం పద్నాలుగో శతాబ్దిలో జరిగిందని గుర్తించారు." ఒక గైడ్‌లాగా చెప్తుంటే ఒక చెంప నా మాటలు వింటూ, మరొక వైపు నుచి ఆ రాళ్ళ మధ్య నుంచి ఊట లూరుతున్న పరిశుద్ధ జలాల్ని నెత్తిన చల్లుకొంటోంది. "వనమూలికల వేళ్ళ అంచుల్లోంచి తేటపడ్డ ఆ జలాలు ఏడాది పొడుగునా ప్రవహిస్తూనే ఉంటాయి" అన్నాను. "ఈ దేవాలయం బ్రహ్మోత్సవాలు సంక్రాంతికి జరుగుతాయి. ఒక విశేషమేంటో తెలుసా? ఇప్పుడు మనం దాటి వచ్చామే, రంగాపూర్, అక్కడొక గొప్ప సూఫీ సాధువు ఉండేవాడు-నిరంజన్ షా వలీ అని. ఆయన దర్గా ఉంది అక్కడ. ఇక్కడ బ్రహ్మోత్సవాలు జరిగినప్పుడే అక్కడ చందనోత్సవమూ జరుగుతుంది. ఇక్కడికి వచ్చిన భక్తులంతా అక్కడికి వెళతారు. అక్కడికి వచ్చిన శ్రద్ధాళువులంతా ఇక్కడికి వస్తారు" అంటుంటే, "నువ్వెప్పుడన్నా ఆ ఉత్సవాలు చూశావా" అంది. ఆ ప్రశ్న వినగానే ఒక సంక్రాంతి చివర పుష్యమాసపు సంధ్యాధూళిలో ఒక సంరంభంలో ఇక్కడ గడిపిన సాయంకాలం మనసంతా ఆవరించింది. గాలుల్లో ఆవరించిన శ్రీచందన సుగంధాలు, దర్గా పైన కప్పిన పవిత్ర శాలువాలు, వర్షించిన గులాబీ పూలరేకలు, లిల్లీ పూలమాలలు, పిల్లలూదిన బూరాలు... "చూడకేమి, చూశాను. ఆ ఆనందాన్ని ఎప్పటికీ మరువలేను" అన్నాను.

ఉమామహేశ్వరం నుంచి కిందకు దిగి మన్ననూరు ఘాట్ ఎక్కి శ్రీశైలం వైపు ప్రయాణిస్తుండగా అడవి ఒక సమూహంగా మాకు ఎదురొచ్చింది. వివిధ వాద్యాల, గాత్రాల, సంతోషపారవశ్యాల బృందగానం లాంటి ఆ తరుతనువుల, దారుదేహాల మధ్య 'ఈ అడవిని ఇట్లా రోడ్డుమీంచి కాదు, లోపల్నుంచి చూడాలి పద' అని ఫర్హాబాద్ జంక్షన్ నుంచి కారు లోపలికి తిప్పాను. దాదాపు పది కిలోమీటర్ల పాటు కొండ అంచు దాకా లోపలికి ప్రయాణం చేస్తున్నంత సేపూ నుచి నేత్రాలే రెక్కలుగా ఎగుర్తున్న పాల పిట్టలా ఉంది. శుష్కపాండురమయిన మాఘఫాల్గుణాల శైశిరాధ్యాయం నుంచి వసంతోత్సవంలోకి అడుగుపెడుతున్న అడవి నవయౌవనపు బాలికలా ఉంది. పవిత్ర నిర్మల మనోభావాలు, ఏదో ఒక ప్రియాతిప్రియమైన సాన్నిధ్యం కోసమే తన జీవిత వికాసాన్నంతటినీ నివేదించు



**ఆధ్యాత్మికత, ఆధునికతల సంగమం:** (సవ్యదిశగా పక్క పేజీ ఎగువ నుంచి) భక్తిముక్తిదాయకం శ్రీశైలం మల్లన్న సన్నిధి; కృష్ణవేణి గలగలల మధ్య భారతీయాత్మను పరిరక్షిస్తున్న వేదవిద్యాలయం; పరుగులు తీస్తున్న ప్రగతి రథానికి ప్రతీక శ్రీశైలం ఆనకట్ట. ఆత్మవికాసం, ఆత్మవిశ్వాసాల కూడలిగా నిలవడమే ఈ దివ్యక్షేత్ర విశిష్టత.

కోవాలనుకునే నిష్కళంక ప్రేమాతిశయం అడవి అడుగడుగునా గోచరిస్తున్నాయి. అప్పుడు అడవికీ, ఈ బాలికకీ మధ్య భేదమే కనిపించలేదు. ఈ సుచరిత అడవిని చూస్తున్నదో, అడవి కళ్ళారా సుచరితనే చూస్తున్నదో తేల్చుకోలేకపోయాను.

పర్హాబాద్ పాయింట్ దగ్గరకు చేరేటప్పటికి అడవి పూర్తిగా మమ్మల్ని ఆవహించింది. సెల్‌ఫోన్‌లు, ఇ-మెయిల్‌లు, ఇంటర్‌నెట్‌లు మాత్రమే అలవాటైన ఈ బాలికకి మొదటిసారిగా దిగంత పరివ్యాప్తమైన సందేశ సాన్నిధ్యం ఎరుకపడింది. ఇది సందేశమూ, అనుభవమూ కూడా. వెబ్‌సైట్ సందేశాన్ని మాత్రమే అందించగలదు. అది ఒక మీడియం లేదా ఒక మెసేజ్ మాత్రమే. నువ్వక్కడ ఆ సందేశాన్ని నీ మనోదేహాలతో నిలువెల్లా ఆస్వాదించలేవు. అది ఒక అపరిపూర్ణ, అసంతృప్త సంకేతం మాత్రమే. కానీ, ఇక్కడ నీ ఎదుటగా ఆవరించిన మహాకాశమూ, నీలి తరంగాలూ, ధూమసదృశమైన శిశిరకాననమూ, ఆ మధ్య మధ్య మధురోహల్లాగా వికసిస్తున్న నవకింజల్కాలూ, కిసలయలూ, అడవిలో వినవస్తున్న అడవి కోళ్ళ అరుపులూ, నెమళ్ళ క్రేంకారాలూ, వాటివల్ల మరింత సజీవంగా, సుస్పష్టంగా వినవస్తున్న అడవి గర్భంలోని ప్రగాఢ నిశ్శబ్దం. ఇవన్నీ నా చిన్నారి బాలికని సీతాకోకచిలుకల్లా చుట్టుముట్టాయి. "మామయ్యా, అట్లాంటిక్ మహాసముద్రాన్ని తరంగితమవుతున్న ఎమరాల్డ్ లాగా పోల్చాడు ఒక కవి. మొదటిసారిగా అట్లాంటిక్‌ని చూసినప్పుడు ఎలా ఉందో ఇప్పుడలా ఉంది నాకు" అంది సుచి.

ఈ అడవి గురించి అరవై ఏళ్ళ కిందట ప్రొఫెసర్ హైమండార్ఫ్ చేసిన వర్ణనలు గుర్తొచ్చాయి. 1940లో ఆయన తన భార్యతో పాటు ఇక్కడ ఫారెస్ట్ గెస్టహౌస్ పక్కన పులిచెలమలో కొన్నాళ్ళు ఉన్నాడు. అక్కడ ఉంటూ మల్లాపూర్, పుల్లాయి పల్లి, పట్వర్ల పల్లి, రాయలేటి పెంటల్లోని చెంచుల జీవితాన్ని అధ్యయనం చేసి కొన్నాళ్ళకు అప్పాపూర్ దగ్గర బౌరమ్మ చెరువుకు మకాం మార్చాడు. అక్కడ నుంచి ఈర్లపెంట, మేడిమలకల, నంగడిగుండాల గూడేలు తిరిగి ఒక వసంత కాలంలో కృష్ణానది దాటి కర్నూలు జిల్లావైపు చెంచుగూడేలు పర్యటించి నడి వర్షాల మధ్యలో తిరిగి ఇటు చేరాడు. అడవిలో మారుతున్న ఋతువుల అందాల్ని అతి సన్నిహితంగా, ఏకాంతంగా చూసేడేమో, ఆ ఋతుక్రమాన్ని వర్ణించేటప్పుడు ఆయన ఏ సూక్ష్మ సుగంధాన్నీ కూడా వదిలిపెట్టకుండా కవిలాగా రాసుకుంటూ పోతాడు. కారు వెనుక సీట్లోంచి 'ది ఎబోరిజినల్ ట్రైబ్స్ ఆఫ్ హైదరాబాద్, వాల్యూం...1' తీసి నాకు పరిచితమైన పంక్తుల్ని ఆత్రతగా అందుకుని సుచికి వినిపించడం మొదలుపెట్టాను.

"మార్చి నెల గడుస్తుండగా పత్రవిహీనాలుగా అంతదాకా దర్శనమిస్తున్న చెట్లలోంచి చివుళ్ళు తొంగి చూడడం మొదలుపెట్టాయి." ఆయన ఇంకా రాస్తున్నాడు: "ధూమ్రపాండురమైన ప్రకృతి పెద్దపెద్ద పువ్వులతో, పసుపు పచ్చని పూలగుబుర్లతో, చిక్కని రంగుల పత్రదళాల్తో కాంతిమంతంగా రంగు తిరుగుతోంది. ఎర్రని చిగుళ్ళజొంపాల మధ్య అత్తిపండ్లు రంగు తీరుతున్నాయి. తొలి ఇప్పపూలు నేలకి రాలుతూ, నేల అంతటా వాటి పుప్పొడిని వెదజల్లుతున్నాయి"

కారు తిరిగి ఘాట్ రోడ్డు మలుపుల్లో ముందుకు సాగుతోంది. మహాసముద్ర తరంగాల ఉత్థానపతనాల వెంబడి సాగుతుండే చిన్న నావలా ఆ తూర్పు కనుమల వరుసలో, మలుపుల్లో, వాలుల్లో ఎగుడు దిగుళ్ళలో కారు సాగుతోంటే బాటకిరువైపులా వసంతాగమన ప్రతీక్షలో అడవి నిల్చి ఉంది. ఎండిన మాకుల మధ్య నుండి రాలుతున్న పండుటాకుల గాలుల్లోంచి, చివుళ్ళు పోసుకుంటున్న తరువుల నవజీవన ప్రసూతి శోభలో దూరంగా కృష్ణవేణి పలుకరిస్తోంది.

"ఇప్పుడు కాళిదాసు కాదు. పాల్కురికి సోమనాథుడిని వినిపించాలని ఉంది నీకు." ఒక పక్కగా గేరు న్యూట్రల్ చేసి డాష్ బోర్డులోంచి పండితారాధ్య చరిత్ర తీశాను. "నాకు ఎంత ఇష్టమో ఈ పుస్తకమంటే. శ్రీశైలం గురించి ఇంత పారవశ్యాన్ని పొందిన భావుకుడు మరొకడున్నాడనుకోను. ఆయన పదమూడో శతాబ్దిలో మనం వచ్చినట్లే ఈ తెలంగాణ దారుల్లోంచే శ్రీశైలాన్ని సందర్శించాడు. అప్పుడీ రహదారులూ, ఈ వాహనాలూ లేని రోజులు. కాలినడకన ఈ కొండలెక్కి శివసందర్శన కుతూహలంలో ముందుకు సాగిన రోజులు. ఇక్కడ ఇదుగో ఈ ముందుండే ఆకాశాన్ని అంటుకున్నట్లుండే ఆ కొండల వరుస, దాన్నెక్కితే చుక్కల్ని తాకినట్లే. ఆ నక్షత్ర పర్వతాన్ని ఈ ఆడవుల మధ్య ప్రమాదాల కెదురీదుతూ ఎట్లా ఎక్కాడో, ఎలా చెప్తాడో చూడు..." అలవాటు అయిన ఆ పేజీల కోసం ఆత్రతగా వెతుకుతున్న నా వేళ్ళను సుచి ఆరాధనగా చూసింది.

'పర్వతయ్యా, మమ్ము పాలింపు' మనుచు
మొక్కుచు, నీడల చిక్కుచు, పండ్లు



**ఆధ్యాత్మికత, ఆధునికతల సంగమం:** (సవ్యదిశగా పక్క పేజీ ఎగువ నుంచి)భక్తిముక్తిదాయకం శ్రీశైలం మల్లన్న సన్నిధి; కృష్ణవేణి గలగలల మధ్య భారతీయాత్మను పరిరక్షిస్తున్న వేదవిద్యాలయం; పరుగులు తీస్తున్న ప్రగతి రథానికి ప్రతీక శ్రీశైలం ఆనకట్ట. ఆత్మవికాసం, ఆత్మవిశ్వాసాల కూడలిగా నిలవడమే ఈ దివ్యక్షేత్ర విశిష్టత.

కోవాలనుకునే నిష్కళంక ప్రేమాతిశయం అడవి అడుగడుగునా గోచరిస్తున్నాయి. అప్పుడు అడవికీ, ఈ బాలికకీ మధ్య భేదమే కనిపించలేదు. ఈ సుచరిత అడవిని చూస్తున్నదో, అడవి కళ్ళారా సుచరితనే చూస్తున్నదో తేల్చుకోలేకపోయాను.

ఫర్హాబాద్ పాయింట్ దగ్గరకు చేరేటప్పటికి అడవి పూర్తిగా మమ్మల్ని ఆవహించింది. సెల్‌ఫోన్‌లు, ఇ-మెయిల్‌లు, ఇంటర్‌నెట్‌లు మాత్రమే అలవాటైన ఈ బాలికకి మొదటిసారిగా దిగంత పరివ్యాప్తమైన సందేశ సాన్నిధ్యం ఎరుకపడింది. ఇది సందేశమూ, అనుభవమూ కూడా. వెబ్‌సైట్ సందేశాన్ని మాత్రమే అందించగలదు. అది ఒక మీడియం లేదా ఒక మెసేజ్ మాత్రమే. నువ్వక్కడ ఆ సందేశాన్ని నీ మనోదేహాలతో నిలువెల్లా ఆస్వాదించలేవు. అది ఒక అపరిపూర్ణ, అసంతృప్త సంకేతం మాత్రమే. కానీ, ఇక్కడ నీ ఎదుటగా ఆవరించిన మహాకాశమూ, నీలి తరంగాలూ, ధూమసదృశమైన శిశిరకాననమూ, ఆ మధ్య మధ్య మధురోహల్లాగా వికసిస్తున్న నవకింజల్కాలూ, కిసలయలూ, అడవిలో వినవస్తున్న అడవి కోళ్ళ అరుపులూ, నెమళ్ళ క్రేంకారాలూ, వాటివల్ల మరింత సజీవంగా, సుస్పష్టంగా వినవస్తున్న అడవి గర్భంలోని ప్రగాఢ నిశ్శబ్దం. ఇవన్నీ నా చిన్నారి బాలికని సీతాకోకచిలుకల్లా చుట్టుముట్టాయి. "మామయ్యా, అట్లాంటిక్ మహాసముద్రాన్ని తరంగితమవుతున్న ఎమరాల్డ్ లాగా పోల్చాడు ఒక కవి. మొదటిసారిగా అట్లాంటిక్‌ని చూసినప్పుడు ఎలా ఉందో ఇప్పుడలా ఉంది నాకు" అంది సుచి.

ఈ అడవి గురించి అరవై ఏళ్ళ కిందట ప్రొఫెసర్ హైమండార్ఫ్ చేసిన వర్ణనలు గుర్తొచ్చాయి. 1940లో ఆయన తన భార్యతో పాటు ఇక్కడ ఫారెస్ట్ గెస్ట్‌హౌస్ పక్కన పులిచెలమలో కొన్నాళ్ళు ఉన్నాడు. అక్కడ ఉంటూ మల్లాపూర్, పుల్లాయి పల్లి, పట్వర్ల పల్లి, రాయలేటి పెంటల్లోని చెంచుల జీవితాన్ని అధ్యయనం చేసి కొన్నాళ్ళకు అప్పాపూర్ దగ్గర బౌరమ్మ చెరువుకు మకాం మార్చాడు. అక్కడ నుంచి ఈర్లపెంట, మేడిమలకల, సంగడిగుండాల గూడేలు తిరిగి ఒక వసంత కాలంలో కృష్ణానది దాటి కర్నూలు జిల్లావైపు చెంచుగూడేలు పర్యటించి నడి వర్షాల మధ్యలో తిరిగి ఇటు చేరాడు. అడవిలో మారుతున్న ఋతువుల అందాల్ని అతి సన్నిహితంగా, ఏకాంతంగా చూసేడేమో, ఆ ఋతుక్రమాన్ని వర్ణించేటప్పుడు ఆయన ఏ సూక్ష్మ సుగంధాన్నీ కూడా వదిలిపెట్టకుండా కవిలాగా రాసుకుంటూ పోతాడు. కారు వెనుక సీట్లోంచి 'ది ఎబోరిజినల్ ట్రైబ్స్ ఆఫ్ హైదరాబాద్, వాల్యూం...1' తీసి నాకు పరిచితమైన పంక్తుల్ని ఆత్రతగా అందుకుని సుచికి వినిపించడం మొదలుపెట్టాను.

"మార్చి నెల గడుస్తుండగా పత్రవిహీనాలుగా అంతదాకా దర్శనమిస్తున్న చెట్లలోంచి చివుళ్ళు తొంగి చూడడం మొదలుపెట్టాయి." ఆయన ఇంకా రాస్తున్నాడు: "ధూమ్రపాండురమైన ప్రకృతి పెద్దపెద్ద పువ్వులతో, పసుపు పచ్చని పూలగుబుర్లతో, చిక్కని రంగుల పత్రదళాల్తో కాంతిమంతంగా రంగు తిరుగుతోంది. ఎర్రని చిగుళ్ళకొంపాల మధ్య అత్తిపండ్ల రంగు తీరుతున్నాయి. తొలి ఇప్పపూలు నేలకి రాలుతూ, నేల అంతటా వాటి పుప్పొడిని వెదజల్లుతున్నాయి"

కారు తిరిగి ఘాట్ రోడ్డు మలుపుల్లో ముందుకు సాగుతోంది. మహాసముద్ర తరంగాల ఉత్థానపతనాల వెంబడి సాగుతుండే చిన్న నావలా ఆ తూర్పు కనుమల వరుసల్లో, మలుపుల్లో, వాలుల్లో ఎగుడు దిగుళ్ళలో కారు సాగుతోంటే బాటకిరువైపులా వసంతాగమన ప్రతీక్షలో అడవి నిల్చి ఉంది. ఎండిన మాకుల మధ్య నుండి రాలుతున్న పండుటాకుల గాలుల్లోంచి, చివుళ్ళు పోసుకుంటున్న తరువుల నవజీవన ప్రసూతి శోభలో దూరంగా కృష్ణవేణి పలుకరిస్తోంది.

"ఇప్పుడు కాళిదాసు కాదు. పాల్కురికి సోమనాధుడిని వినిపించాలని ఉంది నీకు." ఒక పక్కగా గేరు న్యూట్రల్ చేసి డాష్ బోర్డులోంచి పండితారాధ్య చరిత్ర తీశాను. "నాకు ఎంత ఇష్టమో ఈ పుస్తకమంటే. శ్రీశైలం గురించి ఇంత పారవశ్యాన్ని పొందిన భావుకుడు మరొకడున్నాడనుకోను. ఆయన పదమూడో శతాబ్దిలో మనం వచ్చినట్లే ఈ తెలంగాణ దారుల్లోంచే శ్రీశైలాన్ని సందర్శించాడు. అప్పుడీ రహదారులూ, ఈ వాహనాలూ లేని రోజులు. కాలినడకన ఈ కొండలెక్కి శివసందర్శన కుతూహలంలో ముందుకు సాగిన రోజులు. ఇక్కడ ఇదుగో ఈ ముందుండే ఆకాశాన్ని అంటుకున్నట్లుండే ఆ కొండల వరుస, దాన్నెక్కితే చుక్కల్ని తాకినట్లే. ఆ నక్షత్ర పర్వతాన్ని ఈ అడవుల మధ్య ప్రమాదాల కెదురీదుతూ ఎట్లా ఎక్కాడో, ఎలా చెప్తాడో చూడు..." అలవాటు అయిన ఆ పేజీల కోసం ఆత్రతగా వెతుకుతున్న నా వేళ్ళను సుచి ఆరాధనగా చూసింది.

'పర్వతయ్యా, మమ్ము పాలింపు' మనుచు
మొక్కుచు, నీడల చిక్కుచు, పండ్లు



మెక్కుచు, లీలల నెక్కుచు, తిన్నె
లెక్కుచు, రాలను నొక్కుచు, సెలల
చిక్కుచు, తెరపుల నక్కుచు... తరుల
దూగుచు, ఉయ్యాల లూగుచు, శ్రమము
లీగుచు, పూదేనె త్రాగుచు, చలికి
వ్రేగుచు, ఎండల క్రాగుచు...

అడుగు తీసి అడుగు వేసుకుంటూ, ఆయాసం అణుచుకుంటూ, ఓపిక తెచ్చుకుంటూ సాగుతున్న భక్తజనయాత్రని ఆ ద్విపదలో నెమ్మదిగా చదువుతూ మధ్యలో అడిగేను. "ఈ తెలుగు నీకు అర్థమవుతోందా" అని. సుచి కళ్ళల్లో మెరుపు "ఆఁ. అర్థమంటే మీనింగ్ గురించి చెప్పలేనుగాని, ఎంత బాగా కమ్యూనికేట్ అవుతోందో" అంది. "అవును. సోమనాథుడు ఇది భాషతో రాయలేదు. హృదయంతో రాసేడు. అందుకనే ఆ తరువాత వచ్చిన తెలుగు సాహిత్యం అంతా ఆయన ప్రభావం నుంచి తప్పించుకోలేకపోయింది" అన్నాను. అంటుండగానే శివకవులు, శివకవితలు, శివభక్తులు మనసంతా నిండిపోయేరు. మళ్ళా కారు స్టార్ట్ చేశాను. కొద్దిసేపు నేనేమీ మాట్లాడలేదు. ఏదో మహా గంభీరమైన విషయం నాలో ఎక్కడో వ్యక్తీకరణ కోసం పెనుగులాడుతున్నట్లుగా అనుభవమైంది.

## 2

మేం సుండిపెంటకు చేరేటప్పటికి మధ్యాహ్నం మూడున్నర అయింది. నాకోసం ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్ గెస్ట్‌హౌస్ వద్ద మా మిత్రబృందం రాజా, రెడ్డి, షణ్ముగం, శ్రీనివాస్, దాసం మాకోసం వేచి ఉన్నారు. మా భోజనాలు, తర్వాత విరామం అయిన తరువాత అయిదు కావొస్తుండగా "ఇప్పుడు మనం ముందు శిఖరేశ్వరం వెళ్దాం" అన్నారు మిత్రులు. శ్రీశైలానికి తూర్పు నుంచీ, దక్షిణం నుంచీ వచ్చే యాత్రికులందరికీ మొదట దర్శనమిచ్చేది శిఖరేశ్వరమే. సాయంకాలపు ఎండ తీక్షత తగ్గి, గాలుల్లో సంధ్యాఘాదుర్గంధం అలముకొంటుండగా ఎనిమిది కిలోమీటర్ల ఘాట్ మలుపుల్లోంచి శిఖరం చేరుకున్నాం.

"సముద్రమట్టానికి దాదాపు రెండువేల అయిదు వందల అడుగుల ఎత్తున ఉన్న ఈ శిఖరం నల్లమల అడవులంతటికీ కేంద్ర బిందువు. యాత్రికులు ఈ కనుమల్లోంచి, లోయల్లోంచి, కొండవాలుని పట్టుకొని వందలాది మైళ్ళు నడిచి ఇక్కడకు చేరగానే ఈ శిఖరస్థానం మీంచి దూరంగా లోయల్లో శ్రీశైల దేవాలయ గోపురాలు కనబడగానే ఎటువంటి సాఫల్యానుభూతికి లోనయి ఉంటారో ఊహించు. ఒక జీవితకాలపు అన్వేషణ నెరవేరినట్లుంటుంది కదూ. అందుకే శ్రీశైల శిఖరం చూస్తే పునర్జన్మ ఉండదని విధించింది మన పూర్వీకులకి..." సుచి నా మాటలు వినడం లేదు. ఆమె ఒక లేడిపిల్లలా అటూ ఇటూ చెంగున గెంతుతోంది. ఎటు

అడవి బిడ్డల జీవన సౌరభం: (సవ్యదిశగా ఎగువ నుంచి) చెంచు తెగకు చెందిన గిరిజన రైతు; చెంచుల జీవనంలో ఒక దృశ్యం; శ్రీ స్వామీ పూర్ణానంద ఆశ్రమం. పాతరాతియుగం నుంచి శ్రీశైలం జనావాసంగా ఉంది. ఈ నల్లమల అడవుల్లో ప్రకృతికీ, మానవునికీ మధ్య అనుబంధం వేల ఏళ్ళుగా కొనసాగుతోంది.

చూసినా కనుచూపు మేరవరకూ పత్రహరిత మహార్ణవంలా ఉన్న దూరదిగంత పరివ్యాప్తమైన ఆ అడవులు, ఆ నీలి పర్వత శిఖరశ్రేణి, ఆ మధ్య నీలవేణీ నదీ పరీవాహక రేఖ, గుండెల నిండా ఆస్వాదించుకున్న మధురానుభూతి లాంటి జలాశయం, ఆకాశ పత్రం మీంచి జారుతున్న సంధ్యా సూర్యబింబం. ఇటువంటి మహిమాన్వితమైన సుందర దృశ్యం చూసి పరవశించనివారు ఎవరుంటారు!

"ఆదిశంకరులు ఇటువంటి ఒక సంధ్యా సమయంలోనే శ్రీశైల దర్శనం పొందారు. ఆయన పారవశ్యం ఎటువంటి శివానందలహరిగా మారిందో తెలుసునా, సుచీ. ఈ ఒక్క శ్లోకం విను...

సంధ్యారంభ విజృంభిత శ్రుతి శిరః స్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితమ్
భోగీంద్రాభరణం సమస్త సుమనః పూజ్యం గుణావిష్కృతమ్
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్."

నేను శ్లోకం పూర్తి చేస్తుండగానే "సంధ్యారంభ విజృంభితం అన్నమాట ఎంత బావుంది. నిజంగానే ఈ సంధ్యారంభవేళ నాలో ఏదో వెలవేగుతున్నట్లే ఉంది" అంది సుచరిత. ఆమె నల్లని కన్నుల్లో ఒక వింత వెలుగు. ఆమె ముంగురుల పైన సంధ్యా సూర్యకిరణాలు పొడుగ్గా వాలి తామ్ర శోభతో మెరుస్తున్నాయి.

ఆకాశపు అంచుమీంచి అవనతమవుతున్న కోటి సూర్యబింబం క్షణక్షణం వింత వింత రంగులు మారుతోంది. 'అల్పమైన దానిలో సుఖం లేదు. భూమి అంతా ఆవరించి ఉన్నదేదో అదే సుఖమయం' అని ఉపనిషత్ చెప్పిన దానికి దృష్టాంతంగా నలుదిక్కులా దేవతలు రాసిన రాతలాంటి పర్వతాల వరుస. ఆపైన ఆవరించి దూరంగా జరుగుతున్న సాయం సంధ్యారశ్మి. ఆకాశంలో అప్పుడే ఉదయిస్తున్న ఫాల్గుణ పూర్ణిమ జాబిల్లి-ఒక మహా శివస్వరూపాన్ని కళ్ళముందు చిత్రిస్తున్నాయి



శిఖరం దగ్గర మైక్రోవేవ్ రిపీటర్ స్టేషన్ ఫెన్స్ పక్కన ఒక్క ఆకు కూడా లేని తెల్లని కాండం ఉన్న చెట్టుని చూపించి అదేమిటని అడిగింది సుచి. "దాన్ని తపసి చెట్టు అంటారు. కోవెల చెట్టు అని కూడా అంటారు. దాన్నుంచి వచ్చే జిగురును గిరిజన కార్పొరేషన్ కొనుగోలు చేస్తుంది. ఏటా దాదాపు అరవై లక్షల రూపాయల విలువైన జిగురు చెంచువాళ్ళు సేకరిస్తారు. అత్యంత పురాతనమైన ఆ తెగకి ఇంకా ప్రధాన జీవనాధారం ఇదే" అన్నాను. సుచి ఆ చెట్టుని తాకి చూసింది. "ఓ వండర్‌ఫుల్. ఈ చెట్టు పక్కన ఈ రిపీటర్ స్టేషన్. పాత కొత్తల మేలు కలయికగా లేదూ" అంది. ఆమెకి ఏది అనుభవమవ్వాలని ఈ యాత్రని సంకల్పించానో ఆ అనుభూతి ఆమెకి ఇంత తొందరగానే అందడం నన్ను చకితుణ్ణి చేసింది.

శిఖరేశ్వరం నుండి సంధ్యా హారతిని అందుకోవాలని మిత్ర బృందం మమ్మల్ని శ్రీశైల దేవాలయానికి పరుగులు పెట్టించారు. కారు అంగళ్ళ మధ్య మలుపు తిరిగేటప్పటికి పబ్లిక్ ఎడ్రస్ సిస్టమ్‌లో మంగళవాద్యాలు వినిపిస్తున్నాయి. మేం ఆత్రతతో పరుగు పరుగున శివాలయంలో అడుగుపెడుతుంటే, "మనం సాయంకాలం స్నానం చెయ్యలేదు కదా. గుళ్ళోకి ఇట్లా వెళ్ళిపోవడమేనా" అంది సుచి. "ఇదే, ఈ స్వామి విశిష్టత. నువ్వు నరానరి దుమ్ముకొట్టుకొన్న నీ పాదాల్తోనే, నీ మార్గాయాసంతోనే నేరుగా ఆయన్ని పలకరించవచ్చు. దీన్నే ధూళి దర్శనమంటారు. తన దర్శనం కోసం ఎన్నో మైళ్ళు అడవుల్లో, కొండల్లో పడివచ్చిందే నిజమైన శ్రద్ధ. ఇక ప్రత్యేక నియమబంధాలెందుకనే స్వామి ఆయన" అన్నాను. 'దెన్ హి ఈజ్ ట్రూలీ ఏ పీపుల్స్ గాడ్' అంది సుచి.

సాయం సంధ్య వేళ మంగళ వాద్యాల నడుమ ఆ గర్భాలయంలో ఒకటి, అయిదు, తొమ్మిది, పదకొండు, ఇరవై ఏడు వత్తులతో ఒకదాని వెనుక ఒకటి హారతులిస్తుండగా అది చూడడమే కన్నుల పండుగ. హారతి అయిన వెంటనే శివలింగాన్ని నుదుటితో తాకి నమస్కరించి, అమ్మవారి గుడిలో హారతికి అందుకున్నాం. హారతి అయిన వెంటనే అమ్మవారి కొలువు ప్రారంభమైంది. అక్కడకు వారు మొదట నాలుగు వేదాల నుండి, ఆ పైన ఉపనిషత్తులు, పాణిని, కావ్యాలు, అలంకారశాస్త్రాల నుండి శ్లోకాలు వినిపించారు. ప్రతి ఉచ్చాటనకి మధ్య పరాకులు చెప్పారు. చివరగా పంచాంగం తీసుకొని తిథి వార నక్షత్రాలు చెప్పారు. అప్పుడు అపూర్వ గాత్ర మాధుర్యం తొణికిసలాడుతున్న ఒక భక్తురాలు భ్రమరాంబికాష్టకమ్ గానం చేసింది. మరెవరో శ్యామశాస్త్రి కీర్తన "హిమగిరి తనయే హేమలతే" ఆలపించారు. అప్పుడు అర్చకులు మరొక్కసారి హారతిచ్చి మంత్రపుష్పం వినిపించారు. దర్శనాలు మొదలైనాయి.

శిఖరేశ్వరంలో సంధ్యారంభవేళ ప్రారంభమైన ఒక సూక్ష్మలోక జాగృతి అమ్మవారి దర్శనంతో పరిపూర్ణంగా వికసించినట్లనిపించింది. అప్పుడు గుడి ప్రాంగణంలో నడుస్తూ దేవాలయం గురించి చెప్పడం మొదలుపెట్టాను సుచరితకి.

"అనాది నుండీ ఈ శ్రీపర్వత - శ్రీశైల సముదాయ పర్వతశ్రేణి తూర్పు



పశ్చిమాలకు, ఉత్తర దక్షిణాలకు నడుమ ఒక సంస్కృతీసేతువుగా ఉంటూ వచ్చింది. ఇప్పుడు నాగార్జున కొండగా ఉంటున్న శ్రీ పర్వతం ఇక్ష్వాకుల నుండి విష్ణుకుండినుల దాకా ఒక బలమైన సాంస్కృతిక కేంద్రం. అప్పుడు కూడా శ్రీశైలం ఒక ఆరాధనా కేంద్రంగా ఉండి ఉండవచ్చు. ఎమంటే, పాత రాతియుగపు మానవ సామాజిక అవశేషాలు ఎన్నో ఇక్కడ బయటపడ్డాయి. అసలు శ్రీశైలమంతా నీటి బుగ్గలమయం. ఇక్కడ ఆది ప్రతిష్ఠ అమ్మవారిదో లేక స్వామివారిదో చెప్పలేం. అసలు అమ్మవారు ఆదిమానవుడి అమ్మతల్లి రూపమే అయివుండవచ్చు. లేదా స్వామి ఆదిమ ద్రావిడ ఆరాధనా రూపమైన పశుపతి కావచ్చు. కానీ, ఒక శివశక్తి సమ్మిలిత కేంద్రంగా ఇది క్రీస్తుశకం ఆరేడు శతాబ్దాల నుంచే ప్రాచుర్యంలోకి వచ్చింది. శ్రీపర్వతం కేంద్రంగా వర్ధిల్లిన సంస్కృతి ఉత్తరానికి, తూర్పునా వ్యాపిస్తే, శ్రీశైల సందేశం దక్షిణానికీ, పశ్చిమానికీ ప్రసరించింది. మొదట చోళ చాళుక్యుల మధ్య శ్రీశైలం కోసం మొదలైన పోరు ఆ తరువాత వెలనాటి దుర్జయులు, కాకతీయులు, రెడ్డి రాజుల ఆదరణలో బలపడి విజయనగర రాజుల కాలంలో గొప్ప వైభవాన్ని చూసింది. శ్రీకృష్ణదేవరాయల ప్రత్యేక ఆదరణకి ఎంత నోచుకుందంటే, ఆయన ఆలయ ప్రాంగణంలో తననీ, తన దేవేరుల్నీ చిత్రీకరించుకున్నాడు. శివభక్తుల పాదస్పర్శ తాడనానికి ఆ చిత్రరూపు నోచుకున్నంతకాలం తమకే శివసాయుజ్యమనే ఆయన ఆకాంక్షించేడు."

నా మాటలకు అడ్డువస్తూ అడిగింది సుచి. "ఈ ఆలయ ప్రాకారం కూడా ఆయన కట్టించిందేనా?"

కాదు. ఆయన ఆలయానికి ముఖద్వార గోపురాన్ని నిర్మించాడు. దక్షిణ ప్రాకారగోపురం హరిహరరాయల పేరుమీద, ఉత్తర గోపురం శివాజీ పేరుమీద నిర్మించబడ్డాయి. కానీ, ఈ ప్రాకారాన్ని నిర్మించింది ఆయన కాలంలోనే శాంతయ్య అనే స్థానాధిపతి. ఎటు చూసినా దాదాపు [illegible] వందల అడుగుల పొడవు, వెడల్పులతో, ఇరవై అడుగుల [illegible] శిల్పాలతో దర్శనీయమైన కోటగోడని తలపించేదే. దాన్తో ఈ ప్రాకారం ఈ దేవాలయానికి ఒక విశిష్ట అలంకారం."

[illegible] దేవాలయ ముఖమండపాన్ని, [illegible] చూసి, ఆ ముఖమండపం పక్క వీరశిరోమండపం ఎదురుగా రాగానే నా ఒళ్ళు [illegible]. "దీన్ని వీరశిరోమండపం అంటారు. శివభక్తులు తమ శ్రద్ధాభక్తులతో తమ కళ్ళని, చేతుల్ని, శరీరాంగాల్ని, చివరికి తమ శిరస్సుల్ని శివుడి కోసం అర్పించిన మండపం."

ఆలయం నుండి బయటకు వచ్చేటప్పటికి బాగా చీకటి పడింది. తిరిగి గెస్ట్ హౌస్‌కి వెళ్ళబోతుండగా, "ఇక్కడకు వచ్చే యాత్రికులందరికీ వసతి సౌకర్యాలు ఎట్లాగా" అని అడిగింది సుచి. అప్పుడు దేవస్థానంవారు, వివిధ కులాలవారు నిర్వహిస్తున్న కాటేజీల గురించి, సత్రాల గురించీ వివరించాను. ఏదైనా ఒక సత్రం ఎలా ఉంటుందో చూపించమంటే శతాబ్ది ఉత్సవాలు జరుపుకున్న కరివేన సత్రానికి తీసుకువెళ్ళాను.

పెద్దెరువు మజిలీలో శివభక్తులకు శివరాత్రి రోజుల్లో అన్న సంతర్పణగా 1899లో మొదలైన కార్యక్రమం నేడు ఒక సత్రంగా శివరాత్రి రోజుల్లో రోజుకు ఆరు వేలమందికి అన్నదానం చేసే కేంద్రంగా రూపుదిద్దుకుంది. ఈ సత్రం ఇటువంటి కృషి చెయ్యడం వెనుక ఎంతో సేవచేసిన అన్నమంజు వెంకట సుబ్బారావుగారిని ఇంటర్నేషనల్ బయోగ్రాఫికల్ సెంటర్, కేంబ్రిడ్జి 1998లో ఇంటర్నేషనల్ హూ ఈజ్ హూ ఆఫ్ ఇంటలెక్చువల్స్‌లో గుర్తించింది. ఇంకా సత్రం గురించిన ఎన్నో విషయాలు మేనేజరు నరసింహాశర్మ గారి ద్వారా విన్నాం. సత్రంలోని వేద పాఠశాలలో చదువుకుంటున్న విద్యార్థులు అప్పుడే సాయంకాలం అధ్యయనం ముగించారు. వారితోపాటు రాత్రి భోజనం చెయ్యవలసిందిగా మేనేజరుగారి అభ్యర్థన. మేం వచ్చేటప్పుడు సత్రంవారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం నాలుగు వాల్యూముల సెట్ వారు మాకు బహూకరించారు.

బయట రాముని పున్నమి. లోకపాపాన్ని ప్రక్షాళనం చేస్తున్నట్టుగా వెన్నెల. దేవస్థానమంతటా శివరాత్రి ఉత్సవం ముగిసిన ఆనవాళ్ళు. ఉగాది కోసం ఎదురుకోలు. కర్నాటక నుంచి భక్తుల సందడి అప్పుడే మొదలైంది. అక్కడొక పూసలమ్మేవాడితో సుచి మాటల్లో పడింది. తిరుపతికి చెందిన ఆ పూసలాయన పండుగ కోసం ఇక్కడికి వచ్చాడట. అతని ఎదుట పరచి ఉన్న రుద్రాక్షల గురించి ప్రశ్నించబోతే తన సంచిలో గుడ్డల మడతల్లోంచి ఒక ఇంగ్లీషు పుస్తకం తీసి చూపించాడు. పద్మభూషణ్ డాక్టర్ ఆర్.కె. శర్మ అనే ఆయుర్వేద వైద్యుడు రాసిన 'ది ఐ ఆఫ్ రుద్ర' అన్న పుస్తకం అది! రోడ్డు మీద పూసలమ్ముకునే వాడి

పురాతన విశ్వాసాలు: శిఖర దర్శనం (ఎగువ) చేస్తే పునర్జన్మ ఉండదని ప్రగాఢ విశ్వాసం; చెంచు సద్భక్తుని పూజాదికాలు (పక్క పేజీలో). అనాది నుంచీ వస్తున్న ఆచారాలు, నమ్మకాలకు శ్రీశైలం నిలయంగా వర్ధిల్లుతోంది. ఆధునికత ఆవరించిన ఈ రోజుల్లో సైతం గిరిజనుల, నాగరికుల భక్తిశ్రద్ధల్లో మార్పు లేదు.



పశ్చిమాలకు, ఉత్తర దక్షిణాలకు నడుమ ఒక సంస్కృతీసేతువుగా ఉంటూ వచ్చింది. ఇప్పుడు నాగార్జున కొండగా ఉంటున్న శ్రీ పర్వతం ఇక్ష్వాకుల నుండి విష్ణుకుండినుల దాకా ఒక బలమైన సాంస్కృతిక కేంద్రం. అప్పుడు కూడా శ్రీశైలం ఒక ఆరాధనా కేంద్రంగా ఉండి ఉండవచ్చు. ఏమంటే, పాత రాతియుగపు మానవ సామాజిక అవశేషాలు ఎన్నో ఇక్కడ బయటపడ్డాయి. అసలు శ్రీశైలమంతా నీటి బుగ్గలమయం. ఇక్కడ ఆది ప్రతిష్ఠ అమ్మవారిదో లేక స్వామివారిదో చెప్పలేం. అసలు అమ్మవారు ఆదిమానవుడి అమ్మతల్లి రూపమే అయివుండవచ్చు. లేదా స్వామి ఆదిమ ద్రావిడ ఆరాధనా రూపమైన పశుపతి కావచ్చు. కానీ, ఒక శివశక్తి సమ్మిలన కేంద్రంగా ఇది క్రీస్తుశకం ఆరేడు శతాబ్దాల నుంచే ప్రాచుర్యంలోకి వచ్చింది. శ్రీపర్వతం కేంద్రంగా వర్ధిల్లిన సంస్కృతి ఉత్తరానికి, తూర్పుకూ వ్యాపిస్తే, శ్రీశైల సందేశం దక్షిణానికీ, పశ్చిమానికీ ప్రసరించింది. మొదట చోళ చాళుక్యుల మధ్య శ్రీశైలం కోసం మొదలైన పోరు ఆ తరువాత వెలనాటి దుర్జయుల, కాకతీయుల, రెడ్డి రాజుల ఆదరణలో బలపడి విజయనగర రాజుల కాలంలో గొప్ప వైభవాన్ని చూసింది. శ్రీకృష్ణదేవరాయల ప్రత్యేక ఆదరణకి ఎంత నోచుకుందంటే, ఆయన ఆలయ ప్రాంగణంలో తననీ, తన దేవేరుల్నీ చిత్రీకరించుకున్నాడు. శివభక్తుల పాదస్పర్శ తాడనానికి ఆ చిత్తరువు నోచుకున్నంతకాలం తమకి శివసాయుజ్యమనే ఆయన ఆకాంక్షించేడు."

నా మాటలకు అడ్డువస్తూ అడిగింది సుచి. "ఈ ఆలయ ప్రాకారం కూడా ఆయన కట్టించిందేనా?"

"కాదు. ఆయన ఆలయానికి ముఖద్వార గోపురాన్ని నిర్మించాడు. దక్షిణ ప్రాకారగోపురం హరిహరరాయలు పేరుమీద, ఉత్తర గోపురం శివాజీ పేరుమీద నిర్మించబడ్డాయి. కానీ, ఈ ప్రాకారాన్ని నిర్మించింది ఆయన కాలంలోనే శాంతయ్య అనే స్థానాధిపతి. ఎటు చూసినా దాదాపు అయిదారు వందల అడుగుల పొడవు, వెడల్పులతో, ఇరవై అడుగులు మించి ఎత్తుతో నిండుగా వివిధ శిల్పాలతో దుర్భేద్యమైన కోటగోడని తలపింపచేసే దార్ఢ్యంతో ఈ ప్రాకారం ఈ దేవాలయానికి ఒక విశిష్ట అలంకారం."

అక్కణ్ణుంచి ముందుకు తీసుకువచ్చి దేవాలయ ముఖమండపాన్నీ, మధ్యలో శనగల బసవన్ననీ చూపించి, ఆ ముందుకు వచ్చి వీరశిరోమండపం ఎదుటకు రాగానే నా ఒళ్ళు జలదరించింది. "దీన్ని వీరశిరోమండపం అంటారు. శివభక్తులు తమ శ్రద్ధాతిశయంలో తమ కళ్ళనీ, చేతుల్నీ, శరీరాంగాల్నీ, చివరికి తమ శిరసుల్నీ శివుడి కొరకు అర్పించిన మండపం.

ఆలయం నుండి బయటకు వచ్చేటప్పటికి బాగా చీకటి పడింది. తిరిగి గెస్ట్

**పురాతన విశ్వాసాలు:** శిఖర దర్శనం (ఎగువ) చేస్తే పునర్జన్మ ఉండదని ప్రగాఢ విశ్వాసం; చెంచు సద్భక్తుని పూజాదికాలు (పక్క పేజీలో). అనాది నుంచీ వస్తున్న ఆచారాలు, నమ్మకాలకు శ్రీశైలం నిలయంగా వర్ధిల్లుతోంది. ఆధునికత ఆవరించిన ఈ రోజుల్లో సైతం గిరిజనుల, నాగరికుల భక్తిశ్రద్ధల్లో మార్పు లేదు.

హౌస్‌కి వెళ్ళబోతుండగా, "ఇక్కడకు వచ్చే యాత్రికులందరికీ వసతి సౌకర్యాలు ఎట్లాగా" అని అడిగింది సుచి. అప్పుడు దేవస్థానంవారు, వివిధ కులాలవారు నిర్వహిస్తున్న కాటేజీల గురించి, సత్రాల గురించీ వివరించాను. ఏదైనా ఒక సత్రం ఎలా ఉంటుందో చూపించమంటే శతాబ్ది ఉత్సవాలు జరుపుకున్న కరివేన సత్రానికి తీసుకువెళ్ళాను.

పెచ్చెరువు మజలీలో శివభక్తులకు శివరాత్రి రోజుల్లో అన్న సంతర్పణగా 1899లో మొదలైన కార్యక్రమం నేడు ఒక సత్రంగా శివరాత్రి రోజుల్లో రోజుకు ఆరు వేలమందికి అన్నదానం చేసే కేంద్రంగా రూపుదిద్దుకుంది. ఈ సత్రం ఇటువంటి కృషి చెయ్యడం వెనుక ఎంతో సేవచేసిన అన్నమంజు వెంకట సుబ్బారావుగారిని ఇంటర్నేషనల్ బయోగ్రాఫికల్ సెంటర్, కేంబ్రిడ్జి 1998లో ఇంటర్నేషనల్ హూ ఈజ్ హూ ఆఫ్ ఇంటలెక్చువల్స్‌లో గుర్తించింది. ఇంకా సత్రం గురించిన ఎన్నో విషయాలు మేనేజరు నరసింహాశర్మ గారి ద్వారా విన్నాం. సత్రంలోని వేద పాఠశాలలో చదువుకుంటున్న విద్యార్థులు అప్పుడే సాయంకాలం అధ్యయనం ముగించారు. వారితోపాటు రాత్రి భోజనం చెయ్యవలసిందిగా మేనేజరుగారి అభ్యర్థన. మేం వచ్చేటప్పుడు సత్రంవారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం నాలుగు వాల్యూముల సెట్ వారు మాకు బహూకరించారు.

బయట కాముని పున్నమి. లోక పాపాన్ని ప్రక్షాళనం చేస్తున్నట్లుగా వెన్నెల. దేవస్థానమంతటా శివరాత్రి ఉత్సవం ముగిసిన ఆనవాళ్ళు. ఉగాది కోసం ఎదురుకోలు. కర్నాటక నుంచి భక్తుల సందడి అప్పుడే మొదలైంది. అక్కడొక పూసలమ్మేవాడితో సుచి మాటల్లో పడింది. తిరుపతికి చెందిన ఆ పూసలాయన పండుగ కోసం ఇక్కడికి వచ్చాడట. అతని ఎదుట పరచి ఉన్న రుద్రాక్షల గురించి ప్రశ్నించబోతే తన సంచీలో గుడ్డల మడతల్లోంచి ఒక ఇంగ్లీషు పుస్తకం తీసి చూపించాడు. పద్మభూషణ్ డాక్టర్ ఆర్.కె. శర్మ అనే ఆయుర్వేద వైద్యుడు రాసిన 'ది ఐ ఆఫ్ రుద్ర' అన్న పుస్తకం అది! రోడ్డు మీద పూసలమ్ముకునే వాడి

తిరిగి మేం శ్రీశైలం వీధుల్లోకి నడిచాం. 'ఎంతెంత వరున దానేతెంచి విడియ అంతంత ఆయతంబై యుండు పురము' అని కవి స్మరించినట్లే శివభక్తులు నడయాడిన ఆ వీధుల్లో దుకాణాల్ని చూస్తూ ముందుకు నడిచాం. ఒక అంగడి ముందు నిలబడి సుచి ఒక ఆయన్ని ఇంటర్వ్యూ చేసింది. అక్కడ అంగళ్ళన్నింటిలోనూ పెద్ద అంగడి ఆయనదేనట. నెలకి ఎనిమిదివేలు అద్దె చెల్లిస్తున్న ఆ అంగడిలో ఎక్కువగా అమ్ముడుపోయేవి ఏవని అడిగితే దీపంప్రమిదలని చెప్పాడాయన.

క్షేత్రపాలకుడు బయలు వీరభద్రస్వామిని దర్శించుకొని పక్కనే ఉన్న మేకల బండ చెంచుగూడేనికి వెళ్ళాం. అక్కడ ప్రతి ఇల్లూ ఒక శివరాత్రి మందిరంలా ఉంది. "చెంచు సద్భక్తుల"ని ఏడు శతాబ్దుల కిందట కీర్తించినట్లే ఉన్నారు ఇప్పటికీ అక్కడివారు. గూడెం పెద్ద మనిషి తోకల నాగన్నని కలిశాం. ఆయన పూర్వీకులు వేటగాళ్ళు. ఇప్పుడాయన రైతుగా మారాడు. మా ఎదుటనే విల్లు ఎక్కుపెట్టి శరాన్ని సంధించాడు. అక్కడ చెంచు యువకులు కాంస్య విగ్రహాలు తయారీలో శిక్షణ పొందుతున్నారు. వారికి శిక్షణ ఇస్తున్న కళాకారుడు ఆదిలాబాద్ జిల్లాలోని ప్రఖ్యాత శిల్పి రవీంద్ర కుమార్ శర్మ శిష్యుడని తెలిసినప్పుడు కళాబాంధవ్యానికి సరిహద్దులు లేవనిపించింది.

శ్రీశైలం వదిలిపెట్టి ముందుకు వెళ్ళవలసిన సమయం వచ్చింది. నిజానికి ఆమెను పాతాళగంగకు తీసుకువెళ్ళి ఉండవలసింది. 'సాలోక్య సామీప్య సారూప్య ముక్తులొలిసేజాల మహోర్మిదోర్గలిక' అయిన ఆ గంగలో స్నానం చేసి, రెడ్డి రాజులు కట్టించిన సోపాన మార్గమ్మీదుగా శివధ్యానరతగా దేవాలయం ప్రవేశం చేసి ఉంటే ఆ అనుభూతి శివతత్వమయి ఉండేది కదా అనుకున్నాను.

తొమ్మిది పది గంటలవేళ చిగుర్లు మొలుస్తున్న అడవి లోంచి నవజీవిత సౌరభాలు అల్లుకుంటున్నాయి. సాక్షిగణపతి గుడి దగ్గర ఆయన చిట్టాల్లో మా పేరు కూడా నమోదు చేయించుకొని హాటకేశ్వరం, పాలధార-పంచధారల్ని చూశాం. హాటకేశ్వరం అనాది తపోవనం. అక్కడ అడుగుపెట్టిన తరువాత చిత్తవృత్తిలో వైరాగ్యం క్షణకాలమయినా ఉదయించని మానవుడుండడు. కంచి పరమాచార్యుల వారి జీవితంలోని ఒక సంఘటనని నీలంరాజు మురళీధర్ ఎక్కడో ప్రస్తావించింది సుచికి చెప్పాను. పరమాచార్య హాటకేశ్వరం చూడగానే ఆది శంకరుల తపః స్థలాన్ని గుర్తించి ఒక తెల్లవారుజామున తన శిష్యుల్ని, మఠాన్ని వదిలిపెట్టి అక్కడికి వెళ్ళిపోయారు. అక్కడే ఉండిపోవాలని పట్టుపట్టారు. హాటకేశ్వరం నేలపైన మన అంతఃగ్రంథులేవో విడిపోయే బలమయిన ఆకర్షణ శక్తి ఏదో ఉందనిపిస్తుంది.

తిరిగి సుండిపెంటకి చేరుకున్నాం. బ్రేక్‌ఫాస్ట్ అయిన తర్వాత రాజీవ్ గాంధీ నాగార్జునసాగర్- శ్రీశైలం టైగర్ రిజర్వ్ గురించి తెలుసుకోవడానికి ప్రాజెక్ట్ ఆఫీసుకి వెళ్ళాం. అక్కడ ఎన్విరాన్‌మెంట్ ఎడ్యుకేషన్ సెంటర్‌లో అందమయిన ప్రకృతి దృశ్యాల ఫోటోల్ని, సంక్షిప్త పరిచయాన్ని చదువుతుంటే అక్కడ సిబ్బంది ఎవరో మమ్మల్ని తులసీరావుగారికి పరిచయం చేశారు. ఆయన ప్రాజెక్ట్‌లో బయోడైవర్సిటీ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా ఉన్నారు. బయట లాన్‌లో చెట్లనీడల్లో కుర్చీలు వేయించారు. ఎదురుగా లేళ్ళు, దుప్పులు వచ్చి మేస్తున్నాయి. రోడ్డు పక్క గ్లైరిసీడియా నిండుగా పూసి నేల అంతటా ఊదారంగు పూల రేకులు పరుచుకున్నాయి.

"మీ టైగర్ రిజర్వ్ వివరాలు చెప్పండి" అంది సుచి ఆయన్ని మాటల్లోకి దింపుతూ. ఏదో తన అత్యంత ఆత్మీయమైన విషయం గురించి ప్రస్తావిస్తున్న వాడిలా ఆయన చెంపలు ఎర్రబారుతుండగా నెమ్మదిగా, స్పష్టంగా చెప్పడం మొదలుపెట్టారు. "ఇది వట్టి టైగర్ రిజర్వ్ కాదు. పెద్దపులి ఇక్కడి జీవజాలంలో ఒక అగ్రశ్రేణి ప్రాణి. అది బతకాలంటే దాని దిగువ శ్రేణుల్లో మరెన్నో ప్రాణులు బతకాలి. చెదలు, వానపాములు, నత్తలు, పాములు, పక్షులు, దుప్పులు, గొర్రెలు, జింకలు, చిరుతలు మొదలైన చరజీవాలే కాక, గడ్డి, పొదలు, క్రీపర్స్, టింబర్ ఫారెస్ట్, నాన్‌టింబర్ స్పీషీస్ వంటి వృక్ష సముదాయమే కాక, అడవి పైన ప్రత్యక్షంగా, పరోక్షంగా ఆధారపడ్డ మనుష్య సమాజాల్తో సహా ఇదంతా ఒక జీవ వైవిధ్య సముదాయం. ఇందులో అంతరిస్తున్న, క్షీణిస్తున్న, మంచగిస్తున్న ప్రతి ఒక్క జీవజాతి పట్ల మాకు ఆత్రత ఉంది. బాధ్యత ఉంది. ఈ చరాచర జీవజాలమంతటి మధ్యా జీవిక కోసమైన ఒక నిశ్శబ్ద పరస్పర అవగాహన ఉంది. ఆ అవగాహన పట్ల మాకు ఎరుక ఉంది. దాన్ని మేం గౌరవిస్తాం. ఉసిరి చెట్ల చుట్టూ లేళ్ళ మందలు చేరినప్పుడు కొండముచ్చులు వాటికోసం చెట్ల కొమ్మల్ని ఊపి కాయలు రాలుస్తాయి. అందుకు ప్రతిఫలంగా చిరుతపులులు దాడి చేయకుండా దుప్పుల మందలు వాటిని కాపుకాస్తాయి. ఇందులో పచ్చికబయళ్ళ

**కోరికలు తీర్చే దేవర:** సొంత ఇల్లు సమకూరుతుందనే ఆశతో శిఖరం వద్ద రాళ్ళు పేర్చుతున్న దృశ్యం (దిగువ); ఉమామహేశ్వరం ఆలయం వద్ద హృదయాన్ని పులకింపజేసే ప్రకృతి సౌందర్యం (పక్క పేజీలో). అఖిల చరాచర సృష్టి అంతటా నిండిన పరమాత్మ.





మొదలుకుని, పచ్చికలో రాలి తిరిగి మొలకెత్త వలసిన విత్తనాలు మొదలుకుని నిరంతర జీవక్రమ పరంపర ప్రకృతికి అనుగుణంగా జరిపేటట్లు చూడవలసిన కర్తవ్యం మాది..." ఆయన మాటలు వింటూ ఉంటే 'అకృతాత్ములకు శిలా నికరమైతోచు, సుకృతాత్ములకు లింగనికరమై తోచు' అని శ్రీపర్వత సముదాయం గురించి కవి చెప్పిన మాటలు మళ్ళీ గుర్తొచ్చాయి.

"ఇక్కడి ప్రాజక్టులో మీకు తృప్తిని కలిగించే అంశమేది" అని అడిగాను. ఆయనన్నాడు కదా, "ఈ జీవజాల పరిరక్షణలో ప్రజల్ని భాగస్వాముల్ని చెయ్యడమే నన్నెంతో నిలబెట్టే విజయం."

అక్కడి నుంచి చెంచువారి అభివృద్ధి కోసం కృషిచేస్తున్న సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ కార్యాలయానికి వెళ్ళాం. ఆఫీస్ మేనేజర్ రోసిరెడ్డి మమ్మల్ని ఆదరించి, సంస్థ 1988లో శ్రీశైలంలో ఏర్పడినప్పటి నుంచి చేపట్టిన కృషిని వివరించారు. అక్కడ సంస్థలో కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కో ఆర్డినేటర్‌గా పనిచేస్తున్న మాధవీలత గారు పరిచయమయ్యారు. ఆమె సోషల్ వర్క్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసి గత రెండేళ్ళుగా చెంచు సామాజిక పరివర్తనలో తన వంతు పని తాను చేస్తున్నారు. చెంచువారి గురించి సుచి అడిగిన ప్రతి ప్రశ్నకీ ఆమె ఎంతో ఓపిగ్గా జవాబిచ్చారు.

మేం అక్కడి నుంచి హైడల్ ప్రాజక్ట్‌కి వెళ్ళబోయేముందు పూర్ణానందస్వామి ఆశ్రమం చూసి వెళ్ళాలనుకున్నాం.1939లో మదురైలో జన్మించిన పూర్ణానందస్వామి తన ముప్పై ఏళ్ళ వయసులో కాంతివంతమైన బంగారు వర్చస్సుతో హాటకేశ్వరంలో తపస్సు చేసుకుంటూ శ్రీశైల వాసులకు పరిచయమయ్యారు. పశ్చిమ కనుమల్లో ప్రారంభించిన ఆయన అన్వేషణ హిర్ద్వీ మీదుగా శ్రీశైలంలో పరిపూర్తి పొందింది. ఇప్పుడు సుండిపెంటలో నాలుగు ఎకరాల స్థలంలో ఆయన శిష్యులు స్వామివారి గురుపాదుకలకు ఒక ఆశ్రమాన్ని ఏర్పరిచారు. ఒక ప్రశాంత ధ్యానమందిరం, అందమైన పూల తోట, గోశాల, నిత్యాన్న దానము, ప్రాతఃకాల, సాయంకాల వేళల్లో యాగం, చండీ సప్తశతి పారాయణం అక్కడి విశేషాలు. మాకు ఆశ్రమ వివరాలు స్వామి ముఖ్య శిష్యులూ, ఆశ్రమవాసులందరికీ 'పెదనాన్న'గా వ్యవహరించే బి.ఆర్.కె వివరించారు.

## 4

హైడల్ ప్రాజెక్టుల వైపు వెళుతూ "ఇప్పుడు మనం ఆధునిక దేవాలయాన్ని చూడబోతున్నాం" అన్నాను సుచితో. అప్పుడు సుచి మాట్లాడిన మాటలు నన్నాశ్చర్యపరిచాయి. ఆమె అంది కదా, "అదేమి, మనం చూసిన బయో డైవర్సిటీ ప్రాజెక్ట్, చెంచు ప్రాజెక్ట్ కూడా ఆధునిక దేవాలయాలే అనిపించాయి నాకు. ఐ.టి.డి.ఏలో ఉన్న కంప్యూటర్ ఆటోమేషన్, వి-శాట్, వైర్‌లెస్, ఆధునిక సామాజిక జాగృతి ప్రయత్నాలు నన్ను అమెరికా గురించి సిగ్గుపడేటట్లు చేశాయి. మేముంటున్న పెన్సిల్వేనియా రాష్ట్రం అమెరికాలోని పురోగామి రాష్ట్రాలలో ఒకటి. కానీ, మా ప్రొఫెసర్ కోలింగ్‌వుడ్ చెప్తూ ఉంటాడెప్పుడూ- పెన్సిల్వేనియా పునాదులన్నీ అపలేచియన్ ఇండియన్ తెగల ఎముకలపైన నిర్మించినవేనని. నువ్వు ఒక కవి ఏడు శతాబ్దాల కిందట చెంచు సద్భక్తుల గురించి రాశావన్నావు. ఇప్పుడు వారిని ఆధునిక వ్యవసాయంలోకి మళ్ళించడానికి పెద్ద కార్యక్రమమే జరుగుతోంది. ఇది ఇండియా లాంటి డెమోక్రసీలో మాత్రమే సాధ్యం. అమెరికా కూడా డెమోక్రసీనే. కానీ, ఆ సందర్భం వేరు. రెండు శతాబ్దాలు తిరగకుండానే సభ్య అమెరికా తన ఆదిమజాతుల్ని వేటాడి, బంధించి, బానిసలుగా అమ్మేసింది. అపలేచియన్ వీరభూమిలో, ఆ లోయల్లో ఎక్కడ చూసినా రక్తపుచారికలు. కానీ, ఈ నల్లమల అడవుల్లో ఎక్కడ చూసినా శివసాన్నిధ్య ప్రకంపనాలే." సుచి మాటలకు నా ఒళ్ళు పులకరించింది. మెచ్చుకోలుగా ఆమెకి ఒక హేర్ హండిచ్చాను.

ఇదిగో, ఈ శ్రీశైలం రిజర్వాయర్ 308 శతకోటి ఘనపుటడుగుల నీటిని నిల్వ చేయగల జలాశయం. ప్రధానంగా ఇది జల విద్యుత్కేంద్రం. ఇక్కడ ఒక్కొక్కటి నూట పది మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి చేయగల ఏడు జనరేటర్లు ఉన్నాయి. నీటిని నిలువరించడానికి 470 అడుగుల ఎత్తున 1,680 అడుగుల పొడవున మేసనరీ కాంక్రీట్ ఆనకట్ట కట్టారు" ఎన్నోసార్లు ఎందరికో వివరించి ఈ అంకెలు నా నోటికి కంఠతా వచ్చేశాయి. కానీ, ఆ ఆనకట్టనీ, జలాశయాన్నీ మొదటిసారి కళ్ళతో చూసినప్పుడు కలిగే ఆ సంభ్రమం ముందు ఈ అంకెలు అదనంగా చెప్పేదేమీ ఉండదు. మా వెనుక నిశ్చలంగా ఉన్న డ్యామ్‌ని చూపిస్తూ అన్నాను: "ఇదే కనుక సెప్టెంబర్ నెలలో అయివుంటే, ఒక్కొక్కటీ అరవై అయిదు అడుగుల పొడవు, యాభై అయిదు అడుగుల వెడల్పు ఉండే పన్నెండు క్రెస్ట్ గేట్ల నుంచి పదమూడు లక్షల క్యూసెక్కుల మహా జలపాతం నిర్విరామంగా దూకుతుంటే మన వెనుక అంతటా ఆకాశమంతా ఆవరించిన నీటి ఆవిరి తప్ప మరేమీ కనిపించి ఉండేది కాదు."

"ఐ లవ్ టు కమ్ ఎగైన్" అంది సుచి.

కిందికి దిగి లింగాల గట్టు దగ్గర ఆపాను. "ఇవన్నీ మత్స్యకారుల కుటుంబాలు. వీళ్ళంతా ఆనకట్ట కట్టేటప్పుడు కోస్తా ప్రాంతం నుంచి వలస వచ్చినవారు. ఇప్పుడు ఇక్కడ చేపలు పట్టడంలో ఉండిపోయారు. మేం మాట్లాడుతుండగా గంగపుత్ర మత్స్యకారుల సంఘం కార్యదర్శి మల్లికార్జున నన్ను గుర్తుపట్టి పలకరించాడు. నదికి దిగువ వాలులో దొరికే చేపల మీద ఇక్కడి వందా, యాభై కుటుంబాలు ఎటువంటి విశ్వాసవ్యవస్థని ఏర్పరచుకున్నాయో అతను వివరిం



**కొండకోనల్లో సూరీడు:** ఈ పురాతన పుణ్యభూమికి ఇది ఎన్నవ సహస్రాబ్ది? మారుతున్న ప్రపంచం మధ్య మార్పులేని సత్య సౌందర్యపు చల్లదనం హృదయాలకు హత్తుకొంటుంది. అస్తిత్వ ఒత్తిళ్ళ మధ్య నలిగిపోయే మనోదేహాలకు సాంత్వన ఇచ్చే శ్రీ గిరి శోభ మళ్ళీమళ్ళీ తనవద్దకు రప్పించుకొంటుంది.

చాడు. ప్రతి ఏడాది ఏడో నెలలో తాము గంగతల్లి పండుగ చెయ్యడం, తమలో సజ్జనుడెవరో ఒకతన్ని ముందు పంపి వల వేయించడం చెప్పాడు. ఒకప్పుడు చేపలు బాగానే పడేవని, ఒక్క వేటలోనే నూట ముప్పై కేజీల బరువుండే చేప దొరికిందనీ తలుచుకున్నాడు. ఇప్పుడు జనం ఒత్తిడి ఎక్కువైందనీ, చేపలు తగ్గిపోయాయనీ, పట్టేవాటిపై కూడా అటవీ శాఖ అభ్యంతరం పెడుతుందనీ చెప్పాడు. అతను చెప్తున్నవి వింటుంటే జీవ వైవిధ్య పరిరక్షణ గురించి ఫారెస్ట్ ఆఫీసర్ పడ్డ ఆవేదన మాకు మరింత అర్థమయింది.

ఆ మధ్యాహ్నం నిజంగా మమ్మల్ని కదిలించిన మరొక దర్శనీయ స్థలం లెఫ్ట్ బ్యాంక్ హైడల్ ప్రాజెక్ట్. కుడివైపు ప్రాజెక్ట్ కన్నా రిజర్వాయర్‌కు మరింత దగ్గరలో మరింత దిగువగా జనరేటర్లను ఏర్పరచినట్టయితే ఉత్పత్తి సామర్థ్యం పెంచవచ్చుననీ, నాన్-పీక్ డిమాండ్ వేళల్లో జనరేటర్లను పంపులుగా వాడినట్లయితే అదే నదీ జలాల్ని తిరిగి విద్యుదుత్పత్తి కోసం వాడుకోవచ్చుననే ఆలోచనల మీద నిర్మాణమవుతున్న ప్రాజక్ట్ అది. ఇందుకోసం దాదాపు పద్నాలుగు సొరంగాలు, ఒక పవర్ హౌస్, ఒక ట్రాన్స్‌ఫార్మర్, మూడు సర్జ్ చాంబర్లు అండర్‌గ్రౌండ్‌లో నిర్మాణం చేపట్టారు. ఆ నిర్మాణంలోని డిజైన్‌నీ, ప్లాన్‌నీ పటేల్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ జనరల్ మేనేజర్ ఎం.ఎం. పటేల్ మాకు వివరించారు. దేశంలో సొరంగాలు నిర్మించడంలో సిద్ధహస్తులయిన పటేల్ కంపెనీ నిర్ణీత కాలంలోనే పని పూర్తిచేయగలిగిందనీ, జాతీయ ప్రమాణాల కన్నా తక్కువగానే ప్రమాదాల్ని అదుపు చెయ్యగలిగామనీ ఆయన వివరించ గలిగారు. ఆ తరువాత జనరేషన్ కార్పొరేషన్ అసిస్టెంట్ ఇంజనీర్లు జయరామిరెడ్డి, ప్రసాద్ మమ్మల్ని లోపలికి తీసుకువెళ్ళి వర్క్ సైట్ చూపించారు. "ఇది జీవిత కాలంలో ఒక్కసారి లభించే వర్క్ ఎక్స్‌పీరియన్స్. ఎనభై మీటర్ల పొడుగుతో, ఇరవై మీటర్ల వెడల్పుతో ఈ అండర్ గ్రౌండ్‌లో మేం నిర్మించిన సర్జ్ చాంబర్ లాంటిది ప్రపంచంలోనే మరెక్కడా లేదు" అన్నారు జయరామిరెడ్డి.

ఆ తర్వాత మేం సొరంగాల నిర్మాణాన్ని సబ్-కాంట్రాక్ట్‌గా చేపట్టిన వేమారెడ్డిని కలిసినప్పుడు, "ఈ సొరంగాల నిర్మాణంలో టెక్నాలజీది పెద్ద పాత్ర కాదు. అనుభవం ఇచ్చే గైడెన్స్ కూడా కొంతవరకే. ప్రముఖ పాత్ర వహించేదంతా దైవానుగ్రహమే. కనీసం రెండుమూడుసార్లు మేం ఫాటల్ యాక్సిడెంట్ల నుంచి తృటిలో బయటపడ్డాం" అన్నారు.

## 5

తిరిగి హైదరాబాద్ వైపు. ఎడమ వైపు గట్టుమీద కొద్ది క్షణాలు ఆగేం. ఏ స్మృతికందని పూర్వ యుగాల్లోనో వికసించిన మద్దిపూల మధ్య ఏ తుమ్మెద ఝంకారమో ఇక్కడ ఈ స్వామినీ, ఈ శక్తినీ ప్రతిష్ఠించింది. ఆహారం కోసం వింటి నారిని లాగిన చెంచు వేటగాడూ, ఆదిశంకరులూ, మల్లికార్జున పండితుడూ, పాల్కురికి సోమనాథుడూ, వీరశిరోమంటపంలో తలలు నరికి పోగులు పోస్తున్న భక్తుల్ని చూసి చలించిన అనవేమారెడ్డీ, గౌరనా, శ్రీనాథుడూ, శ్రీకృష్ణదేవరాయలూ, శివాజీ, కర్నల్ మెకంజీ, ఏనుగుల వీరాస్వామయ్యా, హైతుండర్ఫ్, నిడదవోలు వెంకట్రావూ, పరబ్రహ్మశాస్త్రీ మొదలైన భావుక పరంపర ఇక్కడ ఏ శక్తి విజృంభణాన్ని చూసి విభ్రములయ్యారో ఆ శక్తి ప్రజ్వలనంలోని ఏ శతాంశాన్నో మెగావాట్లుగా మార్చడానికి తీరానికి అటూ ఇటూ ఇప్పుడు హైడల్ ప్రాజెక్టులు ఏర్పాటయ్యాయి. ఆ విధంగానూ ఇది శక్తిపీఠమే అయింది.

ఈ మహిమాన్విత భూమి యుగాలుగా చెప్తున్న ఏ రహస్య సందేశాన్నో పసిగట్టడానికి ప్రయత్నించినవే, సకల జీవ జాలంలోనే శివ స్వరూపాన్ని చూడాలన్న సంకల్పమే కదా బయోడైవర్సిటీ సంరక్షణగా, పర్యావరణ పరిరక్షణగా రూపు దిద్దుకుంది. పూర్ణానందస్వామి ఆశ్రమంలాగా శ్రీశైలం ఒక నిశ్శబ్ద ఉద్యమం.

నా అమెరికన్ బాలిక కళ్ళల్లో ఒక బెంగ, ఒక వెలుగు. ఇప్పుడామె పెన్సిల్వేనియాకు ఒక నూతన సందేశాన్ని తీసుకుపోగలుగుతోంది. ఏ వెబ్‌సైట్ ద్వారా కమ్యూనికేట్ చెయ్యలేని ఒక అనుతాపతరంగం నవ సహస్రాబ్ది కోసం ఆమెలో ఎగిరిపడుతోంది. ఆధునిక ప్రపంచానికి ఇది రెండవ సహస్రాబ్ది అయివుండవచ్చు. కానీ, ఈ పురాతన పుణ్యభూమికి ఇది ఎన్నవ సహస్రాబ్ది? ఇక్కడ అడవిలో సదా ఇప్పపూలు రాలుతూనే ఉంటాయి. మద్దిచెట్ల గుబుర్లలో తుమ్మెద సంగీతం పాడుతునే ఉంటుంది. మారుతున్న ప్రపంచం నడుమ మార్పులేని సత్య సౌందర్యపు చల్లదనం ఇప్పుడామెకు నిండుగా హృదయానికి హత్తుకుంది.

*బహువిధ పరితోష బాష్ప పూర్‌స్ఫుట పులకాంకిత చారు*
*భోగ భూమిమ్ చిరపద ఫల కాంక్షి సేవ్యమానాం*
*పరమ సదాశివ భావనాం ప్రపద్యే*

# సినిమా



అద్వితీయ అభినయంతో వెండితెర జీవితాన్నీ, ప్రగాఢ తాత్త్విక చింతనతో నిజ జీవితాన్నీ ఉన్నతీకరించుకొన్న కళాభినేత్రి

- వాణిశ్రీ: నిండైన నటనకు నిర్వచనం

# నటనకు నిర్వచనం

**ఆత్మవిశ్వాసానికి స్వయంకృషిని జోడించి నటనాజీవితంలో ఉత్తుంగ శిఖరాన్ని అందుకున్న ఈ కళాభినేత్రి, అస్తిత్వ విచికిత్సలో ప్రగాఢమైన లోతులను శోధించి నిజ జీవితంలోనూ క్రమబద్ధతనూ, సార్థకతనూ సాధించారు**

• ఎ.ఎ.వి. ప్రసాద్, ఎస్.వి. సూర్యప్రకాశరావు


దుపు- నవరస నాయిక వాణిశ్రీతో కాస్సేపు సంభాషించగానే మనసుకు తట్టే పదమిది. తన జీవితం తన అదుపులోనే సాగాలన్న ఆకాంక్ష, దాన్ని నెరవేర్చుకోవడం వల్ల కలిగే తృప్తి ఆమె మాటల్లో ధ్వనిస్తాయి. మహానటి సావిత్రి తరువాతి తరంలో తిరిగి అంతటి కళాభినేత్రిగా వాణిశ్రీ చలన చిత్రరంగంలో గుర్తింపు, తెలుగు ప్రేక్షకుల హృదయాల్లో శాశ్వత స్థానం సంపాదించుకున్నారంటే కారణం- అకుంఠిత దీక్ష, నిరంతర కృషికి అసమాన నటనా ప్రతిభ తోడవడమే. *ప్రేమనగర్* చిత్రంలో గీత రచయిత ఆత్రేయ *తేటతేట తెలుగులా/ తెల్లవారి వెలుగులా/ యేరులా సెలయేరులా/ కలకలా గలగలా/ కదలివచ్చింది కన్నె అప్సరా* అని అభివర్ణించిన అచ్చ తెనుగు నాయిక వాణిశ్రీ. సినీ జీవితంలో తానాశించిన శిఖరాన్ని అందుకున్న ఈ అభినేత్రికి తన బలమేమిటో, లోపాలేమిటో స్పష్టంగా తెలుసు. "నేను అప్సరసను కాకపోయినా అంత అందంగానూ వెండితెరపై చూపించిన ఛాయాగ్రాహకులకు సదా కృతజ్ఞురాలిని. నా విజయానికి వారే సగం కారణం" అని వాణిశ్రీ వినమ్రంగా ప్రకటిస్తారు.

మిగతా సగానికి కారణం అసమాన అభినయం, అనుదినం తనపై తనకు అదుపు. "అది ఒక తపస్సు. చక్కని శారీరక సౌష్ఠవం కోసం ఆహారవిహారాల్లో కఠినంగా నియమపాలన చేసేదాన్ని. సాత్వికాహారం తీసుకొమ్మని పెద్దలు చెప్పేవారు. దాన్ని కచ్చితంగా పాటించేవాళ్ళం. ఇంటివద్ద తెల్లవారుజామున 5 గంటల నుంచి 8 గంటల వరకు మేకప్ వేసుకొన్న తర్వాతనే స్టూడియోకు బయలుదేరేదాన్ని. మేకప్ విషయంలో రాజీలేని శ్రద్ధ నాది. షూటింగ్ షెడ్యూల్‌కు చాలా ముందుగానే వచ్చి, దుస్తులు, అలంకరణ వంటి అంశాలకు దాదాపు మూడు గంటల కాలాన్ని వెచ్చించేదానిని. ఇది కొంతమందికి (ఒక హీరోతో సహా) అసహనాన్ని కలిగించినా నాకు తప్పదు. తన హీరోయిన్ అందంగా ఉంటే హీరోకే కదా లాభం. ఇంత శ్రమకు ఓర్చి, చక్కని ఫిగర్‌ను కాపాడుకున్నాను కనుకనే తెలుగులో పదహారేళ్ళపాటు అగ్రనటిగా నిలబడగలిగాను. మరెవరినీ ఆ దరిదాపులకు రానివ్వలేదు" అని వాణిశ్రీ ఆత్మవిశ్వాసం ధ్వనించే స్వరంతో పేర్కొన్నారు.

అదేసమయంలో "అగ్రనటిగా వెలిగానంటే కారణం వాణిశ్రీలో ఇన్నిరకాల పాత్రలను పోషించగల ప్రతిభ ఉన్నదని మేధావులైన రచయితలు, దర్శకులు గుర్తించడమే" అని ప్రకటిస్తారు. అందుకేనేమో *ప్రేమనగర్, సెక్రటరీ* వంటి హిట్ సినిమాలను చూస్తే తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధి చెందిన నవలలలో పాత్రలు ఆమెను దృష్టిలో పెట్టుకునే రూపొందాయా అనిపిస్తుంది. నాటి తెలుగు ప్రేక్షకుల, ముఖ్యంగా అనేకమంది కన్నెపిల్లల మనోభావాలకు, భావుకులైన యువకుల సుందర స్వప్నాలకు ప్రతీకగా నిలిచి, వైవిధ్యభరితమైన పాత్రలను పోషించి, వాచకాభినయాలలో తనదైన శైలిని సొంతం చేసుకున్న కళాభినేత్రి ఆమె. చెలికత్తెగా, చెల్లెలుగా మొదలుపెట్టి ప్రేయసిగా, భార్యగా, అమ్మగా, అహంకారం మూర్తీభవించిన అత్తగారిగా- దాదాపు 318 చిత్రాలలో ఎన్నో వైవిధ్యమైన పాత్రలలో జీవించారు. ప్రేక్షకులను మెప్పించారు.

> "నా దృష్టిలో ఏ పాత్రలోనైనా మెప్పించడం ముఖ్యం. అది చిన్నదా, పెద్దదా అన్నది ఎన్నడూ పట్టించుకోలేదు."

ఇదంతా సులభంగా సిద్ధించిన విజయం కాదు. వాణిశ్రీ నెల్లూరు ఉస్మాన్ సాహెబ్‌పేట బి.వి.ఎస్ ఉన్నత పాఠశాలలో తొమ్మిదవ తరగతి వరకు చదువుకున్నారు. తర్వాత ఆమె తల్లి కుటుంబ పరిస్థితుల దృష్ట్యా మద్రాసుకు మకాం మార్చవలసి వచ్చింది. చిన్నపట్టణం నుంచి మహానగరానికి వలసవచ్చినవారు ఎదుర్కొనే అనిశ్చితి, యాదృచ్ఛికతలు ఆమె జీవిత గమనాన్ని ప్రభావితం చేశాయి. "నా కెరీర్‌ను ఒక పద్ధతి ప్రకారం ప్లాన్ చేసుకోవడమనేది లేనేలేదు. దానంతట అదే నడచిపోయింది. అయితే, నావరకు నేను గట్టిగా కృషి చేసేదాన్ని. ప్రయత్నంలోనే దేవుడు ఉన్నాడని నా విశ్వాసం" అని చెప్పే వాణిశ్రీలో, చిన్ననాట బాగా చదువుకోవాలనే కోరికతోపాటు లలితకళల మీద ఆసక్తి కూడా బలంగా ఉండేది. దీనికి కృషి తోడై కాలక్రమంలో ఉన్నతశిఖరాలను అందుకోవడానికి పునాది పడింది. మద్రాసులో ఒకవైపు ఆంధ్ర మహిళా సభలో చదువుకుంటూనే కొంతకాలం వీణ, నాట్యం నేర్చుకున్నారు. మెట్రిక్‌తో చదువు నిలిపేసి వీణ మాస్టర్ ప్రేరణతో మూడేళ్ళు భరత నాట్యం నేర్చుకున్నారు.

టి.ఆర్ మాలవ్య వద్ద మొదలైన నాట్యశిక్షణ వెంపటి చినసత్యం వద్ద సుదీర్ఘ కాలంపాటు కొనసాగింది. అదేసమయంలో నటన పట్ల ఆసక్తి వాణిశ్రీని నాటక రంగం వైపు నడిపించింది. ఆ రోజుల్లో ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధిచెందిన రక్త కన్నీరు నాటకంలో భార్యగాను, చిల్లరకొట్టు చిట్టెమ్మలో చిట్టెమ్మగాను నటించి ఆమె నాటకప్రియులను ఆకట్టుకున్నారు. చిట్టెమ్మగా ఆమె నటనను చూసిన హుణసూరు కృష్ణమూర్తి తాను రూపొందిస్తున్న కన్నడ చిత్రం *వీరసంకల్ప* (1962-63)లో కథానాయికగా ఎంపికచేశారు. *వీరసంకల్ప*తో మొదలైన వాణిశ్రీ చిత్ర జీవితం 1979లో ఆమె పెళ్ళిచేసుకుని సినీ జీవితం నుండి విశ్రాంతి తీసుకునేంతవరకు అప్రతిహతంగా సాగింది.

ఆమె అసలు పేరు రత్నకుమారి. కానీ, *నాదీ ఆడజన్మే* చిత్రంలో ఒక పాత్ర కోసం వెళ్ళినప్పుడు మహా నటుడు ఎస్.వి. రంగారావు ఆమె పేరును వాణిశ్రీగా మార్చారు. *వీరసంకల్ప* చిత్రం తర్వాత గౌరీ ప్రొడక్షన్స్ భావనారాయణ, ప్రముఖ జానపద చిత్ర దర్శకుడు బి. విఠలాచార్యులు ఆమెకు మూడు సినిమాలకు కాంట్రాక్టు ఇచ్చారు. ఏ.వి.ఎం సంస్థ కూడా రెండు సినిమాలకు కాంట్రాక్టు పద్ధతి మీద తీసుకుంది. తెలుగులో "నేను డైలాగ్‌లు చెప్పిన మొదటి చిత్రం *బంగారు తిమ్మరాజు*" అని వాణిశ్రీ గుర్తుచేసుకున్నారు.

విఠలాచార్య దర్శకత్వంలో వచ్చిన జానపద చిత్రాలు *బంగారు తిమ్మరాజు, నవగ్రహ పూజా మహిమ* ఆమెను తెలుగు ప్రేక్షకులకు పరిచయం చేశాయి. వింత ఏమిటంటే, పరభాషా చిత్రంతో సినీరంగ ప్రవేశం చేసి, కన్నడ, తమిళ భాషలలో నాయికా పాత్రలు ధరించి రచ్చగెలిచిన వాణిశ్రీ, ఇంట గెలవడానికి మటుకు చాలా కాలం ఓపికగా నిరీక్షించవలసి వచ్చింది. కన్నడంలో కథానాయికగా నటించినా, తెలుగులో చిన్నచిన్న పాత్రలు పోషించవలసి వచ్చేది. అప్పట్లో గిరిజ, గీతాంజలి, రమాప్రభ, మీనాకుమారి వంటి తారల సరసన హాస్య పాత్రలు వచ్చేవి. మహాఅయితే రెండవ హీరోయిన్‌గా అవకాశాలు లభించేవి. మరీ విడ్డూరమేమిటంటే, ఒకవైపు తమిళంలో శివాజీ గణేశన్, ఎం.జి. రామచంద్రన్, కన్నడంలో రాజ్‌కుమార్ వంటి అగ్ర హీరోల సరసన నటిస్తున్న కాలం లోనే, తెలుగులో రాజబాబు, బాలకృష్ణ వంటి హాస్యనటులకు జోడీగా నటించడానికి వాణిశ్రీ వెనుకాడకపోవడం. ఆ రోజుల్లో ఎన్.టి. రామారావు హీరోగా నటించిన



▲ మలుపు తిప్పిన మరపురాని కథ: హాస్యపాత్రల నుంచి కథానాయిక పాత్రలకు ఎదిగి, తానేమిటో నిరూపించిన వాణిశ్రీ

తమ్ముడి కుటుంబం చిత్రంలో ఒక హాస్యభరిత అంతర్నాటకంలో నటీసావిత్రిగా ఆమె కనిపిస్తారు. చిత్రం ఏమిటంటే, వాణిశ్రీ అగ్రనటిగా పేరు ప్రఖ్యాతులు గడించిన తరువాత నటీసావిత్రి చిత్రంలో టైటిల్ పాత్ర పోషించడం. అందులో కూడా ఎన్టీఆర్ యముడుగానే నటించారు.

"ఒక కళాకారిణిగా వచ్చిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకోవాలనే తపన తప్ప పాత్ర స్వభావాన్ని నేను పెద్దగా పట్టించుకోలేదు. ఒక కళాకారిణిగా ఏ పాత్రైనా చేసి ప్రతిభను చాటుకోవాలనే ఉత్సాహమే తప్ప అప్పట్లో నేను ఇమేజ్ గురించి ఆలోచించలేదు" అని వాణిశ్రీ ఆ రోజులను గుర్తు చేసుకుంటూ చెప్పారు. హాస్యపాత్రలతో తెలుగులో ఆమె నటజీవితం ఆరంభమైనా, వాటికే పరిమితం కాకుండా ఉండాలనే తపనతో కథానాయికగా ఎదగడానికి ఆమె అహర్నిశలూ కృషిచేశారు. తనకన్నా సీనియర్లను చూసి నేర్చుకోవడం, నిజజీవితంలో తారసిల్లే రకరకాల మనుషులను పరిశీలించడం ఈ కృషిలో భాగం.

"ఉదాహరణకు, సావిత్రి హీరోయిన్‌గా ఉన్న చిత్రంలో నాకు ఏదైనా చిన్న పాత్ర దొరికిందనుకోండి. ఇందులో సావిత్రి నటనను చూసి నేర్చుకునే అవకాశం లభిస్తుంది కదా అనుకొని ఆ పాత్రకు ఒప్పుకునేదాన్ని. శ్రీకృష్ణ తులాభారంలో నేను దాసి పాత్రను పోషించాను. అయితే, ఇది నా ఇమేజ్‌ను దెబ్బతీస్తుందని అనుకోలేదు. దాని పాత్రకు ఉండవలసిన డైమెన్షన్స్ దానికి ఉంటాయి. వాటిని దృష్టిలో పెట్టుకొని పాత్రకు న్యాయం చేయాలి అన్నదే నా తపన" అని ఆమె చెప్పారు.

నిజానికి వాణిశ్రీ హాస్యపాత్రలు పోషిస్తున్న తరుణంలోనే స్వర్గీయ బి.ఎన్. రెడ్డి బంగారు పంజరం చిత్రంలో ఆమెకు కథానాయిక పాత్ర ఇచ్చారు. అయితే, ఆ సినిమా నిర్మాణం విపరీతంగా ఆలస్యమైంది. ఈలోగా ఆమె ఏ పాత్ర లభించినా వదలకుండా చేసేవారు. దాంతో బి.ఎన్ "మేము ఇక్కడ నిన్ను హీరోయిన్‌గా తీసుకొంటే, నీవు మరోవైపు చిన్నాచితకా పాత్రలు చేస్తే ఎలా అమ్మా! ఏ పాత్ర దొరికితే అది చేసేస్తున్నావు. నీవు కొంతకాలం నిరీక్షించాలి. మంచిపాత్రలు వచ్చే వరకు ఆగాలి" అని గొడవ పెట్టేవారు. అయితే, బంగారు పంజరం కథను సిద్ధం చేసుకోవడానికి బి.ఎన్. రెడ్డికి మూడేళ్ళు పట్టింది. ఈలోపు తనకు ఏడెనిమిది సీన్లు ఉంటేచాలు, ఏ చిత్రంలోనైనా వాణిశ్రీ నటించడానికి సిద్ధపడేవారు.

"నా దృష్టిలో ఏ పాత్రలోనైనా మెప్పించడమే ముఖ్యం. అది చిన్నదా, పెద్దదా అన్నది ఎన్నడూ పట్టించుకోలేదు. రకరకాల పాత్రలు చేసి పరిణతి సాధించడమే లక్ష్యంగా కృషి సాగించాను" అని వాణిశ్రీ ఆత్మవిశ్వాసం ఉట్టిపడే స్వరంతో వివరించారు. చలన చిత్ర రంగంలో నటిగా ఉన్నత శిఖరాలను అందుకునే సత్తా తనకు ఉందని ఆమెకు తెలుసు. అయితే, అందుకు అవకాశం రావాలి కదా. పరభాషా చిత్రాలలో హీరోయిన్‌గా మెప్పిస్తున్నా, మాతృభాషలో కూడా నెగ్గాలని ఆమె అహరహం తపిస్తూ ఉండేవారు.



**మరపురాని కథలో వాస్తవానికి సావిత్రి నటించవలసి ఉన్నా, కొన్ని కారణాల వల్ల ఆ పాత్ర వాణిశ్రీని వరించింది.**

హాస్యపాత్రల దశ: పక్కలో బల్లెం వంటి కాపవర చిత్రాలలో హాస్యనటులకు జోడీగా కనిపించిన వాణిశ్రీకి చిన్నపాత్రలే ప్రముఖ పాత్రలకు సోపానాలు ▶

ఆశయానికీ, వాస్తవానికీ మధ్య అనివార్యంగా ఉండే పెనుగులాటను స్థిరచిత్తంతో నిభాయించుకుంటూ, హాస్యపాత్రలు, సెకండ్ హీరోయిన్, చెల్లెలు పాత్రలూ ధరించసాగారు. ఆ క్రమంలోనే వచ్చిన సుఖదుఃఖాలు చిత్రంలో ఇది మల్లెల వేళయనీ, ఇది వెన్నెల మాసమనీ... అనే కృష్ణశాస్త్రి పాట వినగానే వాణిశ్రీ గుర్తుకొస్తారు. ఆ చిత్రంలో చిన్నదే అయినా తన మామూలు హాస్య పాత్రలకు భిన్నమైన భూమికను పోషించారు. ఆటుపోట్లను ఎదిరించి నిలిచే స్థైర్యం, అభినయ ప్రతిభ, కార్యదీక్ష మూర్తీభవించిన వాణిశ్రీని సహజంగానే అదృష్టం వలకరించింది. మరపురాని కథ చిత్రం వాణిశ్రీకి తెలుగులో తొలిసారిగా కథానాయికగా నటించే అవకాశం కలిగించి ఆమె నటనా జీవితంలో మైలురాయిగా, మరపురాని చిత్రంగా నిలిచిపోయింది. నిజానికి మరపురాని కథ చిత్రంలో హీరోయిన్‌గా సావిత్రి నటించవలసింది. తమిళంలో శివాజీ గణేశన్, సావిత్రి నటించిన కొళంధైయుం దైవం చిత్రాన్నే తెలుగులో మరపురాని కథగా తీశారు. ఇందులో ఎన్.టి. రామారావు, సావిత్రి నటించవలసింది. ఆ సమయంలో సావిత్రి గర్భవతి కావడం, చిత్ర నిర్మాణ బడ్జెట్ అంచనాలను దాటిపోయేట్లు కనిపించడం మూలంగా నిర్మాత డూండీ మనసు మార్చుకుని వాణిశ్రీ, చంద్రమోహన్‌లతో మరపురాని కథను నిర్మించారు. ఈ చిత్రం పెద్ద హిట్ అయి తెలుగులో వాణిశ్రీ నటజీవితం మలుపు తిరగడానికి పునాది వేసింది. అయితే, మరపురాని కథలోని పాత్రను ఆమె గొప్పగా చెప్పుకోరు. "ఏముందండీ, తమిళ చిత్రంలో సావిత్రి నటనను మక్కీకిమక్కీగా తెలుగులో చేశానంతే" అని చెప్పారు.

వాణిశ్రీపై మొదట్లో సావిత్రి ప్రభావం ఉండేది. కానీ, "రానురాను సావిత్రిగారిలో లోపాలు కనబడసాగాయి. ఆమెలో బాడీ లాంగ్వేజ్ లేదు. ఎంతసేపూ ముఖంలోనే భావాలు పలికించేవారు. ముఖ్యంగా తన శరీరాకృతి



▲ అద్భుత విజయం: జగపతి పిక్చర్స్ వారి దసరా బుల్లోడు అఖండ విజయం వాణిశ్రీ నటనా జీవితంలో కలికితురాయి

[illegible] అని వివరించారామె.

మరపురాని కథ వాణిశ్రీకి మంచిపేరు తెచ్చినా, ఆ తర్వాత తెలుగులో హీరోయిన్‌గా మరిన్ని అవకాశాలు రావడానికి కాలాలు పట్టింది. అయినా, ఆమె ఏ మాత్రం నిరుత్సాహ పడలేదు. నటిగా తన భవిష్యత్తుపట్ల గల ఆత్మవిశ్వాసం ఆమెను నిరుత్సాహపడకుండా చేసింది. "మనిషి వైఫల్యాలలోనే ఎదుగుతాడు. విజయం మనిషికి నేర్పేకన్నా వైఫల్యం ఎక్కువగా నేర్పుతుంది" అంటారామె. మరపురాని కథ విజయం అనంతరం ఆత్మీయులు చిత్రం వాణిశ్రీకి మంచి బ్రేక్ ఇచ్చింది. "ఆత్మీయులు చిత్రంలో అక్కినేనికి చెల్లెలుగా చేస్తావా, ప్రేయసిగా చేస్తావా అని అడిగితే, పాత్రకు విస్తృత పరిధి లేకపోయినా హీరోయిన్‌గా చేయడానికే ఒప్పుకున్నాను" అని ఆమె చెప్పారు. ఆ చిత్రం హిట్ కావడంతో ఇక ఎన్.టి. రామారావుతో పాటు ఇతర హీరోలు కృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజుల సరసన హీరోయిన్‌గా స్థిరపడే అవకాశం కలిగింది. నిండు హృదయాలు చిత్రంలో మొదట వేరే హీరోయిన్‌ను అనుకొని, కారణాంతరాల వల్ల ఆ పాత్రకు వాణిశ్రీని తీసుకున్నారు. హాస్యనటుల సరసన "పోకిరి పాత్రలు వేసిన ఈమె నా సరసన హీరోయిన్‌గా నటించడమేమిటి అని రామారావుగారు అనుకొని ఉంటే పరిస్థితి వేరేలా ఉండేది" అని అన్నారు వాణిశ్రీ. అవమానమైనా అవాంతరాలను ఆత్మవిశ్వాసంతో అధిగమించి, తన ప్రతిభను నిరూపించుకున్నారు కనుకనే ఆమె ఆనాటి అగ్ర హీరోల సమ్మతి పొంది హీరోయిన్‌గా స్థిరపడగలిగారు. పైగా, "ఆ దశలో సావిత్రిగారు తల్లి పాత్రలు, వదిన పాత్రలు వేయడం, జమునగారు పెళ్లిచేసుకుని చిత్రాలను తగ్గించుకోవడం, కొన్ని కారణాలవల్ల కృష్ణకుమారి కూడా తెరమరుగు కావడం వంటి పరిణామాల మధ్య అగ్రనటుల సరసన హీరోయిన్‌గా ఆ ఖాళీని నేను భర్తీ చేశాననుకుంటున్నాను" అని చెప్పే వాస్తవిక దృక్పథం ఆమెకు ఉంది.

నటిగా జీవితాన్ని ప్రారంభించిన తొలిరోజులలో ఆమెపై పుట్టణ్ణ కణగల్, కె.ఎస్. ప్రకాశరావు వంటి దర్శకుల ప్రభావం ప్రసరిస్తే, నటిగా శిఖరాగ్రానికి చేరిన తర్వాత కొందరు ఉద్దండ దర్శకుల ఆదరాతో వ్యాపార చిత్రాలలోనే కాకుండా కళాత్మక చిత్రాలలో కూడా రాణించగలనని నిరూపించారు. శ్యామ్ బెనెగల్ అనుగ్రహం, బాపు గోరంతదీపం దీనికి ఉదాహరణలు. ఈ రెండు చిత్రాలలో ఆమె మేకప్ లేకుండా సహజంగా నటించడానికి వెనుకాడలేదు. "నేనిలా కనిపించినందుకు చక్రపాణి వంటి కొందరు చిత్రసీమ పెద్దలు చివాట్లు పెట్టారు కూడా" అని ఆమె గుర్తుచేసుకున్నారు. విశ్వనాథ్, బాపుల గురించి ఆమె విశ్లేషణ ఆశ్చర్యం కలిగిస్తుంది. "నేను హీరోయిన్‌గా చేసిన రోజుల్లో విశ్వనాథ్‌లో ఎంతో హాస్యప్రియత్వం కనిపించేది. జీవన జ్యోతి, చిన్ననాటి స్నేహితులు, చెల్లెలి కాపురం వంటి చిత్రాలలో నేను నటిస్తున్నప్పుడు విశ్వనాథ్ గారు సెట్‌లో సరదాగా ఉంటూ అందరినీ నవ్వించేవారు. ఇప్పుడు ఆ విశ్వనాథ్ నాకు కనిపించడం లేదు. అలాగే బాపు బయటకు కనిపించని ప్రతిభాశాలి. ఆయన గంభీరంగా కనిపించేవారు" అని ఆమె చెప్పారు.

అలాగే తాను పనిచేసిన హీరోల గురించి కూడా ఆమెకు నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. "వ్యక్తిగాను, నటుడుగాను శివాజీ గణేశన్ నన్నెంతో ప్రభావితం చేశారు. జగయ్యగారి మాట తీరు, ప్రవర్తన ఎంతో నచ్చేవి. ఇక ఎన్టీఆర్ ఎవరితోనూ మాట్లాడేవారు కాదు. తన పనేదో తాను చేసుకుని క్రమశిక్షణకు మారుపేరుగా కనిపించేవారు. ఇక నాగేశ్వరరావు గారిలా మాట్లాడడం మరొకరికి చేతకాదు. ఆయన మార్గం అనితర సాధ్యం.

▲ నచ్చిన పాత్ర: ప్రేమనగర్‌లో లత విడిపోయినవారిని బాగు చేయాలని తపించే పాత్ర. అది తనకెంతో నచ్చిందంటారు వాణిశ్రీ

దేవదాసు చిత్రంతో అక్కినేని-సావిత్రి జంటకు వచ్చినంత పేరు, ప్రేమనగర్ ఘనవిజయంతో అక్కినేని-వాణిశ్రీ జోడీకి లభించింది.

◀ సహజ నటనకు నీరాజనం: కె. విశ్వనాథ్ దర్శకత్వంలో వచ్చిన జీవనజ్యోతిలో తల్లిగా, కూతురుగా ఆమె నటన ఉన్నత శిఖరాలను అందుకొంది. ప్రశంసలు పొందింది

▲ పౌరాణిక పాత్రలు: శ్రీకృష్ణ సత్య (పైన); సతీసావిత్రి వంటి చిత్రాలలో పౌరాణిక పాత్రలు పోషించినా వాటిపై అంత మోజు లేదు

శోభన్‌బాబు గారిలో ఒక ఆర్థిక నిపుణుడు, ఒక జెంటిల్‌మేన్ కనిపిస్తే కృష్ణగారిలో ఎప్పుడూ సినిమాల నిర్మాణ వ్యయం, వసూళ్ళ గురించి కచ్చితంగా లెక్కలు కట్టే విచిత్రమైన మనిషి కనిపించేవారు.

సావిత్రి తరం తరువాత రెండు దశాబ్దాలు హీరోయిన్‌గా నిలబడిన వాణిశ్రీ, తెలుగు సినిమా అప్పట్లో తిరిగిన కొత్తమలుపులు, కొత్తకథలలో పాత్రలకు అనుగుణంగా తనను తాను మలచుకున్నారు. ఆమె చేసినన్ని రకాల పాత్రలను ఆ తరంలోగాని, ఈ తరంలోగాని తెలుగులో మరే హీరోయిన్ చేయలేదంటే అతిశయోక్తి కాదు. ఆ రోజుల్లో అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రిలను అద్భుతమైన జంటగా పరిగణించేవారు. తరువాత వాణిశ్రీ, నాగేశ్వరరావుల జంట దశాబ్దంన్నరపైగా వరుసగా అనేక విజయవంతమైన చిత్రాలలో నటించింది. దేవదాసు, డాక్టర్ చక్రవర్తి చిత్రాలలో అక్కినేని, సావిత్రిల జంటకు ఎంత పేరు వచ్చిందో, తరువాత వాణిశ్రీ, అక్కినేని కలసి నటించిన ప్రేమనగర్, విచిత్ర బంధం, సెక్రటరీ వంటి నవలా చిత్రాలకు అంతకు దీటైన పేరు వచ్చింది. తెలుగునాట నవలలు రాజ్యమేలుతున్న కాలంలో వాటిలోని పాత్రలను వాణిశ్రీని దృష్టిలో పెట్టుకుని కథానాయిక పాత్రలు సృష్టిస్తున్నారా అనిపించేంత సహజంగా వాటిలో లీనమై వాణిశ్రీ నటించారు. సీరియల్స్ నవలలు చదివే వేలాది మంది తెలుగు గృహిణులు, యువతీయువకులకు ఆమె ఆరాధ్యదేవతగా మారిపోయారు.

*జీవన తరంగాలు*లో సరోజ, *విచిత్రబంధం*లో (విజేత)సంధ్య, *ప్రేమనగర్*లో లత, *సెక్రటరీ*లో జయంతి పాత్రలు ఆమెకు నటిగా శాశ్వతమైన కీర్తిని తెచ్చిపెట్టాయి. "వాటిలో నాకు బాగా నచ్చిన పాత్ర *ప్రేమనగర్*లో లత పాత్రే ఎందుకంటే, ఆ పాత్ర అభిమానవతే కాదు, మానవతావాది కూడా. చెడిపోయినవారిని బాగుచేయాలని, పేదలకు ఏదో చేయాలని తపించే మంచి పాత్ర. దర్శకుడు కె.ఎస్. ప్రకాశరావు చేసిన క్యారెక్టరైజేషన్ అద్భుతం. ఈ చిత్రంలోని పాత్రల వ్యక్తిత్వాలను గొప్పగా తీర్చిదిద్దారాయన" అని ఆమె వివరించారు. "*ప్రేమనగర్*ను రామానాయుడుకు ముందు ఒక నిర్మాత అక్కినేని, జమునలతో తీయాలని కోడూరి కౌసల్యాదేవి వద్ద హక్కులను తీసుకున్నారు. కానీ, ఆ చిత్రం ఎందుకో నిర్మాణం కాలేదు. తరువాత రామానాయుడు గారు ఆ హక్కులను కొని లత పాత్రకు నన్ను ఎంపిక చేశారు" అని ఆమె వెల్లడించారు. లత పాత్ర ఆమెకు ఎంత పేరు తెచ్చిపెట్టిందంటే, *ప్రేమనగర్* చిత్రాన్ని తమిళంలో పునర్నిర్మించినప్పుడు వాణిశ్రీ చేతనే ఆ పాత్రను చేయించారు. తమిళంలో శివాజీ గణేశన్ కథానాయకుడుగా *వసంతమాళిగై* పేరుతో ఆ చిత్రం అఖండవిజయం సాధించి నాయికగా తమిళంలో కూడా వాణిశ్రీ స్థానాన్ని సుస్థిరం చేసింది.



మిళంలో ఆమె 75 చిత్రాలలో వైవిధ్యభరితమైన పాత్రలను పోషించారు. ఎం.జి.ఆర్‌తో మూడు చిత్రాలలో నటించగా, శివాజీతో నటించిన *నల్లదొరై కుడుంబం*, *పుణ్యభూమి*(హిందీలో *మదర్ ఇండియా*) చిత్రాలు ఆమెకు మంచిపేరు తెచ్చాయి. ఒక నటి కానీ, నటుడు కానీ ద్విపాత్రాభినయం చేయడమంటే, కెరీర్‌లో శిఖరాగ్రానికి చేరినట్లు లెక్క. హిందీలో హేమమాలిని ద్విపాత్రాభినయం చేసిన *సీతా ఔర్ గీతా* చిత్రాన్ని తెలుగు, తమిళ భాషలలో వాణిశ్రీతో నిర్మించారు. *గంగ మంగ* పేరుతో విడుదలైన ఆ చిత్రం అఖండ విజయాన్ని సాధించింది. అలాగే ఆమె రెండు పాత్రలు పోషించిన *ఇద్దరు అమ్మాయిలు* చక్కని కుటుంబ చిత్రంగా ప్రజాదరణ పొందింది. అక్కినేని నాగేశ్వరరావు, శోభన్‌బాబుల సరసన అమాయకురాలైన మధ్యతరగతి పేద యువతిగాను, అహంకారం మూర్తీభవించిన సంపన్న యువతిగాను వాణిశ్రీ నటించారు. ఇందులో అహంకారి పాత్రకు, *విచిత్రబంధం*లో సంధ్య పాత్రకు దగ్గర పోలికలు ఉన్నాయి. ఆమెకు నవలా నాయికగా పేరు తెచ్చిన మరో నవలా చిత్రం *చక్రవాకం*.

ఒకవైపు నవలా చిత్రాలలో నటిస్తూనే మరోవైపు *దెబ్బకు ఠా దొంగల ముఠా*, *జగత్ కిలాడీలు* వంటి చిత్రాలలో కూడా నటించారు. "కొన్ని పాత్రలను ఎందుకు ఒప్పుకున్నానో నాకే తెలియదు. కొందరు దర్శకుల ఒత్తిడికి, మొహమాటాలకు తలొగ్గి కొన్ని పాత్రలు చేశాను. నటిగా నాకు సంవత్సరానికి ఎనిమిది పది చిత్రాలుంటే, కొందరు దర్శకులకు సంవత్సరానికి ఒకే చిత్రం ఉండేది. నన్ను నమ్ముకుని వచ్చిన అటువంటి వారిని కాదనలేక కొన్ని పాత్రలు చేశాను" అని వాణిశ్రీ చెప్పారు. దసరా



▲ బాపు మలచిన గిరిజన సుందరి: *భక్త కన్నప్ప* చిత్రంలో కృష్ణంరాజు సరసన; తర్వాత *కృష్ణవేణి*లో అపూర్వ నటన



▲ పొగరుబోతు పాత్రలోనూ తనకుతానే సాటి: *విచిత్ర బంధం*, *ఇద్దరు అమ్మాయిలు* చిత్రాలలో అహంకారానికి నిలువుటద్దవు నటన

**వాణిశ్రీ ధరించే మేచింగ్ చీర, మోచేతుల జాకెట్‌లు, మేచింగ్ గోళ్ళరంగు ఆ రోజుల్లో యువతులకు పెద్ద ఫ్యాషన్ అయ్యాయి.**



కలైమామణి అవార్డు: నాటి ప్రధాని మొరార్జీ దేశాయ్ నుంచి తమిళ నాడు ప్రభుత్వ అవార్డు ▶

బుల్లోడులో ఆమె చేసిన రాధ పాత్ర బాగా ప్రజాదరణ పొందింది. అందులో శృంగార నాయికగా వాణిశ్రీని అతిగా చూపించారనే మాట కూడా అప్పట్లో వినిపించింది. "వి.బి. రాజేంద్రప్రసాద్ సామాన్య జనం కోసం స్టెప్‌లు వేయించడం అనే ఒరవడిని అదృష్టవంతులు చిత్రంతోనే ప్రారంభించారు. ఆ ఒరవడికి అనుగుణంగానే దసరా బుల్లోడులో కూడా పాటల చిత్రీకరణ సామాన్య జనాన్ని, ముఖ్యంగా యువతను ఆకట్టుకునేలా సాగింది" అని వాణిశ్రీ చెప్పారు. దసరా బుల్లోడులో వాణిశ్రీ కట్టుబొట్టును ఆ రోజుల్లో పల్లెటూళ్ళలో కూడా చాలామంది యువతులు అనుసరించారు. తరువాత ప్రేమనగర్‌లో ఆమె అలంకరణ, జడ, వస్త్రధారణ చాలామందికి ఆదర్శమైంది. మేచింగ్ చీరా, మోచేతుల వరకు జాకెట్‌లతో పాటు మేచింగ్ గోళ్ళరంగు, బొట్టు అప్పట్లో వాణిశ్రీ పాత్రద్వారా ప్రచారమయ్యాయి. అలా గ్లామర్ హీరోయిన్‌గా చేస్తూనే వింతకథ అనే చిత్రంలో శృంగార ప్రధానమైన పాత్రను ధరించారు. 'ఏ' సర్టిఫికెట్ పొందిన ఆ చిత్రం అప్పట్లో సంచలనం సృష్టించింది. అందులో ఆమె ఒక కాలేజి లెక్చరర్ భార్య. తనను ప్రేమించి పెళ్ళాడిన భర్త మానసిక దౌర్బల్యానికి లోనై తనను శారీరక సుఖానికి దూరం చేయగా, తీవ్రమైన మానసిక సంఘర్షణకు గురైన పాత్రను ఆమె గొప్పగా నటించి మెప్పించారు. అలాగే రాజా రమేశ్‌లో నాగేశ్వరరావు భార్య రాణిగా ఆమె పోషించిన పాత్ర కూడా తనకెంతో ఇష్టమైనదని ఆమె చెబుతారు. కథానాయిక మొల్ల, కథానాయకురాలు, జీవనజ్యోతి, కృష్ణవేణి చిత్రాలు ఆమెను మహానటిగా నిలబెట్టాయి. "అంచెలంచెలుగా స్వయంకృషితో ఎదిగిన గొప్ప నటి వాణిశ్రీ. దర్శకులు రూపకల్పన చేసిన పాత్రకు నూటికి నూరుపాళ్ళు న్యాయంచేసే ప్రతిభావంతురాలు" అని ఆమెతో జీవనజ్యోతి మొదలైన మంచి చిత్రాలను రూపొందించిన కె. విశ్వనాథ్ ప్రశంసించారు. విశ్వనాథ్ చెప్పినట్లు వాణిశ్రీ ఏ పాత్రయితే ధరిస్తారో ఆ పాత్రలో పరకాయ ప్రవేశం చేయడం ఆమె విజయ రహస్యం కావచ్చు. జీవనజ్యోతిలో తల్లిగా, కూతురుగా వైవిధ్యం చూపి తనకు తానే సాటి అనిపించుకున్నారు. "భరతనాట్యంలో ప్రావీణ్యం సంపాదించాలంటే ఆ భరత నాట్యం మనం కావాలి. అంటే అంతగా మమేకం చెందాలి" అని వాణిశ్రీ అభిప్రాయం.

ఈ వ్యాఖ్య జెన్ తత్వాన్ని తలపిస్తోందే అంటారా? అవును. తాత్త్విక చింతనలో వాణిశ్రీ సాధించిన పరిణతి ఆశ్చర్యానందాలు కలిగిస్తుంది. ఎన్.టి. రామారావుతో తాను చేసిన సతీ సావిత్రి చిత్రాన్ని ప్రస్తావిస్తూ, "అరవిందుని సావిత్రి చదివాక ఇలాంటి పౌరాణికాలతో ఎలా పొంతన కుదురుతుంది చెప్పండి" అన్నప్పుడు జనసామాన్యానికి తెలియని తాత్త్విక వాణిశ్రీ పరిచయమవుతారు. 16 ఏళ్ళపాటు రకరకాల పాత్రలు చేసిన వాణిశ్రీని అస్తిత్వానికి సంబంధించిన మౌలిక ప్రశ్నలు చుట్టుముట్టాయి. సొంత ఇష్టం మీదనే సినిమా రంగానికి వచ్చి, ఒక స్త్రీగా తాను ఏమేమి కావడానికి వీలున్నదో అవన్నీ వెండితెర మీద అయిన వాణిశ్రీ, రచయితలు, దర్శకులు స్త్రీ గురించి చెప్పిన వివిధ కథల సముదాయాన్ని కూడా తెరమీద పరిపూర్ణంగా ప్రతిబింబించిన వాణిశ్రీ, చివరకు 'నేనెవరిని' అనే తాత్త్విక ప్రశ్న వద్దకు వచ్చారు. "నాకిష్టమై నేను సినిమా రంగానికి వచ్చాను. ఊపిరి లేకుండా బతకగలను కానీ నటన లేకుండా బతకలేను అనుకున్నాను. ఆత్మవిశ్వాసమే ఆయుధంగా, పెట్టుబడిగా కృషి చేశాను. వాణిశ్రీకి చిత్ర పరిశ్రమ అవసరం అనే దశ నుంచి చిత్ర పరిశ్రమకు వాణిశ్రీ అవసరం అనే దశకు ఎదిగాను. అయినా, నటనకు సంబంధించి అన్ని జాగ్రత్తలు తీసుకునేదాన్ని. ఆ రోజుల్లో ఒక సినిమా తీయడానికి 8 నెలల నుంచి సంవత్సరం దాకా పట్టేది. అంతకాలం ఏకాగ్రతతో ఆ పాత్రకు సంబంధించిన మూడ్‌లో ఉండిపోయేదాన్ని. రచయిత సృష్టించిన పాత్రలోని ఉదాత్తత, ఇతర ఉత్తమ గుణాలు మన వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసే మాట నిజమే. ఆ పాత్ర ప్రభావం, అది కలిగించే రసానుభూతి మనను లోతుల్లోకి ఇంకుతుంది. అందులో పరకాయ ప్రవేశం చేశాక సొంత తల్లి, మేకప్‌మాన్ కూడా ఆ పాత్రకు సంబంధించినంతవరకు పరాయి వారేనన్న అనుభూతి కలుగుతుంది. దూరం ఏర్పడుతుంది" అని చెప్పారామె. ఆ విధంగా వెండితెర మీద వివిధ పాత్రల ద్వారా ఏదో వాస్తవికతను ప్రతిబింబిస్తున్నట్లు నటించడంలోని ప్రాథమిక అవాస్తవికతను ఆమె గుర్తించారు. లేకుంటే 'వాస్తవికత' కూడా తాను తెర మీద అనుకరించిన ఇతర వేషాలలాంటి ఒక వేషం అనే ప్రమాదంలోకి జారిపోయేవారేమో!

"రానురానూ నేను పాత్రల్లానే



▲ పరిణత నటన: మరపురాని తల్లిలో కృష్ణ సరసన; పాత్రలను ఆవాహన చేసుకోవడం వాణిశ్రీకి వెన్నతో పెట్టిన విద్య



▲ ఆదర్శ ప్రేమ జంట: కొడుకు-కోడలు చిత్రంలో అక్కినేనితో; తెలుగు నవలల ఆధారంగా వచ్చిన అనేకానేక చిత్రాలలో అక్కినేని-వాణిశ్రీ జంట అఖిలాంధ్ర ప్రేక్షకులను రక్తికట్టించింది



◀ అవార్డులు, రివార్డులు: పి.వి. నరసింహారావు నుంచి రాష్ట్ర ప్రభుత్వ అవార్డు స్వీకారం

రానురానూ నేను పాత్రల్లానే మాట్లాడసాగాను. ఒక దశలో 'నేనెవరిని' అనే ప్రశ్న ముప్పిరిగొని భయపెట్టింది.



▲ అత్తపాత్రలు: పెద్దింటల్లుడులో మోహన్‌బాబుతో; రానురానూ ఇలాంటి పాత్రలలో అశ్లీలత ఎక్కువవడం ఆమెకు నచ్చలేదు



▲ అభినయానికి నిలువెత్తు నిర్వచనం: నటజీవితంలో శిఖరాగ్రం

మాట్లాడసాగాను. ఒక దశలో నేనెవరో నాకే తెలియకుండా పోయింది. దాంతో భయం వేసేది. మామూలు మనిషి ఒక డాక్టరుగానో, గుమాస్తాగానో ఇంటి దగ్గర నుంచి బయలుదేరి ఆఫీసుకు వచ్చినా, ఇంటికి తిరిగివెళ్ళాక తిరిగి తాను తానే అవుతాడు. నా విషయంలో అలా కాదే. ఇవాళ వెండితెరపై నేనెవరికో ప్రేయసిని, లేదా భార్యని. కాకుంటే తల్లి లేదా అత్తను. ఆ పాత్రలకు న్యాయం చేయడానికి అదే మూడ్‌లో ఉండిపోవడంతో ఇంటికి తిరిగివచ్చాక కూడా అదే మూడ్ వెంటాడేది. దీనంతటి మధ్య నిజమైన వాణిశ్రీ ఎవరో నాకే తెలియకుండా పోయింది. శూన్యం ఏర్పడింది. రొటీన్ అయిపోయిన నటనాజీవితం ఊపిరిసలప నివ్వని స్థితి ఏర్పడింది. అలా ప్రకృతిలోకి వెళ్ళి ఏదైనా చెట్టు కింద ఇష్టమైన పుస్తకం చదువుకునే అవకాశం లేనేలేదు" అని చెవుతున్నప్పుడు 'అదుపు కోసం తపించి, సాధించి, ఆ పదానికి నిలువెత్తు నిర్వచనంగా మారిన వాణిశ్రీ కనిపించారు.

16 ఏళ్ళపాటు అనేక పాత్రలను ఆవాహన చేసుకొని, వాటిలో మమేకమైపోయిన వాణిశ్రీకి క్రమేణా అదంతా మానసిక చిత్రహింసలా అనిపించసాగింది. మరోవైపు తాను సంపాదించే రూపాయిని తాను చూడలేకపోతున్నాననే వాస్తవం ఎటూ ఉంది. ఎంతసేపూ స్టూడియోలలో, లొకేషన్లలో గడపడం వల్ల తాను కట్టుకున్న ఇంట్లో తానుండలేకపోతున్నాననే గ్రహింపూ ఉంది. బయట ప్రపంచంతో సంబంధం లేని విచిత్ర స్థితి అందరు హీరోయిన్‌లలా ఆమెకూ అనుభవమే. లోకజ్ఞానం లేకపోతే తన లాభనష్టాలను బేరీజు వేసుకోలేకపోవడం, సమస్య నుంచి పారిపోవడం వంటి దుర్గతలు తప్పవని ఆమెకు తెలుసు. తనను ఆవరించిన పాత్రల పొరలను తిరస్కరించుకుంటూ, తొలగించుకుంటూ నిజమైన వాణిశ్రీ బయటపడసాగారు. ఉత్సాహ ఉద్వేగాలు, ప్రేమానురాగాలు వెండితెరకే పరిమితం చేసుకోరాదనీ, నిజ జీవితంలో వాటిని అనుభవించాలనే ఆకాంక్ష వాణిశ్రీని వివాహానికి సిద్ధం చేసింది. ప్రముఖ వైద్యుడు కరుణాకరన్‌తో 1979లో ఆమె వివాహం జరిగింది. ఇప్పుడామెకు మెడిసిన్ చదువుతున్న కుమార్తె, పదోతరగతి చదువుతున్న కుమారుడు ఉన్నారు. నిజజీవితంలో భర్త పిల్లలతో తాను కోరుకున్న ఇల్లాలి పాత్రలో ఆనందంగా ఒదిగిపోయారు




వాహమైన తర్వాత పూర్తిగా తనదైన జీవితంలోకి వెళ్ళిపోయిన వాణిశ్రీ, ఆపైన చాలాకాలానికి మెగాస్టార్ చిరంజీవి అత్తకు యముడు అమ్మాయికి మొగుడుతో సినీరంగంలో పునఃప్రవేశం చేశారు. తర్వాత నాగార్జున, సుమన్, బాలకృష్ణ వంటి ఆధునిక తరం హీరోలతో అత్త పాత్రలు చేశారు. అయితే, సీతారత్నంగారి అమ్మాయి, ఏమండీ ఆవిడ వచ్చింది చిత్రాలలో కొన్ని ఇబ్బందికరమైన సన్నివేశాలు, సంభాషణలను ఆమె జీర్ణించుకోలేకపోయారు. అశ్లీలం జొప్పించిన ఒక అత్తపాత్రను ఆమె నిరాకరించారు. "సినిమాలో అలాంటి పాత్రను సృష్టించే రచయిత, దర్శకుడు తనకూ అక్కచెల్లెళ్ళు, అత్తలు ఉన్నారని మరచిపోకూడదు. మరచిపోతే వికృతమైన ఆలోచనలు వచ్చి వావివరసలకు సంబంధం లేని శృంగార సన్నివేశాలు పుట్టుకొస్తాయి" అని ఆమె నిశితంగా విమర్శించారు.

సినిమాలు చూసి ఎవరూ చెడిపోరు, బాగుపడరు అనే అభిప్రాయాన్ని వాణిశ్రీ అంగీకరించరు. దర్శకులైనా, రచయితలైనా, నటీనటులైనా తామూ సంఘంలో ఉంటున్నామని, తమ ఫ్యాషన్‌లను, హావభావాలను, తెరపై చూపే గుణగణాలను అభిమానించే ప్రేక్షకులు ఉంటారనీ, వారు వెండితెర పాత్రల వల్ల ప్రభావితులు కాకుండా ఉండలేరని గ్రహించాలంటారు వాణిశ్రీ. అందువల్ల సమాజానికి జవాబుదారీ వహించవలసిన బాధ్యత శక్తిమంతమైన సినిమా మీడియంకు ఉందని ఆమె అభిప్రాయం. సినిమా నిర్మాణానికి కనీస అర్హతలు లేకపోవడం వల్లనే డబ్బు, పలుకుబడి గలవారు సినిమా మీడియంను దుర్వినియోగం చేసి, తమ వ్యక్తిగత వికారాలను ప్రేక్షకుల మీదకు రుద్దగలుగుతున్నారని ఆమె అంటారు. అందుకే చిత్రపరిశ్రమ ఈ విషయంలో నియమావళిని రూపొందించుకోవాలని సూచించారు.

"చిన్నప్పుడు నేను భగవద్గీత పుస్తకాన్ని కొనుక్కుంటే మా స్నేహితురాళ్ళు ఈ వయసులో నీకెందుకు ఇలాంటి పుస్తకాలనేవారు. ఇలాంటి పుస్తకాలు ఈ వయసు నుండే చదవాలి అని చెప్పాను" అని వాణిశ్రీ తన బాల్య సంఘటనను గుర్తు చేసుకున్నారు. తర్వాత జిడ్డు కృష్ణమూర్తి, రమణ మహర్షి వంటివారి బోధలు ఆమెలో తాత్విక జిజ్ఞాసను రేకెత్తించాయి. "ఎవరు ఏ దారిననుసరించినా అంతిమ లక్ష్యం భగవంతుడే"నని వాణిశ్రీ అంటారు. పరిపూర్ణతే పరమావధిగా నటనా జీవితాన్నీ, నిజజీవితాన్నీ తీర్చిదిద్దుకున్న ఆమె పలుకులలో ఎంతో అర్థం, జీవితానుభవం ఉట్టిపడుతున్నాయి. ■